# బాలభాగవతము

దోనూరి కోనేరునాథకవి ప్రణీతము

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయమున సహాయాంధ్ర పరిశోధకుడగు
విద్వాన్, సాహిత్యశిరోమణి,
పంగనామల బాలకృష్ణమూర్తి, ఎం. ఏ. చే
పరిష్కరింపబడినది.



తిరుమల తిరుపతి దేవస్థానం బోర్డు ఆఫ్ ట్రస్టీస్‌వారి తరఫున
ఎగ్జిక్యూటివ్ ఆఫీసరువారగు
శ్రీ చెలికాని అన్నారావు, బి. ఏ. గారి
యనుమతిని ప్రకటింపఁబడినది.

తిరుపతి

తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రాక్షరశాల

1954

# ఉపోద్ఘాతము



బాలభాగవతమను నీప్రబంధము శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధ నాలయమున 7120 నెంబరు గల వ్రాతప్రతి ననుసరించి పరిష్కరింప బడినది. ఇది దొరతనమువారి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున (Government Oriental Manuscripts Library) D. 27 సంఖ్యచే సూచింపఁబడు కాగితపు వ్రాతప్రతి నాధారముగాఁగొని వ్రాయఁబడినది. ఇయ్యది పరిమితియందు చిన్నదగుటను శ్రీమద్భాగవతమునకు సంగ్రహ రూపముగా నుండుటను దీనికి బాలభాగవత మనునామ మెంతయు నొప్పుచున్నది. బాలభాగవతమనుపేర మఱొకటి ద్విపదలో నీకవిచేతనే వ్రాయఁబడియున్నది ఆ ద్విపదభాగవతమునఁ గొంతభాగమచ్చుపడినట్లు కూడ ముద్రితాముద్రితగ్రంథములపట్టికవలనఁ దెలియుచున్నది. ప్రకృత గ్రంథమగు బాలభాగవతము ప్రబంధము. మొట్టమొదట నీ ప్రబంధ బాలభాగవతమే ప్రబంధశైలిని వ్రాయఁబడి పలువురచేఁ బొగడ్తలంది మెచ్చులువడయుటచే నియ్యదియే ద్విపదచ్ఛందమునఁ దర్వాత వ్రాయఁ బడెనని, యీ ద్విపద బాలభాగవతగ్రంథములోని యీ క్రిందిపంక్తులచేఁ దెలియుచున్నది.

“ వచియించి తొనరఁ బద్యకావ్యముగఁ
ప్రచురంబుగా బాలభాగవతంబు
వాసికినెక్కి యిప్పసుధాతలమున
భాసిల్లు నా బాల భాగవతంబె
యరుదుగా నడచిన యన్నిమార్గములఁ
దిరముగా మాచిన తిమ్మయ్యపేర

ద్విపదకావ్యంబుగా వెలయంగఁ జేయు
మిపుడు మా కెంతయు హిత మిది యనుడు".

ఆ ద్విపదకావ్యము చినతిమ్మరాజున కంకితమొనఁగఁబడినది.

ఈ ప్రబంధ బాలభాగవతము ఆరవీటిప్రభు వగు తిరుమలరాజు ప్రేరణమున నాతనితండ్రియగు రామరాజ తిమ్మరాజున కంకిత మొసంగఁ బడినది. ఈ విషయమునే గ్రంథకర్తయగు కోనేరుకవి కృత్యాదిని,

"కం॥ ఈ కృతికి భర్త రామ
క్ష్మాకాంతుని తిమ్మనృపతిగా నిట్టివిధం
బాకర్ణింపఁగ దిరుమల
భూకాంతుడు కర్తగాఁగఁబూనితిఁబలుకన్॥" (పు. 9. ప. 25)

అని పేర్కొన్నాఁడు.

ఇది శ్రీమద్భాగవతమునకు సంగ్రహానువాదమున తెనుఁగుసేఁత. శ్రీమద్భాగవతమందలి ద్వాదశస్కంధ కథా భాగవిషయ మారాశ్వాసములుగాఁ జక్కని ప్రబంధశైలిని వ్రాయఁబడినది. ఈ గ్రంథమున నైదాశ్వాసములును నాఱవ యాశ్వాసమునఁ గొంతభాగమునుమాత్రము గలదు. తుదను కొంచెమించు మించుగా నైదాఱుపుటల గ్రంథభాగము మాత్రమే లోపించి యుండును. కృత్యాదినిఁగూడఁ గొన్ని పద్యములు లేవు. పైయైదాశ్వాసములందు దశమస్కంధాంతభాగవతకథాభాగమును నాఱవ యాశ్వాసమున నేకాదశస్కంధ కథాభాగమునఁ జాలవఱకును గలదు. మిగతభాగము లభించలేదు. గ్రంథమధ్యమున నొకటిరెండు తావుల నలతిగ్రంథపాతములు గలవు. ఈ ప్రతి కాధారమగు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము నందలి కాగితపు వ్రాతప్రతిలోఁ జాల వ్రాత తప్పులును, కొన్నితావుల గ్రంథపాతములును గలవు.

## గ్రంథకర్తృవిషయము

ఈ ప్రబంధబాలభాగవతమును రచించినది శ్రీ దోనూరి కోనేరుకవి. ఇతని తండ్రిపేరు దోనూరి నాగయమంత్రి. అశ్వలాయనసూత్రుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. కోనేరుకవి శ్రీమదహోబలనరసింహస్వామి భక్తుఁడు. సంస్కృతమునందును, దేశభాషయగు తెనుగునందును జక్కని చవులూరు కవిత సల్ల సమర్థుఁడు. ఇతఁడారవీటివంశరాజగు తిరుమలరాజున కాస్థాన కవి. ఈ తిరుమలరాజు రామరాజతిమ్మరాజను ప్రసిద్ధిగల తిమ్మరాజునకు బుత్రుఁడు. తిరుమలరాజు విష్ణుకథయగు భాగవతమందలి ద్వాదశస్కంధ కథల వరుస గూర్చి బాలభాగవతంబని రచించి తన తండ్రియగు రామ రాజు తిమ్మరాజున కంకితమొనర్పు మని యీ దోనూరి కోనేరుకవిని వేడినట్లు లీ క్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

సీ॥ శ్రీమదహోబల శ్రీనృసింహసమగ్ర
కరుణావిశేషప్రకాశమహితు
భాసుర సంస్కృత ప్రాకృతాదికశాస్త్ర
భాషాకవిత్వ సౌభాగ్యనిపుణు
జనవర్ణితాశ్వలాయన సూత్రపావన
శ్రీవత్సగోత్రాబ్ధి శిశిరకరుని
సారస్యవినుతు దోనూరి నాగయమంత్రి
పుత్రుండనైనట్టి పుణ్యచరితుఁ

తే॥ జతురభూనాయకాస్థాన సకల సుజన
వందితుని నన్ను గోనేరునాథసుకవి
నర్థిఁ బిలిపించి సత్కార మాచరించి
పలికె నిట్లని గంభీరభాషణముల॥

(పుట. 5. పద్యం. 12.)

మ॥ సకలక్ష్మాకవిసార్థయూథములు మెచ్చన్ సంస్కృత ప్రాకృతా
దిక భాషామయ కావ్యకర్తవయి పృథ్వీనాయకాస్థానర
త్నకలాపంబనఁ బేరుగాంచిన కృతార్థశ్రేష్ఠ, దోనూరి కో
నకవీంద్రోత్తమ! నీ మహామహిమ చందం బద్భుతం బిద్ధరన్।

ఉ॥ ఆరయ శబ్దతర్కముల నాఢ్యులు కొందఱు కొంద ఱా యలం
కార విశేషశాస్త్రముల గౌరవవంతులు కొంద ఱప్పుడున్
జారుకవిత్వతత్వపదశాసను లిందరు గౌరవింప దో
నూరి పదాంక మించితి వహో గుణభూషణ సత్యభాషణా ॥

కం॥ కొడుకును నిధియును జెలువును
గుడియును నల్లిల్లు వనము గుఱుతుగఁ గృతినా
బడు బుడమి సప్తసంతతు
లెడ నన్నిటఁ గృతియ మించ నెన్నుదు రార్యుల్ ॥

తే॥ అట్టికావ్యంబు హరికథ యయ్యెనేని
యదియుఁ గనఁ బ్రౌఢకవికృతం బయ్యెనేని
కస్తురికి వన్నియయును బంగారమునకుఁ
బరిమళంబును దొరకిన పగిది గాదె ॥

సీ॥ ప్రతిజన్మకృత మహాపాతక సంఘాత
పర్వతదంభోళి భాగవతము
అతివేల వితతోద్యదతి పాపసాటోప
పన్నగఖగరాట్టు భాగవతము
భీషణదుస్సహాశేష కల్మషసరి
త్పతి కుంభసంభూతి భాగవతము
నిరవధి నిబిడోపదురితమేఘావళి
పరివాహపవనంబు భాగవతము

## ఉపోద్ఘాతము

తే॥ మఱియుఁ బ్రాసంగికాఘసంబంధ తిమిర
పటల భానువిలాసంబు భాగవతము
సాత్త్వికోత్తమ మునిజనాశాస్య మోక్ష
పద నిధానాంజనంబు శ్రీ భాగవతము॥

తే॥ అట్టి భాగవతంబునం దలరుచున్న
ద్వాదశస్కంధ కథలను వరుసఁ గూర్చి
కావ్యమొక్కటి బాలభాగవత మనఁగఁ
జెప్పి లోకోపకారంబు సేయవలయు॥

సీ॥ శ్రీ వీరనరసింహుచేఁ బతి ద్రోహార
గండపెండేర మేఘునుఁడు గాంచె
వేంకటేశ్వరు నాజ్ఞ విగతదృష్టికి దృష్టి
దయమీఱ నిచ్చెనే ధర్మమూర్తి
కణకమీఁగాముల గట్టుపై వేసవిం
బుట్టించె జలము లే భూసుతుండు
మానవకడ నవాంబూనిఁ బోరచు బరా
జయము నొందించె నే శౌర్యశాలి

తే॥ అట్టి మజ్జనకునకు సత్యాభిరతున
కారపీటి రామక్షితిపాత్మజునకుఁ
దిమ్మభూపాలమణికిఁ బుణ్యమ్ము గాఁగఁ
బలుకఁ జెన్నొందు శ్రీ బాల భాగవతము॥

(పుటలు 6, 7.)

## ఏతద్గ్రంథరచనాకాలము

ఈ దోనూరి కోనేరుకవి 16_వ శతాబ్దివాఁడు. కృత్యాదిని బూర్వకవుల స్మరించు తఱి,

కం॥ నన్నయభట్టార్యుని, భీ
మన్నన్ దిక్కయ్య నెఱ్ఱయామాత్యుఁ శ్రీనా
థున్నుతియించెద మిగులఁ బ్ర
సన్నాత్ముల నంధ్రకావ్య జలజాసనులన్॥

( పు. 3. పద్యం. 6. )

అని కవిత్రయమును శ్రీనాథుని బేర్కొనెను. అష్టదిగ్గజముల నెవ్వరిని బేర్కొనలేదు. సమకాలికుఁడగుట బేర్కొనియుండఁడు. అదియునుంగాక శ్రీకృష్ణదేవరాయ నిర్యాణానంతరము పది లేక పండ్రెండుసంవత్సరములకు గాని యారవీటివంశస్థు లధికారమునకు రాలేదు. మన కోనేరుకవి ఆరవీటి రామరాజు తిమ్మరాజుకుమారుఁడగు తిరుమలరాజున కాస్థానకవియగుటచే 1540 A. D. ప్రాంతమునఁ బ్రౌఢకవియై యుండనోపు. ఈతఁడు జన్మించిన సంవత్సరము యథాతథముగఁ దెలియదు. ఇట్టి ప్రౌఢకవిత్వ మలవడు నప్పటి కీతఁడు ముప్పదియేండ్లవాఁడైన నై యుండవలయును. ఇతఁడా వయసునఁగాని తాఁ జదివిన శాస్త్రజాలముల జీర్ణించికొని శ్రీభాష్యాది వేదాంతగ్రంథములఁ జదివి తత్త్వజ్ఞుఁడై యింతటిగ్రంథము వ్రాయఁ బూనియుండఁడని తోఁచుచున్నది. ఈ బాలభాగవతరచనాకాల విషయము గూడ ద్విపదబాలభాగవతము నంచలి యొక పద్యముచే నూహింపనగును. ద్విపదబాలభాగవతమున చివర,

చం॥ అరుదుగ శాలివాహనశతాబ్దములెన్న నిధాన, తర్క, సా
గర, శశి సంఖ్యచే వెలయఁగల్గు ప్లవంగమనంగ మించు వ

త్సరమునఁ బల్కెఁ దిమ్మవసుధాపతికిన్ గవిసార్వభౌముఁ డీ
హారిహిత బాలభాగవతహారి పదద్విపదప్రబంధముల్॥

అని యుండుటచే నా శాలివాహనశకాబ్దములకు సరియగు క్రీ. శ. వర్షములు 1547 అగును. ఆ సంవత్సరమున ద్విపదబాలభాగవతమును రచించినట్లు నుడివియున్నాడు. ఆ పద్యమందే కవిసార్వభౌముఁడనియు నుండుటచే నీతనికా బిరుదముకూడ నీ బాలభాగవతరచనాదికముచేతనే యబ్బియుండనోపు గాన, ద్విపదబాలభాగవత రచనాకాలమునకుఁ గొంత పూర్వము ప్రబంధబాలభాగవతము రచియించి యుండవలయును. ఈ ప్రబంధబాలభాగవతము హృద్యపద్యబంధురమై చాల ప్రసిద్ధిచెందుటకు గూడ నే మూడునాలుగేడులైనఁ బట్టియుండును గదా. అందుచే నీ ప్రబంధ బాలభాగవతరచనాకాలము 1542 - 1544 A. D. యై యుండు నని తోఁచుచున్నది.

మఱియు నీ ప్రబంధబాలభాగవతమునఁ గూడఁ గొన్నిపద్యము లీ కృతికాలమును దెల్పఁ దోడ్పడుచున్నవి.

'ఉ॥ ఏపున ద్రోహిభావము వహించిన సల్కయతిమ్మరాజు ద
త్పాపసహాయు సల్కయయుతంబుగ శౌర్యముమీరఁ ద్రుంచి వి
ద్యాపురియందు చాల ఘనుఁడయ్యె సదాశివరాయరాజ్యసం
స్థాపకుఁడై సిరంగవసుధావరు రామనరేంద్రుఁ డున్నతిన్॥

(పుట. 11. పద్యం. 37.)

అను పద్యమున సల్కయను ద్రుంచి సదాశివరాయలను స్థాపించిన రామరాజప్రశంస యుండుటచేతను, సదాశివరాయలపాలన 1542-వ సంవత్సరమగుటచేతను నీ కృతి 1542 - 44 కాలమునకుఁ జెందియుండ వచ్చునని తోఁచుచున్నది.

## చారిత్రక విషయము

ఈ బాలభాగవతగ్రంథములను పద్యద్విపదకావ్యములనే కాక రామరాజీయము, నరసభూపాలీయము, రామాభ్యుదయము, పరమయోగివిలాసము, సాంబోపాఖ్యానము, వసుచరిత్ర, స్వరమేళకళానిధి, ది సోర్సెస్ ఆఫ్ ది విజయనగర్ ఎంపైర్, కృష్ణరాయ విజయము, కళాపూర్ణోదయము మున్నగు పెక్కుగ్రంథములఁ బరిశీలించి వానియందు ప్రతిబింబితములగు చారిత్రకవిషయములనెల్ల నీబాలభాగవతగ్రంథములకు సంబంధించిన వానిని గ్రహించి శుక్లనామసంవత్సర జ్యేష్ఠమాసమున వెలువడిన భారతి సంపుటము - ౯. సంఖ్య - ౬ - 845 - 897 పుటలలో 'ఆరవీటివంశచరిత్ర' అను శీర్షికక్రింద సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు విపులముగ వ్రాసియున్నారు. చారిత్రక విషయముల నరయగోరు వారు పై వ్యాసమును తిలకింతురు గాత. ద్విపద బాలభాగవతమున పేర్కొనఁబడిన ఆరవీటి వంశవృక్షమును గూడ వ్రాసియున్నారు. ఈ ప్రబంధబాలభాగవతమునకు సంబంధించిన కొన్ని చారిత్రక విషయములను వారి వ్యాసవిషయములనే యిట పేర్కొనుచున్నాను.

బుక్కరాజపుత్రుఁడగు రామరాజప్రశంస యిట్లున్నది:—

గబ్బుల్ దెబ్బదివేవురార్వకులు వేడ్కం గొల్వగాఁ గిన్కపెన్
మబ్బుల్ గప్పగఁ గందనోలుగొను ప్రేమన్ జుట్టుముట్టన్ సవా
బిబ్బీ నుబ్బణగించి తోలె నరిరాడ్బీముండు లంకాసర
వ్యాబ్బంధ్యాభుఁడు బుక్కభూవిభుని రామాధీశుఁ డాహా యనన్॥

( పద్య బాలభాగవతము పుట. 10 ప. 33. )

బుక్కరాజుపుత్రుఁడగు రామరాజు సవా నెదిరించి యాతనిగర్వ మణంచెను.

# ప్రబంధబాలభాగవతములో వర్ణింపబడిన ఆరవీటి వంశవృక్షము

- తాత పిన్నమరాజు
  - సోమిదేవ
    - రాఘవదేవ
      - పిన్నమరాజు
        - ఆరవీటి బుక్కరాజు – బల్లాదేవి
          - రామరాజు — లక్కమదేవి
            - (కృతిభర్త) తిమ్మ–గోపమ్మ
              - తిరుమల
                - (ప్ర. బా. భా. (కృతికర్త)
              - విట్ఠల
              - చినతిమ్మ
                - ( ద్వి. బా. భా. కృతిపతి )
              - పాపతిమ్మ
            - కొండ
            - శ్రీరంగ — తిర్మలాంబ
              - అళియ రామరాజు

ఈ కందనోలుముట్టడినిగురించి ద్విపదబాలభాగవతమున నిట్లున్నది.

'ఆమహీపతికి దిల్లాంబికయందు, రామనృపాలుండు రాజేంద్రుండౌదవె
నెంచు నెన్నగ జాలునిద్ధశౌర్యమున, గందనవోలిదు ర్గంబులోనుండి
బుక్కయరామభూభుజుం డెల్లనృపుల, నెక్కువయిదియని నెన్నంగజాలి
వీరులు డెబ్బదివేవురాశ్వికులు, జేరి కొల్వంగవచ్చిన సవా నెదిరి
కలనంది పంచబంగాళంబుసేసి, గెలిచె దచ్చరితంబు గీర్తింప దరమె'

ఇందు రామరాజ సైన్యబలమును గూర్చి యెక్కువగా నుడువ లేదు. రామరాజీయము నందు 208 పద్యములో సదరు దండుయొక్క వివరణము వర్ణింపబడియున్నది. చూడుడు.

"సీ॥ మదకరి కోకటి కిర్వది గుఱ్ఱములు గుఱ్ఱ
మునకును విలుకాండ్రు ముగురు విచ్చు
కత్తులవారీటికాండ్రట్ల వరిల్ల
నిట్టియేనుగులును జట్టు మూడు
వేలయేనూరు నుద్వృత్తితో నడపంగ
గందనో ల్సాధింపగాం దలంచి
మొనద్రుంచి గట్టిగా ముట్టడి దిగిన నా
బిబ్బిని మిక్కిలి యుబ్బణంచి"

అనగా 3,500 ఏనుగులు, 70,000 గుఱ్ఱములు, విలుకాండ్రు 210,000, విచ్చుకత్తులవారు 210,0 0, ఈటెకాండ్రు 210,000, అన్నమాట. ఇట్టి భీకరసైన్యముతో రామరాజు కందనోలును ముట్టడించుటకు 70,000 అశ్వికులతో వచ్చిన సవాబిబ్బీని అనగా అడిల్ ఖానుని ఉబ్బణగించెను.

'హరి భావోన్నతుఁ డాదవేనిపతి కాచాధీశసప్తాంగసం
హరణోదంచితుఁ డారవీటి నగరాధ్యక్షుండు బుక్కక్షమా
వరపుత్రుండగు రామభద్రుఁడు హరిద్వల్గద్యశోజాహ్నవీ
స్థిరసౌభాగ్యుఁడు దత్పముల్ గలరె ధాత్రిన్ మాడుగాలంబులన్ ॥'

(పుట - 11. పద్యం - 34.)

ఆదవేనికోట మహాబలిష్ఠమైనది. ఈకోటను రామరాజుపట్టుకొన్న వృత్తాంతము రామరాజీయము నందలి 210-వ బిరుదగద్య మందలి "నిరవాపాదవనీ దుర్గనివాసికాసవుడయ దుర్మదఖల నిర్మథన" అన్న బిరుదవాక్యముచేత సూచితము. ఈ కాచాధీశుఁడు లేక కాసవుడయుడు ఎవ్వరికి 'అనతుడో,' తత్కారణముగ రామరాజాతనిపై నేల దండు వెడలవలసివచ్చెనో తెలియదు. ఈ కాచాధీశుఁడు సంగమవంశపతులు వాడై యుండి తద్వంశజులకడనుండి విజయనగరసింహాసనము నొడిచికొన్న సాళువనరసింగరాయలను గికురింపగా అతని యధికారమును స్థాపించుటకై ఆరవీటి రామరాజు ఆదివేనిపై దండు వెడలియుండును. ఇది మా యూహ. (నే. వెం.)

ఈ ప్రబంధబాలభాగవతమున 'సాళువ నరసింగరాయ రాజ్య స్థాపకుం డయ్యెఁ బ్రౌఢి నారవీటి బుక్కనరేంద్రు డుద్ఘాటితారి' (1-30) యని యుండుటచే నీ యారవీటి బుక్కరాజు సాళువనరసింగరాయలును సమకాలీనుఁ డని నిస్సంశయముగా మనము నిర్ధారణ సేయవచ్చును. బుక్కరాజపుత్రుఁ డగు రామరాజుకూడా 'శ్రీవీరనరసింహరాచేఁ బత్రి ద్రోహర గండపెండేర మే ఘనుఁడు గాంచె' (1-19) యని యీ పద్య బాలభాగవతమున పేర్కొనఁబడుటచే వీర నరసింహరాయలు (కృష్ణరాయలయన్న)కు సమకాలికుఁడై యుండనోపు.

పైన ప్రశంసితుడగు రామరాజుయొక్క పుత్రుడే మన ప్రబంధ బాల భాగవతమునకుఁ గృతికర్త. ఈతిరుమలరాజు అవుకువంశమునకు మూల పురుషుడు. ఇతని కనేకబిరుదములు గలవు. ఇతఁడుద్దండరాయ డనునతనిని జయించెనని, పట్టివాడప్రభువు నోడించెననియు నీతనిఁగూర్చిన ఈక్రింది పద్యములలో తెలియుచున్నది.

'కం॥ గండరగూళికి గండర
గండని కుద్దండరాయ గణవారణ శ్రీ
గండాంకున కెంతెం బర
గండనికిఁ బట్టివాడ గజసింహునకుఁ॥' (పుట - 17 - ప-2.)

ఉత్సాహ॥ పండితాంబుజాత మిత్ర భయదజన్య మేదినీ
ఖండితాహితప్రకాండ కాండమండలీ జితా
ఖండలప్రశస్తశస్త్ర ఘనతరానుభావ వు
ద్దండరాయహృదయ భల్లదాన కల్పభూరుహా॥
( పుట - 215. )

మ॥ సహజాంభోజదినేశ.............................ని
త్సహితశ్రీపద పట్టివాడ గజసింహా దానశౌర్యోదయా॥ (4-382)

ఇతడు కంపిలిరాజును జయించి యాతని సప్తాంగములను హరించి గండరగూళి యను బిరుదమును గొనినట్లు 'సంగరాంగణచర్య కంపిలి రాయసప్తాంగ గండరగూళి సద్బిరుదాది సంగ్రహణోజ్వలా' యని తెలియుచున్నది. కాని యీతనికాలమున కంపిలిరాజ్యము లేదనియు నితడా కంపిలిరాజును గెలుచుటయు నసంభవమనియు, బిరుదులు వంశ పారంపర్యముగ వచ్చియుండుననియు శ్రీనేలటూరి వేంకటరమణయ్య గారు తెల్పియున్నారు.

ఈ తిరుమలరాజు మాళవరాజును తదితరులను జయించినట్లును, మహామదమలకకు ప్రాణదాన మొసంగినట్లును తెలియుచున్నది.

'చాళుక్యచక్రవర్తికి మాళవమదభంజనునకు'

(పుట - 18 - ప - 6.)

కదనధనంజయునకు మహా, మదమల్క ప్రాణదాన మతికొడ్డియరా॥

(పుట - 17 - ప - 4)

ఈతఁడు క్రీ. శ. 1505 మొదలు 1542 వఱకు కర్ణాటకరాజుల యుద్ధములలో తరచు పాల్గొనుచుండెను. కృష్ణరాయల రాజ్యాభిషేక సమయమున నితఁడు విద్యానగరరాజసభయం దుండి యటుపిమ్మట నా రాజునకు సలహా నిచ్చుచుండెను.

'సాకల్యముగ గీర్తిసర్వదిక్తటులందు, బ్రాకటస్థితినిల్పు నొకు వారు' అను కృష్ణరాయవిజయములోని సీసపద్యపాదము పై యూహా కాధారము. కృష్ణరాయల కళింగదండయాత్ర యందు అవుకువారు పాల్గొనినట్లు,

'కివిగ నొకువారును కడింది రహిం వెలుగోటివార లా
రావెలవారుఁ గూడుకొని......'

ఇత్యాది కృ. రా. వి. లోని పద్యమునఁ దెలియుచున్నది. కావున నీ తిరుమలరాజు కృష్ణరాయలతో కటకముపఱకునుఁ బోయినందుచేత పై బిరుదముల సంపాదించియుండును. మఱియు నీతని తమ్మునిపుత్రుఁడగు నళియరామరాజునకు సలకముతిమ్మయను జంపుటయందు ఈతడు చాల తోడ్పడినట్లు తెలియుచున్నది.

సలకయ తిమ్మాసుర దు
ర్విలసిత విలయాబ్ధిలగన......బిరుదార్ఢా ॥
( పుట - 146 - వ - 306 )

ఈ తిరుమలరాజుసోదరులు విఠ్ఠలేశుఁడు, చినతిమ్మ, పాపతిమ్మ అని కలరు. వీరిలో చినతిమ్మరాజుపేరనే ద్విపద బాలభాగవతము వ్రాయఁబడినది.

ఈ దోనూరి కోనేరుకవికి నంద్యాల నారసింహరాజుగా రొక గ్రామమును దానముచేసినట్లు L. R. Vol. 33. P. 244 లో నున్నది. అది యెట్లన,

"ఈగ్రామానకు (కమలాపురం తా॥ కోడూరునకు) యీశాన్యం, వఖుపరువుదూరమున యఱ్ఱగుంట్ల అనే గ్రామం దోనూరి కోనయ్య గారికి యీ నంద్యాల నారశింహరాజుగారే ధారాగ్రహీతంగా యిచ్చిరి. యిందుకు దాఖలా యీ యఱ్ఱగుంట్ల గ్రామంయొక్క పొలిమేర చెతు దిక్కులయందు వలయ వామనముద్రలు రాతిపైన చెక్కి దిగువ దోనూరి కోనయ్యగారి అగ్రహారం యెర్రగుంట్ల అని ఆ పొలిమేర రెండు యే గ్రామం కలుస్తూవున్నదో ఆ గ్రామం పేరున్ను వ్రాసినారు. యీ దోనూరి కోనయ్య అనే బ్రాంహ్మడే బాలభాగవతం అనే ప్రాకృత గ్రంథం చేసినాడు. అందులో ఆరవేటి బుక్కరాయల ప్రకరణంలో తద్వంశీకులయిన నంద్యాలరాజుల వంశావళి వున్నది.
(L. R. Vol. 33. P. 244.)

## ఈ త ని వై దు ష్య ము

ఈ కవి నిజసామర్థ్యముం గూడ నీకృత్యాదిని గొన్ని పద్యములలో నుడివియున్నాఁడు. అవి,

మ॥ సకలక్ష్మాకవినాథయూథములు మెచ్చన్ సంస్కృతప్రాకృతా
దిక భాషామయ కావ్యకర్తవయి పృథ్వీనాయకాస్థానర
త్నకలాపంబనఁ బేరుగాంచి నకృతార్థశ్రేష్ఠ దోనూరికో
నకవీంద్రోత్తమ నీ మహామహిమచందం బన్యుతం బిద్ధరన్॥

( పుట - 5. పద్యం - 13. )

ఉ॥ ఆరయ శబ్దతర్కములు నాథ్యులు కొందఱు కొందఱాయలం
కార విశేషశాస్త్రముల గౌరవవంతులు కొంద ఱెప్పుడున్
జారుకవిత్వ తత్వపద శౌనకు లిందఱు గారవింప దో
నూరి పదాంక మించితి వహో గుణభూషణ సత్యభాషణా॥

( పుట - 6. పద్యం - 14. )

అని తిరుమలరాజు ప్రశంసించియుండుటచే నాకాలమున నుత్తమతరగతికి జెందిన కవికోటిలో నొకఁడై యుండనోపు. కేవలము కవియే గాక పండితుఁడున్నై యుండియుండును. అట్లు కానిచో సకలక్ష్మాకవినాథ యూథములు మెచ్చునట్టి సంస్కృతాదికభాషామయకావ్యకర్త యగుట పొసఁగనేరదు. మఱియు నీతఁడు భిన్నభిన్న రుచులుగల విద్వాంసులనెల్ల సంతృప్తిపఱచి వారిచే మన్ననలనందుటకు మహాపండితుఁడును, మహా కవియు నై యుండవలయును. ఈ కవి ద్విపదభాగవతమున ' కవి సార్వభౌముఁ ' డని పేర్కొనుటచే నా ద్విపదభాగవతరచనకుఁ బూర్వమే యీతని కా బిరుదము లభించియుండవలయునని తోఁచుచున్నది. ఈ ప్రబంధబాలభాగవతముననుఁ బ్రత్యాశ్వాసము చివఱను గల యాశ్వా సాంత గద్యమున ' ఇది శ్రీమదష్టభాషాకవిమిత్ర, నాగయమంత్రిపుత్ర, సాహిత్యమార్గ నిశ్శంక, దోనూరిపదాంక ' యని చెప్పికొనియుండుటచే నీతఁ డెనిమిదిభాషల లెస్సగాఁ దెలిసినవాఁడని తెలియుచున్నది.

2

వేదాంతవిషయమును బ్రతిపాదించు సందర్భములనెల్ల విశిష్టాద్వైత సంప్రదాయసరణినే విశేషముగాఁ బ్రతిపాదించి యున్నాఁడు. పుట- 6- ప-43 వాసుదేవమయబ్రహ్మము, శేష శేషిత్వాది పదప్రయోగములు శ్రీ రామానుజభాష్యపంక్తులే ధ్రువోపాఖ్యానము, నృసింహదండకము మొదలగు ఘట్టములందు బ్రయుక్తములగుట నీతఁడు విశిష్టాద్వైత మతావలంబియై తన్మతగ్రంథములనెల్ల జక్కఁగ జదివినవాఁడని తెల్పు చున్నవి. మఱియుఁ నిందలి పురంజనోపాఖ్యానము, దక్షాధ్వరధ్వంసము, వామనావతారము మొదలగు ఘట్టములందు నా యా మీమాంసజ్ఞానము వెల్లడించియున్నాఁడు. వామనావతారఘట్టమున బలి యొనర్చు యాగశాలను వర్ణించుతఱి మూలమున లేకున్నను స్వకీయ పాండిత్య ప్రకటనమునకై యామీమాంసా శాస్త్రప్రతిపాదిత యజ్ఞాంగపారిభాషిక పదములనే ప్రయోగించెను.

సీ॥ ఆశ్రావయాదివాక్యవిశేషభాసుర
స్వనదైర్ఘ్యసంచితశ్రవణమహము
ప్రకటస్రువస్రుధ్రువోపభృదులూఖలమున
లైణాజినాదిక వ్యాప్తతంబు
కృష్ణాదికస్వరోత్కృష్టతరోద్గాతృ
సంపాదితాదానసామకంబు
ప్రణయనాదికరమ్యపావకసాత్కృత
సాన్నాయ్యకృతగంధసంకరంబు
తే॥ నై ప్రశాస్త్రుదితానువాక్యానువేద్య
మాన దేవతాకృతసన్నిధాన వినుత
మును విశిష్టసామాజిక ముపకరణము
లమరు బలిమఖశాలాశ్రయంబుఁగాంచె॥

(పుట 290. పద్యము 159.)

అద్దాన నాతని కావ్యశాస్త్రమండలి పరిచితియు వ్యక్తమగుచున్నది. మఱియు నా వటుని వర్ణించుతఱి నా వర్ణనమంతయు స్వకీయమే యై యుండనోపు.

సీ॥ త్రయ్యతిప్రౌఢతర ప్రభాకరకుమా
రిలశాస్త్ర చాతుర్యవిలసితములు
వేదాంతవాగర్థవిధులును గౌతమ
కణభోజిపాణిని గ్రంథరుచులు
కాపిలమతయుక్తిఘటనలు బహుపురా
ణేతిహాసగ్రాహ్య జాతకథలు
నాటకాలంకార నైపుణాభినయంబు
కావ్యప్రహేళికా కౌశలంబు
తే॥ లాదిగా గల విద్యారహస్యతతుల
ఘనతరోదారపటునిరాఘాటఘణితి
వహ్నిసన్నిభులగు మునీశ్వరులతోడ
గోష్ఠిఁ జేసె న వ్వటు డటు కొంత తడవు॥

(పుట 291 — పద్యం 161.)

పై పద్యమున గల సర్వతంత్ర స్వతంత్రతయు మన దోనూరి కోనేరుకవికి గల విజ్ఞానమును జాటుచున్నది.

ఈతని కైత మధురము, ప్రౌఢము నై యలరారుచున్నది. సంస్కృతపండితుఁడు నగుటచే నన్నయభట్టారకశైలివలె నెక్కుడుగ సంస్కృతపదములతోడనే విశేషముగా రచన సాగించినను, తెనుఁగున గూడ సిద్ధహస్తుఁ డని తెల్పుటకా యనునట్లు రెండుమూఁడు తావుల కేవల మచ్చతెనుఁగున జక్కని కైత నల్లి కవికీర్తి నందినాడు. కమ్మని తెనుఁగుపోకడల సీసు పద్యముల కీ క్రిందివి యుదాహరణములు :—

సీ॥ చిఱుతగాలికిఁ బుట్టు కుఱుంగడ లుయ్యాలల్
గానూఁగి యాడు జక్కవలచేతఁ
దమ్మితూఁడులు ద్రుంచి కొమ్మల కందించి
పెంపొందు రాయంచ పిండుచేతఁ
బూదేనెపొత్తుల భోజనంబుల కర్థిఁ
గదుపులు గట్టు తుమ్మెదలచేతఁ
దరులతీవెల విరు ల్గురియు నెల్లపుడు పైఁ
బడి కప్పుకొన్న పుప్పొడులచేత
తే॥ గరుడపచ్చల చెలులతో విరసపడఁగఁ
బదరు క్రొమ్మించు నాచుజొంపములచేతఁ
జాల వేడుక లొదవింపజాలు నొక్క
కొలనుఁ జేరె న య్యేనుఁగు కులము సామి॥
( పుట 257 — పద్యం 18, )

కం॥ కొలఁకులఁ దేటుల మొరపం
బులకు న్నెలవులగుచు మొగము లవియు చెం
గలువల నెత్తావులపైఁ
జలువల నయ్యేన్గురాజు సంతసమొందెన్॥

సీ॥ రిక్కలగమికాఁడు రేపణంతిమగండు
కలువచుట్టము వేడివెలుఁగుజోడు
వెలకినజ్జాడు లేమలబూచి లచ్చితో
బుట్టువు చలువల పుట్టినిల్లు
కఱకంఠు తలపువ్వు చెఱకువిల్తునిమామ
దాతరాయడు చక్కదనముపెంకి
తరిదాల్పు డాకన్ను దండిచీకటిఁ ద్రెంచు
బలియుండు పసిడిగుబ్బల తలారి

గీ॥ కమలములపాలివిధి చకోరముల పంట
కుప్ప తెక్కలికాండ్రకు గుండెదిగులు
తలయచిక్కిన వెడగాము చలిదికుడుపు
తొవయుకన్నులు మెచ్చు చందురుడు వొడచె॥

( పుట 392 – పద్యం 185. )

ఈ కవి హేమంతఋతువర్ణనము కడుంగడు స్వాభావికముగను చమత్కారముగను గానించియున్నాఁడు. సీసపద్యమున నొక్కొక్క పాదము నొక్కొక్క సమాసముగ సంస్కృతమయముగనే వ్రాసెను. తుదిని తత్సమద్యోతక ప్రత్యయంబు మాత్రము తెలుఁగు. ఈ సీసమున 'జానుసంవ్యాజత...వార్ధకంబు' అని ముసలితనమున చలికి మోకాళ్ళ ముడుచుకొని కడుపున వొత్తిగిలియుంచుస్వభావచేష్ట యెంతోరమ్యముగ చిత్రింపఁబడినది. చూడుడు :—

సీ॥ శీతవిద్రావితాశేష మందోష్ణాతి
శయసమారూఢ రోమాస్తనంబు
పల్లవకాంక్షిత ప్రౌఢాంగనాపీన
కుచకుంభగాఢోప గూహనంబు
కుటకండ సంభృతోత్కటకరీషానలో
ద్యద్ధూమసంభాదితాంబరంబు
జానుసంవ్యాజిత శాతోదరీకృత
వ్యాయస్తదుర్బల వార్ధకంబు
తే॥ జనవర స్వీకృతోరుహాసంతికంబు
హవ్యవాటక్కణసంశ్రితాహస్కరంబు
దీర్ఘదీర్ఘ విభావరీ దీపితంబు
నయ్యె హేమంతవేళాసమాగమంబు ॥

( పుట 377 – పద్యము 126. )

మఱియు నీతనివి కొన్ని తెనుఁగు పదప్రయోగములును గుర్తింప నగును. అవి ఒజ్జళ్ళు (232), పశువారె (386), ఎడసించు (405), కీడ్పఱసి (419), బారసి (382), వ్రేయలు (386) మొదలగునవి.

సంస్కృతమునఁ గూడ నీతని పాండిత్యశౌండీర్యముం జాటు నీ క్రింది పదప్రయోగములు గణనార్హములని యిట జూపుచున్నాను. ముద్వాస్యంద (123) వాస్సార (243) యాష్మాకీన; అస్మాకీన (228) అదసీయ్యాని (237), సముద్గీత (373), న్యర్బుదషట్కంబు (405), Vedic usage సౌత్యంబగు నహంబు (431), ఐతదాత్మ్యంబు (431), పై ప్రయోగములం దీ కవికి గల వ్యాకరణజ్ఞానము, వైదికజ్ఞానము వ్యక్త మగుచున్నది. న్యర్బుదపదము సామాన్యముగ వేదప్రయుక్తము. ఈ కవి యిందు ప్రయోగించినాడు. ఐతదాత్మ్యము కూడ నుపనిషత్ప్రయుక్తమగుపదము.

## ఈ త ని క వి తా రీ తు లు

శ్రీమద్భాగవతమునే యాధారముగఁ గొని నితివృత్తమున నేలాంటి విశేషమార్పులు సేయక, తత్త్వోపదేశసందర్భములందు భక్తిప్రపత్తులు లేక ముక్తిగలుగ దను విశిష్టాద్వైత తత్త్వాంశములనే యవకాశము దొరకినపుడెల్ల బోధింప నమకట్టి రచన సాగించినను నీ కవి కవనమున బూర్వకవుల పోకడలు కొన్ని గోచరించుచున్నవి. మచ్చునకిచట గొన్ని యుదహరించుచున్నాను.

ఉ॥ ఎవ్వరిదాన వీవు కమలేక్షణ నీ కులమెద్ది ? పేర ని
న్నెవ్వఁడి యందు రిచ్చటికి నెన్నఁడు వచ్చితి విట్టిరూపమే
నెవ్వరియందు గాన కుసుమేషునిమోహనమంత్రశక్తియో
నవ్వులదేర నింక వచనంబు ప్రసాదము సేయఁగాఁ దగున్॥

( పుట 282 - పద్యం 121 )

మనుచరిత్రమున,

'ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటిచరించె దోటలే
కివ్వనభూమి'......

అను పద్యము నందలి యెత్తుగడను బోలియున్నది.

వామనావతార ఘట్టమున :—

అమితబ్రహ్మరహస్యమార్గగమనా యాసక్తిమచ్చేతసే
నిమలాచారజుషే పదత్రయమితోర్వీం విష్ణురూపాయ తు
భ్యమహం సంప్రదదే నమో నమమ నిత్యప్రీతిరస్తంచు ని
స్తమ్ముడై గ్రక్కున ధారవోసె బలి యుత్సాహంబు సంధిల్లగన్ ॥

( పుట 295 - పద్యం 180 )

శ్రీమదాంధ్రభాగవతమున నిదేఘట్టమున :—

శా॥ విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్యవిదే త్రిపాదధరణిం దాస్యామి యంచుం గ్రియా
క్షిప్రుండై దనుజేశ్వరుండు వడుగుం జే సాచి పూజించి బ్ర
హ్మప్రీతమ్మని ధారవోసె భువనం బాశ్చర్యముం బొందగన్॥

( అష్టమస్కంధము - పద్యం 607 )

సూర్యోదయవర్ణనసందర్భమున,

అగ్నిరత్నములు ప్రత్యగ్రనాడీ విము
క్తకౌమధూమసంగతి నెసంగ ॥

( పుట 392 - పద్యం 187 )

ప్రాచీం వాసకసజ్జికా ముపగతే భానౌ దిశాంవల్లభే
పశ్యైతా రుచయః పతంగదృషదామాగ్నేయనాడింధమాః
..........................................

( అనర్ఘరాఘవం - అంకం 4 - శ్లో 2 )

కాళీయమర్దనఘట్టమున :—

శా॥ ఆడెం దాండవ మయ్యహీంద్రుతలలం దానచ్యుతుండై కిన్నరుల్
పాడన్ సాంద్రకుతూహలంబున నభోభాగస్థులై నిర్జరుల్
.................................

( పుట 375 - పద్యం 116 )

ఈ పద్యమెత్తుగడ శ్రీనాథుని భీమఖండ మందలి శివతాండవ పద్యమును జ్ఞప్తికిదెచ్చు చున్నది:

త్రిపురవిజయానంతరము:—

ఆడెం దాండవ మూర్జటీవటహా లీలాటోప విస్ఫూర్జిత
క్రీడాడంబర ముల్లసిల్ల గరళగ్రీవుండు............

( భీమఖండం అశ్వాసము 4 - పద్యం 148 )

సీ॥ విప్రవర్యులు చూచి వేదసమంబన
శాస్త్రులు వేదాంతశాస్త్ర మనఁగ
శబ్దశాస్త్రజ్ఞులు శబ్దసారంబన
రసికులలంకారరాశి యనఁగ
లక్షజ్ఞులు సర్వలక్షణాఢ్యంబన
నీతిజ్ఞు లిది మహానీతి యనఁగ
కావ్యవేదులు మహాకావ్యం బనంగ బౌ
రాణికు లాదిపురాణ మనఁగ

తే॥ గాన చాతుర్యలోలుపులైన వార
లుదిత మృదుభావములపదం బిదియనంగ
జగతి నాచంద్రతారార్కమగుచు మిగుల
భాసురంబగు నీ బాలభాగవతము॥

(పుట 23 - పద్యం 5 )

అను పద్యము విన్నంతోడనే శ్రీమదాంధ్రమహాభారతమున నన్నయభట్టారకుని యీ క్రిందిపద్యము జ్ఞాపకమునకు వచ్చుచున్నది.

సీ॥ ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియు
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ

తే॥ వివిధ వేద తత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు ॥

( మహాభారతము )

## ప్రబంధబాలభాగవతనామము

ఈ కవి దీనిని మహాప్రబంధమని పేర్కొనియున్నాఁడు. కవితా కళ పరమోచ్ఛదశనందిన ప్రబంధకాలమగు పదునాఱవశతాబ్దమువాఁడు గావున నాఁటి కవితాభిరుచినిబట్టియు, కొన్ని ప్రబంధలక్షణము లుండుటం బట్టియు దీనిని ప్రబంధమనఁ దగును. ప్రబంధమునకు ముఖ్యముగా నేక నాయకత్వముండవలయును. ఇందును భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడే నాయకుండు. అతని యవతారలీలలు విలాసములు నిందు వర్ణితములు. నగరార్ణవశైలర్త్వాది వర్ణనములు నిందు గలవు. వివిధచ్ఛందములఁ

బద్యములు గలవు. పురాణలక్షణములును నెక్కుడుగనే గానుపించు చున్నవి. అయినను శ్రీమద్భాగవతము సంగ్రహముగా ప్రబంధపద్ధతిలో నాఱాశ్వాసములలోనికిఁ జమత్కారముగా వ్రాయఁబడి యుండుటచే దీనికి మహాప్రబంధమని యీ కవి నుడివియున్నాఁడు. ఆంధ్రములో భారతమును 'కవివృషభులు' మహాకావ్యమనియు గొనియాడున ట్లీ గ్రంథముగూడ మహాప్రబంధ మనఁదగును. పదునెనిమిదివేల గ్రంథముగల శ్రీమద్భాగవతమును చిన్నదిగా నాఱాశ్వాసములలోనికి సంగ్రహింపఁ బడుటచే చిన్నదిగ చేయబడినకారణమున దీనికి బాలభాగవతనామ మెంతయు నొప్పుచున్నది.

## ఛందోవిషయము

మహాకవియు నుభయభాషాకోవిదుఁడును, నష్టభాషాకవిమిత్రుఁ డగుటవలన నీ కవిపాండిత్యము చాల గొప్పది. ఇతఁడు సంస్కృతాంధ్రముల రెండుభాషల నీ గ్రంథమున వెలయఁజేసెను. సంస్కృతచ్ఛందములలోను నాంధ్రచ్ఛందములలోను జక్కగ కైత నల్లినాఁడు. ఈతఁడీ గ్రంథమున సాధారణముగఁ గవులుపయోగించు చంపకోత్పల శార్దూల మత్తేభములును, కంద, సీస గీతములును మాత్రమే కాక విశేషచ్ఛందములను గూడ నుపయోగించినాఁడు. అవి తోటకము, మత్తకోకిల, ఉత్సాహము, స్రగ్ధర, మహాస్రగ్ధర, లయగ్రాహి, లయవిభాతి, లయహారి, మాలినీవృత్తములు. తరువోజ, రగడ, తరళములను గూడ సందర్భోచితముగ నుపయోగించి నిజకవితాప్రావీణ్యముం జాటినాఁడు.

గూఢచతుర్థినిఁ గూడ నొక పద్యమున జొప్పించెను. ఈ క్రింది సీసపద్యమున కెత్తు గీతమునందు నాల్గవపాదము నిగూఢము. నాకు చేతనైనంతవఱకు పైసీసపాదము లందలిపదములనే కూర్చి గూఢమగు చతుర్థపాదమును పూరించితిని,

గూఢ చతుర్థి :—

సీ॥ అర్జున భూధరేశాభ విరాజిల్లు
హరిభక్తివిజయభూత్యసమధృతుల
అబ్జమిత్రకుమారయశమున వర్తిల్లు
వరకళారుచి శక్తివర్తనముల
జలనిధి గురువిలాసంబున భాసిల్లు
నైర్మల్యభరణాది న్యాయగతుల
శంబర ఘనజిష్ణు సమలీల వర్ధిల్లు
నురుయుక్తి దానభోగోజ్జ్వలతల
తే॥ అహహ రాయరాహుత్త వేశ్యా భుజంగ
మన్నెపులి ముఖ్య బిరుదసమన్వితుండు
దితిరిపుస్థితి రామయ తిమ్మనృపతి
(అసమధృతి శక్తిభాసిల్లు న్యాయగతుల) ॥

ఈతని నృసింహదండక ముద్రేకపూరితము. స్వయముగ శ్రీమదహోబల నృసింహస్వామి భక్తుఁడౌట నీ భాగవతమునఁ బ్రహ్లాదచరిత్రమందు నరసింహావతార ఘట్టమును వ్రాయుతఱి విశిష్టాద్వైత తత్త్వము గద్యత్రయము మున్నగు వానిలోని విషయములను ప్రతిపాదించుచు భక్త్యుద్రేకమున నావేశపరవశుఁడై నీ దండకమును నుడివినట్లు తోఁచుచున్నది. ఇది యంతయు సంస్కృతమయము. తోటకాది వృత్తములు కూడ సంస్కృతమయములుగా రచించినాఁడు. ఈ దండకరచన యందు కవి నిజ సంస్కృతభాషా పాండిత్యమును, విశిష్టాద్వైత వేదాంత పరిచయమును, భగవద్భక్తి మున్నగు ననేకసంప్రదాయవిషయముల నేరి కూర్చి యిట జమత్కారముగా వ్రాసియున్నాఁడు. ఈ దండకరచన మావేశపూరితమై యొకే ప్రచండవృష్టిని దొరలినట్లున్నది. ఇందలి తత్త్వమంతయు విశిష్టాద్వైత తత్త్వము.

## ఇతని ప్రయోగవైశిష్ట్యము

సంస్కృతాంధ్రములందు సిద్ధహస్తుఁడగు నీ కవి యింతటిగ్రంథమున నొక్కచో నొక సీసపద్యమున యతి ప్రయోగమును విశిష్టముగా ప్రయోగించినాఁడు.

"సీ: రోమపాదుం డనావృష్టిపరీహార
మూహించి మహితాత్ము ఋష్యశృంగు" (పుట 347)

అను సీసమందలి పెద్దపాదమందును, చిన్నపాదమునందును, యతి స్వరూపము చింత్యము. పెద్దపాదమున 'రో' 'వృ' లకును, చిన్న పాదమున 'ఊ' 'ఋ' లకును యతి చెల్లింపఁబడియున్నది. ఋవళి సందర్భమున ఇ, ఈ, ఎ ఏ లం గూడిన రేఫముమాత్రమే ఋకారముతో జెల్లు నని కవిజనాశ్రయ, అప్పకవీయాది ఛందోగ్రంథములు నుడువు చున్నవి. ఈ గ్రంథకర్త దోనూరి కోనేరుకవి అష్టభాషా కవిమిత్ర, సాహిత్యమార్గనిశ్శంక, కవిసార్వభౌమేత్యాది బిరుదాంచితుఁడైన మహా కవి. ఇంతటి ప్రౌఢకవియై పై సీసపద్యమందలి యతివిషయము తెలియక యిట్లు వ్రాసియుండఁడు. ఇట్టి యతులు కొన్ని నవనాథచరిత్రాది కృతు లందు గోచరించుటచే గ్రాహ్యమే కాగలదు. ఈ సందర్భమున దీనిని తద్భవవ్యాజయతిక్రింద సమర్థించుకొనవచ్చునని నా యూహకు తోచు చున్నది. 'ఋ'కారము తద్భవమున 'రు' అగుచున్నది. 'రోమపాదుం డనావృష్టి' యనుచోట నిది తద్భవవ్యాజయతియే యగుననఁ దగునేమో. 'స్నానముచేసి ధౌతపరిధానముగట్టి' యిత్యాదులయందు స్నానశబ్దమునకు తద్భవము 'తాన' మగుననియు నద్దానతద్వ్యాజమున ధానమునందు 'ధ'కారము 'స్నా'కు యతిగా నుడువుచున్నారు. అనఁగా నొకపదము తద్భవమున నొండు రూపమున గల్గు వికృతిననుసరించి త ద్వ్యాజమునఁ గూడ యతి చెల్లించవచ్చునని తేలుచున్నది ఇట 'రోమపాదుం డనావృష్టి' యనుచోట 'రో' వృలకును, 'ఊహించి మహితాత్ము

ఋష్యశృంగు' అను పాదమున 'ఊ' 'ఋ'లకును నీ తద్భవవ్యాజముననే యతి చెల్లింపబడెనని తోఁచుచున్నది. ప్రాకృతవ్యాకరణమున 'ఉదృత్వాదిషు'అను ప్రాకృతసూత్రప్రకారము 'ఋతుః'అను సంస్కృతపదము ప్రాకృతమున 'ఉదు' అని యగుచున్నది. ఇట 'ఋ'కారము 'ఉ'గా మారుచున్నది. ఇట్టి తద్భవప్రాకృతరూపమున గోచరించు ఉకారమును వ్యాజముగఁ గొని యీ స్థలమున యతి చెల్లింపఁబడినది. వృక్షశబ్దము ప్రాకృతమున 'రుక్ఖో' యను రూప మగుచున్నది. 'వృ' అనునది 'రు'గా మారుచున్నది. ఆ రూపము నాధారముగాఁ జేసికొని 'రో'అను వర్ణమునకు 'వృ' అని ఋకారము ఉత్వవిశిష్టరేఫముగా గ్రహించి యతి చెల్లింపఁబడినది. నవనాథచరిత్రయందును 'నృపునితో నొండు రెండును గాను జెప్పి, నృపతనూభవుల పావురముల నెల్ల' అను తావుల యందు నిట్లే చెల్లింపఁబడియున్నందున నీ కవి కావలయుననియే పై విధమున యతివైశిష్ట్యము నెఱుకపరచుటకై వ్రాసియుండును. మఱి కొన్ని ప్రాచీనగ్రంథములందును గొన్నిట నిట్టియతులు చెల్లింపఁబడినవి. 'ఋ' అను నది 'రి - రు 'లకు రెంటికిని సమముగా చెల్లింపఁబడినది. మఱొక తావున నీ కవి యేలకో చిత్రముగా యతిప్రయోగముచేసినాఁడు.

..............................మొదలి వారి

నిరుపుర దంభోళి నిహతిచేఁ బరిమార్చి

యని యఖండయతినిఁ బ్రయోగించినాఁడు. ఇది క్వాచిత్కమే కాని చింత్యము. ప్రమాదపతితము కావచ్చును.

## ఇందలి విశిష్టాద్వైత తత్త్వము

శ్రీమద్భగవద్గీతకు శ్రీమద్రామానుజులవారిభాష్యమున కవతారికలోని పంక్తులును, ఈ బాలభాగవత మందలి ధ్రువోపాఖ్యానము నందలి కొన్ని పంక్తులును సరిపోలుచున్నవి. అవి యీ క్రింద నుదహరించుచున్నాను.

శ్రియఃపతిర్నిఖిల హేయప్రత్యనీక కల్యాణైకతానః
స్వేతర సమస్తవస్తు విలక్షణానంత జ్ఞానానందైక స్వరూపః

స్వాభావికానవధికాతిశయజ్ఞాన వీర్య శక్తితేజః ప్రభృత్య సంఖ్యేయ కల్యాణగుణ మహోదధిః

వివిధవిచిత్రానంత భోగ్య భోక్తృవర్గ పరిపూర్ణ నిఖిల జగదుదయ విభవ లయలీలః పరంబ్రహ్మ పురుషోత్తమో నారాయణః

వాఙ్మనసా పరిచ్ఛేద్య స్వరూప స్వభావః

బ్రహ్మాది దేవమనుష్యాణాం ధ్యానారాధనాద్య గోచరోఽపార కారుణ్య సౌశీల్యవాత్సల్యౌదార్య మహోదధిః

(భగవద్గీత — రామానుజభాష్యావతారిక)

బాలభాగవతమున నీ క్రిందివిధముగ నున్నది:—

ఇవ్విధంబున నిఖిలహేయప్రత్యనీక కల్యాణైక తానజ్ఞానానందైక స్వరూపతా నిరూపితుండును నస్పృష్టాశేష దోషస్వాభావికానవధికాతిశయ జ్ఞానబలైశ్వర్య వీర్యకీర్తి శక్తితేజః ప్రభృత్య సంఖ్యేయ కల్యాణగుణ మహోదధియును, లక్ష్మీపదాంకుండును, వివిధవిచిత్రానంత భోక్తృవర్గ భోగోపకరణ భోగస్థాన పూర్ణనిఖిల జగదుదయ విభవలయలీలుండును, పరబ్రహ్మయుం, బురుషోత్తముండు నగు నారాయణునియందలి భక్తి యోగంబు.......................................

వాఙ్మనసాపరిచ్ఛేద్య స్వరూప స్వభావుండును, నపారకారుణ్యసౌశిత్యాదార్యమహోదధియును, ననాలోచితవిశేషాశేష లోకశరణ్యుండును, ప్రణతార్తిహరుండును, నాశ్రితవాత్సల్యైకనిధియును నగు శ్రీమన్నారాయణుని సర్వోపాయంబుల శరణంబు పొందెంగావునఁ ధ్రువుండు:—

(పుట 126 - 127)

# ఆంధ్రమందు గల భాగవతగ్రంథములు

భక్తిరసము చిప్పిలు భాగవతగ్రంథమును పలువురు చేపట్టి వారి వారి చిత్తవృత్తికిఁ దోఁచిన రీతి చంపువులుగను, సంగ్రహములుగను, ద్విపదలుగను, వచనములుగను, యక్షగానములుగను, నాటకములుగను రచించిరి.

" (A) చంపూగ్రంథములు :—

(1) శ్రీమదాంధ్రభాగవతము — బమ్మెరపోతన స్కం. 1,4—7.10
(2) ,, బొప్పరాజు గంగన్న సూ-5.
(3) ,, పర్చూరి సింగన్న సూ-6.
(4) ,, నందిమల్లయ-గంటసింగన స్కం-6. (1440-1490)
(5) ,, మలయమారుతము సర్వన్న సూ-6. (నష్టం)
(6) ,, వెలిగందల నారయ సూ - 11, 12.
(7) ,, చంద్రాభట్ల హరిభట్టు 7, 11, 12.
(8) ,, కోవూరి పట్టాభిరామశర్మ స్కం-11, 12.
(9) ,, ముడుంబి సింగరాచార్యులు స్కం-1,2,5,11,12.
(10) ,, సంజీవరాయకవి స్కం . 7, 8, 10.

(B) సంగ్రహములు :—

(11) ,, దోనూరి కోనేరుకవి (1530-1550) ప్రబంధము.
(12) ,, అల్లమరాజు రామకృష్ణకవి (1845) అచ్చతెనుగు.

(C) ద్విపద భాగవతములు :—

(1) ,, మడికి సింగన్న స్కం-10. (1420)
(2) ,, రత్నాకరం గోపాలకవి స్కం-10.
(3) ,, దోనూరి కోనేరుకవి (1530-1550)
(4) ,, తరిగొండ వెంకమాంబ 1840.
(5) ,, ఉేకుమళ్ళ రంగశాయి స్కం-1-4. (ఛిద్రస్థితి)

(D) వచనములు :—

(1) ,, కందుర్తి వెంకటాచలకవి (నష్టము)
(2) ,, పుష్పగిరి తిమ్మన—సంగ్రహము (1775-1800)
(3) ,, శతఘంటం వెంకటరంగశాస్త్రి.

(E) యక్షగానములు :—

(1) ,, వెంకటాచలదాసు
(2) ,, చిలమద్దినారాయణాచార్యులు స్కం-10. పూ-భా
(3) ,, ఎల్లయ

(F) నాటకములు :—

భాగములు — పలువురు — ఆధునికులు ”

భారతి-ఖర-పుష్యము (శిష్టా రామకృష్ణశాస్త్రిగారు.)

## ప రి ష్క ర ణ ము

ఈగ్రంథమును పరిష్కరించుటలో నిచ్చట ఆంధ్రశాఖాపరిశోధకులు కీ॥ శే॥ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నా కెక్కువగఁ జేయూత నొసఁగిరి. వారికి కృతజ్ఞుఁడనై వారిని స్మరించుట నా కర్తవ్యముగ భావింతును. మూలగ్రంథమున తప్పులు మెండుగ గలవు. మూలపాఠములు అలతి దోషములుగ నున్నను నట్లే ఫుట్‌నోటులో చూపితిని. నా మార్పులు, పూరణములు కుండలీకరణము గావించితిని. దీని ముద్రణమునకు సమ్మతినొసఁగి మా కెంతయుఁ బ్రోత్సాహ మొసంగు దేవస్థానపుటధికారులకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడను. సకాలమున ప్రూఫులు సరిదిద్ది అచ్చుకూర్చుటయందు శ్రమకోర్చి సహాయపడిన ముద్రాక్షరశాల వారికిని నే నెంతయు కృతజ్ఞుఁడను.

పంగనామల బాలకృష్ణమూర్తి.

# విషయసూచిక

## ప్రథమాశ్వాసము

## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము

## చతుర్థాశ్వాసము

## పంచమాశ్వాసము

## షష్ఠాశ్వాసము

# బాలభాగవతము

## ప్రథమాశ్వాసము.

### కృత్యవతరణిక.

ఇష్టదేవతాది ప్రార్థనము.

[1] ..............................

సీ॥ (సింహాసనీ) కృతశ్రీమదోంకార యా
స్థానీకృతోపనిషద్రహాస్య
శుభమంటపీకృత శ్రుతిసూతికాగేహ
శేఖరీకృతబాలశిశిరకిరణ
ముకురీకృతానేకసుకవి శుద్ధస్వాంత
సహచరీకృతవాక్యచతురకీర
హస్తభూషీకృత పుస్తకోజ్జ్వల వీణ
యాతపత్రీకృత శ్వేతపద్మ
తే॥ హార నీహార ఫణిరాజహార హీర
హారభాసుర ఘనసార చారువర్ణ
భారతీదేవి మన్మనఃపద్మసద్మ
వసతియై సత్కవిత్వంబు నొసఁగుఁగాత ॥ 1

1. (.........) కుండలి లోపలి భాగము నాచేఁబూరింపఁ బడినది. దీనికిఁ బూర్వమిష్టదేవతా స్తుతి పద్యములు గొన్ని మాతృకలోనే లోపించినవి.

తే॥ సరవి నెవ్వానివాగ్విలాసక్రమంబు
వాణి మున్నిద్దరకు డిగ్గి వచ్చువేళ
మొదలిసోపాన మయ్యె నమ్మునివరేణ్యు
ననఘు వాల్మీకిఁ బ్రణమిల్లి యభినుతింతు॥ 2

ఉ॥ మానితశబ్దతోయముల మంజులతరార్థతరంగపంక్తులన్
భూనుతభావరత్నముల భూరితరాతినిగూఢ మార్గయా
దోనికరంబులన్ మిగుల దుస్తరమై కనుపట్టుభారతా
ఖ్యానపయోధిఁ గట్టిన మహామహు సాత్యవతేయుఁ గొల్చెదన్ ॥ 3

ఆ॥ [1]నిగమకల్పశాఖ నగణితరుచిభాగ
వతఫలంబు గోసి (భావుకులకు)
శుకముఖమున (నొసగె సుకృతి యెవ్వం డట్టి)
వ్యాసుఁ బ్రస్తుతింప నలవియగునె॥ 4

సీ॥ ఆవాణి యెవ్వాని నీవ నే నని పల్కె
వరరుచితోడి సంవాదవేళ
శారద కాళిదాసకవిత్వసమముగాఁ
దులఁదూచె నెవ్వాని లలితకవిత
మృదుని గద్యంబుచే మెప్పించి యెవ్వాఁడు
పంచశాఖము నిగుర్పించుకొనియె
[2]నాఱుపద్యములచే నర్కుని గరఁగించి
యెవ్వాఁడు తనువున కింపుఁ గాంచె

---

1. నిగమకల్పశాఖ నగణితఫలవిభాగ
వతఫలంబు గోసి.........
శుకముఖమున.........గడియొల్లాను
వ్యాసు బ్రస్తుతింప నలవియగునె
2. (పద్యశతంబుచే భాస్కరుఁ గరఁగించి)

తే॥ ఖండనగ్రంథ మొనరించెఁ గణఁక నెవ్వఁ
డెవ్వనికిఁ బదలాలిత్య మొసఁగు బిరుదు
శివహరిచరిత్రకావ్యముల్ చేసి రెవ్వ
రట్టి సంస్కృతకవుల నిత్యము నుతింతు॥ 5

కం॥ నన్నయభట్టార్యుని భీ
మన్నన్ దిక్కయ్య నెఱ్ఱయామాత్యు శ్రీనా
థు న్నుతియించెద మిగులఁ బ్ర
సన్నాత్ముల నంధ్రకావ్యజలజాసనులన్॥ 6

కం॥ మఱియును దొల్లియు నిప్పుడు
మెఱయు మహీశ్వరులసభల మెచ్చులు గొనుచున్
నెఱకవితలఁ బల్కెడు నే
డ్తెఱగల సత్కవుల సన్నుతిం బ్రార్థింతున్॥ 7

శా॥ [1](ఆయాపోట్లమ్మ)పా కవిత్వములనొయ్యంగూర్చి లోకుల్ దమున్
[2]ఛా యంచున్ హసియింప మాదృశుల కాస్థానంబులన్ మున్ను సల్
సేయం ద్రోవలు వెట్టు నక్కుకవులన్ జిత్తంబున న్మెచ్చి దీ
ర్ఘా [3](యుష్మంతులరై చెలంగుఁడ)ని యే నాశీర్వదింతున్ దగన్॥ 8

వ॥ అని యివ్విధంబున ప్రారిప్సిత గ్రంథనిర్విఘ్న పరిసమాప్తి సంప్రదాయావిచ్ఛేదలక్షణ ఫలసాధనంబుగా నిష్టదేవతా ప్రార్థనంబుం జేసి యొకానొకశుభముహూర్తంబున భగవద్భాగవత చరిత్రానుబంధ బంధుర ప్రబంధవిరచనా వితతకుతూహల సమాలింగితాంతరంగుండ నగుచుఁ జెలంగు సమయంబున. 9

---

1. (.........పా) 2. జా 3. (య.........)

## కృత్యావశ్యకత.

సీ॥ తనకీర్తి [1](స్వర్ధునీ) ధరనీలకంఠాభి
ధానంబుఁ గడు నపార్థముగఁ జేయఁ
దనప్రతాపారుణాతపము లోకాలోక
ధరదరీధ్వాంతంబుఁ దఱిమియాడఁ
దనదానవిభవంబు ఘనదానవాద్యహ్వా
ద్య[2](ప్రాభవంబుల నవఘు) లింపఁ
దనవచశ్శుద్ధి శాంతనవ ధర్మాత్మజ
త్రైశంకవాదులఁ[3] (ప్రస్తరింపఁ)
తే॥ జాల నుతికెక్కు—చాళుక్యచక్రవర్తి
బిరుదమన్నెవిభాళాది బిరుదజాల
మానితుఁడు రామరాజతిమ్మ [4] (క్షితీశ
సూనుఁడై యొప్పు) తిరుమలక్షోణివిభుఁడు ॥

వ॥ మఱియుం బాండవకులధుర్యుండును గల్యాణరాజ్యస్థాపనాచార్యుండును హళాసబిరుదరగండరగూళిబిరుద మన్నెరగండాది[5] (బిరుదాంకుండును) అభినవసాహసాంకుండును సత్యభాషాపరాయణుండును చాళుక్యరాజ్య[6] ప్రణయణుండునగు సమ్మహీవరుండు కస్తూరికాలేప ప్రశస్తంబును ముకుర[7] (కాంతితరంగి) తంబును బర్యంతలంబిముక్తికసరవిసరమహోద్దామక్షౌమవితానమానితంబును బుష్పోపహారపరిమళ భ్రమద్భృంగఝుంకారసంకులంబును నై నేత్రోత్సవాధారంబైన సభాగారంబునందుఁ బాణిని జైమిని వ్యాసకపిల కణాదాక్షపాదదర్శిత దర్శన రహస్య దర్శనాధిగతప్రశంసులగు విద్వాంసులును ప్రస్తుతాశుచిత్ర మధుర విస్తారగుణప్రశస్త భాషాష్టకవిశిష్ట చాటుప్రబంధీయ కవితాసరణిద్వయ

---

1. (ఘుసీ) 2 (.........) 3. సంస్మరింప. 4. (......)
5. (.........) 6. (పరాయణుండు) 7. (.........)

వరిష్ఠులగు కవిశ్రేష్ఠులును సూర్యసోమవంశజులగు భూభుజులును[1] భట్టి చాణక్య, యుగంధర, [2]శివదేవోపమానులగు ప్రధానులును సతత హితవిహితశుభ సమాచరణ సమాహితులగు పురోహితులును గద్య పద్య పఠనప్రవీణవాగాడంబరులగు భట్టప్రవరులును గీతోపనిషద్విశేష సంధాయకులగు గాయకులును మఱియుఁ బౌరాణికవైద్యగణక గణికా నియోగంబులు నిండికొలువ విట్ఠలేశ్వరాదిక సహోదరసహితుండై కొలువుండి నిజజనకుండగు రామరాజుతిమ్మభూపాలునకుఁ బుణ్యంబుగాఁ గృతిప్రతిష్ఠ సేయం జిత్తగించి యప్పుడు. 11

సీ॥ శ్రీమదహోబల శ్రీనృసింహాసమగ్ర
కరుణావిశేషప్రకాశమహితు
భాసురసంస్కృతప్రాకృతాదికశాస్త్ర
భాషాకవిత్వ సౌభాగ్యనిపుణు
జనవర్ణితాశ్వలాయన సూత్రపావను
శ్రీవత్సగోత్రాబ్ధిశిశిరకరుని
సారస్యవినుతు దోనూరినాగయమంత్రి
[3](పుత్రుండనైనట్టి) పుణ్యచరితుఁ
తే॥ జతురభూనాయకాస్థాన సకలసుజన
నందితుని నన్ను గోనేఱునాథసుకవి
నర్థిఁ బిలిపించి సత్కార మాచరించి
పలికె నిట్లని గంభీరభాషణముల॥ 12

మ॥ సకలక్ష్మాకవినాథయూథములు మెచ్చన్ సంస్కృతప్రాకృతా
దికభాషామయకావ్యకర్త[4](వయి) పృథ్వీనాయకాస్థానగ
త్నకలాపం బనఁ బేరు గాంచిన కృతార్థశ్రేష్ఠ దోనూరి కో
నకవీంద్రోత్తమ! నీమహామహిమచందం బద్భుతం బిద్ధరన్॥ 13

---

1. భట్ట. 2. శివధర్మోపమాను. 3. పుత్రుడైనట్టి. 4. వై.

ఉ॥ ఆరయ శబ్దతర్కములనాఢ్యులు కొందఱు కొంద ఱాయలం
కారవిశేషశాస్త్రముల గౌరవవంతులు కొంద ఱెప్పుడుం
జారుకవిత్వతత్త్వపదశాసకు లిందఱు గారవింప దో
నూరిపదాంక! మించితివి వహో గుణభూషణ సత్యభాషణా॥ 14

కం॥ కొడుకును నిధియును జెఱువును
గుడియును నల్లిల్లు వనము గుఱుతుగఁ గృతినా
[1] (బడు)ఁ బుడమి సప్తసంతతు
లెడ నన్నిటఁ గృతియ మించ నెన్నుదు రార్యుల్॥ 15

తే॥ అట్టికావ్యంబు హరికథ యయ్యెనేని
యదియుఁ గనఁ బ్రౌఢకవికృతం బయ్యెనేని
కస్తురికి వన్నియయును బంగారమునకుఁ
బరిమళంబును దొరకినపగిదిఁ గాదె॥ 16

వ॥ కావున,

సీ॥ ప్రతిజన్మకృతమహాపాతకసంఘాత
పర్వతదంభోళి భాగవతము
అతివేలవితతోద్యదతిపాపసాటోప
పన్నగఖగరాట్టు భాగవతము
భీషణదుస్సహాశేషకల్మషసరి
త్పతికుంభ ([2] సంభూతి) భాగవతము
నిరవధినిబిడోపదురితమేఘావళి
పరివాహపవనంబు భాగవతము

తే॥ మఱియుఁ బ్రాసంగికాఘసంబంధతిమిర
పటల భానువిలాసంబు భాగవతము
సాత్త్వికోత్తమమునిజనాశాస్యమోక్ష
పదనిధానాంజనంబు శ్రీభాగవతము॥ 17

1. (...). 2. సంభూతి.

తే॥ అట్టిభాగవతంబునం దలరుచున్న
ద్వాదశస్కంధకథలను వరుసఁ గూర్చి
కావ్య మొక్కటి బాలభాగవత మనఁగఁ
జెప్పి లోకోపకారంబు సేయవలయు ॥ 18

వ॥ అదియును,

సీ॥ శ్రీవీరనరసింహుచేఁ బతిద్రోహర
గండ ([1] పెండేర) మొఘనుఁడు గాంచె
వేంకటేశ్వరునాజ్ఞ విగతదృష్టికి దృష్టి
దయ మీఱి నిచ్చె నేధర్మమూర్తి
కణఁక మీఁగాములగట్టుపైఁ ([2] వేసవిం)
బుట్టించె జలము లేభూనుతుండు
([3] నూనుపకడ నవాం) బూనిఁబోరనుబరా
జయము నొందించె నేశౌర్యశాలి ॥

తే॥ అట్టిమజ్జనకునకు సత్యాభిరతున
కారవేటి [4] రామక్షితిపాత్మజునకు
దిమ్మభూపాలమణికిఁ బుణ్యమ్ముగాఁగఁ
బలుకఁ జెన్నొందు శ్రీబాలభాగవతము ॥ 19

ఉ॥ ఇమ్మహిఁగావ్యజాతమున నెక్కుడువిష్ణుకథాచయప్రబం
ధమ్మదియుక్ భవద్విరచి ([5] తంబయి) నం గడు నద్భుతైకవా
సమ్మగుఁ దత్ఫలోన్నతులు చక్కఁగఁ గైకొనునట్టికర్త మా
తిమ్మనృపాలుఁ డైన గణుతింపఁగ శక్యమె భాగ్యయోగ్యతల్ ॥ 20

---

1. పెండార. 2. వేసవి. 3. (......). 4. కామ 5. తంబనం.

ఆ. వె॥ భాగవతము గలుగ బాలభాగవతంబుఁ
బ్రియముసేయఁ గలరు పెద్దలెల్ల
జగతిఁ దల్లిసరస జవ్వని యగుబిడ్డఁ
జూచువార లాత్మఁ జొక్కునట్లు॥ 21

వ॥ అని యానతిచ్చి సబహుమానంబుగాఁ బద్మరాగశకల శోభాగంబులగు పూగంబులును, విరహిణీ (గల్ల) స్థలంబులకుం బ్రతి దళంబులగు నాగవల్లీదళంబులును, బూర్ణపూర్ణిమాచంద్ర చంద్రికారాజయ ప్రచండంబులగుఁ గర్పూరఖండంబులును దాంబూలంబొసంగి, మణి మయాభరణ చిత్రాంబరాదిక ప్రదాన పూర్వకంబుగా ననేకాగ్రహా రాందోళికాచ్ఛత్ర చామరాది వితరణంబుల బహూకరించిన నేనును హర్షించి యంగీకారంబుఁ జేసితి. 22

చం॥ హరికథఁ బల్కఁ బూనుతఱి నట్టిప్రయత్నము నేసె మేలుమేల్
నరపతి కింక నీ కృతియు నాథుఁడు [1] రామమహీశు తిమ్మభూ
వరుఁ డగుటన్ భువిన్ మిగుల వార్తకునెక్కెడు సర్వసేవ్యతన్
శరధిసుతాకళత్రుని ప్రసాదపు జాజుల దండకైవడిన్ ॥ 23

సీ॥ వరమదీయమనఃస్థ నరసింహపదపద్మ
మకరంద మాధుర్యమంజులములు
భవ్యమజ్జిహ్వాకా భారతీ ధమ్మిల్ల
వర్తిపుష్పామోద వాసితములు
రామభూపతి తిమ్మరాజ సద్గుణమణి
ధాళధళ్యాన్వయోదంచితములు
గురుభుజాబలశాలి తిరుమలతిమ్మావర
స్ఫుటయశోభూషణ భూషితములు

1. కామ.

తే॥ హారికథాజాల వజ్రవర్మాప్రృతఘులు
రాజవంశ తపఃపరి పక్వతా ప్ర
కాశకములు బాలభాగవతసూక్తి
నికరములు మోద మొనరించు సుకవి తతికి ॥ 24

కం॥ ఈకృతికి భర్త రామ
క్ష్మాకాంతుని తిమ్మనృపతిగా నిట్టివిధం
బాకర్ణింపఁగఁ దిరుమల
భూకాంతుఁడు కర్తగాఁగఁ బూనితిఁ బలుకన్ ॥ 25

వ॥ ఇమ్మహాప్రబంధంబునకు ముఖభూషణంబుగాఁ గృతినాథుని వంశావతారం బభివర్ణించెద. 26

## కృతిపతివంశావతారవర్ణనము

మ॥ హరికిం బొక్కిటితమ్మిఁ బుట్టె ద్రుహిణుం డమ్మేటికిం బుత్త్రుఁడై
పరగెం దండ్రికి నీ డనంగ మిగులం బ్రఖ్యాతుఁడై యత్రి, త
ద్వరనేత్రోదితుఁడై నచంద్రుఁడు జగద్వంద్యుం బుధుం గాంచె, సు
స్థిరచిత్తుండు బురూరవుండు ధరణిం జెన్నొందుఁ దత్సూనుఁడై ॥ 27

కం॥ అతనికి నాయువు నహుషుం
డతనికిఁ దన్నందనుఁడు యయాతి యతండు
ద్ధత ధాటీరయ సంశో
ధితరిపుఁడై గెలిచె సకలపృథ్వీతలమున్ ॥ 28

తే॥ అతనిసత్పుత్త్రుఁ డగుపూరునన్వయమున
వెలసెఁ జాలఁ బరీక్షిదుర్వీవిభుండు
పేరుగలతత్కులంబునం దారెవీటి
బుక్కభూపాలుఁ డుదయించె భూనుతుండు ॥ 29

సీ॥ ధరఁ బ్రసిద్ధుండైన తాత పెన్నమరాజు
తగ నెన్న నేపుణ్యు తాతతాత
భావజ్ఞుఁ డగుసోమిదేవభూపాలుఁ డే
ధర్మప్రవర్తకుతాత తండ్రి
గురుశౌర్యధైర్యభాసురుఁడు రాఘవదేవ
ధరణీశుఁ డేశూరు తండ్రితండ్రి
పెన్నమరాజన్యుఁ డున్నతసౌజన్య
వినుతప్రతాపుఁ డే ఘనునితండ్రి
తే॥ యతఁడు దను మన్నెపులియని యఖిలదిశలఁ
జెలఁగి పొగడ సాళువనరసింగరాయ
రాజ్యసంస్థాపకుం డయ్యెఁ బ్రౌఢి నారె
వీటి బుక్కనరేంద్రుఁ డుద్ఘాటితారి ॥ 30

కం॥ ఆబుక్కమహీశుఁడు ఘనుఁ
డై బల్లాదేవియందు హర్షము మీఱన్
గోబాడబశుభకరుని భు
జాబలబలభద్రు రామజనపతిఁ గనియెన్॥ 31

శా॥ ఫక్కీభీషణభాష్యనిర్వహణ విభ్రాడ్భోగిరాడాదికుల్
దక్కం దక్కుబుధుల్ సమర్థులె మహోద్దామాంఘ్రిమంజీర ని
శ్చక్కావాసిత దుర్వహాగ్రహపద క్షుద్రాహితుం డైన యా
బుక్కక్ష్మాపతి రామభూరమణదోః స్ఫూర్తుల్ ప్రశంసింపగన్॥ 32

శా॥ గబ్బుల్ దెబ్బదివేవు రాశ్వికులు వేడ్కం గొల్వగా గిన్క పెన్
మబ్బుల్ గప్పగ గందనోలు గొను ప్రేమన్ జుట్టుముట్టన్ సవా
బిబ్బీ నుబ్బణగించి తోలె నరిరాడ్భీముండు లంకాసర
[1]ణ్యబ్బంధ్యాభుఁడు బుక్కభూవిభుని రామాధీశుఁ డాహా యనన్॥ 33

1. బ్బంద్రాభుఁడు.

మ॥ హరిభావోన్నతుఁ డాదవే [1] నిపతి కాచాధీశసప్తాంగ సం
హరణోదంచితుఁ డారెవీటినగరాధ్యక్షుండు బుక్కక్షమా
వరపుత్రుం డగురామభద్రుఁడు హరిద్వల్లద్యశోజాహ్నవీ
స్థిరసౌభాగ్యుఁడు దత్సముల్ గలరెధాత్రిన్ మూఁడుగాలంబులన్॥ 34

కం॥ అక్కాంబినీశ్వరునకున్
లక్కమదేవికిని రూపలక్షణ లక్ష్మీ
న్యక్కృతనైషధుఁ డిన జి
[2] ద్రుక్కలితుఁడు తిమ్మభూవరుం డుదయించెన్॥ 35

తే॥ మఱియు నాలక్క [3] (మాంబికా) మణికిఁ గొండ
భూమిపతియును శ్రీరంగభూవరుండు
కలిగి రందులో శ్రీరంగఘనున కొదవె
రమణఁ దిరుమలాంబికయందు రామనృపతి॥ 36

ఉ॥ ఏపున ద్రోహిభావము వహించిన సల్కయతిమ్మరాజుఁ ద
త్పాపసహాయు సల్కయ యుతంబుగ శౌర్యమువిూఱఁ ద్రుంచి వి
ద్యాపురియందుఁ జాల ఘనుఁడయ్యె సదాశివరాయరాజ్యసం
స్థాపకుఁడై సిరంగవసుధావరు రామనరేంద్రుఁ డున్నతిన్॥ 37

సీ॥ విష్ణుండు కృతయుగవేళ రేణుకయందు
జమదగ్నిరాముఁడై సంభవించె
ఆతండె కౌసల్యయందుఁ ద్రేతావేళ
దశరథరాముఁడై తగ జనించె
ద్వాపరవేళ నాతండె రోహిణియందు
వసుదేవరాముఁడై వసుధఁ బుట్టె
ఆతండె తిమ్మాంబయం దర్థిఁ గలివేళ
శ్రీరంగరాముఁడై కోరి యొదవె

1. వేర్థి. 2. దృకలితు. 3. మాంబా.

తే॥ ధర్మసంస్థాపనార్థమై ధరణిఁ జక్రి
యుగయుగంబున జనియించు టుచిత మనుచుఁ
దెలిసి సుజనులు వర్ణింప జెలువుగాంచెఁ
బ్రణుతరణకేళి రామభూపాలమౌళి॥ 38

వ॥ ఆ కొండమహీపతి శ్రీరంగనరేంద్రులకు నగ్రజుండు. 39

చం॥ కృతముఁ ద్రిశంకనందనుఁడు గెల్చెఁ గృతంబున సత్యసంధతా
వ్రతియయి, త్రేతయందు రఘువల్లభుఁ డాఘను మించె, నంత ధ
ర్మతనయుఁ డొప్పె వారికిసమంబుగ ద్వాపరవేళయందుఁ ద
త్త్రితయముఁబోలె రామనృప తిమ్మమహీవరుఁ డియ్యుగంబునన్॥ 40

గూఢ చతుర్థి

సీ॥ అర్జునభూధరేశాభ విరాజిల్లు
హరిభక్తివిజయభూత్యసమధృతుల
అబ్జమిత్రకుమారయశమున వర్తిల్లు
వరకళారుచిశక్తివర్తనముల
జలనిధిగురువిలాసంబున భాసిల్లు
నైర్మల్యభరణాదిన్యాయగతుల
శంబరఘనజిష్ణుసమలీల వర్ధిల్లు
నురుయుక్తిదానభోగోజ్వలతల

తే॥ అహహా రాయరాహుత్తవేశ్యాభుజంగ
మన్నెపులిముఖ్యబిరుదసమన్వితుండు
దితిరిపుస్థితి రామయతిమ్మనృపతి॥ 41

(యసమధృతిశక్తిభాసిల్లున్యాయగతుల)

తే॥ అన్యనృపతుల సాటిసేయంగఁ దగునె
రామభూపాలకునిదిమ్మరాజుమణికి
ధరణి ధారాధరా(ర్వ)రాధాతనూజ
దానధారావిధానుసంధానుకృతికి ॥ 42

కం॥ హరికిన్ సిరిగతి, హరునకు
ధరణీధరతనయగతిఁ, బితామహునకు వా
క్తరుణిగతిఁ, దిమ్మమనుజే
శ్వరునకు గోపమ్మ యనఁగ సతియై వెలసెన్ ॥ 43

సీ॥ విమలజన్మస్థానవిఖ్యాతసంపద
నబ్జవాసినికి నీ డనఁగవచ్చు
సంగతసకలలక్షణతాసమున్నతి
నద్రినందనకు జో డనఁగవచ్చు
వినుతపాతివ్రత్యఘనతరవ్రతమున
నాయరుంధతి సాటి యనఁగవచ్చు
నియతిప్రభావాతిశయవిశేషంబున
నత్రిభామిని సాటి యనఁగవచ్చు

తే॥ వర్ణనీయపరీక్షిదన్వయసుధాబ్ధి
కైరవాప్తాయమానబుక్కక్షితీశ
పాత్రరామమహీపాలపుత్రతిమ్మ
కువలయేశ్వరసతియైన గోపమాంబ ॥ 44

సీ॥ దృశ్యభావమున నర్థించి దీపించిన
ధర్మంబు నాల్గుపాదము లనంగ
వినుతింప మూర్తీభవించి కన్పట్టు ను
ర్వీతలేశుల నాల్గు విద్య లనఁగ

భువనరక్షార్థమై యవతారలీల లే
ర్పడు నాల్గు పూరుషార్థంబు లనఁగ
ఖలుల దండించునుత్కంఠచే దేహముల్
ధరియించు నాల్గు వేదంబు లనఁగఁ
తే॥ దిమ్మనృపతికి గోపమదేవియందు
సుతులు గలిగిరి తిరుమలక్షోణిపతియు
విఠ్ఠలేశుఁడు చినతిమ్మవిభుఁడు పాప
తిమ్మనఘనుఁడు నను మహాధీరమతులు ॥ 45

వ॥ అందు,

చం॥ సిరికి గృహంబు, పెంపునకు సీమ, [1] యణంకకుఁ బుట్టినిల్లు, స
త్కరుణకుఁ డెంకి, విద్యలకుఁ గందువ, యీవికి మేలుబంతి, యి
ద్ధరణికి నూఁత, శిష్టులకుఁ దాయి యనం దగఁ గీర్తిఁ గాంచె నా
తిరుమలరాజశేఖరుఁడు తిమ్మనృపాలసుతాగ్రగణ్యుఁడై ॥ 46

సీ॥ అబ్ధికన్యాభర్త కపరావతారంబు
పర్యాయ మంభోధిబాంధవునకు
ప్రకృతి పూర్ణిమాహారిణలాంఛనున కా
హ్వానంబు [2] (మఱి) కామధేనువునకు
సంబోధనంబు నిర్జరభూరుహమున క
భ్యాహారణంబు రాధాత్మజునకు
నుద్ఘోషణంబు చిత్తోద్భవునకు పున
ర్వ్యాహృతి చింతాపదాంకమణికి
తే॥ ననుచు వినుతింతు రెపుడు కర్ణాటలాట
మగధమాళవనేపాళమద్రకుకుర
శకకళింగాంగవంగాదిసభలఁ దిమ్మ
రాజుతిరుమలభూపాలు రమ్యశీలు ॥ 47

1. క. 2. (......)

వ॥ తదనుజుండు,

ఉ॥ బొంకని ధర్మజుం డడుగఁబోవనిపన్నగశాయి, యాజిలో
గొంకనియర్జునుండు, కరకుండులు లేని శశాంకుఁ డెన్నఁడున్ ।
గ్రుంకనిభానుఁ డన్యసతిఁ గోరనిజిష్ణుఁ డనంగఁబొల్చు ధ
ర్మాంకుఁడు విఠ్ఠలక్షితివరాగ్రణి మానధనాగ్రగణ్యుఁడై ॥ 49

మ॥ తనకున్నెచ్చెలియైనక్రీడిపయి నంతర్మోహబంధంబు వో
వనివాఁడై హరి విఠ్ఠలేశ్వరుఁడు తద్వంశంబునన్ సంపదల్
తనరన్ నల్వదియంతరంబులగునంతన్ దిమ్మభూపాలనం
దనుఁడై విఠ్ఠలరాజమూర్తి బఱగెన్ ధర్మావనోద్యోగిత౯ ॥ 50

సీ॥ కటకాఖ్యకటకస్థకరటిరాడ్గజఘటా
సంభూతమదభరస్తంభకంబు
పాండ్యభూమీభృత్సభాసభాజితభటో
ద్భటభుజాబలగర్వభంజకంబు
మక్కామహాదుర్గతుక్కారపతివపుః
స్థాయివేపథుసముత్థానదంబు
ఢిల్లీపురాధీశపల్లవోష్ఠీభావి
విప్రలంభకథాభయప్రదంబు

తే॥ రామనరనాథతిమ్మభూరమణపుత్ర
విఠ్ఠలేశాభిధానపృథ్వీకళత్ర
ధాటికారంభసంభ్రమధ్వనితపటహ
గణసముత్థితధణధణధ్వనరవంబు ॥ 51

కం॥ వినుతస్థితి యావిఠ్ఠల
మనుజేంద్రుని యనుజుఁ డలరె మహనీయయశో
ధనుఁడు చినతిమ్మభూపతి
యనుపముఁ డితఁడాహవాపరార్జునుఁ డనఁగన్ ॥ 52

సీ॥ మన మెక్కడగుత్రొక్కడునదక్కులరమొక్క
దము పండువులదండు లమరియుండు
అనిజారినునుబూరిగొనితారి పెనువారి
దొలగించుకొనమించు గలయునంచు
శరణంది యనువొంద సిరిఁ గంద మొకచంద
మిది కింక వలదింక నేల శంక
వడిఁ బేరులిడఁ దీరుపడు నేరుపులగోరు
పనులెంతమనవింతలొనరగొంత
తే॥ యనుచు గుంపులై చింతింతు రధికభీతి
నహాహా రామనృపాలతిమ్మావనీశ
తనయచినతిమ్మభూవరో త్తంసధాటి
కలసి లోనై నయట్టి ప్రత్యర్థినృపులు ॥ 53

ఉ॥ ఆచినతిమ్మభూవరుప్రియావరజుండను పాపతిమ్మరా
జేచినకీర్తిచెంత హరియించె హలాహలకంఠ కంఠసీ
మాచిరసంగృహీతరుచిమంజిమపుంజమదాపహృత్యసం
కోచనిశాకరాంతరజగుప్సితతుచ్ఛకళంకసంకృతిన్ ॥ 54

సీ॥ నైషధేశ్వరునిసౌందర్యవిలాసంబు
త్రైశంకవునియందు దనరె నేని
పవమానసూనుని భావశుద్ధత్వంబు
సంక్రందనునియందు సాగె నేని
సవ్యసాచికిఁ గల శౌర్యవిశేషంబు
భానుసూనునియందు బఱగె నేని
ఫణిసార్వభౌముని పటువాగ్విలాసంబు
హేమాచలంబున కెసఁగె నేని

తే॥ వారిఁ దగసాటిసేయంగవచ్చు సత్య
భోగవితరణధీరతాస్ఫురణలందు
రామజనపతితిమ్మభూరమణు పాప
తిమ్మభూపాలమణికి ([1] ధాత్రీంద్ర) ఘృణికి ॥ 55

వ॥ ఈదృగ్విధ సహోదర సేవితుండగు నారాజశేఖరునకు,

## షష్ఠ్యంతములు.

కం. అభినవచలువరగండని
కుభయదళపితామహునకు నుదదిగ్రా?
యభయంకరునకు వేఁగ్య
త్రిభువనమల్లునకు రాజదేవేంద్రునకున్ ॥ ౧

కం. గండరగూళికి గండర
గండని కుద్దండరాయగణవారణస్త్రీ
గండాం [2](కున కెంతెంబర)
గండనికిం బట్టివాడగజసింహునకున్ ॥ ౨

కం॥ హాసబిరుదరగండని క
త్యసదృశనిశ్శంకసాహసాంకున కుం గో
లసురత్రాణునకును మ
న్నెసురత్రాణునకు రాజనీతిజ్ఞునకున్ ॥ 3

కం॥ కదనధనంజయునకు మహా
మదుమల్కప్రాణదానమతి కొండియ రా
యదిశాపట్టున కరిరా
యదళవిభాళునకు పాండవాన్వయపతికిన్ ॥ ౪

1. ధాత్రీంద్ర.
2. కునకత్యంబర. కువకెంతెంబర (పాఠాంతరం)

కం॥ సకలనివృన్నరనాయక
మకుటమణికి నంధకారమన్నె జగజ్జ్యో
తికి ధరణీభరణశేషా
హికి షోడశదానమండలేశాంకునకున్ ॥ ౫

కం॥ చాళుక్యచక్రవర్తికి
మాళవమదభంజనునకు మర్దితశకసే
నాధిపునకు బిరుదమన్నెని
ఘాళునకును మన్నెపులికి భాసురమణికిన్ ॥ ౬

కం॥ సలిలమహీరుహశైల
స్థలపూర్వకచతురశీతిసంఖ్యాకమహా
దుర్వ్యలదుర్గవిభాళునకుం
కులగిరిధీరునకు గాయగోవాళునకున్ ॥ ౭

కం॥ ధరణీవరాహరాయకా
మరుమృగదర్పణనృపోత్తమస్వామిద్రో
హరగండమండలాధీ
శ్వర బిరుదునకాడితప్పు ? వర.........నికిన్ ॥ ౮

కం॥ రాజకులభూషణునకున్
రాజమనోహరున కన్యరాజతమఃపా ?
షోఘ్నునకుం దిరుమల
రాజేంద్రునకుం ధరాచర[1]చ్చంద్రునకున్ ॥ ౯

వ॥ అభ్యుదయపరంపరాభివృద్ధియు నభిమతసిద్ధియుం గా నా
[illegible]నిన యిమ్మహాప్రబంధంబునకుం బ్రారంభంబు,

1. ఇ చంద్రు.

కథాప్రారంభము.

సీ॥ బ్రాహ్మాదికంబులై పరగుపురాణంబు
లెన్నంగఁ బదియును నెనిమిదియును
సరవి సర్గప్రతిసర్గముల్ వంశము
న్వంతరంబులును వంశానుచరిత
ములు నను లక్షణంబులపంచకంబుచేఁ
జెన్నుమీరుచునుండు నన్నిటికిని
ఘనుఁడు వేదవ్యాసముని కర్త యనఁబడు
నవియు కథాకథనార్థనటన
తే. గీ॥ నహితమును మాన్చియును హితం బందఁజేయు
జ్ఞానవిజ్ఞానసాధనతానుతంబు
లగుట వేదంబులకు సాటి యనగవచ్చు
నుపపురాణంబులును నట్టియుపమ నెసఁగు ॥ 1

వ॥ ఇవ్విధంబున బ్రాహ్మ, పద్మ, వైష్ణవ, శైవ, భాగవత, నారదీయ, మార్కండేయ, యాగ్నేయ, భవిష్య, బ్రహ్మకైవర్త, లైంగ, వామన, వరాహ, మత్స్య, కూర్మ, గారుడ, స్కాంద, బ్రహ్మాండ నామంబుల బరగుఁ బదునెనిమిది పురాణంబుల యందును, వైష్ణవ, నారదీయ, భాగవత, గారుడ, పాద్మ, వరాహంబులు సాత్త్వికపురాణంబులు. బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మకైవర్త, మార్కండేయ, భవిష్యద్వామనంబులు రాజసపురాణంబులు. మత్స్య, కూర్మ, లైంగ, శైవ, స్కాంద, ఆగ్నేయంబులు తామస పురాణంబులు. ఇందు సాత్త్వికపురాణంబులు [1] (భగవద్భక్తులకు) మోక్షదాయకంబులు. అట్టిసాత్త్విక పురాణంబులయందు ఋతువులయందు వసంతర్తువుంబోలె నష్టాదశసహస్ర గ్రంథసంఖ్యాకంబగు శ్రీమహాభాగవతంబు విరాజిల్లుచుండు, 2

1. (భగవ........)

ఆ॥ అట్టిభాగవతమునందలి ద్వాదశ
స్కంధకథలు సింధు గలుగుకతన
వసుధ బాలభాగవత మన నిక్కావ్య
మలరుచుండు సుజను లభినుతింప ॥ 3

వ॥ ఇట్టి బాలభాగవతమునకుం గథానుక్రమణిక యెట్టిదన్నను శౌనకాదిమహామునిప్రశ్నంబును, సూతుండు నారాయణావతార సూచనంబు సేయుటయును, నారదాఖ్యానంబును, భాగవత పురాణ నిర్మాణప్రకారంబును, నశ్వత్థామపరిభవంబును, భీష్మనిర్యాణంబును ధర్మనందను రాజ్యాభిషేకంబును, శ్రీకృష్ణునిద్వారకా గమనంబును, బరీక్షిత్తు జన్మంబును, ధృతరాష్ట్రనిర్గమంబును, కృష్ణావతారవిసర్జనంబును, పాండవమహాప్రస్థానంబును, బరీక్షిత్తు దిగ్విజయంబును, గలిగర్వహరణంబును, శృంగి శాపంబును, బరీక్షిత్తు ప్రాయోపవేశంబును, శుకయోగి సందర్శనంబును, నను ప్రథమస్కంధ కథలును, బరీక్షిత్తు ప్రశ్నంబును, ఖట్వాంగ మోక్షప్రకారంబును, ధారణాయోగ లక్షణంబును, భగవదవతార కథనంబును, బ్రహ్మతపశ్చరణంబును, హరిదర్శనంబును, హరిబ్రహ్మ సంవాదంబును, బ్రహ్మనారద సంవాదంబును, దశలక్షణ వివరంబును, నను ద్వితీయస్కంధ కథలును, విదురోద్ధవ సంవాదంబును, విదురమైత్రేయ సంవాదంబును, జగదుత్పత్తి లక్షణంబును, బద్మసంభవు జన్మప్రకారంబును, దచ్చరిత్రంబును, సర్గకాల కల్పలక్షణంబును, సృష్టిప్రకారంబును, స్వాయంభువ మనుసంభవంబును, వరాహావతారంబును, దితి కశ్యప సల్లాపంబును, జయ విజయుల శాపప్రాప్తియును, హిరణ్యాక్ష హిరణ్యకశిపుల జన్మంబులును, హిరణ్యాక్ష హననంబును, వసుధోద్ధరణంబును, గర్దముండు దేవహూతిని వివాహంబగుటయును, గపిలావతారంబును, గపిలదేవహూతి సంవాదంబును, నను తృతీయస్కంధ కథలును, మనుపుత్రికా సంతతిక్రమంబులును, దక్షయజ్ఞ వినాశంబును, ధృవచరిత్రం

బును, వేనపృథు చరిత్రంబులును, నారదప్రాచీనబర్హి సంవాదంబును, పురంజనోపాఖ్యానంబును, ప్రచేతసులకు విష్ణుండు ప్రత్యక్షంబగుట యును, వారలకు మారిషాకన్యయందు దక్షుండు జనియించుటయును, నను చతుర్థస్కంధ కథలును, ప్రియవ్రతోపాఖ్యానంబును, నాభి – ఋషభ – భరతచరిత్రంబులును, నాంగీరస రహూగణ సంవాదంబును, బ్రహ్మాండగోళలక్షణప్రస్తానంబును, ద్వీపసముద్రనద్యాదివర్ణనంబులును, జ్యోతిశ్చక్రసంస్థానంబును, పాతాళనరకస్థితులును, నను పంచమస్కంధ కథలును, నజామిళోపాఖ్యానంబును, నారాయణనామ ప్రభావంబును, దక్షతపశ్చరణంబును, దత్సంతతిప్రకారంబును, దేవాసురనరతిర్యగాది జన్మంబులును, విశ్వరూపజననంబును, దత్సంహారంబును, వృత్రాసుర సంభవంబును, దధీచిచరిత్రంబును, దేవాసురయుద్ధంబును, వృత్రవధం బును, చిత్రకేతూపాఖ్యానంబును, నేకోనపంచాశత్సువమారాఖ్యానంబును, నను షష్ఠస్కంధకథలును, హిరణ్యకశిపు దితిసంవాదంబును, హిరణ్య కశిపు చరిత్రంబును, బ్రహ్లాదజన్మంబును, దచ్చరిత్రంబును, శ్రీనృసింహా వతారంబును, త్రిపురవిజయప్రస్థానంబును, బుద్ధావతారంబును, వర్ణా శ్రమధర్మ వివరణంబును, నను సప్తమస్కంధ కథలును, స్వాయంభువాది మనుచరిత్రంబును, గజేంద్రమోక్షంబును, రైవతచాక్షుస వర్తనంబును, సముద్రమథనంబును, కూర్మావతారంబును, మోహినీవేషావతారంబును, గాలనేమి సుమాలుల (మాలిమాల్యవంత) హరణంబును, జంభపాకబల నముచిదళనంబును, హరిహరసల్లాపంబును, వైవస్వతాదివృత్తాంతంబును, వామనావతార కథయును, సత్యవ్రతోపాఖ్యానంబును, మీనావతారం బును, నను నష్టమస్కంధకథలును, రాజవంశానుకీర్తనంబును, సుద్యుమ్న చరితంబును, నిక్ష్వాకుప్రముఖజననంబును, [1] మనుపుత్రాదిచరిత్రంబులును, నంబరీషకథయును, మాంధాతృహరిశ్చంద్ర సగరభగీరథాముల వృత్తాం

1. మరుత్తాది.

తంబులును, శ్రీరామచంద్ర కథయును, జంద్రవంశ రాజవర్ణనోపక్రమం
బును, జమదగ్ని పరశురాముల వృత్తాంతంబులును, విశ్వామిత్ర యయాతి
ప్రముఖుల చరిత్రంబులును, శకుంతలాదుష్యంతుల సమాగమంబును,
భరతప్రభావంబును, శంతనుభీష్మాదుల జన్మంబులును, ఋష్యశృంగ
చరిత్రంబును, యదువంశ ప్రకారంబును, గృష్ణావతార సూచనంబును,
నను నవమస్కంధ కథలును, దేవకీవివాహంబును, గంసోద్రేకంబును,
బలదేవావతారంబును, గృష్ణావతారంబును, ఘోషప్రవేశంబును,
బూతనాసంహారంబును, శకట తృణావర్త భంజనంబును, మృద్భక్షణాది
చరిత్రంబులును, నలకూబర మణిగ్రీవ శాపమోక్షంబును, బృందావన
గమనంబును, వత్సాపహరణంబును, గాళీయమర్దనంబును, దావానల
పానంబును, గోపికావ్రతంబులును, వల్లవీవస్త్రాపహరణంబును, గోవర్ధనో
ద్ధరణంబును, నందానయనంబును, రాసక్రీడలును, సుదర్శనశాపవిమోచ
నంబును, శంఖచూడారిష్టదళనంబును, గంసుఁడు దేవకీవసుదేవుల నిరో
ధించుటయును, నక్రూరాగమనంబును, విశ్వరూపకథయును, మధురానగర
ప్రవేశకథయును, ధనుర్భంగంబును, గువలయాపీడ చాణూర ముష్టికాది
వధంబును, గంసవధంబును, దేవకీవసుదేవ బంధమోక్షంబును, నుగ్రసేన
రాజ్యస్థాపనంబును, రామకృష్ణ విద్యాభ్యాసకథయును, జరాసంధ వధ
యును, శిశుపాలవధయును, సాళ్వాది నిర్జయంబును, బల్వలాసుర మార
ణంబును, గుచేలోపాఖ్యానంబును, దేవకీపుత్రార్పణంబును, సుభద్రా
పరిణయంబును, గురుపుత్రప్రదానంబును, జరాసంధకథయును, ద్వారకా
నగర ప్రవేశంబును, గాలయవనఘాతనంబును, రుక్మిణీకల్యాణంబును,
రుక్మిభంజనంబును, ప్రద్యుమ్న చరితంబును, జాంబవతీ కల్యాణంబును,
సత్యభామాకల్యాణంబును, గాళిందీ మిత్రవిందాది కల్యాణంబును, ముర
నరకసంహారంబును, షోడశసహస్రకన్యా పరిగ్రహంబును, పారిజాతాప
హరణంబును, బౌండ్ర కాశిరాజ సంహారంబును, గాశీపురీదహనంబును,

ద్వివిదహననంబును, హస్తినాపుర హలాకర్షణంబును, కృష్ణనారద సల్లాపంబును, ధర్మరాజ రాజసూయకథయును, మిథిలాగమనంబును, మృతవిప్రపుత్రదానంబును, శ్రుతిగీతలును, వృకోపాఖ్యానంబును, భ్రిమాతరిత్కోపాఖ్యానంబును, నను దశమస్కంధ కథలును, విప్రశాపప్రాప్తియు, నారదవసుదేవ సంవాదంబును, నవార్షభ విదేహ సంవాదంబును, బ్రహ్మాది ప్రార్థనంబును, నుద్ధవప్రశ్నంబును, నవధూత యదుసంవాదంబును, గృష్ణుం డుద్ధవునకు నాత్మవిద్యాకర్మనిర్ణయంబు లానతిచ్చుటయు, బ్రభాసతీర్థయాత్రయు, యదునాశనంబును, గృష్ణ పరమపద ప్రయాణంబును, నను నేకాదశస్కంధ కథలును, గలియుగరాజవంశంబును, దల్లక్షణంబులును, జతుర్విధ ప్రళయలక్షణంబులును, బరీక్షిత్తు నిర్యాణంబును, జనమేజయుని సర్పయాగంబును, వేదశాఖాప్రణయనంబును, మార్కండేయోపాఖ్యానంబును, (మహాపురుషాంగ ప్రశస్తివిషయంబును), సూర్య ప్రశంసయు, బురాణప్రస్తారంబును, నను ద్వాదశస్కంధకథలుం గలిగి సాంగోపాంగంబై బరగు బాల భాగవతంబు ॥ 4

## బాల భాగవత ప్రశంస

సీ॥ విప్రవర్యులు చూచి వేదసమం బన
శాస్త్రులు వేదాంతశాస్త్ర మనఁగ
శబ్దశాస్త్రజ్ఞులు శబ్దసారం బన
రసికు లలంకారరాశి యనఁగ
లక్షణజ్ఞులు సర్వలక్షణాఢ్యం బన
నీతిజ్ఞు లిది మహానీతి యనఁగఁ
గావ్యవేదులు మహాకావ్యం బనంగఁ బౌ
రాణికు లాదిపురాణ మనఁగ

తే॥ [1](గానమాధు)ర్యలోలుపులై నవాగ
లుదితమృదుభావములపదం బిది యనంగ
జగతి నాచంద్రతారార్క మగుచు మిగుల
భాసురంబగు నీ బాలభాగవతము ॥ 5

మఱియును,

సీ॥ పావనంబైనయీ బాలభాగవతంబు
సద్భక్తినెప్పుడుఁ జదువువారు
వినియెడివారును గొనియాడువారును
వ్రాయువారలును దీర్ఘాయు లగుచు
ధనధాన్య పుత్రమిత్రసమృద్ధియును ధర్మ
సిద్ధియుఁ గాంతురు చెలఁగి వేడ్క
హరి వారిహృదయంబులందుఁ బ్రసన్నుఁడై
నిత్యంబుఁ గరుణచే నిలచియుండు

తే॥ సర్వతీర్థఫలంబును సర్వదాన
ఫలములును సర్వసౌఖ్యముల్ గలిగి వార
లఖిల భాగవతోత్తంసు లనఁగ వెలసి
జ్ఞానులై పొందుదురు సముజ్జ్వలశుభంబు ॥ 6

వ॥ ఇట్టి భాగవతంబునకుఁ గథాసూత్రం బెట్టిదనిన, 7

శౌనకాదిమునులు ప్రశ్నించుట

సీ॥ రమణీయమైన నైమిశారణ్యాభిధాన పు
ణ్యక్షేత్రమున శౌనకాదిమునులు
దశశతవర్షసాధ్యంబైన వైష్ణవం
బనుమహాయాగంబు నాచరించు

1. ( ......... మర్య ).

చుండంగ నచటికి నుగ్రశ్రవసుఁడను
సూతుండు భువనవిఖ్యాతచరితుఁ
డరుదెంచుటయు వార లమ్మౌనిఁ బూజించి
గుణహర్ష రోమహర్షణకుమార
తే॥ నిఖిలకల్యాణమూలమై నియతశుద్ధ
సాత్వికంబును విష్ణుసచ్చరితనుతము
నగుపురాణంబు నొకటి నుదాహరింప
వలయు నని ప్రార్థనావృత్తిఁ బలుకుటయును ॥ 8

వ॥ శౌనకాది మహామునులకు సూతుం డిట్లనియె। ([1]మునీంద్రులారా!) మీరు చేసిన ప్రశ్నంబు సాధుసమ్మతంబు, విష్ణుకథా కథనం బుభయశ్రేయస్కరం బది యెట్లంటేని. 9

## సూతుండు నారాయణావతార సూచనంబు సేయుట.

సీ॥ పంకజాక్షునిమీఁది భక్తియోగము నిత్య
వైరాగ్యవిజ్ఞానవర్తనంబు
నారాయణునికథాన్వయము గల్గినయేని
[2] అర్థకామాపేక్ష లల్లుకొనవు
పరమాత్మ యనఁ బరబ్రహ్మ యనంగ సా
త్వికులు విష్ణునిగాగ తెలిసికొందు
రఖిలధర్మములకు నఖిలయోగములకు
శ్రీమహావిష్ణుసంప్రీతి సిద్ధి

1. మునీంద్రా!. 2. (......మాపక్షు).

తే॥ తన్ను బొగడినఁ దలచిన విన్న నెపుడు
(హరి [1] త) ద్దియాంతరంగంబులందు నిలుచు
హరి మనంబున నిల్పిన నఖిలజనుఁడు
జ్ఞానదీపంబుఁ గాంచి మోక్షంబుఁ గాంచు ॥ 10

తే॥ అట్టివిష్ణుఁ డనంతపాదాక్షికర్ణ
హ స్తవదనో త్తమాంగకుం డనగఁ బరఁగు
యోగనిద్రానుకూలుఁడై యుదధిలోన
నుండుఁ బ్రహ్మాండముల కెల్ల నొడయుఁ డతఁడు ॥ 11

కం॥ తన్నాభికమలమున ను
త్పన్నుండై బ్రహ్మ సృష్టిపరుఁ డగుచుండన్
సన్నుతగతి నద్దేవుఁడె
యెన్నఁగ హరుఁడగుచు సృష్టియే పణగించున్ ॥ 12

వ॥ అద్దేవుని యంశాంశంబులు యుగయుగంబున ధర్మసంస్థాపనార్థం బవతరించి కృతకృత్యంబులై స్వస్థానంబున నుండు, నదియును గ్రమంబున గౌమారసర్గబ్రహ్మచర్యావతారంబును, యజ్ఞవరాహావతారంబును, నారదావతారంబును, నారాయణావతారంబును, గపిలావతారంబును, దత్తాత్రేయావతారంబును, సుయజ్ఞావతారంబును, నురుక్రమావతారంబును, బృథుచక్రవర్త్యవతారంబును, మీనావతారంబును, గూర్మావతారంబును, ధన్వంతర్యవతారంబును, నమృత విభాగ సమయ మోహినీ వేషావతారంబును, నరసింహావతారంబును, వామనావతారంబును, బరశురామావతారంబును, వ్యాసావతారంబును, రామచంద్రావతారంబును, రామకృష్ణావతారంబును, బుద్ధావతారంబునుం గాఁ గలిగినఁ కల్క్యవతారంబును మొదలుగాఁగల

1. భవ.

యనతారంబు లనంతంబు, లతనిమహిమ యనాఙ్మనసగోచరంబగు నట్టి శ్రీ మన్నారాయణున కర్పితంబుగా మున్ను వ్యస్తసమస్తశ్రుతినిర్ణేతయు, శ్రీమహాభారతాహ్వాయపంచమవేదనిర్మాతయు నగు వేదవ్యాసభట్టారకుండు శ్రీ మహాభాగవతం బను మహాపురాణంబు నిర్ణయించి యతని తనయుండగు శుకయోగిచేతం జదివించె, నతండును గంగానదీమధ్యమంబునఁ బ్రాయోపవిష్టుండగుఁ బరీక్షిన్నరేంద్రునకు నుపదేశించె, నమ్మహాపురాణం బే నెఱింగినభంగి మీకు వినుపింతు ననుటయు, నా రౌమహర్షణికి శౌనకాదు లిట్లనిరి ॥ 13

తే॥ ఇప్పురాణంబు మును వ్యాసుఁ డెట్లు చెప్పె
నదియు శుకయోగిచే విన్న యప్పరీక్షి
తుం డనగ నెవ్వఁ డతఁడేలయుండె గంగ
లోనఁ బ్రాయోపవేశంబుఁ బూని యనఘ ॥ 14

## నారదుఁడు వ్యాసునికడ కరుదెంచుట.

చ॥ అనుటయు సూతుఁ డిట్లను మహాయశులార! వినుండు వ్యాసుఁ డ
త్యనుపమమైన యాబదరికాశ్రమభూమి సరస్వతీతటం
బున హరిసత్కథల్ పలుకఁ బూని విచారము నొందు నంతఁ, జ
య్యనఁ జనుదెంచి నారదమహాముని యమ్మునితోడ నిట్లనున్ ॥ 15

కం॥ ఈ వొనరించిన భారత
మీ విశ్వహితార్థి వగుచు నెన్నగ నదియున్
కేవల భగవన్నుతిపర
మై పరలగఁ జేయవైతి వఖిలార్థజ్ఞా ॥ 16

మ॥ హరి నాత్మం బరముం గృపాజలధి లోకాంతర్బహిర్వ్యాపి నీ
శ్వరుఁ గీర్తించినఁ దామె తామె యణఁగున్ సంసారబంధంబు లా

సరణిం బోవగఁ జూపకున్న నరుఁ డేచందంబునం దాటు భీ
కరమై వస్వతకింకరాంకురితమూకక్షోభదాక్షేపముల్ ॥ 17

కం॥ కర్తనములు కలుషములకు
నర్తనములు పరమసుగతినటికిన్ విమలో
ద్వర్తనములు మతికి శుభా
వర్తనములు వాసుదేవవరకీర్తనముల్ ॥ 18

వ॥ అట్టి విష్ణునామసంకీర్తనమహాత్త్వంబునకు దృష్టాంతంబైన
మదీయజన్మంబు వివరించెద విను మని యిట్లనియె. 19

నారదుని పూర్వవృత్తాంతము

సీ॥ తొలుబామలందు విప్రులయింటిదాసికిఁ
దనయుండనై వారు పెనుపఁ బెరిగి
యోగీంద్రు లొకకొంద ఱొనరఁ జాతుర్మాస్య
నియతవ్రతస్థులై నిలిచి యొక్క
యెడ నుండ వారలఁ గడుభక్తి సేవించి
వారలు హరిఁగొల్వ వారిఁ జూచి
హరినామసంకీర్తనాసక్తిఁ గైకొంటి
నంత వా రెందేని నరుగఁ దలఁచి

తే॥ విష్ణుదాస్యంబు సరహస్యవిధము గాఁగ
నాకుఁ దెలిపిరి కరుణాసనాథు లగుచు
దదనుభావంబు గలిగియుం దల్లియొద్ద
వత్సలత నుండి నేఁడేండ్లవాఁడ నగుచు ॥ 20

కం॥ ఆవులఁ బిదుకగఁ జీకటిఁ
బోవుచు [1] నుండంగఁ దల్లి భుజగము గఱవన్

1. చుఁదను.

జీవితముఁ బాయఁ దత్త్వము
భావించి విషాద ముడిగి భావములోనన్॥ 21

మ॥ హరిఁ జింతింపుచుఁ బుణ్యతీర్థముల నత్యాసక్తిమైఁ జూచుచున్
ధరణిం ద్రిమ్మరుచుండి యొక్కతటిఁ జింతాక్రాంతి నార్తుండనై
హరి నీక్షించెదఁ గాక యే నని తదీయధ్యాన (సంపత్తి నా[1]
హరి నేకాగ్రతఁ గొల్వగా) విభుఁ డదృష్టాకారుఁడై చేరువన్॥ 22

కం॥ బాలక నను నిప్పుడు గనఁ
జాలవు నీ వింక నొక్కసాత్త్వికతనువున్
లీలం గైకొని బుద్ధివి
శాలత నను గాంతు వనుచుఁ జయ్యనఁ బలుకన్॥ 23

వ॥ ఏను విష్ణునామస్మరణసంకీర్తన పవిత్రుండ నగుచుం గాల క్రమంబున నద్దేహంబు విసర్జించి, భగవదనుగ్రహంబున నీ సాత్త్వికాంగంబుఁ గైకొని కల్పావసానంబున వారిరాశి నిద్రించు నారాయణు[2](ని యందు నిదురవోవ నిచ్ఛగించు బ్రహ్మయొక్క) యుచ్ఛ్వాసపవనంబు వెంబడిం బ్రవేశించి నిశావసానంబున నుత్థితుండగు నద్దేవునిశ్వాసవశంబున మరీచిముఖ్యులు నేను వెడలితి మిప్పు డమ్మహాత్ముని నీశ్వరదత్తయగు నిర్వీణచేత ననిశంబు[3] (గానంబు సేయు) చుండుదు. 24

కం॥ హరిభక్తియు హరిదాస్యము
హరిపుణ్యకథాకథనము హరిపూజనమున్
హరిపాదతీర్థ సేవయు
హరిహరి సంసారవార్ధి కనువగుకలముల్॥ 25

1. (.........) 2 (.........) 3. (.........)

కం॥ కావున నొక్కపురాణము
[1](శ్రీవిష్ణుప్రీతికిన్) బ్రసిద్ధతరముగా
నీ వొనరింపు మనుచు సం
భావనతోఁ బలికి పద్మభవజుఁడు వోవన్॥ 26

## భాగవతపురాణ నిర్మాణప్రకారము

ఉ॥ దివ్యదృశుండు వ్యాసుఁడును దేటగు నారదమౌనివాక్య మా
త్మవ్యవసాయలీల కు [2](చితంబని) మిక్కిలి సంతసిల్లి, స
త్సేవ్యుని నచ్యుతుం గురిచి చిత్రతదాశ్రమభూప్రవిష్టుఁడై
భవ్యముగా నొనర్చెఁ దగ భాగవతాఖ్యమహాపురాణమున్॥ 27

వ॥ ఇది పురాణనిర్మాణప్రకారం బింక నీపురాణంబు శుకమహర్షి పరీక్షిన్మహీపాలునిజన్మంబు వివరించెద నని యిట్లనియె. 28

## అశ్వత్థామ పరాభవము

భీమకరగదావిదళితోరుండై పుడమిపయిం బడియున్న సుయోధనుం జూచి యశ్వత్థామ తత్ప్రియార్థంబు శిబిరమధ్య నిద్రితులైన ద్రౌపదీపుత్రుల ఖండించి తెచ్చి యతనికి సమర్పించి చనియె, ద్రౌపది యొందు దుఃఖదైన్యంబుఁ జూచి యర్జునుండు — 29

శా॥ ఆశ్వాసంబును బొందు మిందునిభవక్త్రా ఘాతుకుండైన యా
పశ్చాచ్చారుశిరంబు [3](ద్రుంతు నను మేల్ వాక్యంబులన్) బల్కుచున్
విశ్వేశుండగుశౌరి సారథిగ వేవేగన్ రథం బెక్కి యా
యశ్వత్థామపదానువృత్తిఁ జనియెన్ హాస్త్రోల్లసచ్చాపుఁడై॥ 30

---

1. (చున్ ............)  2. (...... ); హితం  3. (.........)

తే॥ గురుసుతుఁడు నట్లు వచ్చు నన్నరుని జూచి
కడు (భ[1]యంపడి వెఱవొందు గాంచలేమి)
[2]కడకు నుపసంహరణ మెఱుఁగకయు నపుడు
బ్రహ్మశీర్షాఖ్యమనెడు నస్త్రంబు వైచె॥ 31

వ॥ వైచిన నదియుం గాలానలజ్వాలాకరాళం బగుచు నరుకు
డెంచు సమయంబున. 32

కం॥ కనుగొని పార్థుఁడు కృష్ణుని
పనుపున మంత్రించి వైచె బ్రహ్మాస్త్రంబుఁ
వినువీథి నవియు రెండును
ఘనతరముగఁ దాకె ననలకణములు గురియన్॥ 33

శా॥ అంభోధుల్ గలఁగెన్ గులాచలము లల్లాడెన్ దిశల్ వెల్గె, ది
క్కుంభివ్రాతమదాంబుధార లోదగెన్ ఘూర్ణిల్లెఁ బాతాళ, మ
య్యంభోజాప్తునిరథ్యముల్ సెదరె నిట్టట్టయ్యె నిద్ధాత్రి, వే
శంభుం గౌఁగిటఁ జేర్చె గౌరియు భయాసంస్ఫూర్తియోగంబునన్॥

వ॥ అప్పుడు, 35

తే॥ ద్రౌణి తనదైన బ్రహ్మశీర్షమున కెపుడు
నవిదితోపసంహారుఁ డై నట్టికతన
భువనసంక్షోభకరములై పోరుచున్న
రెంటఁ బార్థుండె యుపసంహరించి నడచి॥ 36

వ॥ అశ్వత్థామను బట్టుకొని హింసింప నుద్యోగించినం గృష్ణుఁ
డెడసొచ్చి యిట్లనియె. 37

---

1. (య.............) 2. కణక.

సీ॥ నిద్రించు బాలుర నిరపరాధులఁ ద్రుంచె
నితఁడు బ్రాహ్మణుఁ డన నెట్లువచ్చు
హింసకుండగువాని హింసించుటయు యుక్త
మాతతాయిని జంప నఘముఁ జెంద
దట్లయ్యు భీతుని నబలుని మత్తుని
దీనుఁ బలాయితుండైనవాని
నిగ్రహింపఁగరాదు నిను గాంచి రయమున
బరువిడె నీతండు ప్రాణభీతిఁ
తే॥ గాన నీతండు వధ్యుండు గాడు కరుణఁ
బ్రోవు మనుటయుఁ, బార్థుండుఁ బోలఁ జూచి
ఖలుని ద్రౌపది కొప్పింతుగాక వీని
ననుచుఁ జిత్తంబులో నిశ్చయంబు సేసి॥ 38

కం॥ గట్టిగఁ బాశంబులచేఁ
గట్టి భయభ్రాంతి నొందగా రథముపయిన్
బెట్టుకొని తనదుమున్నిటి
పట్టునకున్ వచ్చి ద్రుపదపతిసుతయెదుటన్॥ 39

మ॥ నిలువంబెట్టినఁ జూచి యాసతి సమస్వీతార్తియై యిట్లనున్
మలినాచారుఁడ వీవు బ్రాహ్మణుఁడవే మర్యాద వోనాడి నీ
కులమున్ శీలము మాపి చోరునిగతిన్ గ్రూరత్వ మేపారగా
[1] లలితాకారుల నాకుమారుల నవేళం ద్రుంపఁగాఁ బాడియే॥ 40

వ॥ అని తనవారలం జూచి యిట్లనియె. 41

---

1. లలితాచారుల

తే॥ ఎంతఘాతుకుఁడైన గానిండు విప్రుఁ
డితఁ డవధ్యుండు హింసింప నేమిగలదు
కృపిని ద్రోణుని జూచి సత్కృప దలిర్ప
విడువుఁ డీతని తప్పు భావింపవలదు ॥ 42

కం॥ అనిపలుకుననంత భీముఁడు
తనపిడికిటిపోట్ల నితనితలఁ దునియలు గా
నొనరింతు నంచు నుడువగ
వనజదలాక్షుండు వేగ వారించె దయన్ ॥ 43

తే॥ అంత నవ్వ్యాసుదేవుననుమతమునఁ
బార్థుఁ డసిధారచేత నశ్వత్థుకచము
లంటఁగోసి శిరోగతంబైన మణిని
బుచ్చుకొని బంధనము లూడ్చి పోవ విడచె ॥ 44

వ॥ ఇవ్విధంబున,

సీ॥ అనిలోన శత్రుసంహారంబు నీడేర్చి
ధర్మనందనునిస ద్ధర్మసరణి
చెలగంగ రాజ్యాభిషిక్తుని గాఁ జేసి
విజయప్రతాపముల్ వెలయు మూడు
హయమేధయాగంబు లతనిచేఁ జేయించి
ద్వారకకేగంగఁ దలఁచు కృష్ణుఁ
గనుగొని యభిమన్యుకాంత యుత్తర క్రొక్కి
పలుకు గద్గదమును భయముఁ గదుర

తే॥ దేవ! యిదె వచ్చె నొకయస్త్రతేజ మిపుడు
నాకు గర్భోపతాపం బొనర్పఁ బూనె
గర్భబాలుండు నిహతుండు గాకయుండఁ
గావవే నన్ను నీపుత్రిఁ గమలనాభ ॥ 45

వ॥ అనినఁ గృష్ణుం డది యశ్వత్థామప్రయుక్తబాణానలం బని నిశ్చయంబుసేసి, 46

ఉ॥ ఆవనజాక్షిఁ జూచి దరహాస మిగుర్పఁగ నింతమాత్రకే
లీ వెఱ పింత యింతి ! యని లీలయవోలె సుదర్శనంబుఁ ద
త్పావనగర్భరక్షకు శుభంబుగ నిల్పి భయంబుఁ దెల్పి సే
నావృతుఁడై యదుల్ ముదమునందగ ద్వారక కేగఁజూచుచున్॥ 47

వ॥ విరహాసహిష్ణుండైన ధర్మతనయునిచేత నిలువుమని ప్రార్థితుండై ద్వారకాప్రయాణంబు మాని హాస్తిపురంబుననె నిలచియుండె నంత ధర్మాత్మజుండు, 48

తే॥ బాంధవులఁ జంపినట్టిపాపమున కాత్మ
నిక్లబతనొందుచును ధౌమ్యవిదురకృష్ణ
బోధితుండయ్యుఁ దెలియక పుణ్యానుతులఁ
దాను భీమార్జునాదు లందఱును గూడి॥ 49

## భీ ష్మ ని ర్యా ణ ము

కం॥ సమితిస్థితి వరశరగత
ల్పమునం బడియున్నభీష్ముపాలికిఁ జని రా
సమయమున నారద వ్యా
సముఖానేకర్షివరులుఁ జనుదెంచి రొగిన్॥ 50

శా॥ గంగాసూనుఁడు నమ్మునీంద్రులకు వేడ్కం బూజ లిప్పించి, శౌ
రిం గైవల్యపదేశు నర్చనముచేఁ బ్రీతాత్ముఁ జేయించి, స
త్సంగం బబ్బుట కుబ్బుచున్ [1]మనమునన్ ధర్మాత్ములన్ వారిఁ జే
రం గూర్చుండ ననుజ్ఞయిచ్చి ముదమారన్ వారితో సల్లనున్॥ 51

1. మనములన్.

కం॥ ధర్మాత్మజుండు కౌరవ
దుర్మతులను నెల్ల నోర్చి తుదివిజయ శ్రీ
కర్మంబు గాంచె నహాహా
[1](ధర్మే)జయ మను మతంబు దప్పునె యెచటన్॥ 52

ఉ॥ ఎవ్వనిపాదరేణువుల నిచ్చఁ దలంచినమాత్ర జైత్రులై
క్రొవ్విననైత్యులన్ దునిమి కోర్కులు గాంతురు వేల్పు లాజిలో
నవ్విభుఁ డచ్యుతుండె సఖుఁడై చరియింపగఁ బాండవుల్ సిరుల్
నివ్వటిలన్ జయస్థులయి నిల్చుట యద్భుతమే తలంపగన్ ॥ 53

వ॥ అని మఱియు యథోచిత సంభాషణంబు లాడుచుం దన్ను నడిగెడు ధర్మనందనునకు హరిభజనప్రకారంబులు, వర్ణాశ్రమాచారంబులును, బ్రవృత్తినివృత్తిలక్షణంబులును, నాపద్ధర్మంబులును, ధర్మార్థకామమోక్ష మార్గంబులును, నానాపురాణోపాఖ్యానేతిహాస రహస్యంబులు దెలిపి యుప్పుడు, 54

కం॥ దశశతకిరణుం డుత్తర
దిశకుం జనుదెంచు టెఱిఁగి తెలిసి చెలంగన్
దశశతరథనాథుఁడు చి
ద్వశగుఁడు భీష్ముండు చరమదశ కున్ముఖుఁడై ॥ 55

తే॥ తనదుముందర నభిముఖత్వమున నున్న
దేవకీపుత్రుపై భక్తి దృష్టిఁ జేర్చి
యమ్మహాత్ముని బరమపదాధినాథు
ననదృశజ్ఞానుఁ డగుచు నిట్లని నుతించె ॥ 56

---

2. ధరోత్మ.

## భీష్మస్తుతి

శా॥ శ్రీకృష్ణాయ నమో నమో మునివచస్సింధ్వాంతగణ్యాయ తే
వైకుంఠాయ నమో నమో యదుకులవ్యక్తోరుపుణ్యాయ తే
[1](శ్రీకాంతాయ నమో నమో మునిజనశ్రేణీశరణ్యాయ తే
లోకేశాయ నమో)యనంబరగు పల్కుల్ మాకు సన్మంత్రముల్॥57

సీ॥ కురుసభాసన్నిధిక్షోణి నెవ్వఁడు పాండ
వరమణి కక్షయాంబరము లొసఁగె
ఉభయసేనామధ్యమోజ్జ్వలుండై క్రీడి
కెవ్వాఁడు పరతత్త్వ మెల్లఁ దెలిపె
సారథ్యమొనరించి సమితిలో నెవ్వాఁడు
విజయుని సుజయు గావించి మించె
సఖుని గాచుటకునై చక్రంబుచే నంటి
యెవ్వాఁడు గడిమి నా కెదురు నడచె
తే॥ సరవి నెవ్వాఁడు బహువిలాసములఁ జూపె
గోపభామలమానంబుఁ గొల్లలాడె
ధర్మసంస్థాపనము జేసె ధరణి నెవ్వఁ
డతఁడు నామానసంబున నలరుఁ గాత॥ 58

వ॥ మఱియతను సకలజగత్కారణత్వ, రక్షకత్వ, శేషిత్వ, లక్ష్మీ పతిత్వ లక్షితుండును, సర్వవ్యాపకుండును, సర్వనియంతయు, హేయ ప్రతిభటుండును, నిఖిలకళ్యైకతానుండును, స్వేతరసమస్తవస్తువిలక్షణుండును, నిత్యనిరవద్యనిరుపమ నిరతిశయనిర్ద్వంద్వ నిర్వికారనిర్వైర నిరామయనిరాటంకనిరంజననిరీహానిర్మలసచ్చిదానందస్వరూపస్వయంప్రకాశుండును, నైన శ్రీమన్నారాయణుండు శరణంబు. 59

1. (............యనం)

సీ॥ భావింతు ధవళాబ్జపత్రాక్షు మణివక్షు
సేవింతు నిత్యరోచిష్ణుఁ గృష్ణు
నర్చింతు నఖిలలోకాధీశు లక్ష్మీశు
నాత్మఁ గైకొందు దైత్యారి శౌరి
వినుతింతు భక్తి గోవిందు ముకుందుని
నీక్షింతు మది హృషీకేశు నీశు
యజియింతు శేషాహినిజతల్పు నవికల్పు
భజియింతు ఖగపతిధ్వజుని నజుని
తే॥ భక్తపరతంత్రచారిత్రు భవ్యగాత్రు
నీలనీరదసమవర్ణు నిత్యపూర్ణు
గురుతరకృపాసనాథు వైకుంఠనాథు
దలఁతు మ్రొక్కుదు శరణొందుఁ గొలుతు నెపుడు॥ 60

వ॥ అని యిట్లు పలుకు శరతల్పగతుండైన భీష్ముండు వాసుదేవ
మయబ్రహ్మంబు నొందుటయును, 61

కం॥ కురిసెం బువ్వులవానలు
పరిచితతత్పరిమళానుపతదళికుల ఝుం
కరణములు [1] సందడింపగ
సురదుందుభిగణము మ్రోసెఁ జోద్యము గాగన్॥ 62

వ॥ ధర్మపుత్రుండును బితామహుండైన గాంగేయునకు సముచిత
కరణీయంబు లొనర్చి బ్రహ్మర్షిగణంబుల వీడ్కొని యప్పుడు, 63

## ధర్మరాజు ధరణి నేలుట

కం॥ శతపత్రాక్షానుజ సం
గతుఁడై కరిపురికి వచ్చి కడు వినయముతో
ధృతరాష్ట్రునిచేఁ దగ నను
మతుఁడై రాజ్యస్థుఁడగుచు మహిఁ బాలించెన్॥ 64

1. సంగడింపగ.

ఉ॥ ఏడవచక్రవర్తి పదియేడవరా జని తన్ను నెల్లచో
వేడుక సజ్జనుల్ పొగడ విస్మయమొందగ శత్రుమిత్రతల్
చూడక ధర్మకృత్యములు చొప్పులు నిల్పుచు నిట్టివేళయం
దీడును జోడులేని మతి నెన్నగ రాజ్యము సేసె నున్నతిన్ ॥ 65

ఉ॥ దుర్మద వైరిరాజకవిధుంతుదితప్రకటప్రతాపసం
వర్మిత ధర్మవృద్ధి పరివర్ధిత కీర్తిలతా వితానుఁడై
ధర్మతనూభవుండు జనతాపరిపాలన మాచరింపఁగా
ధర్మము నాల్గుపాదముల ధాత్రిపయిన్ నిలిచెన్ దృఢంబుగన్॥ 66

## కృష్ణుడు ద్వారక కరుగుట

వ॥ అంతఁ గృష్ణుండును, గుంతీసుభద్రల నూరడించి ధౌమ్య ధృతరాష్ట్రవిదురధర్మజ భీమాదులకు యథోచితప్రియంబు లాచరించి, యర్జునుండు ధవళాతపత్రంబును, నుద్ధవసాత్యకులు రత్నచామరంబులు బూని కొలువంగఁ, గనకరథారూఢుండై భేరీపటహశంఖకాహళఝల్లరీ డిండిమఢమఢమామికాఢక్కాహుడుక్కాదివాద్యనిస్వనంబులు దిగ్గజ శ్రవణపుటపాటన పాటవంబునం బ్రవర్తిల్లఁ జతురంగబలసమేతుండై హాస్తినాపురంబు వెలువడి కురుజాంగల పాంచాలాదిదేశంబులు దాటి పోవుచు, 67

మహాస్రగ్ధర ॥

కనియెన్ గృష్ణుండు గాఢాగ్రహఘటితముఖాఘూతమాతంగనక్ర
ధ్వనితాంభోబిభ్యదభ్యుద్రవదహిబహుళపూత్కారఘోరానిలోద్య
ద్ఘనభంగోత్తుంగరంగత్క్రమతఝషతిమిగ్రాహపాఠీన సంచా
లననిర్గచ్ఛన్మణిశ్రీలలితపృషత కల్యాణముద్రున్ సముద్రున్॥ 68

వ॥ అప్పుడు,

సీ॥ ఇది క్రుద్ధజంభభిద్భిదురభీతప్రమ
 [1]జ్జద్గోత్రవిశ్రమస్థానమనియు
ఇది మధ్యలోకపృష్టిదమహావర్షుకాం
 బుధరమండలపానభూమి యనియు
ఇది బడబాముఖాభ్యుదితశోచిష్కేశ
 నిత్యోపయోజ్యపానీయ మనియు
ఇది యొక్కతటి జంతుమదఘుగో (ఘూమ) సం
 ఘట్టనప్రథితఘురట్ట మనియు
తే॥ ఇది యనర్ఘ్యమణీగుప్తిసదన మనియు
ఇది సమస్త్యాదవృత్తికి నెక్క డనియు
బహువిధంబుల వినుతించెఁ బద్మనాభు
డఖిలకకుబంతరోల్లాసి నంబురాసి॥ 69

వ॥ అట్టి సముద్రంబు దరిసి తన్మధ్యప్రదేశంబున, 70

శా॥ శ్రీమంతుండగుశౌరి వేడుకఁ బ్రవేశించెన్ సముద్దామ సౌ
దామిన్యాభ(మ) [2]ధూళిధూపమ ముఖోద్యన్మందహాసప్రభా
కౌముద్యాప్లుత ధాళధళ్యనిధిముక్తాయుక్తలాజాక్షత
ప్రేమావర్షణహర్షవీక్షణ మిళద్బృందారకన్ ద్వారకన్॥ 71

సీ॥ బర్హార్భుఖద్రుమప్రతిగుచ్ఛ బంభ్రమ
 ద్బసలాంగనాగాన భాసురంబు
పరిఘీకృతాంభోధి గురుఘోష ధిక్కారి
 హారి భృకుంసు తౌర్యత్రికంబు
సౌధాగ్రచరరతిశ్రమ వారి హారచల
 ద్వైజ [3](యం తో)న్నత ధ్వజపటంబు

1. జ. జ్జ  2 వ,  3. (......)

వరణశృంగస్థల ద్వరతారకావహ
స్థగిత తత్ఖచితరత్నవజ్రంబు
తే॥ హృష్ట తుఖ్కారకి హేషారవేడితంబు
కరటి కటనిర్గళద్దాన గంధిలంబు
ప్రస్తుతింపఁగఁ దగదె వైభవకృతద్యు
ఘట్టనంబైన ద్వారకాపట్టణంబు॥ 72

వ॥ అందు,

కం॥ లీలావనముల హాటక
జాలాంతస్థలుల రత్నసౌధంబులపై
హేలావతులన్ రతులన్
దేలించుచు నుండె శౌరి తేజం బలరన్ ॥ 73

కం॥ అనుటయు సూతుని శౌనక
ముని యిట్లను మాతృగర్భముననుండిన బా
లుని హరి యేక్రియఁ గాచెను
వినఁజేయుము కృపఁ దదీయవృత్తం బెల్లన్ ॥ 74

తే॥ అనుటయును సూతుఁ డిట్లను విను మునీంద్ర
యుత్తరాగర్భమున నిల్చియున్న శిశువు
దశమమాసంబువచ్చిన ద్రౌణిశిఖిశిఖ
జనితసంతాపుఁ డగుచు నిట్లని తలంచె॥ 75

## పరీక్షిత్తుని జననము

శా॥ సంతాపం బొనరింపఁజొచ్చె, విశిఖజ్వాలల్ మొఱల్ వెట్ట, యే
నంతర్గర్భగుఁడన్ సమర్థతయు లే దాప్తుల్ సుభద్రాదు లి
కాంతాగర్భము చక్రిగాచె నని పల్కన్ విందు, నచ్చక్రియున్
జెంతం జేరఁడు నిల్వ నెట్టిగతి, యోజింపంగఁ గా దియ్యెడన్ ॥ 76

ఉ॥ గర్భగతుండు నొచ్చికొని గ్రక్కున నిర్గతిలేక చిక్కినన్
గర్భిణికిన్ విపత్తి మును గల్గుట సిద్ధము గావునన్ మనో
దుర్భరమైనయట్టిదళ [1](దోపక) యుండగ నన్ను నెంతయున్
నిర్భయుఁ జేయఁబూని హరి నిల్వఁడొకో, కరుణాగుణాఢ్యుఁడై॥ 77

మ॥ అని [2](యిల్లేడ్చుచు) గర్భబాలకుఁడు కృష్ణా! యెట్లు రక్షించెదో
యనుచుండంగఁ దదగ్రసీమ హరి నీలాంభోధరశ్యామలుం
డును బీతాంబరుఁడున్ గదోజ్జ్వలకరుండున్ గుండలాలంకృతుం
డును నంగుష్టకమాత్రదేహుఁడును నై నూత్నప్రభన్ నిల్చుచున్॥ 78

కం॥ గద జిరజిరనన్ ద్రిప్పుచు
నదరులు మైఁ బొదవునట్టి యశ్వత్థామ
ప్రదరంబు నీఱుసేయుచు
ముద మొసగెన్ బాలకునకు మోహనలీలన్॥ 79

ఉ॥ బాలుఁడు నీతఁ డెవ్వఁడు కృపాలుఁడు నాభయ మెల్లఁ బాపి యా
భీలతరద్విజాస్త్రశిఖిఁ బెం పణగించె, నితండ శౌరి గా
బోలుఁ దదన్యుఁ డిట్లబలఁ బ్రోవగ నేర్చునె యంచుఁ జూడగా
నాలలితాంగుఁడైన దనుజారి తిరోహితుఁ డయ్యె నయ్యెడన్॥ 80

ఆ॥ అంత నుత్తరయు మహోర్వాలగ్నంబున
విష్ణుభక్తియుక్తి వినుతపాత్రు
విమలకమలనేత్రు విఖ్యాతచారిత్రుఁ
బుత్రుఁ గనియెఁ బాండుపుత్రు లలర॥ 81

ఆ సమయంబున,

1. (.........) 2. (.........); యార్చుచుచు.

సీ॥ హర్షంబు మీఱంగ ననుజసమేతుఁడై
ధర్మాత్మజుఁడు యథోక్తక్రమమున
భూమీసురులకు గోభూతిలకనకాది
దానంబు లిచ్చి యుత్సవ మొనర్చి
కార్తాంతికులఁ బిల్చి [1](కడగ)ఁ బౌత్రునికి గ్ర
హానుకూల్యస్ఫూర్తి యడుగ, వార
లో దేవ ! యితఁడు వంశోద్ధారకుండగు
నాదిరాజన్యుల నవఘళించు
తే॥ జనులఁ బాలించుఁ దుది నొక్కమునికుమారు
శాపభయమునఁ దద్దయు, జాడఁ దెలిసి
గంగఁ బ్రాయోపవిష్టుఁడై కమలనాభుఁ
గలయు నని జాతకం బెల్లఁ బలికి వెఱఁగి॥ 82

అంత,

తే॥ కుక్షివీక్షితుండగువిష్ణుఁ గోరి జగము
నందు, గలయం బరీక్షించు నట్టికతన
చెలఁగి పెద్దలు తను బరీక్షి త్తటంచుఁ
బలుక నభివృద్ధిఁ బొందె నబ్బాలకుండు॥ 83

వ॥ ధర్మపుత్రుండును దొల్లి మరుత్తుం డుత్తరదిగ్భాగంబున నిక్షేపించిన ధనకనకపాత్రాదికంబులు దెప్పించి జన్నంబులు సేయుచుం బ్రజాపాలనంబు సేయుచుండె. 84

సీ॥ అంతట మునితీర్థయాత్రకై చనిన య
వ్విదురుండు విజ్ఞానవినుతుఁడైన

1. కణక.

మైత్రేయువలన నిర్మలభక్తియుక్తుఁడై
కర్మయోగాదిసంగతులు దెలిసి
హాస్తినపురమున కరుదెంచుటయు ధర్మ
పుత్రుండు మజ్జనభోజనాది
సత్కృతుల్ సేయించి, సముచితాసనమున
నునిచి తా నతనితో వినయ మలర

తే॥ ఆర్య ! మీరింతకాలంబు నవనిమీద
నెట్టితీర్థముల్ జూచితి రింపు మీర
వాసుదేవునికల్యాణవార్త లేమి
యైన నెఱుఁగుదురే, యని యడుగుటయును॥ 85

వ॥ విదురుండును దీర్థయాత్రావృత్తాంతం బంతయు నెఱింగించి యదునాశంబు దా నెఱింగియు, ధర్మరాజు శోకాకులుం డగుననియుం దాను శూద్రుండు గావున శిష్టనిధనంబుఁ జెప్ప యుక్తంబు గాదనియునుం జెప్పండయ్యె. ధర్మపుత్రుండును జ్ఞాత్రుని బెనుచుచు ముద్దుసేయుచుం బెద్దకాలంబు సుఖంబున నుండె నంత, 86

సీ॥ ధర్మమార్గప్రవృత్తికదర్థ [1] మర్థకా
మాతురశలభసంఘాతదీప
కళిక, మోక్షవిఘాతకారణంబు, నృశంస
తానిదానం, బసత్యప్రలాప
గురుమూర్తి, పరహింతపరిహార [2] (కర్త) దు
రాచారవితతి [3] (శుద్ధాంత), మఖిల
[4] (దుర్గుణాం)జనవేటి దుష్టచారతమిస్ర
మార్యచరిత్రనిందాలవాల,

1. మార్గప్రవృత్తికరత్వ. 2. కత్వ. 3. సిద్ధాంత. 4. దుర్గణాం.

తే॥ మాగ్రహద్వేషలోభమోహాదివస్తు
పణ్యవీధి, నిశిష్టవిభ్రాంతిఘుటిక
సకలదోషాకరంబు, సంచలితమనుజన
హృదయజాలంబు కలికాల మేఁగుదెంచె॥ 87

## ధృతరాష్ట్ర నిర్గమనము

కం॥ వితతంబగుదత్కాలా
గతిఁ గనుగొని విదురుఁ డాత్మగతమునఁ జింతా
గతుఁడై వని కేఁగెడుమతి
ధృతరాష్ట్రునితోడ నొంటిఁ దెలుపఁగఁ దొణఁగెన్॥ 88

కం॥ కొడుకుల నూర్వుర నదిలో
నడచినపాండవులె యిట్టుల నన్నం బిడగా
గుడుచుంజుట్టము నని యి
క్కడనుండఁగఁ దగునె నీకుఁ గౌరవనాథా॥ 89

అదియునుంగాక,

కం॥ ఇడుములఁ బెట్టిరి నీసుతు
లెడపక పుట్టినది మొదలు నిప్పాండవులన్
నొడువగ వచ్చునె యది యి
ప్పుడు వారలతోడిపొందు పొసగునె నీకున్॥ 90

ఉ॥ ఇచ్చట నుండఁగా మిగుల హీనత దోచుఁ గురుక్షితీంద్ర! నీ
సచ్చరితానురూపముగ జక్కనఁ గానల కేఁగి యచ్చటన్
మచ్చికఁ బుణ్యతీర్థముల మానస మెంతయు సంతసిల్లగా
నొచ్చెములేని సత్పథము నొంద గణంగుట యుక్తమిత్తఱిన్॥ 91

తే॥ అనుచు విదురుండు బోధించి యాడుటయును
వినుచు ధృతరాష్ట్రుఁ డాత్మ భావించి రోసి
విపినమున కేఁగ సమకట్టి విదురుఁ గూడి
కడఁక గాంధారియును దోడఁ గదలఁ బూనె॥ 92

వ॥ ఇట్లు కదలిన గాంధారీధృతరాష్ట్రులం దోడ్కొని విదురుండు వనంబున కరిగిన నమ్మరునాటి ప్రభాతంబున, 93

కం॥ వరకీర్తి ధర్మతనయుఁడు
విరచితనియతప్రభాతవిధియై భక్తిన్
గురుభవనమునకు వందన
పరుఁడై నిత్యంబు వచ్చుభంగిన్ వచ్చెన్ ॥ 94

వ॥ వచ్చి గాంధారీధృతరాష్ట్రులఁ గానక యచ్చట గూర్చున్న సంజయు నడిగిన, 95

ఉ॥ నిన్నటిమాపు పెద్దధరణీపతియున్ విదురుండు మంతనం
బున్న తెఱంగుకాని, మఱి యొండెఱుఁగన్, ధృతరాష్ట్రభూవరుం
డిన్నిటినాళ్ళభంగి నను నేమియుఁ బ్రశ్నముసేయఁ డీనిశన్
నన్నును మోసబుచ్చి చని నారని ఖేదము నొందె నాతఁడున్॥ 96

వ॥ ధర్మపుత్రుండును వెచ్చ నూర్చుచుం జింతాభరాక్రాంతుం డై యుండె నంత, 97

సీ॥ తనతనుద్యోతంబు నినుమడింపఁగఁ జాలి
తనయూర్ధ్వపుండ్రసంతతి చెలంగ
తనచిత్తశుద్ధికి నెనవచ్చుపటికంపు
జపసూత్ర మొకకేలఁ జాల మెఱయ
తనతపోఽగ్నిజ్వాల లనజాలి యువటుభా
గంబునఁ గెంజడల్ గడు నటింప

తనదువాఙ్మాధుర్యమును బోలు వల్లకీ
రవము తత్రత్యులఁ [1](మిప్పుల)ఁ దనుప
తే॥ తనదు సద్ధర్మలతికనాఁ దనరు యజ్ఞ
సూత్రము నురస్థలంబున సొబగుఁజూప
దండకుండీమృగాజినధారియైన
నారదుఁడు వచ్చె విద్యావిశారదుండు॥ 98

కం॥ వచ్చిననారదుఁ గనుఁగొని
యచ్చెరువడి ధర్మపుత్రుఁ డానతుఁ డగుచుఁ
దచ్చరణములకుఁ బూజన
మిచ్చి సుఖాసీను జేసి యిట్లని పలికెన్॥ 99

మ॥ అనఘా మాపెదతండ్రియైనధృతరాష్ట్రాధీశుఁడుం దత్కళాం
గనయున్ మాపినతండ్రి యవ్విదురుఁడుం గారుణ్యలక్ష్మీనిధుల్
చనినా రెచ్చటికో వినంబడదు తచ్చారిత్ర మీ వన్నియున్
గనుసర్వజ్ఞుఁడ విట్టి మమ్ము దెలుపంగా నర్థిఁ బ్రార్థించెదన్॥ 100

వ॥ అనుటయు నారదుండు విశ్వం బీశ్వరాయత్తం బగుటయును, దేహికి సుఖదుఃఖానుభవంబునందు స్వాతంత్ర్యంబు లేదనియును, సంయోగవియోగంబులు కర్మజంబులనియునుం దెలిపి యిట్లనియె. 101

ఆ॥ ఎంతకాల ముండు నిద్ధాత్రిపైఁ గృష్ణుఁ
డంతదనుక నుండు డరసి మీరు
నంతమీఁదఁ గాల మతిదుష్ట మగునట్టి
కాల మేరికైనఁ గడవ వశమె॥ 102

వ॥ అని మఱియు నిట్లనియె. 103

---

1. (.........).

సీ॥ పృథివీశ! యిక దాప నేల యాధృతరాష్ట్ర
వృత్తాంత మంతయుఁ జిత్తగింపు
హిమశైలదక్షిణాశ్రమభూమి సప్తర్షి
వరులకై సప్తప్రవాహమైన
జాహ్నవీతటమున సముచితానుష్ఠాన
శాలియై కౌరవజనవిభుండు
ధారణాయోగంబు దాల్చి గుణక్షోభ
మును నింద్రియాక్షేపమును నణంచి
తే॥ యోగముక్తాత్ముఁడగు నంత కొనర నతని
దావశిఖ చుట్టుకొనినఁ దత్పత్నియైన
యట్టి గాంధారియును భర్త ననుగమించె
విదురుఁడును దీర్ఘయాత్రకై కదలి చనియె॥ 104

కం॥ అనిచెప్పి యమ్మునీంద్రుఁడు
తనవలసినయట్లు చనియె ధర్మతనూజుం
డును వారల కుచితములగు
పనులన్నియుఁ జేసె ననుజపరివృతుఁడగుచున్॥ 105

వ॥ అంత నొక్కనాడు పాండవాగ్రజుండు పరిసరగతుండగు
పవనతనయు నవలోకించి యిట్లనియె. 106

సీ॥ ఆచారగతి జౌక యయ్యె విప్రులయందుఁ
గ్రయవిక్రయాదులఁ గల్ల లొదవె
కొడుకులు దండ్రులఁ జెడనాడఁ జొచ్చిరి
మగువలు పతులకు మారుపడిరి
గురుపరిచర్యమైఁ గొల్వరు శిష్యులు
హెచ్చుఁ గుందులు లేక యేకమయ్యె

అన్యాయమున రాజు లర్థంబు గొనఁబూని
రాష్ట్ర్యులు లోభయుక్తాత్ము లైరి
ఆ॥ వర్షములకుఁ దటి నవగ్రహంబులు పుట్టి
సస్యములకుఁ బంట జాడ దటిగె
మలినవృత్తియైన కలియుగవేళ పై
కొనగఁ బోలు నిప్పు డనిలతనయ॥ 107

## కృష్ణావతార విసర్జనము

కం॥ ఏడునెలలయ్యెఁ గృష్ణుని
జూడంగాఁ బార్థుఁ డేఁగి చోద్యము మఱలం
జూడకపోయెను యదువుల
జాడయునుం దెలియ దేమి చందం బగునో॥ 108

అదియునుంగాక,

ఇచ్చట గ్రంథపాతము.

.........................

తే॥ .........................
తేరఁ దెరువునఁ దాకిరి చోరభటులు
వారి వారించుపనికిఁ బెంపారునాడు
ధను వసాధ్యత నొందె నేమని వచింతు॥ 109

కం॥ మున్నిటివే ధనుశరములు
మున్నిటివె రథాశ్వములును మున్నిటిదె మతిఁ
మున్నిటివాడనె యే నివి
యన్నియు వృథ యయ్యె నిపుడు హరికృపలేమిఁ॥ 110

వ॥ అని యివ్విధంబున నర్జునుండు కృష్ణుని వృత్తాంతంబు ధర్మరాజున కెఱింగించి కృష్ణోపదిష్ట గీతారహస్యంబులు మనంబునకుం

దెచ్చుకొని శోకం బుడిగియుండె నంత గుంతియుం గృష్ణార్పిత చిత్త యగుచు యోగముక్తాత్మయయ్యె, కృష్ణుండు విజయంబుఁ జేసిన దివసంబునందె కలియుగంబు ప్రవేశించెం గావునఁ దదీయ ప్రకారంబుఁ గనుంగొని, 111

## పాండవ మహాప్రస్థానము

సీ॥ ధర్మజుం డభిమన్యుతనయుఁ బరీక్షిత్తు
గరిపురిఁ బట్టంబు గట్టి యతని
కఖిలవస్తువులు సమర్పించి, యనిరుద్ధ
నందనుఁడగు వజ్రనాము మధురఁ
జక్కంగ నిల్పి, ప్రాజాపత్యమను నిష్టి
గావించి, యగ్నుల గారవమునఁ
దనయందె యారోపితంబులు గాఁ జేసి
చరియించుచు విముక్తసరణిఁ జనియె
తే॥ అంత భీమాదులును ద్రుపదాత్మజయును
జ్ఞానులై పుణ్యలోకవిశ్రాంతులైరి
విదురుఁడు ప్రభాసమనుతీర్థపదమునందు
ముక్తుఁడై ధర్మపతిరూపమునఁ జెలంగె॥ 112

కం॥ ఈపాండవప్రయాణము
నేపుణ్యుఁడు చదువు విను మహేచ్ఛత నతఁడా
తాపములఁ బాసి విజ్ఞా
నోపేతుం డగుచు శుభము నొందుఁ వేగ॥ 113

వ॥ అని పలికి సూతుండు ప్రస్తుతంబైన పరమభాగవతుండగు పరీక్షిత్తుచారిత్రంబు వివరించెద నని యిట్లనియె. 114

## పరిక్షిత్తు దిగ్విజయము

సీ॥ ఆపరీక్షిత్తు సింహాసనస్థుండయి
ధర నేలుచుండి యుత్తరునిపుత్రి
యగు నిరావతిఁ బెండ్లియై తగ జనమేజ
యాదిపుత్రచతుష్టయంబుఁ బడసి
జాహ్నవీతటిఁ గృపాచార్యు నాచార్యత
నమర మూఁడశ్వమేధము లొనర్చి
సకలదిక్కులు గెల్చుసమయంబునందు గో
మిధునంబుఁ దన్నుచు మెఱయుచున్న
తే॥ శూద్రవిభుచిహ్నుఁడగు కలిం జూచి నిగ్ర
హించె నన విని యద్భుతోపేతులగుచు
శౌనకాదులు రోమహర్షణతనూజుఁ
బలికి రిట్లని వినయసంభ్రమము సెలఁగ॥ 115

తే॥ సూత యెబ్భంగిఁ గలిరాజుఁ జూచి నిగ్ర
హించెఁ దెలిసి పరీక్షిన్మహీవరుండు
తెలియఁబల్కుము విష్ణుదాసులచరిత్ర
మనుపమం బెంతవిన్నను దనివి కలదె॥ 116

ఉ॥ నావిని సూతుఁ డిట్లను ధనంజయపౌత్రుఁడు దిగ్జయంబు సే
నావృతుఁడై యొనర్చి, నరనాయకు లెల్లఁ గరంబు లిచ్చుచున్
సేవలు సేయఁ ద్రిమ్మరుచుఁ జెల్వమించు సరస్వతీనదీ
పావనతీరభూమికిఁ బ్రబాధసమగ్రత వచ్చి యచ్చటన్॥ 117

కం॥ గోరూపముతో దగఁ గ
న్నీరొలుకుచునున్న ధారుణిన్ ఘనవృషభా
కారమున నొంటిపద మా
ధారంబుగనున్నయట్టి ధర్మువుఁ గనియెన్॥ 118

వ॥ ఆ సమయంబున నప్పరీక్షిత్తు వినుచుండఁ ధర్మదేవుండు భూదేవి కిట్లనియె. 119

మ॥ జననీ! యశ్రులు రాల్చె దేమిటికిఁ! గంసద్వేషి లేఁడయ్యెఁగా
యనియో, నిర్దయు లేలుచుందు రనియో యన్యాయముల్ హెచ్చుఁ, బో
మ్మనియో, సభ్యుల కింపు లేదనియొ, మేలై యింతకాలంబు దు
ర్జనసంహారి మురారి నిన్ను గరుణన్ రక్షించెఁగా యెంతయున్॥ 120

చం॥ అనుటయు భూమి యిట్లను మహాజనసన్నుత ధర్మదేవ! కృ
ష్ణునిదయ నింతకాలమును సుస్థిర నైతిఁ దదీయదివ్యప
ద్వనజయుగంబు సోఁకగ ధృవంబుగ సస్యసముచ్చయంబునన్
దనువున రోమహర్షణము దాల్తు ననారత [1](ముక్తముదంబునన్) 121

ఉ॥ ఎవ్వనిపాదతీర్థమున కిందుకళామకుటుండు మోచు వాఁ
డెవ్వని నామసార మచలేంద్రతనూజ యెఱుంగు నెన్నఁగా
నెవ్వఁడు మోక్షలక్ష్మికిఁ బరేశ్వరుఁ డట్టి దయాసమన్వితుం
డవ్వసుదేవపుత్త్రుఁ డెడ్డయ్యెసకతంబున దుఃఖమొందెదన్॥ 122

వ॥ మఱియును,

కం॥ నీకును నాకును గోద్విజ
లోకమునకు దేవతలకు, లోలాత్ములచే
నాకులపా టొదవెడు నిక
నీకలికాలమున ననుచు నివ్వగపొదవెన్॥ 123

తే॥ నాల్గుపదములు మోపి యున్నాళ్ళు వేడ్క
నెగడఁ జరియించుచుండెడు నీవు నకట
కలుషగతి వంకఁ జరణ మొక్కటియ మోపి
యుండఁ గణగితి వింక నెట్లోర్వవచ్చు॥ 124

1. తుక్త ముక్త దయాంబునన్.

వ॥ అని యిట్లు భాషించుచు గోవృషభరూపంబుల నున్న ధరణీ ధర్మదేవతల శూద్ర ప్రభులక్షణలక్షితుండగు కలిరాజు డగ్గరి యకారణ కోపాటోపంబున శరణిపయింబడఁదన్నినం దృణకబళంబులు వదలి హాంభా రావంబులు సేయు నగ్గోమిథునంబుం జూచి కనకరథమధ్యగతుండగు పరీక్షిత్తు దయాళుండై శూద్రాదిలక్షణుం జూచి కనలి శరాసనంబు సశరంబు సేయుచు నిట్లనియె. 125

## క లి గ ర్వ హ ర ణ ము

కం॥ కారణములేక మద మే
పారఁగ గోమిథునముఁ బదాహతుల వడిఁ
ధారుణిపైఁ బడఁ గొట్టితి
వౌరా! నీగర్వమెల్ల నణఁచెదఁ గుజనా॥ 126

మ॥ అని యాధర్మువుఁ జూచి యిట్లను మహాత్మా! మిమ్మొగిఁ దన్ని గూల్చినవీనిఁ వధియింతు నిచ్చటనె, మీచిత్తంబులో నున్న యీయా వనట ల్మాన్చెద, నిన్ను నాల్గడుగులన్ వర్తిల్లగాఁ జేసెదన్ వనజాతాక్షుమఱందిపౌత్రుఁడను నన్ వర్ణించి వీక్షించుమా॥ 127

తే॥ అనుచు గోరూపముననున్న యవనిఁ గాంచి
తల్లి! నీ కింత మది నేలఁ దల్లడంబు
చోద్యముగ వీని దండింతుఁ జూడు మనుచు
కేలన నసిపుత్రి ఝళిపించి కినుకఁ జూప॥ 128

చం॥ కలియును రాజచిహ్నములు గ్రక్కున మాని భయోపతాప దు
ర్బలుఁడయి తత్పదాబ్జములపై నిజహస్తముఁ జేర్చి, దేవ! నీ
లలితకృపాణపుత్రికధళద్ధళితంబగుచున్న యంతలోఁ
జలమరియున్ ఝళఝ్ఝళిత సంగతమయ్యె మదీయచిత్తమున్॥ 129

చం॥ అనుటయు నుత్తరాతనయుఁ డావృషలాధిపుఁ బోలఁ జూచి యి
ట్లను నహాహ! దురాత్మక, నిజాంగమదంబునఁ జేసి గోవులన్
గనలి యకారణంబె పదఘట్టన నొంచితి, వయ్యదూత్తమా
ర్జును లెడమైనఁ దత్కరుణ సోఁకిన న న్నెదలోఁ దలంపవే॥ 130

కం॥ కావున దండ్యుఁడవగు నిను
బోనిడువ నయుక్త మనిన, [1](భూపాలుని) ను
ద్భావితభయుఁడగు కలి, యా
సావికిఁ దగువాక్యములఁ బ్రసన్నుని జేసెన్॥ 131

వ॥ ఇట్లు ప్రసన్నునిం జేసి, 132

తే॥ శుభగుణాకర నాకుండఁ జోటు కరుణ
సేసి రక్షింపవలయు నాశ్రితశరణ్య
యనుచుఁ బ్రార్థింప నభిమన్యుతనయుఁ డాగ్ర
హంబు కొంత విసర్జించి యతనిఁ జూచి॥ 133

తే॥ పాన, మింతులు, జూదంబు, ప్రాణివధయు
నను చతుస్థానములు నసత్యంబు, మదము,
కామ హింసలు, వైరసంగతియుఁ గాగ
నైదుచోట్లును నిలయంబులని విధించి॥ 134

కం॥ ఇతరస్థలములఁ గన నీ
స్థితిఁ గాంచిన నిగ్రహింతు సిద్ధం బని యా
క్షితిపతి, ప్రణతుండగు న
ద్భుతగతిఁ గలిరాజు నపుడు పొమ్మని యనిపెన్॥ 135

వ॥ ఇట్లు కలినిగ్రహంబు సేసి ధర్మదేవతను సత్యశౌచదయా
తపంబులను నాల్గుపాదంబులు నుద్ధరించి మేదినికి మోదంబు సంపాదించి

1. భూపాల.

మఱలి హాస్తినపురంబునకు వచ్చి రాజ్యంబు సేయుచుండి శృంగిముని శాపంబు నొంది గంగాతటంబున నిరశనవ్రతంబుఁగైకొని ముక్తుం డయ్యె ననుటయు, శౌనకాదిమహర్షులు రోమహర్షణిం జూచి, మహాత్మా! పరీక్షిత్కుమారుం డేమికారణంబున శప్తుండయ్యె, నెట్లు ముక్తుండయ్యె, సవిస్తరంబుగ నానతీయవలయు, నని యడిగిన సూతుండు శౌనకాదుల కిట్లనియె. 136

## శృంగిశాపము

సీ॥ ఒకనాఁడు వేటకై యుత్సాహ మాత్మలో
నెసఁగఁ బరీక్షిన్మహీవరుండు
కానకు నేఁగి మృగంబుల బహువిధం
బులఁ ద్రుంచి దప్పిచే నలఁత నొంది
యుదకంబు వెదకుచు నొక్కచో యోగని
మీలితనేత్రు శమీకనాము
నొకమునిఁ గాంచి యో యుత్తమ! జలముల
దయసేయు మనుచుఁ బ్రార్థనముసేయ
తే॥ నమ్మహర్షి సమాధిస్థుఁడై నకతనఁ
బలుకకుండినఁ జూచి యప్పార్థివుండు
నతఁడు తన్నుఁ గైకొనఁడని యాత్మఁ దలచి
తాపసుల కిట్టి గర్వంబు దగునె యనుచు॥ 137

కం॥ ఒకమృతసర్పముఁ దన విం
టికొప్పునఁ దెచ్చి యమ్ముని ప్రభుగళసీ
మిక నిడి చనినం దత్పు
త్రకుఁ డనఘుఁడు శృంగి యపుడె తద్విధ మెల్లన్॥ 138

సీ॥ మునికుమారులచేత విని యచ్చటికి వచ్చి
తండ్రిఁ గన్గొని విషాదంబు నొంది
తపసుల నిట్లు బాధలఁబెట్టు రాజులు
గలిగిరే మున్ను భూతలమునందు
శౌరి ప్రోవుటకదా సాధుల వధియింప
ద్రోణఁగిరి మత్తులై దుష్టజనులు
నృపకీట మిబ్భంగి విపరీత మొనరింప
నేమైన మనవంక నెగ్గు గలదె
తే॥ ధ్యాననిశ్చలుఁడైన మాతండ్రి మెడను
చెల్లరే మృతసర్పంబుఁ జేర్చినాడు
ఖలుని నిప్పుడె శపియింతుఁగాక యనుచు
కౌశికీనది కేఁగి వేగంబు గదుర॥ 139

వ॥ ఆచమనం బొనరించి కరంబుల జలంబులుగూని రోషారుణ
నేత్రుఁ డగుచు నుచ్చైస్స్వనంబున, 140

చం॥ తనతనుగర్వదుర్విహిత తామసవృత్తి నకారణంబె నా
జనకునికంఠసీమ మృతసర్పముఁ బెట్టినదుర్విచారుఁ డ
వ్వనజదళాక్షశంకరు లవశ్యము కావలియున్న నైన న
త్యనుపమతక్షకోరగ విషాహుతి నేడవనాటి కీల్గుతన్॥ 141

వ॥ అని యిట్లు వాక్యరోషాసంగియైన శృంగి శపియించి క్రమ్మర
జనకు సమీపంబునకు వచ్చి, కంఠలగ్నకాకోదరకళేబరంబుం గడకుం
ద్రొబ్బుండని కాతరత్వంబున సఖులనుం గుయ్యిడుచు రోదింపం దన్నాదం
బున శమీకుండును సమాధి చాలించి యున్మీలితనేత్రుండై యిట్లనియె. 142

చం॥ అకట కుమార! యేల కడునార్తుఁడవయ్యెదు, నాదుకంఠపీ
ఠిక మృతసర్ప మిట్లొసఁగు దెప్పరముం గనియో భయంబునొం

దకు మిక దీనికై యిటులఁ దామసవృత్తి నొనర్చినట్టి పా
తకుఁ డతఁ డెవ్వఁడిందుల విధం బెఱిగింపుము నాకు నావుడున్॥ 143

వ॥ శృంగియుం బరీక్షిత్తుసేసినవృత్తాంతంబును దా నతని శపియిం
చుటయును దెలుపిన నతండును గంఠలగ్నంబగు సర్పశరీరంబుఁ బాఱవైచి
కొడుకుతో నిట్లనియె. 144

మ॥ విపినాంతంబున కేఁగుదెంచి మృగయావిక్రాంతివిశ్రాంతిచే
నుపజాతాధికతృష్ణుఁడై మనల నీరొక్కింత యర్థించినన్
విపులాతిథ్య మొనర్పఁగావలయు నుర్వీభర్త కట్లైనచో,
శపియింపం దగునే కుమారక ! తపశ్చర్యార్థనిర్ధాకా॥ 145

శా॥ ద్రౌణ్యస్త్రానలతాపితాంగుఁడయి దైత్యధ్వంసిచేతన్ దయా
గణ్యస్ఫూర్తి సురక్షితుండగుచు, నీక్ష్మామండలం బెల్ల సా
ద్గుణ్యం బొప్పగ నేలుబాలకుని నక్రూరున్ గులోద్ధారునిన్
బుణ్యున్ వైష్ణవు నప్పరీక్షితుని శప్తుంజేయఁగాఁ బాడియే॥ 146

కం॥ యదుపతియు నరుఁడు నరిగిన
పిదపన్ దిక్కైనన[1](యతఁడు) ప్రిదిలిన, ప్రజలే
యదవదనొందుదురో, మన
మొదవించుటగాదె యట్టి యుపతాపంబున్॥ 147

వ॥ అనుచు వగచి శమీకుండు శిష్యునిచేత నవ్విధంబెల్ల
పరీక్షిత్తునకుం దెలిపిన విని పరీక్షితుండు నాత్మగతంబున,

## పరిక్షిత్తు ప్రాయోపవేశము చేయుట

చం॥ వనముల కేల యేఁగితి నవార్యపరాక్రమలీల నేఁగియున్
వనముల కేల బోయి విజనస్థితుఁ డమ్మునియున్నచో టికి

1. ఘతండు.

మ్మునితనయుండు శాంతరసమూర్తి నె యుండగ నన్ను నేల య
మ్మునితనయుండు దిట్టె నిది మోచినఘాలముగ్రాలశీలమున్ ॥ 148

చం॥ ఋషితనయుండు రేగి శపియించినయందుల కేను గ్రమ్మఱన్
రుషితము దాల్తునేని సుజను ల్మది మెచ్చరు, కావున న్మహా
విషయ[1](విషా) మిషగ్రసన విహ్వలతం గడ క్రొత్తి చిత్తమున్
హృషితముగా నొనర్తు నిక నేడవనాటికి విష్ణుకీర్తనన్ ॥ 149

వ॥ అని తలపోసి కుమారుండగు జనమేజయునకుఁ బట్టంబుఁ గట్టి దేవభూదేవసమారాధనం బొనర్చి సర్వసంగవర్జితుండై నిరశనవ్రతంబుఁ గైకొని హాస్తిపురంబు వెలువడి, 150

లయగ్రాహి ॥

విందుఁడగు పార్థసుతనందనుఁడు గాంచె సుర
బృందసతతప్రణత నిందుధరజూటీ
కందరనివాసరతిఁ గందళిరుచిన్ సగర
నందనులమోక్షములకుం దెరువు నిత్యా
నందఫలదాయిని నమందగతి ముజ్జగము
లందుఁగల ప్రౌఢశుభమందిరము నా కా
ళిందిచెలికత్తియ ముకుందపదపద్మమక
రందఝరి జహ్నుతనయుం దెలివిమీరన్ ॥ 151

వ॥ ఇవ్విధంబునం బరీక్షిత్తు గంగానదికిం జని యచ్చట దేవర్షిగణపరివేష్టితుండై ప్రాయోపవిష్టుండయ్యె, నయ్యెడ నమంద దుందుభిధ్వానంబు సందడించె; సురతరువర్ష కుసుమంబులు గురిసె నప్పు డయ్యభిమన్యునందనుండు కశ్యపాత్రివశిష్ఠగౌతమకలశసంభవాదుల నవ లోకించి యిట్లనియె. 152

1. మిషా.

కం॥ ఏడుదినములని మోక్షము
జాడకుఁ జనునట్టివిధము చర్చించి తగన్
వేడుకఁ బలుకుం డిందఱుఁ
బ్రోడలు శిశువులు సకలభువనస్థులకున్॥ 153

వ॥ అని విష్ణుకథాశ్రవణతత్పరుండై యడుగుసమయంబున, 154

## శు క యో గి సం ద ర్శ న ము

మ॥ ప్రకటజ్ఞానకళావివేచితపరబ్రహ్మామృతాస్వాదనో
త్సుకతావిస్మృతసర్వకృత్యుఁ డతులాస్తోకప్రభావోన్నతుం
డకలంకాకృతి దిక్పటీకుఁ డనఘూతాధ్యతుఁ డైనట్టి శ్రీ
శుకయోగీంద్రుఁడు వచ్చె నచ్చట మహర్షుల్ హర్షులై చూడఁగన్॥ 155

తే॥ వచ్చి నిల్చిన యా యోగివర్యుఁ గాంచి
వందనం బాచరించి భూవల్లభుండు
సముచితాసనమున నిల్పి సన్నుతించి
తనదువృత్తాంత మతని కంతయును దెలిపి॥ 156

వ॥ కృతాంజలియై యిట్లనియె. 157

## ప రి క్షి త్తు శు క యో గి ని ప్ర శ్నిం చు ట

సీ॥ అవధూతచంద్ర ! నీ యంఘ్రిద్వయీరేణు
కణములు మోక్షైకకారణంబు
లాతపాహతునకు నమృతవృష్టియుఁ బోలెఁ
గలిగె నాకిపుడు నీ లలితగోష్ఠి
అపవర్గలక్ష్మి సప్తాహంబులందె సా
ధించెద ననుచు దీపించె బుద్ధి
యదియును నాకు సాధ్యంబగు నిటమీఁదఁ
గాకున్న నిను జూడఁ గలుగు టెట్లు

తే॥ లేవిధంబున సుగతికి నేఁగఁ గలుగు
నవనిపై నావుఁబిదికినయంతితడవె
కాని యొక-చోట నిల్వని ఘనచరిత్ర
కరుణసేయుము నామీఁద గారవముగ॥ 158

వ॥ అని యివ్విధంబున సూతుండు శౌనకాదిమునులకుఁ బ్రథమ స్కంధకథావిశేషంబులు వివరించి యనంతరకథావిశేషంబులు వినుమనియె నట్లు ప్రార్థించినం బ్రాయోపవ్రతశీలుండగు పరీక్షిన్నరపాలునకు నాగర్భవైష్ణవధర్మానురాగియగు శుకయోగి యిట్లనియె. 159

తే॥ జనవరోత్తమ నీ ప్రశ్న మనుపమంబు
కోర్కు లెడసేసి మోక్షంబుఁ గోరుకతన
మోక్షలక్ష్మియుఁ బుండరీకాక్షుసేవ
కలుగునప్పుడ కరతలామలకఫలము॥ 160

తే॥ ద్వాపరయుగంబునందు మాతండ్రి నన్ను
బ్రహ్మసమ్మితమైన శ్రీభాగవతము
భక్తిఁ జదివించినది మోక్షపదవిఁ గోరు
నీకు వినుపింతు నంతయు నృపవరేణ్య॥ 161

వ॥ హరినామస్మరణంబు ముహూర్తంబునైనను మోక్షంబొసంగఁజాలు నది యెట్లంటేని, 162

## ఖట్వాంగుడు మోక్ష మందినప్రకారము

మ॥ విను ఖట్వాంగుఁ డనఁగఁ దొల్లి యొక యుర్వీభర్త, రక్షశ్చమూ
హననప్రీణితుఁడైన వజ్రి, వరదానాశక్తుఁడై యున్నచో,
దనయాయుఃపరిశేష మెల్ల నడుగం దర్కించి యా యింద్రుడో
ఘనశౌర్యా! ఘటికాద్వయం బె, యని సత్కారుణ్యతం దెల్పినన్॥163

ఉ॥ ఆ నృపశేఖరుం డతిరయంబున ధాత్రికి వచ్చి, విప్రులన్
దీనుల దానమానములఁ దృప్తులఁ జేసి, విరక్తుఁడై, పర
ధ్యానము మాని, భక్తిమెయి నంతిమకాలములోన విష్ణు ల
క్ష్మీనిధి సంస్మరించి, పలవిల్లుచు మోక్షముఁ జెందె భూవరా॥ 164

కం॥ విడువక దివసము పేడగు
నెడ యున్నది నీకు మోక్ష మింతటిలోనన్
బడయుట యరుదే మది నే
ర్పడునిష్ఠన్ విష్ణుభక్తిఁ బరగితి వేనిన్॥ 165

ధా ర ణా యో గ ల క్ష ణ ము

సీ॥ ఎవ్వడైన నిజాంత మెఱిఁగినయప్పుడ
ధారణాయోగంబుఁ దాల్పవలయు,
ధారణ యనగఁ జిత్తమున విశ్వాత్మకుం
డగు హరిం దలఁచుచు నంఘ్రిచేతఁ
జాల మూలాధారచక్రంబుఁ బీడించి
ప్రాణంబుఁ బొక్కిటిపదముఁ జేర్చి,
మెయ్యన హృదయంబు నురమునఁ గంఠంబు
దాటించి భ్రూయుగాంతరముఁ జేర్చి;
తే॥ కర్ణనాసికావక్త్రాక్షిగతులు మాసి
ప్రాణ మలయించి బ్రహ్మరంధ్రంబు చించి
వెలుపరించుచు బ్రహ్మంబు కలియు టందు
రట్టి బ్రహ్మం బనంగ నారాయణుండు॥ 166

కం॥ నారాయణుఁ డఖిలజగ
త్కారణభూతుఁడు తదంఘ్రికమలోపాస్తి

ప్రారంభంబునఁ గోర్కులు
నెరుపుత్రో[1] ంపడించు నృపకులతిలకా॥ 167

వ॥ అనుటయుఁ బరీక్షిత్తు శుకయోగి కిట్లనియె. 168

కం॥ హరి విష్ణుం డీ భువనాం
తరముల నెట్లుండు నతనిదలఁపుల దాసో
త్కర మేవిధమున నిలుపుం
బరాశరాన్వయపవిత్ర భవ్యచరిత్రా॥ 169

వ॥ అనుటయు శుకయోగి యిట్లను నరేంద్రా! యీ
యర్థంబె తొల్లి లక్ష్మీపతివలన విని చతుర్ముఖుండు తన్నడిగిన నార
దునకునానతిచ్చెఁ దత్ప్రకారంబు వినుము. నారదునకుఁ జతుర్ముఖుం
డిట్లనియె. 170

కం॥ నారద! నీవడిగిన చి
త్సారరహస్యక్రమంబు సకలంబును జిం
తారూఢం బగునట్టుగ
నారాయణుఁ డమరఁ దెలిపె నాకుం గరుణన్॥ 171

## భ గ వ ద వ తా ర క థ న ము

వ॥ విను మద్దేవునికి భూర్భువస్స్వరాద్యుపరిలోకంబు లేడును
మీఁదటిదేహంబును, నతలవితలాద్యధోలోకంబులేడును క్రిందటిశరీరంబు
నై యుండు నదియెట్లనిన, భూలోకంబు కటిప్రదేశంబు, భువర్లోకంబు
నాభియు, స్వర్లోకంబు హృదయంబు, మహర్లోకంబు వక్షంబు, జన
లోకంబు కంఠంబు, తపోలోకంబు లలాటంబు, సత్యలోకంబు శిరం,
బతలంబు జఘనంబు, వితలంబు తొడలు, సుతలంబు జానువులు, తలా

1. నందడీవె.

తలంబు జంఘలు, మహాతలంబు గుల్ఫంబులు, రసాతలంబు పాదంబులు, పాతాళంబు పాదతలంబు, సకలచరాచరంబులకుఁ బుండరీకాక్షుని దేహంబు సంభవస్థానంబు. అతఁడే మదీయజన్మకారణంబు, నావలన రుద్రుండు, నీవును, నవప్రజాపతులును, సనకాదియోగీంద్రులును, నమర విద్యాధరాదులును నుదయించి రా సమయంబున, 172

సీ॥ ఇట్టిజగంబున కీశుఁడై పరమేశు
హరిఁగూర్చి మఖము సేయంగఁ దలఁచి
యజ్ఞోపకరణంబు లరసి కానగలేక
తదుచితద్రవ్యభూతంబు, మంత్ర
తంత్రాదికములు జిత్తమున నవ్విభునిగాఁ
జింతించి యత్యంతచిత్రసరణి
నతిభక్తి మానసయజ్ఞంబుఁ జేసితి
నతఁడును నాకుఁ బ్రీతాత్ముఁ డయ్యె

తే॥ నదియుమొదలుగ నను జూచి యాదరమున
మునులు నింద్రాదివిబుధులు మనుజవరులు
నమ్మహాత్మునిగూర్చి సేయంగఁ బూని
రాగమోదితవృత్తిచే నధ్వరములు॥ 173

వ॥ ఇట్టి జగన్మయుండైన శ్రీకాంతునిఁ బ్రాజ్ఞులు ధారణాయోగ సమయంబున హృదయంబున నిలుపువిధంబు వినుము. మణిమయోజ్జ్వల కిరీటుండు నూర్ధ్వపుండ్రవిరాజమానలలాటుండును, ఆకర్ణనాసాయతనేత్ర పుండరీకశస్యుండును, మందహాసభాసురాస్యుండును, మకరకుండలమరీచి ధళద్ధళాయమానగళస్థలుండును, నిరుపమశ్మశ్రుకలాపోజ్జ్వలుండును, గంఠ కంబుమనోహరితారహార వ్రజుండును, శంఖచక్రగదా పద్మవిరాజమాన చతుర్భుజుండును, శ్రీవత్సకౌస్తుభవైజయంతీభూషితభుజాంతరుండును,

విధిసూతిగృహాంబుజ నాభిజలాకరుండును, బీతాంబరకృతనయనానందుం డును, మంజీరరంజితచరణారవిందుండును, లావణ్యయౌవనాదిగుణోద్దా ముండును, సజలజలధరశ్యాముండును, నగు శ్రీమన్నారాయణునిధ్యాన ప్రవాహంబున భజియింపవలయు; నేతాదృశధ్యానతత్పరుండగు భాగ వతుండు భగవత్కృపాకటాక్షవీక్షితుండై యర్చిరహరాది మార్గంబువట్టి తత్తదనేకస్థానాభిమాన దేవతాపూజ్యమానుండగుచు భానుమండలంబు భేదించి, చంద్రాద్యారాధితుండై బ్రహ్మాండంబును బృథివ్యాదిదశోత్త రావరణంబుల నతిక్రమించి యవ్యక్తంబు గడచి విరజానది నుత్తరించి బ్రహ్మాలంకారభూషితుండగుచు వైకుంఠపురంబు ప్రవేశించి భగవంతు నకు నానావిధకైంకర్యంబు లొనర్చుచుం బరమానందంబునం బునరా వృత్తిరహితుండై యుండునద్దేవుం డజుం డనంతుండు, పురాణపురుషుండు పురుషోత్తముండు; తత్ప్రభావం బవాఙ్మనసగోచరంబు. 174

కం॥ దుర్మదసంహారణంబును,
ధర్మస్థాపనము గోరి ధరణీధరుఁ డం
తర్మహిమోన్నతకరుణా
నిర్మలమతి యుగయుగమున నెమ్మి జనించున్॥ 175

తే॥ అనుటయును నోపితామహ! యాదరమున
దెలిపి తఖిలంబు హరి ధరిత్రీతలమున
నెన్నియవతారములఁ దాల్చె నేమి సేసె
ననిన నమ్మునికిట్లను నబ్జభవుఁడు॥ 176

ఉ॥ నారద! యేఁ జతుర్ముఖుఁడనై పుణ్యవంతుఁడనయ్యు విష్ణుఁ డి
ద్ధారుణిఁ దాల్చినట్టి యవతారము లెన్న నశక్తుఁడన్ మనో
హారివిశిష్టతేజము లనంతము లార్యనుతంబులున్ గుణో
ద్ధారకముల్ తదీయవిహృతంబులు సత్యము గల్గియుండుటన్॥ 177

వ॥ ఐనను నే నెఱింగినభంగిఁ బ్రధానావతారంబులు వివరించెద నాకర్ణింపుము. 178

శా॥ ఆది న్మేదిని నేలఁ జుట్టుకొని హేమాక్షుండు నా నొక్క క్ర
వ్యాదుం డుద్ధతుఁడై రసాతలము డాయం దూర విష్ణుండు దా
భూదారాకృతిఁ బూని యద్దనుజు నేర్పు ల్మాపె వేల్పుల్ గడుం
మోదింపన్ మును నిల్చునట్లు నిలిపెన్ భూమండలిన్ నేర్పునన్ ॥179

సీ॥ సిద్ధార్థుఁడైన రుచిప్రజాపతికి స్వా
యంభువమనుపుత్త్రియైన యట్టి
యాకూతికిని బుట్టినట్టి చిత్రచరిత్రుఁ
డనఘాశయుండు యజ్ఞాహ్వయుండు
తనభార్యయైనట్టి దక్షిణాసతియందు
సుయమాఖ్యవిబుధుల సుతుల గాంచె
ధర్మార్థియగుచుఁ దాత్పర్యంబు విలసిల్లు
నింద్రత్వమున జగం బెల్ల నేలె
తే॥ నతనిమాతామహుండు స్వాయంభువుండు
భవ్యుఁ డితఁడె హరి యని పలికెఁ దెలిసి
యట్లు గావున వినుము సుయజ్ఞవిభుని
యంబుజాక్షునియవతార మండ్రు బుధులు॥ 180

చం॥ అమలవివేకశాలి కపిలాహ్వయుఁడై జననంబునొందెఁ, గ
ర్దమునకు దేవహూతికిని దామరసాక్షుఁడు తన్మునీశ్వరుం
డమితమనీష సాంఖ్యమగు నాగమ మొప్పఁగఁ జేసి తల్లికిన్
శమ మొదవించి మోక్షపద సంగతిఁ జేసె నుతావతారుఁడై॥ 181

సీ॥ తనయార్థియై యత్రి మును దపోనియమంబుఁ
బూనిన దా మెచ్చి యేను నీకు
ననఘ! దత్తుఁడ నైతి ననినట్టికతన, ద
త్తాత్రేయుఁ డనుపేర నతిశయిల్లి
విష్ణుఁడ, భువి బ్రభవించెఁ దత్ప్రసా
జీవను ల్గడు భక్తి సేవసేసి
కార్తవీర్యార్జునక్ష్మాతలాధీశుండు
వేయిబాహులవులచే వినుతి కెక్కె
తే॥ మఱియు జంభాదిరాక్షసమహిమ లణఁచి
యమ్మునీంద్రుఁడు వజ్రి కాహ్లాద మొసఁగె
నన, నలర్కాదులకు యోగ మలరఁ దెలిపెఁ
దన్మహాత్త్వంబు మిగుల చిత్రము మునీంద్ర! ॥ 182

వ॥ మఱియును,

## బ్రహ్మ తపంబు సేయుట

సీ॥ కల్పాదియం దేను గణకఁ దపంబు సే
యంగఁ బూనుచు నన యనుచు బలుకు
విను మది హేతువై సనకసనందన
సనకాత్మజసనత్సుజాతమహిత
నామము ల్వెలయు మన్మానసంబునఁ బూని
జలజనాభుఁడు కృపాసహితుఁ డగుచు
జనియించె నల్వు రయ్యును వార లొక్కటి
యై చరించిరి భువనాంతరముల
తే॥ ననమమోక్షప్రదాయకంబగునివృత్తి
ధర్మశాస్త్రంబు నిల్పిరి ధర్మబుద్ధి

బ్రహ్మచర్యంబుచే లోకపావనత్వ
మంది రరిది తదీయమాహాత్మ్య మనఘ ! ॥

వ॥ మఱియును,

సీ॥ దక్షప్రజేశనందనియైన మూర్తికి
ధర్మునకును జక్రి తానె నరుఁడు
నారాయణుండు ననంగ సంభవ మొందె
బదరికాశ్రమభూమి నుదితనిష్ఠఁ
దపము సేయఁగ మహేంద్రప్రేరితామర
జనము తపోవిఘ్నజననకాంక్ష
నరు చెంచుటయుఁ జూచి యందు నారాయణుఁ
డూరుపుత్రిఁ గల్పించె నూరుసీమ

తే॥ నదియు నూర్వశి యనుపేర ననమరూప
యగుచు నప్పుడే నిర్జించె నప్సరసల
[1](ననమసాహాస) ఘనుల సహస్రకవచ
ముఖ్యదనుజుల గప్పి రమ్మునులు గడిమి॥

మ॥ వనజాతేక్షాంశమునం ధ్రువుండు నుతభావవ్యక్తుఁ డుత్తా
దునకుం బుత్రత నొంది ఘోరతపముం దుర్వారత
[2](దనువొప్పంగ భృగు) ముఖ్యదిక్స్య మునిసార్థంబున్నం
దను సప్తర్షులమీఁదనొప్పెడు ధ్రువస్థానంబు గాంచెం

సీ॥ వేనున కాత్మజుండై నలినాక్షుండు
పృథునామకుండయి పృథులకీర్తి
భూసుర శప్తుఁడై పున్నరకంబున
నున్నట్టి తనతండ్రి నుద్ధరించె

1. (.........) 2. (.........)

పృథివి ధేనువుఁ జేసి ప్రథితుఁడైన మనువు
వత్సంబుఁ జేసి దేవతలు పొగడ
బహులతరౌషధీప్రముఖవస్తుశ్రేణిఁ
బిదికి లోకములకుఁ బ్రియమొనర్చె

తే॥ మున్ను నిమ్నోన్నతాకృతి నున్నయట్టి
ధరణి భుజసత్త్వమున సమస్థలిగఁ జేసి
నట్లు జగదుపకారార్థమైన యట్టి
తత్ప్రకారంబు మిగుల చిత్రము మునీంద్ర ! ॥ 186

చం॥ నరనుత ! మేరుదేవికిని నాభికి నార్యులు సన్నుతింపఁగా
హరి వృషభావతారమున నర్థి జనించి జడస్వభావుఁడై
పరిచితశాంతియుక్తి మునిభావములన్ ముదమందఁ జేయుచున్
ధర జనియించె దత్క్రమ ముదారతపంబు దలంచి చూడఁగన్ ॥ 187

తే॥ శరధిలో మీనమూర్తియై ధరణిధరుఁడు
వేదముల నుద్ధరించి యత్యాదరమున
ఘనుఁడు సత్యవ్రతుఁడు తన్నుఁ గాంచి కొలువఁ
జెలఁగె నా కథ లోకప్రసిద్ధతరము॥ 188

కం॥ త్రిదశులు దైత్యులు గూడుక
యుదధి సుధార్థంబు ద్రచ్చుచుండఁగ భారా
స్పదతం గ్రుంగెడునద్రికిఁ
గుదురయ్యెం జక్రధరుఁడు కూర్మాకృతియై॥ 189

ఉ॥ ఆ వినుతాస్మదాచరితయజ్ఞమునందు జనించుచున్ హయ
గ్రీవసమాఖ్యఁ జక్రి కృతకృత్యత మించె సువర్ణవర్ణుఁడున్
బావనయజ్ఞమూర్తియగు భవ్యతరాంగుఁడునై తదీయ సం
భావితదీర్ఘనిశ్వసితపంక్తులె వేదము లయ్యె నయ్యెడన్ ॥ 190

మ॥ హరి సర్వంబున నున్నవాఁడనుచుఁ బ్రహ్లాదుండు భాషింప మ
త్సరసంబాధితచిత్తుఁడై నిజసభాస్తంభంబు సం దవ్విధం
బరయం గోరిన యాహిరణ్యకశిపుల్ వ్యగ్రాత్ముఁ [1]ద త్తస్తంభముల్
నరసింహాకృతి నమ్మహీశునివడిన్ వ్రమందించెఁ జిత్రంబుగన్॥ 191

తే॥ గ్రాహపీడితమయి జలాకరములోన
విశ్వపతి ! కావవే యని వేడుకొనిన
దంతివరునకు నతికృతార్థత నొసంగి
యాదిమూలావతారాఖ్య నలరెఁ జక్రి॥ 192

కం॥ చతురత వామనుఁడై బలి
హృతమగు రాజ్యంబు మఱల నిచ్చెం గ్రతుభు
క్పతికిన్ హరి తత్స్వాదో
ర్థితనది తద్వైభవంబు దెలిపెడు నెందున్॥ 193

సీ॥ హంసావతారుఁడై యతఁడె భాగవతమ
హాపురాణంబున కర్థిఁ దెలిపె
మన్వవతారుఁడై మహిమచే దుష్టుల
దండించి కీర్తులు ధాత్రి నిలిపె
నబ్ధి ధన్వంతరియై జనియించి యా
యుర్వేద మనువొంద నిర్వహించెఁ
బరశురామాఖ్యచేఁ బరగఁ గోపాగ్నికి
[2](నెఱఁగ సేసెను హైహయయకులము),
తే॥ దాశరథియయి రావణదర్పవిభజ
.........................
.........................
బుద్ధుఁడై ... పురమఁలఫాడవడంచె॥ 194

1. దత్స్తంభ. 2. నైజసేసె హైహయే యాదికులము.

వ॥ మఱియుం గల్క్యవతారంబున నిఖిలసంహారణంబు సేసె. ఇందుఁ గొన్ని యవతారంబు లైనవి. కొన్ని కావలయు నిప్పుడు ధన్వంతరియైన హరి పరశురామావతారంబున నున్నవాఁడు. ఇక మీఁదట రామచంద్రాద్యవతారంబులవధ(త)రింపంగలవాఁ డని లీలావృత్తాంతంబు లనంతంబులు లెక్కింప శక్యంబగునే యని నారదునకుఁ బితామహుండు సెప్పినక్రమంబు శుకయోగీంద్రుండు వర్ణించుటయు నాకర్ణించి పరీక్షిత్తుం డతని వీక్షించి, 195

ఉ॥ యోగిశశాంక ! విష్ణునుతి యోగ్యపరంబగు నీసముల్లస
ద్వాగమృతంబుచేఁ బ్రమదవారిధిఁ దేలెడు నామనంబు, స
ర్వాగమసారముం దెలియు నాస్థ సహించుటఁజేసి తృప్తి సం
యోగము నొంద దించుకయు నుత్సవ మద్భుతలీల నుబ్బుటన్॥ 196

వ॥ అవధరింపుము. శుద్ధుండైన జీవునకు శరీరసంగం బెబ్భంగిఁ గలుగు ; దేహాంతర్వర్తియైన జీవునకు నేక్రమంబున ముక్తి సంభవించు ; విరాట్పురుషునివలనం బ్రపంచం బెట్లు జనియించె; నేతత్ప్రకారంబులను, హరివిజయంబులును, నతండు భక్తజనోద్ధరణంబు సేసిన తెఱంగులును, గర్మవాసనావిధంబులును, నానతిమ్మని ప్రార్థించుటయుం బరీక్షిత్తునకు శుకుం డిట్లనియె. 197

తే॥ జీవునకు దేహసంబంధసిద్ధి యెపుడు
నీశ్వరునిమాయ నగునని యెఱుఁగు మధిప
అతని కయ్యీశ్వరునియందె యత్న మలర
భక్తి నిల్పి తత్కృపఁజేసి ముక్తి గలుగు॥ 198

వ॥ ఈ యర్థంబునకు నొక్క యితిహాసంబు గలదు వినుము. 199

## హరి బ్రహ్మకు ప్రత్యక్షమగుట

సీ॥ ధాత కల్పాది నాత్మప్రయాసన మహా
సరసిజమూలంబు నరయఁ గోరి
జలములం గ్రుమ్మరి తెలియక యలసి, పూ
ర్వపుఁ దమ్మిలోనికి వచ్చియున్న
యంతలోఁ దప తప యనుమాట యాకస్మి
కము వినంబడ నద్భుతము వహించి
తపము సేయు మటంచుఁ దన కది బుద్ధి సె
ప్పుటగాగ నాత్మలోఁ బోలఁ జూచి
తే॥ జ్ఞానకర్మేంద్రియవ్యాప్తి మానఁ జేసి
మానసము నిశ్చలముగా నమర్చి వేయు
దివ్యవర్షముల్ దప మతిధృతి నొనర్ప
నతనికిని హరి మెచ్చి ప్రత్యక్ష మయ్యె॥ 200

వ॥ అప్పుడు,

కం॥ మున్నుగఁ జతురాననుఁ డతి
సన్నుతతేజోమయంబు సౌఖ్యకళాసం
పన్నిలయము నగు సకలా
భ్యున్నతవైకుంఠనామపురముఁ గనియెన్॥ 201

వ॥ కనుంగొని,

మ॥ సిరులన్మించిన యప్పురంబునడుమన్ జిత్రస్ఫురన్మంటపాం
తరసీమ న్ఫణిరాజశయ్యపయి నుద్యద్దీప్తిమత్కుండలా
భరణుండై చెలువొందువానిఁ గరుణాభవ్యున్ నిజా[1](వాస)పు
ష్కరవన్నాభి ననంతు నచ్యుతుని హర్షంబొప్ప వీక్షించుచున్॥ 202

1. దాన.

## హరి బ్రహ్మ సంవాదము

కం॥ పులకాంకురారంబులు మైఁ
గలయఁగ మొలవంగ నలికఁ గలితాంజలియై
పలు తెఱఁగుల వినుతించిన
జలజాక్షుఁ డతనిఁ బలికెఁ జయ్యనఁ గృపతోన్॥ 203

తే॥ నన్ను నీ విట్లు చూచుట నాదుకరుణ
గాదె, నీదు తపశ్శక్తి గాదు, ద్రుహిణ!
తపములను నెల్ల నాయందు తథ్యమైన
భక్తిసారాంశ మది యగు ముక్తిదంబు॥ 204

కం॥ పరమేష్ఠి! నీవు గోరిన
వర మిచ్చెద నడుగు మనుడు వనజాసనుఁడున్
పరమపురుషునకు వినయా
దరసతచతురాస్యుఁ డగుచుఁ దా నిట్లనియెన్॥ 205

సీ॥ దేవ! భవత్పాదసేవ గల్గినమీఁద
నాశాస్యమగు వరం బన్య మెద్ది
యీవిశ్వ మంతయు నీవని యంతట
గలిగించు మార్గంబుఁ దెలుపు మనుడు
నద్దేవుఁ డతని కిట్లను మత్స్వరూప రూ
పగుణవిభూతులు పద్మగర్భ
మత్ప్రసాదమునను గ్రమంబునఁ దెలిసెద
వీ వాదియగురూప మెల్ల నేన

తే॥ విశ్వమం దేను నాయందు విశ్వముండు
విశ్వ మణగించి యే నేకవృత్తి నుందు
ననుచు నంతర్హితుండయ్యె నచ్యుతుండు
పద్మగర్భుండు నిజకార్యపరత నొందె॥ 206

వ॥ కావున భగవద్భక్తి ముక్తిసాధనంబు. 207

## బ్రహ్మనారద సంవాదము — దశలక్షణ వివరణము

తే॥ మఱియు నొకనాడు నారదమౌని వేడ్క-
నఱసి కడ కేఁగి నీవు నన్నడిగినట్లు
ప్రశ్నములు గొన్ని జేసినఁ బద్మగర్భుఁ
డతనియార్జవ మంతయు నాత్మఁ బొగడి॥ 208

వ॥ భగవంతుండైన హరి దనకు మున్ను చతుశ్శ్లోకంబుల దశలక్షణలక్షితంబుగా సంకుచితమార్గంబున నుపదేశించిన శ్రీ మహాభాగవతంబు వివరించె; నమ్మౌనియు సరస్వతీనదీతీరంబున వేదవ్యాస భట్టారకునకుం దద్రహస్యం బెఱింగించె; నతండు నాకుం దెలిపె నమ్మహాభాగవతం బుపన్యసించెద నాకర్ణింపుము; దశలక్షణంబు లెవ్వి యనిన సర్గంబును, నిసర్గంబును, స్థానంబును, బోషణంబును, ఊతులును, మన్వంతరంబులును, ఈశానుచరిత్రంబులును, విరోధంబును, ముక్తియు, నాశ్రయంబు ననంబడు నందు దశమంబగు నాశ్రయంబు దెలుపుకొఱకుఁ దక్కంగల తొమ్మిదియు వివరింపబడుఁ, దల్లక్షణంబు వినుము; ప్రకృతి మహదహంకారాదులు భగవంతునియం దుదయించుట సర్గంబు, విరాట్పురుషునివలన హిరణ్యగర్భుండు జనియించి చరాచరభూతజాలంబు నిర్మించుట నిసర్గంబు, హరివిజయంబు స్థానంబు, చక్రి భక్తజనోద్ధరణంబు సేయుట పోషణంబు, కర్మవాసనాదినిరూపణంబు లూతులు, మనుచరిత్రంబులు మన్వంతరంబులు, దశావతారాదికథావిస్తారంబు లీశానుకథలు, జగంబు లుపసంహరించి నారాయణుండు యోగనిద్ర నొందుట విరోధంబు, జీవుండు భగవత్కృపావిశేషంబున మోక్షంబు నొందుట ముక్తి, యుత్పత్తిస్థితిలయంబులకుఁ గారణం బగునది యాశ్రయంబు ననం బరగుచుండు. 209

కం॥ హరియందు జగము లొదవును
హరియం దభివృద్ధి నొందు హరియం దణఁగున్
హరి నెఱిఁగిన సకలంబును
ధరణీవరతిలక యవగతం బై యుండున్॥ 210

కం॥ ఈయర్థమె విదురుఁడు మై
త్రేయుని మున్నడిగె నతఁడు దెలిపె ననం, బ్ర
జ్ఞాయుతుఁడు పరీక్షిన్నృపుఁ
డా యోగీంద్రులక్రమంబు నంతయు నడిగెన్ ॥ 211

వ॥ అని యిట్లు సూతుండు సెప్పిన, శౌనకాదిమహామునులు మహాత్మా ! సమనంతరకథావృత్తాంతం బేమి యయ్యె నానతీయవే యని యడుగుటయును, 212

శా॥ గంభీరత్వసముద్ర ముద్ర వరభోగన్యక్కృతప్రస్ఫుర
జ్జంభారాతివిహార హారవసుధాశాంతాహితక్రామితా !
అంభోదేశవిశేష శేషకమఠాహార్యేభసంస్తుత్యదోః
స్తంభస్థాపితగోత్రగోత్రమహిమాధాయిప్రభావోన్నతా ! 213

కం॥ అతులితసింహాసన గ
ద్రితయమహాస్థాననిశితధీగుణయుత, వి
శ్రుతవిద్వత్కవిజన జ
ల్పితనానావర్ణ మండలీకరగండా ! ॥ 214

ఉత్సాహ॥ పండితాంబుజాతమిత్రభయదజన్యమేదినీ
ఖండితాహితప్రకాండకాండమండలీజితా
ఖండలప్రశస్తశస్త్రఘనతరానుభావ ! యు
ద్దండరాయహృదయభల్లదానకల్పభూరుహా॥ 215

గద్య॥ ఇది శ్రీమదష్టభాషాకవిమిత్ర నాగయమంత్రిపుత్ర సాహిత్యమార్గ నిశ్శంక దోనూరిపదాంక వినయలక్ష్మీసనాథ కోనేరునాథప్రణీతం బైన బాలభాగవతంబను మహాప్రబంధంబునందుఁ గథానుక్రమణికయు, శౌనకాదిమునిప్రశ్నంబును, సూతుం డవతారసూచనంబు సేయుటయును, నారదాఖ్యానంబును, భాగవతపురాణనిర్మాణప్రకారంబును, నశ్వత్థామపరిభవంబును, భీష్మనిర్యాణంబును, ధర్మనందను రాజ్యాభిషేకంబును, గృష్ణుని ద్వారకాగమనంబును, బరీక్షిత్తుజననంబును, ధృతరాష్ట్ర నిర్గమంబును, గృష్ణావతారవిసర్జనంబును, బాండవమహాప్రస్థానంబును, బరీక్షిద్దిగ్విజయంబును, గలిగర్వాపహరణంబును, శృంగిశాపంబును, బరీక్షిత్తుప్రాయోపవేశంబును, శుకయోగిసందర్శనంబును, బరీక్షిత్తుప్రశ్నంబును, ఖట్వాంగమోక్షప్రకారంబును, ధారణాయోగలక్షణంబును, భగవదవతారకథనంబును, బ్రహ్మతపశ్చరణంబును, హరిదర్శనంబును, హరిబ్రహ్మసంవాదంబును, బ్రహ్మనారదసంవాదంబును, దశలక్షణవివరణంబును, నను ప్రథమ ద్వితీయస్కంధకథావిశేషంబులుగల ప్రథమాశ్వాసము సంపూర్ణము. 216



## బాలభాగవతము

### ద్వితీయాశ్వాసము



కం॥ శ్రీమత్పాండవకులజ
స్థేమావహరామరాజు తిమ్మనృపాలో
ద్దామ తపఃఫలగుణ లీ
లామహిమ నివేశ తిరుమలక్షోణీశా॥ 1

వ॥ ఆకర్ణింపుము. పుణ్యకథాశ్రవణసమగ్రహర్షులగు శౌనకాది మహర్షులకు హరినామస్మరణ రోమహర్షణియగు రౌమహర్షణి యిట్లను; నట్లు ప్రాయోపవేశవ్రతశీలుండైన పరీక్షిన్నరపాలునకు నాగర్భవైష్ణవ ధర్మానురాగియగు శుకయోగి యిట్లనియె. 2

### విదురుఁడు తీర్థయాత్ర కరుగుట

సీ॥ ధృతరాష్ట్రసుతుఁడు దుర్మతుఁడు సుయోధనుం
డప్పాండుసుతుల రాజ్యంబు ధనము
మిన్నక దుర్ద్యూత మిషమునఁ గైకొని
వెడలఁగొట్టుటయు నవ్వీరవరులు
ద్వాదశాబ్దంబులు వనవాసులై యొక
వత్సరం బజ్ఞాతవాసు లగుచు
చనుదెంచి తమకు రాజ్యంబు నీఁజాలక
కురుభర్త సమరంబుఁ గోరుకొటఁగి
తే॥ యుద్ధసన్నద్ధులగునంత నుభయపక్ష
ములకు హితకాంక్షియై కృష్ణుఁ డలఘుయశుఁడు
రాయబారియై హాస్తిపురంబు కేఁగి
వృద్ధజనపతితోఁ జెప్పె విశదసరణి॥ 3

ఉ॥ ధర్మతనూజుపాలిమహిం దప్పక యిప్పు డొసంగుఁ డెంతయున్
[1](ధర్మువు) కాక లోభగతిఁ దద్విపరీతత యాచరించినన్
దుర్మదులైన నీ సుతులఁ ద్రుంతురు నిక్కము పాండుపుత్రు లా
మర్మ మెఱింగి త్రిప్పుము సమంబుగ వారల నీ కుమారులన్॥ 4

ఆ॥ అనుచుఁ బలుకునంత నచటికి నరుదెంచి
యవ్విధమునఁ బలుకు నట్టి విదురుఁ
గని సుయోధనుండు కనలి దాసీపుత్రు
నధము వెడల నడపుఁడనుచుఁ బలికె॥ 5

కం॥ పలుకుటయు విదురుఁ డయ్యెడ
దలవంచుక లేచి లజ్జితంబున శస్త్రం
బులు విడిచి తీర్థయాత్రా
కలనోన్ముఖుఁ డగుచు నరిగెఁ గాననమునకున్॥ 6

సీ॥ ఇవ్విధంబునఁ గాన కేఁగి యవ్విదురుండు
నీరపర్ణానిలాహారుఁ డగుచు
నవధూతవేషుఁడై వివిధ తీర్థముల నా
నందింపుచుఁ బ్రభాసనామ తీర్థ
మున కేఁగు తెరువున జననుతులగు పాండు
సుతులచేఁ గౌరవప్రతతి యెల్ల
పొలియుట విని మోదఁ బొక్కి సరస్వతీ
జలపూరమునఁ గృతస్నానుఁ డగుచు

తే॥ మత్స్యకురు జాంగలాదికమహితదేశ
ములను బుణ్యనదీదేవనిలయములను
గడచి పోవుచు యమునాపగాతటమున
నుద్ధవుని విష్ణుభక్తిప్రసిద్ధుఁ గాంచి॥ 7

1. ధర్మవు.

విదురోద్ధవసంవాదము

సీ॥ ఉగ్రసేనుఁడు సాహసోగ్రసేనుఁడు ప్రజా
యుతముగా ముదముతో నున్నవాఁడె
శూరుఁడు రిపుజయశూరుఁడు సజ్జనా
క్రూరు డక్రూరుఁడు కుశలనిధిఁ బె
బలభద్రునకు మహాప్రాభవోన్నతభుజా
బలభద్రునకుఁ జాల భద్రమగునె
ప్రద్యుమ్నునకు బహు ప్రద్యుమ్ననకును సత్
కృతవర్మ కృతవర్మ కైన సుఖంబె
తే॥ సాంబునకు సాంబునకు మే ననామయంబె
కలిత విజయుఁడే దుష్టభంగదుఁడు గదుఁడు
నిత్యసాత్యకి సాత్యకి నిర్వృతుండె
సహితుఁడే సారణుఁడు సత్ప్రసారణుండు॥ 8

కం॥ దేవప్రార్థితుఁడగు హరిఁ
బ్రావీణ్యముతోడఁ గనిన భాగ్యసమేతుల్
దేవకియును వసుదేవుఁడు
నావిర్భూత ప్రమోదు లగుదురె యధిపా॥ 9

స్రగ్ధర: జిష్ణుండు ద్వ ద్దయాభూషితుఁడు కలుషవిచ్ఛేది యంతర్మనోరో
చిష్ణుం డాభీరనారీ శితనిశిత శరక్షిప్తరక్షుండు సాక్షాత్
విష్ణుం డా బాల్యలీలా విఘటిత ధరణీ విశ్వభారుండు శ్రీమత్
కృష్ణుండధ్యాత్మవిద్యా కృతమతి వితత క్షేముఁడై యున్నవాఁడే॥ 10

వ॥ అని యువ్విధంబున, —11

కం॥ విదురుండును దగఁ గృష్ణా
భ్యుదయుం డగుటయును వినుచు నుద్ధవుఁడు మదిన్
గదిరెడు శోకంబున గ
ద్గదిక వచోరచనఁ దగులఁగా నిట్లనియెన్॥ 12

శా॥ శ్రీకాంతుండజుఁ డవ్యయుండనఘ నచ్ఛిన్నాత్ముఁడై యుండియున్
లోక ద్రోహుల నుక్కడంచుటకు భూలోకంబు మీఁద న్మను
ష్యాకారంబు వహించి మించి కృత కృత్య[1](త్వంబు) నేకొన్న యా
శ్రీకృష్ణుండు నిజాస్పదంబునకు వేంచేసెన్ విచిత్రంబుగన్॥ 13

సీ॥ అమరసంప్రార్థితుండై హరి, దేవకీ
వసుదేవులకు సంభవంబు నొందె
నందవ్రజమున నానందవిహారియై
పూతనాదర్పవిస్ఫూర్తి నణఁచె
శకట తృణావర్త బకదైత్యుల హరించి
కంసుని విగత ప్రాణుఁ జేసె
మురనరకాదులఁ బరిమార్చి శిశుపాల
దంతవక్త్రాఖ్యుల దండి చెఱచె
తే॥ నసమసుఖవార్ధిలోఁ బదియాఱువేలు
యువతులను దేల్చె నిత్యభోగోత్సవములఁ
బార్థునకు సూతుఁడై కురుప్రతతిఁ ద్రుంచె
గృష్ణుఁడన మించె భవవీత తృష్ణుఁ డనఘ॥ 14

కం॥ ఎవ్వని మాయకు విధిహరు
లవ్వల యెఱుఁగంగనేర రట్టి [2](మహాత్ముం)
డివ్వసుధఁ దిరుగు చరితం
బెవ్వఁడు సామర్థ్యవంతుఁ డిదమిత్థమనన్॥ 15

1. త్వంబు నే. 2. (.........)డి.

కం॥ నగధరుఁ డగణిత కరుణన్
జగతీభారంబు మాన్పఁ జనుదెంచిన వాఁ
డగుటన్ యదువుల నెల్లన్
దెగువం దెగఁ జిత్తగించె ధీరవిచారా॥ 16

వ॥ ఆ సమయంబున,

సీ॥ శౌరిజాతర సేయ సమకట్టుటయు యదు
ప్రవరులు సంతోషభరితు లగుచు
యువతీసమేతులై వివిధయానములపై
సమరి ప్రభాస తీర్థమున కేఁగి
యచట మజ్జన భోజనాది కృత్యంబులు
దీర్చి హాలాపాన దృప్తు లగుచు
హర్షరోషవశాత్ములై పరస్పర తాడ
నాకర్షణప్రహారాదివిధుల

తే॥ సమసి రందఱు నంతట శౌరి బదరి
కాశ్రమమునకు నన్ను బొమ్మనుచు ననుపఁ
గొంత దవ్వేను చని సమాక్రాంతచింతఁ
గళవళము పుట్టి మరల వేగమున వచ్చి॥ 16

మ॥ కనుగొంటిన్ హరి జిష్ణుఁ గృష్ణు నొక వృక్షచ్ఛాయఁ గూర్చుండి నే
ర్పున వామాంకముమీఁద దక్షిణపదాంభోజాతమున్నిల్పి, లో
చనపర్వంబగుచున్నవానిఁ, గరుణాసంభావితస్వాంత శో
భన భావంబున నిశ్చలాబ్ధి వగిదిన్ భాసిల్లు పుణ్యాత్మునిన్॥ 17

తే॥ అట్టితఱిఁ దీర్థసేవకై యరుగునట్టి
ఘనుఁడు మైత్రేయుఁ డనియెడు మునివరుండు
శౌరిఁ గనుగొని భక్తితోఁ జేరి నిలిచె
నేను తత్సన్నిధిన యుంటి నీద్యచరిత॥ 18

## విదుర మైత్రేయ సంవాదము

ఉ॥ ఆయెడ మున్ను గాంచి యసురారి ముదంబున నన్ను నిట్లనున్
ధ్యేయునిగా ననుం గని సుధీప్రియ యుద్ధవ క్రొంటిజామునం
బాయత భక్తితో వసువ వయ్యును గొల్చితిగాన నిప్డు ను
ధ్యాయిత గల్గె నీకు నిక నంటవు నిన్ను బునర్భవాఘముల్॥ 19

తే॥ పద్మకల్పంబునం దేను పద్మభవుని
కెఱుంగజెప్పిన పరతత్త్వమెల్ల నీకుఁ
గరుణ వివరింతు ననుచు న ప్పరమపురుషుఁ
డనువుగాఁ దెల్పె మైత్రేయుఁడును వినంగ॥ 20

కం॥ మురజిదుపదిష్టవాక్య
స్మరణము దద్విరహతాపశాంతి యొనర్చన్
ధరఁ దిరుగుచుండి యిత్తఱి
నరుగుచునున్నాఁడ బదరికాశ్రమమునకున్॥ 21

వ॥ అని యుద్ధవుండు కృష్ణుని పరమపదప్రయాణం బెఱింగించిన విదురుండు శోకభిదురవిదళితహృదయుండగుచుఁ గృష్ణనామసంకీర్తన నెట్టకేలకుం జిత్తం బాత్మాయత్తంబుఁ జేసికొని యుద్ధవునిం జూచి మహాత్మా! నీకు నప్పరమపురుషుం డుపదేశించిన దివ్యతత్త్వజ్ఞానంబు నాకుం బ్రసాదించి నన్నుం గృతార్థుం జేయుమనిన, నిది యంతయు సజ్జన విధేయుండగు మైత్రేయుండు నీకుం దెలుపంగలం డని పలికి యుద్ధవుండు బదరికాశ్రమమార్గంబునం జనియె ననుటయు, 22

కం॥ అవినీతివృత్తి నయ్యా
దవులెల్ల న్నమయునట్టితెఱి నమయక యు
ద్ధవుఁ డెట్లు నిలిచెనో యని
యవనీపతి యోగిచంద్రు నడిగిన నతఁడున్॥ 23

తే॥ తాఁ జనినమీఁదఁ దనయట్లు ధరణియందుఁ
దత్త్వమార్గంబుఁ దెలుప నుద్ధవుఁడు శక్తుఁ
డని యతని నచ్యుతుఁడు నిల్పె ననుచుఁ దెల్పె
వినుము తరువాతి వృత్తాంత మనియె నంత॥ 24

కం॥ విదురుఁడు గ్రమ్మఱి యమునా
నది దాఁటి రమేశుకీర్తనంబునఁ జనుచున్
ముదమున గంగాతటమునఁ
బదటున మైత్రేయుఁ గాంచె భక్త్యానతుఁడై॥ 25

తే॥ పలికె నిట్లని యోమహానివర్య నిన్ను
గంటి భవపాశములు వీడుకొంటి నిపుడు
కొన్ని సందేశపదవములు నిన్ను నడుగ
వలసియున్నది యవి నాకుఁ దెలుపు మొనర॥ 26

తే॥ విష్ణుఁ డేరీతిఁ బుట్టించు విశ్వమాది
నేమిటికి నేమి ప్రభవమై యొనఁగుచుండు
నీ ప్రపంచంబు విస్తృతం బెట్లు చేసె
ననుచు నడిగిన మైత్రేయుఁ డతనిఁ బలికె॥ 27

మ॥ అనఘా! కాలుఁడ వీవు మానివరు శాపాసక్తి శూద్రాసుతుం
డనఁ బ్రఖ్యాతి వహించితిట్లు హరిదాస్యం బర్థిఁ జేకొన్న శో
భనచిత్తుండవు నీకు నచ్యుతకథాప్రస్తావముల్ సెప్ప డొ
ప్పు నచింత్యప్రతిభాన, యోవిదుర, యాప్తుల్ దాసు లాచక్రికిన్॥ 28

కం॥ వర్ణించి తొల్లి పెద్దలు
నిర్ణితముఁ జేసినారు నిఖిలము నది నీ
కర్ణామృతమయ్యెడు నా
కర్ణింపుము విశదలీలఁ గథన మొనర్తున్॥ 29

## జ గ దు త్ప త్తి ల క్ష ణ ము

వ॥ అవహితచిత్తుండ వగుమని చెప్పం దొడంగె. సకలజగదేకభర్త యగు పురుషోత్తముండు తన లోననుండు జగంబుల లీలార్థంబు వెలువరించుటకు దలంచె; దలంచిన యప్పుడ యద్దేవుని యోగమాయ యగు ప్రకృతివలన దమఃప్రధానంబై త్రిగుణాత్మకంబైన యహంకారంబు బుట్టె నదియు వైకారిక, తైజస, భూతాదులను పేళ్ళం బఱంగె నందు భూతాది యగు తామసాహంకారంబువలన శబ్ద స్పర్శ రూపరసగంధంబు లను పంచతన్మాత్ర లుదయించె నందు శబ్దంబాకాశంబు నుత్పాదించె; నాకాశంబు స్పర్శనంబున వాయువుం గలిగించె; వాయువు రూపంబు చేత తేజంబు జనితంబు సేసి తేజంబువలన, రసబలంబువలన జలంబు వొడమె, జలంబు వలన గంధంబు జేసి పృథివి యొదవె; మఱియుఁ దైజసంబును రాజసాహంకారంబువలన శ్రోత్ర త్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులను జ్ఞానేంద్రియంబులేనును నావిర్భవించె, వైకారికంబైన సాత్త్వికాహంకారంబువలన దిక్పాలును, వాయువు నర్కుండును, ప్రచేతసు లుత్పన్నం బయ్యె నప్పుడు, 30

మ॥ తమలో నైక్యము లేక సృష్టి కసమర్థంబైన యా తత్త్వసం
ఘముఁ బ్రార్థించిన విష్ణుఁ డందుఁ గడు వేడ్కన్ని ల్చె నచ్ఛక్తి గ
ర్భము గాఁగల్గిన యా సమాజ మతిచిత్రంబైన తన్మాయచే
నమరం జయ్యెనఁ గోటియోజనమితివ్యాప్తోరుహేమాండమై॥ 31

శా॥ ఆ హేమాండములోన నచ్యుతుఁడు బాహాపాదచక్షుశ్శిర
స్సాహస్రంబులు గల్గి సర్వభువన స్రష్ట్రాశ్రయంబైన యా
దేహంబు న్ధరియించి నట్టి మహిమన్ దీపించు నయ్యండ మి
ట్లాహా పుట్టఁగఁజేయుచున్ బఱఁగె బ్రహ్మాండాహ్వయాఖ్యాతమై॥

వ॥ అట్టి బ్రహ్మాండంబునకు నొండొంటికిఁ [1] (బది)యేసి మడంగు లెక్కుడైన ధరణి సలిలతేజో వాయుగగనాహంకార మహత్తత్త్వంబు

1. బది సేసి.

లసియెడు సప్తావరణంబులు గలిగియుండు నందుఁ బ్రథమావరణం బగు ధరణీతత్త్వంబుఁ గొందఱు పంచాశత్కోటి యోజన విశాలోన్నతం బని యుదహరింతురు. అట్టి యండంబు నారాయణలీలా శయనస్థానతం బ్రవృద్ధంబై యున్న యమ్మహాజలపూర మధ్యంబునం దేలి యాడుచు వేయి దివ్యాబ్దంబులుండె; నంత నవ్విరాట్పురుషుండు నయ్యండ కటహంబు భేదించి సవిస్తారంబుగా నొనర్చియు నావరణసంరక్షకుండై చతుర్దశభువనంబులు గల్పించి తనయందుఁ గానంబడు సకలప్రపంచంబుం జూచుచుండె; నంత నవ్విరాట్పురుషుని ముఖబాహూరుపాదంబులం జాతుర్వర్ణ్యం బుదయించె; నిట్లు బుద్ధిపూర్వకంబును క్షేత్రజ్ఞాధిష్ఠితంబునై తొలుత ప్రాకృతసర్గం బావహిల్లె; నింక నవ్విరాట్పురుషునివలన స్వారాట్టనం బఱఁగు బ్రహ్మదేవుని జననంబును దత్కృత సర్గంబును వివరించెద వినుము. 33

## పద్మసంభవు జన్మప్రకారము — తచ్చరిత్రంబును

సీ॥ జలశాయియైనయా జలజాక్షు మదిలో జ
    గంబుఁ గల్పించు సంకల్ప మొదవు
నంత రజోగుణం బద్దేవునాభి నం
    భోజంబు నొక్కటి మొలవఁ జేసె
నందచ్యుతుండు నిజాంశంబు నిలుపం జ
    తుర్ముఖుఁ డుదయించె ధర్మమయుఁడు
బ్రహ్మనామంబునఁ బఱఁగ నతండు త
    త్కంజమూలము నెఱుగంగఁ గోరి
తే॥ తద్విపుల నాళరంధ్ర పదంబుఁ బట్టి
దివ్య వర్షసహస్రంబు దిరిగి వెదకి
మొదలు గానగలేక యమ్మొదలినెలవు
చేరి చింతాభరాక్రాంతచిత్తుఁ డగుచు॥ 34

శా॥ ఈ నీరంబున కంతమెద్ది కమలం బిం దేగతిం గల్గె, ని
ట్లే నేలాగున నిందుఁ బుట్టితి విభుం డెవ్వాఁ డిదమ్మూలముం
గానఁగూడదు నాకు నింక దపమే కల్యాణదం బంచు నా
సీనుండై యొక దివ్యవర్షసమముల్ సేసెం దపం బందులోన్ ॥ 35

మత్తకోకిల ॥
అంతఁ బద్మజుఁ డొక్కనాఁడు నిజాంతరంగము నందు శ్రీ
మంతుఁ బన్నగరాజతల్ప సమగ్రభూషణుఁ గోమల
స్వాంతు నీలపయోదసన్నిభుఁ జక్రహస్తు ననంతుని
శ్చింతఁ జేరి తపోబలంబునఁ జేసి కాంచి కృతార్థుఁడై ॥ 36

కం॥ బహువిధముల వినుతించిన
నహిపతిశయనుఁడు ప్రసన్నుఁడై ముందర స
న్నిహితుఁడై నయసంప
ద్విహితానతివినుతి నవ్విధిం గృపఁ బలికెన్ ॥ 37

శా॥ నామాయన్ జగముద్భవిల్లెఁ బెరుగున్నామాయలో డిందు నా
నామార్గంబుల నీ జగన్నికర మంతఃస్థంబు బాహ్యంబు నే
నామేన న్విలసిల్లు నిన్నిటికి నెన్నం గారణం బేను నా
సామర్థ్యంబు మదీయశక్తి వెలిగా శక్యంబె యూహింపగాన్ ॥ 38

కం॥ సకలము మద్భక్తులకును
సుకరము సాధింపరాని చోటెద్దియు లే
దకలంకము మద్దాస్యము
వికృతిపదమ్మేతదన్యవిరహణ మెల్లన్ ॥ 39

శా॥ ఈవిశ్వంబు సృజించునట్టిపనికై యే నిన్ను నాత్మీయ తే
జోవిన్యాసమునన్ సరోజభవుఁగాఁ జూపట్ట నిర్మించితిన్
నా వాక్యంబున మత్ప్రియార్థముగ వాఙ్నాథుండవై సర్వమున్
ద్రావిఖ్యాతఁ జెలంగుమంచు హరి యంతర్ధానముం బొందినన్ ॥ 40

కం॥ ఆయంబుజభవుఁడును, నవ్వ
లే యని తత్పరమపురుషలీలార్థముగా
నాయతమతి సృష్టిక్రియ
సేయగ నుద్యుక్తుఁ డయ్యెఁ జిత్తములోనన్॥ 41

వ॥ ఆసమయంబున నాచతురాననుండు వృక్షలతాదిస్థావరంబులు ప్రథమ సర్గంబును, పశుపక్షిమృగ జలచరాది తిర్యక్ప్రమాహంబులు ద్వితీయ సర్గంబును, మనుష్యులు తృతీయసర్గంబును, దేవతలు చతుర్థ సర్గంబునుంగా [1] (సృజించె) నిట్టు మహత్తత్త్వసర్గంబును నహంకార సర్గంబును [2] (జనియించి) పంచతన్మాత్ర ప్రపంచ మహాభూత సర్గంబును, దశ విధేంద్రియ సర్గంబును, మనోధి దేవతాసర్గంబును, నను ని య్యేనును బ్రహ్మకంటె మున్ను ప్రకృతివలన నైనయవి గావునఁ బ్రాకృత సర్గంబు లనంబడు: తదనంతరంబున బ్రహ్మనిర్మితంబులైన స్థావరసర్గ తిర్యక్సర్గ మనుష్యసర్గ దేవసర్గంబులు నాలుగును వైకృతసర్గంబు లనంబడు నిట్లు సర్గంబులు నవవిధత్వంబునం బఱఁగుచుండు. 42

కం॥ కంజాక్షు యోగమాయా
పుంజీకృత సకలభువన భూతంబుల యా
సంజనన మాంతముగఁ బలు
కం జాలునె తెలిసి పన్నగప్రభుఁడైనన్॥ 43

వ॥ ఇవ్విధంబునం బంకజాసనాసీనుండై సృష్టియొనర్చు బ్రహ్మకుఁ బరమాయువు నూరేండ్లు తత్ప్రమాణంబు వినుము: దశగుర్వక్షరోచ్చారణకాలం బొక్క ప్రాణం బనంజను; ప్రాణంబు లాఱైన నొక్క విఘటిక యనంబడు; నఱువది విఘటికలొక్క ఘటిక యగు; ఘడియలు రెండైన నొక్క ముహూర్తంబగు; ముహూర్తంబులు ముప్పదియైన నహోరా

1. సృజించి. 2. (......)

త్రంబులై యొక్క దివసంబగు; దివసంబులు ముప్పదియైన మాసంబు; ద్వాదశమాసంబులు నొక్క సంవత్సరంబగు నది షాబ్దం బనంబడు; నిట్టి మానుషాబ్దంబు దేవతలకు నొక్క త్రంబగు; నట్టి దివసంబుల చేతనైన దివ్య సంవత్సరంబులు లైన నొక్క మహాయుగంబగు; నందుఁ గృతయుగంబునకు నెనమన్నూఱును, త్రేతాయుగంబునకు మూఁడువేలనాఱునూఱును, యుగంబునకు రెండువేలనేనూఱును, కలియుగంబునకు వేయిన్ని దివ్యాబ్దంబులు సంఖ్యాతంబులై యుండు; నిట్లు ద్వాదశసహస్ర పరిగణితంబగు మహాయుగంబునకు మానుషాబ్దంబులు నలువది లక్షలు నిఱువదివేలు సెల్లు; నిట్టి మహాయుగంబులు వేయి సనిన
నొక్కపగలగు నంతియ రాత్రియుఁ బ్రవర్తిల్లు నట్టి దినావసానంబున, 4

## సర్గకాలకల్పలక్షణము

సీ॥ రాజీవభవుఁడు నిద్రాలోలుఁ డగునంత
నంబుధు లేకోదకంబుఁ జూపు
సంకర్షణాగ్నిచే సమయుచు నన్నిట
భూర్భువస్స్వర్లోకములు మునుంగు
నట మహర్లోకులు నతిభీతులై జన
లోకంబునకుఁ బోదు రాకులముగ
నయ్యబ్ధి మీఁద నారాయణుఁ డహిశయ్య
యోగనిద్రాసక్తి నుండునపుడు
తే॥ నయ్యహములోనఁ బదునల్గురైనయట్టి
మనువు లరుగుదు రొక్కొక్క [1](మనువుకాల)
మఱియ డెబ్బదియొక్క మహాయుగంబు
లిట్లు ధాతకు దివసంబు లెల్లఁ జరగు॥ 4

1. మనువుతకాల.

వ॥ అట్టి తుషారప్రమాణ రాత్రియెల్ల నిద్రించినధాత, వేఁగుటయు మేల్కాని యెప్పటి యట్ల ప్రజల సృజియించు నట్టి దైనందిన ప్రళయ ప్రకారం బట్టి యహోరాత్రంబులు గల వర్షశతంబునందు నేబదియేం డ్లొక్క [1] (పరార్థం) బనం బరఁగు నిప్పు డొక్క పరార్థంబు జనియె దాని తోడ నారాయణుని నాభిపద్మంబున మొలచినయది యాదిగాఁ బ్రవర్తించిన పద్మకల్పంబు పూర్ణంబయ్యె, నిపుడు ద్వితీయపరార్థంబున హరి వరాహ రూపంబుఁ దాల్చుట యాదిగా శ్వేతవరాహకల్పంబు నడచుచున్నయది; యిది కల్పప్రకారంబు. 46

## సృష్టిప్రకారము

శా॥ బ్రహ్మాండంబులు రోమరంధ్రముల పేరాశంబు గన్పట్టఁగా
జిహ్మాత్వం బెడసేసి నిత్యకరుణా శ్రీసన్నుతుండై పర
బ్రహ్మాఖ్య న్విలసిల్లు నే యనఘుఁ డా పద్మాక్షు తన్మాయచే
బ్రహ్మాండం బొక టిట్లు కల్గుటయుఁ జిత్రంబే పరివ్రాజకా॥ 47

వ॥ కమలాసనుని సమనంతర సృష్టిక్రమం బాకర్ణింపుము; సనకస నందన సనత్కుమార సనత్సుజాతు లను యోగీంద్రుల మానసంబునఁ బుట్టించి ప్రజాసృష్టి యొనర్పం డనుటయు, 48

ఉత్సాహ॥

వ్రతులు నవ్వి యహహా మాదు వైషయిక సుఖంబులున్
మతము లగునె యనుచు మారు మాటలాడ కాత్మలోఁ
బ్రతత కోపుఁడైన నలువ ఫాలసీమ [2] (నీలలో)
హితుఁడు సంభవంబునొందు నేచు నిల్చి యుద్ధతిన్॥ 49

1. యుపదార్థ. 2. సీమదు

ఉత్సాహ ॥

తాత నాకు నొక్కపేరుఁ దగ నొసంగు మనుచు న
ద్ధాత నీవు జననమొందు తఱిఁ గణంగి రోదనం
బాతతముగఁ జేత రుద్రుఁ డనగఁ బరఁగు మని తనూ
జాతు గారవించి మఱియు సమ్మదంబు చొప్పడన్ ॥ 50

తే॥ భవుఁడు మహదాది దేవుండు పశుపతియును,
శర్వుఁ డుగ్రుఁడు, భీముఁ డీశానుఁ డనగఁ,
జెలఁగు మీవు ప్రజాసృష్టి సేయు మనుచు
నతఁడు రుద్రశతంబు నుద్ధతియుఁ జేసె ॥ 51

ఉ॥ వారును దత్క్షణంబ యనివారితులై భువనంబులెల్ల సం
హారముఁ జేయఁ జూచుటయు నబ్జభవుండు చలించి యో మహో
పూరుషులార ! మీరు తపముల్ హరిఁగూర్చి యొనర్పుడంచు, ద
ద్దారుణ సృష్టిమాయ నుచితంబుగ వీడ్కొనియెన్ గుణోజ్జ్వలా ॥ 52

కం॥ అలవడ మరీచి దక్షులు
పులస్త్య భృగ్వంగిరసులు పులహాత్రి వసి
ష్ఠులు గ్రతువునను నవబ్ర
హ్మల నతిఘనులన్ సృజించె నవ్విధి యనఘా ॥ 53

వ॥ మఱియును నప్పితామహునకు, 54

సీ॥ నారదుఁ డుదయించె నూరుదేశంబున
[1] (దక్షిణస్తనమున) ధర్ముఁ డొదవె
మృత్యువశర్మంబు మొదవెన్నునను, నాత్మ
దర్పకుం డెసఁగెఁ, గ్రోధంబు బొమల

1. దక్షిణకరమున. సంస్కృతభాగవతం. స్కం 3. అధ్యా. 12. శ్లో. 25. ధర్మః స్తనాద్దక్షిణతో అనియున్నది. ఆంధ్ర భాగవతమునను దక్షిణస్తనమనియే యున్నది.

యెడఁ బుట్టె, లోభంబు వొడమెం రదచ్ఛదం
బునఁ, బయోధులు లింగమున జనించె
పాయుదేశమున సంభవమొందె నైఋతి
కలిగె దేహచ్ఛాయఁ గర్దముండు
తే॥ వదన సంజాతయై నిల్చె వాణి, హృదయ
హారి లావణ్య భవ్య దివ్యాంగి యగుచుఁ
గమల భవుఁ డప్పు డక్కన్యఁ గాంచి మోహి
తాత్ముఁడై వేడ్కఁ బాణిగ్రహంబు సేసె॥ 55

వ॥ మఱియుఁ బంచకోశ సృష్టి యొనర్చి తమోమయమైన యిద్దేహంబు విసర్జించిన నది రాత్రియయ్యె నందు యక్షరక్షోగణంబులు ప్రభవించె, మఱియు నొక్క ప్రభామయగాత్రంబు దాల్చి దేవతలం బుట్టించి తత్తనుత్యాగంబు సేసిన, నది దివసం బయ్యె. మఱియు వపురంతరంబున నసురులఁ బుట్టించి తచ్ఛరీరంబుఁ బరిత్యజించిన నది ప్రాతస్సంధ్య యయ్యె. మఱియు నొండు విగ్రహంబున గంధర్వులచ్ఛరలం బుట్టించి యయ్యంగంబు విడచిన నది చంద్రికయయ్యె మఱియు నొక్కమూర్తిఁ బిశాచగుహ్యకసిద్ధ భూతసంఘంబులం గలిగించి యా కళేబరం బుపేక్షించిన నది తంద్రియయ్యె మఱియుఁ బితృసాధ్యగణంబుల నొదవించి యా సంహననంబు నిరసించిన నది సాయంసంధ్య యయ్యె. వెండియు సిద్ధవిద్యాధరులఁ బుట్టించి యామేను సడలించిన నది తిరోధానం బయ్యె, నిజప్రతిబింబంబునఁ గిన్నర కింపురుషులం బుట్టించె నిట్లు సృష్టి యొనర్చియు నసంతుష్టుండై యంగ[1] (విధూననంబు) సేసిన రాలిన కేశంబులు సర్పంబు లయ్యె. ఋషులం బుట్టించి యయ్యొడలు దోలంగించిన నది తపంబయ్యె. క్రమ్మఱ పూర్వ దివ్యదేహంబు ధరియించిన నతని చతుర్ముఖంబుల వేదోపవేదాదులును మఖాది క్రియాకలాపంబులును

1. విధూనంబు.

వర్ణాశ్రమధర్మంబులును చిద్విద్యాప్రణవచ్ఛందో [1] (వర్ణంబులు) 56
జనియించె నంత,

## స్వాయంభువమనుసంభవము

తే॥ [2](తనదు దేహంబు ద్వివిధంబు) దాల్చ, మనువుఁ,
గన్య శతరూప యను దానిఁ గలుగఁజేసి
దంపతులుగా నొనర్చిన ధాత వారి
నట్టి దాంపత్యమనిషిద్ధ మాద్య మనుట॥ 57

అప్పుడు,

## వరాహావతారము

సీ॥ ఆప్రకారమున స్వాయంభువ మనువు సం
జాతుఁడై కంజాతజాతుచేత
సృష్టినియుక్తుఁడై చేతులు మొగిచి యీ
యుర్వి నీట మునింగి యునికి నిపుడు
నాకు మదీయ సంతానంబునకు నుండు
[3](నట్టి) చోటెయ్యది యానతిమ్ము
నావుడు ధర నెత్తు నేవిధమున నగు
నని విష్ణుఁ బ్రార్థించు నబ్జభవుని
తే॥ నాసికారంధ్రమున రమానాథుఁ డాద
రమున నంగుష్ఠమాత్ర వరాహమూర్తి
నుదితుఁడై తత్క్షణంబ యత్యుగ్రుఁ డగుచు
మునులు నుతియింపఁగాఁ బ్రవర్ధనము నొందె॥ 58

---

1. ఛందో...గ్ని సంబులు. 2. ఆత్మభుజసులహృదయంబు, (కన్యరూప మభూద్ద్వేధా యత్కాయ మభి చక్షతే,)॥ సం॥ భా॥ 3 స్కం, ౧౨-వ అధ్యాయం, ౫-వ శ్లో. 3 నచ్చి.

చం॥ అనుపమలీల సూకరణి యజ్ఞవరాహము వర్ధితాంగుఁడై
వననిధి సొచ్చి యం దెదురువచ్చిన యా కనకాక్షునాము దై
త్యుని వధియించి [1](కోరమొన) నుర్విజలంబుల మీఁదికెత్తి చ
క్కన నిలిపెన్ సమస్థిరముగా ధరణీధర నామమేర్పడన్॥ 59

తే॥ అనుడు విదురుండు విని హిరణ్యాక్షునాముఁ
డెట్లు జనియించె నతఁడేల యెదిరిచెఁ గిటి
నపుడు యజ్ఞవరాహ మెట్లతని ద్రుంచెఁ
దెలుపవే యనఁ బలికె మైత్రేయమౌని॥ 60

## ది తి క శ్య ప స ల్లా ప ము

ఉ॥ అంబుజసూతికిన్ దనయుఁడైన మరీచికి నందనుండు, బు
ద్ధ్యంబులఁ బెద్ద, కశ్యపమహాముని తత్పతి, దక్షకన్య నీ
లాంబుజనేత్రి యైన దితి యమ్మహితాశయుఁ జేరి యొక్కనా
డంబరరత్నమస్తమయ మందుతఱిన్ రతికేళిఁ గోరుడున్॥ 61

ఉ॥ అమ్మునివర్యుఁ డిట్లను లతాంగి! కనుంగొనుచూ దినావసా
నమ్మిది యిట్టి సంజకడ న్యాయమె కాముకవృత్తి నున్కి భూ
తమ్ములఁ గూడి యంబరపథమ్మున శూలి చరించు నిప్పు డీ
విమ్మెయి రాత్రిరాక [2](కొకయించుక) సేపు సహించు టొప్పగున్॥

చం॥ అనుటయు [3](నమ్మృగాక్షి) హృదయాధిప నీ వచనంబు తథ్యమౌ
మనసిజబాణభిన్నమగు మానసము [4](న్భవదీయ) యోగ సం
జనిత సుఖాతిరేకమునఁ జల్లఁగ జేయక నిల్పరాదు, లె
మ్మనుచు విలజ్జయై యతని హస్తసరోజము పట్టి యీడ్చినన్॥ 63

1. కోర గని యుర్వి. 2. కొక యించొక. 3. మృగాక్షి. 4. భవదీయ్య.

కం॥ త్రోయం జాలక యమ్మని
యాయతమగు నగ్ని శాల యందారమణిన్
గాయజు కేళిం దృప్తిన్
శ్రీయుతఁగాఁ జేసి యీశచింతాపరుఁడై॥ 64

తే॥ సాంధ్య విధిఁదీర్చి దితిముఖాబ్జంబుఁ జూచి
యతివ నీ కిట్టితటి గర్భమగుటఁ జేసి
యసుర లిరువురు జనియింతు రనుచుఁ దెలిపి
నంతఁ దద్గర్భ మభివృద్ధి యగుచునుండ॥ 65

మ॥ శతవర్షంబులు సెల్లునంత దితిభాస్వద్గర్భసంజాతమై
యతిచిత్రంబగు నొక్కతేజము సమస్తాశాతతిం గప్పినన్
శతమన్యుప్రముఖామరుల్ వెఱచి యబ్జాతాసనుం జేరి యా
నతులై దత్క్రియ మెల్లఁ దెల్పుటయు నన్నాళీకజుం డిట్లనున్॥ 66

జ య వి జ యు ల శా ప ప్రా ప్తి

కం॥ వినుఁ డమరులార! దెల్పెద
ఘనతర వైరాగ్యనిధులు గలరు మునుల్ మ
త్తనయులు సనకస నందన
సనత్కుమారక సనత్సుజాతు లనంగన్॥ 67

కం॥ ఆ కల్యాణచరిత్రు ల
నాకాంక్షితు లొక్కనాడు హరి నచ్యుతు ల
క్ష్మీకాంతుఁ జూచుతలపున
వైకుంఠపురంబుఁ జూడ వచ్చిరి వేడ్కన్॥ 68

సీ॥ సహజ నిష్ఠాగరిష్ఠప్రపత్తి విశేష
భావిభాగ్యములకుఁ బట్టుఁగొమ్మ

నిరుపమైకానంత గరుడాది శుభమతి
స్ఫుట తపస్స్ఫూర్తుల భోగభూమి
ప్రకృతి లీలాభవ ద్వికృతి సంయోజిత
ప్రతత మోహాబ్ధికిఁ బరతటంబు
దితగతాగత భేదమతి మదభృద్గమ్య ?
మానముక్తాత్ములఁ యాన వితతి

తే॥ నభినుతంబగు నైరమ్మదాఖ్య ముఖ్య
తరతటాకోర్మితరణసంధానమంద
గంధవాహానుగాళి ఝుంకరణ గాన
కుంఠితా[1](ప్సరస్స్వ)రము వైకుంఠపురము॥ 69

తే॥ అట్టిపురమధ్యసీమ రత్నాభిరామ
దివ్యమగు విష్ణునగరు స్తుతించు నట్టి
యమ్మహాత్ముల జయవిజయాఖ్యులైన
ప్రాక్ప్రతీహారవృత్తితత్పరులు నూచి॥ 70

చం॥ నిలువుఁడు మానులార ! హరి, నీరధిపుత్రికతోడఁ గేళి మె
చ్చులుగొను చున్నవాఁ డిపుడు చూడగఁ గూడదు వేళఁగోరి వే
ల్పులు, మునులెల్లవారె వరముల్ పడియున్న తెఱంగుఁ జూడుఁడం
[2](చలవడు) వేత్రదండముల నడ్డము సాచుచు నిల్చి రయ్యెడన్॥ 71

చం॥ భువనములందు నిత్యమును బూని చరించుచు నేడు భక్తులో
కవరదు విష్ణుఁ జూతుమను కాంక్ష సెలంగగ నేగు మమ్ము ని
ట్లవమతి నడ్డగించితి రహమ్మతిఁ జాతకులార యిట్టి మీ
రవనితలంబుపై నసురులై జనియింపుడు క్రూరభావతన్॥ 72

---

1. అప్సరస్స్వరము. 2. చ్చలపుడ.

కం॥ అని [1]శపియించుటయు(ను) న
వ్వనజాక్షునిదాసు లాస్య వైవర్ణ్యంబుల్
కనఁబడగ ధైర్యమహిమక్
మునివరులకుఁ బ్రణతులగుచు ముకుళితకరులై ॥ 73

ఉ॥ మాన్యులు మిమ్ము మొఱంగ కవమానముసేతకు దుష్ట జన్మతా
దైన్యము గల్గె మాకు ననుతాపము నొందకుఁ డీరలింక నే
మాన్యము నొల్ల మేమియును నచ్యుతుఁ గ్రమ్మఱఁ జేరఁగల్గు సౌ
జన్య మనుగ్రహింపుఁడని సారెకుఁ బ్రార్థన సేయనత్తఱిన్ ॥ 74

సీ॥ [2](రమణీయ) విశ్వాధి రాజ్యసూచకత మూ
ర్ధంబున మణికిరీటంబు మెఱయ
వివృతోర్ధ్వపుండ్ర సేతువిభక్త [3](ఫాలాబ్ధి)
పైని [4](నీలాలక) పంక్తి [5](వరల)
మందహాస విలాస మహితాననంబుపై
మకరకుండల దీప్తి మహిమ నిగుడ
రుచిరనాభీ సరోరుహ సరాగపరాగ
వాసితం బగు పైఁడి [6](వలువ) లమర
తే॥ చరణమంజీర శింజితాసార ధార
నుపనిషద్వాక్యముల వీక నగ్గడింప
నచటి కరుదెంచె లక్ష్మీరహస్య సుహృదుఁ
డార్తరక్షాచణుండు నారాయణుండు॥ 75

వ॥ వచ్చి యచ్చట రిచ్చపడియున్న యాత్మానుచరులం జూచి
యిట్లనియె. 76

---

1. శపించుటయన. 2. రమణీయ్య. 3. బాలాబ్ధి. 4. నిలాలక. 5. వొరల. 6. వలువ.

కం॥ యతివరులకుఁ బ్రతిశాపం
బతి కుపిత మనస్కులగుచు నలరింపమి నీ
ధృతి నుతియింపగఁ దగు గో
క్షితిసురులకుఁ దిరుగ నగ్గు సేయగఁ జనునే॥ 77

కం॥ వారక గో బ్రాహ్మణ హిత
కారులు గల రెవ్వ రసమకల్యాణమతుల్
వారలు నాకుం గల రే
వారికిఁ గలవాఁడ నిది [1](యవశ్యము) సుండీ॥ 78

తే॥ ఇంక నసురత్వజనిభయం బేల మీరు
వసుధ నాయందు దృఢవైర వశుల రగుచు
జన్మములమూఁట నాచేత సంఖ్య హతుల
రగుచుఁ గ్రమ్మఱ మత్పదం బందఁగలరు॥ 79

కం॥ అని యానతిచ్చు నద్దే
వుని గని య య్యోగిపుంగవులు ప్రమదముతో
వినుతించి కృతార్థస్థితిఁ
జనువు నెఱపి యతఁడు వనుపఁ జనిరి నిజేచ్ఛన్॥ 80

కం॥ ఆ జయు విజయులె యిప్పుడు
తేజోమహనీయు లగుచు దితిగర్భములో
నోజపడి యున్న వా ర
వ్యాజోన్నతి మెఱయఁగలరు వారు ధరిత్రిన్॥ 81

హిరణ్యాక్ష హిరణ్యకశిపుల జన్మప్రకారము

వ॥ అని యివ్విధంబున నీరజభవుండు దెలిపిన నిలింపులు నిజ నివాసంబునకు నరిగిరి. దితియుం బుత్రద్వయంబుఁ గాంచినఁ దత్కాలం

1. వస్యము.

బున మహోత్పాతంబు లెసంగె. కశ్యపమునియు నయ్యిరువురలోన గర్భాధానజ్యేష్ఠునకు హిరణ్యకశిపుం డనియును, జననజ్యేష్ఠునకు హిరణ్యాక్షుం డనియును నామధేయంబు లొనర్చె నందు, 82

మ॥ అతి దర్పంబున వృద్ధిఁబొందుచు హిరణ్యాక్షుండు [1](దీవ్యత్తపో)
వ్రతయుక్తిన్ విధిఁ బ్రీతుఁ జేసి వరవారప్రాప్త సంతుష్టుఁడై
యతులోదగ్ర గదాకరుం డగుచు [1](మర్త్య)శ్రేణి యం దాజికిన్
బ్రతివీరుండగు వానిఁ గానక మహారౌద్రాద్భుత ప్రక్రియన్॥ 83

కం॥ తెఱ గొప్ప దివమునకుఁ గ్ర
చ్చ్చఱఁ జని వేల్పాది యమర సంఘంబులనే
డ్తెఱఁ దాకి వెఱపుఁ గఱపుచు
బఱపెన్ సింగంబు కలభ పంక్తులఁబోలెన్॥ 84

చం॥ శరనిధి సొచ్చి పాశధరు సైన్యుల నందఱ బిల్కుమార్చి, య
వ్వరుణునిఁ బోరికిం బిలువ వాఁడి యతం డిపుడి ద్దురాత్ము నె
వ్వైరపున గెల్వఁగూడ దది వేళయుఁ గాదని బుద్ధిఁజూచి, శ్రీ
హరి యొకరుండు దక్క దితిజా! యెదు రెవ్వరు నీకు నాపుడున్॥85

శా॥ హుంకారం బొనరించి యా దితిసుతుం డోరీ! యతం డిప్పు డే
వంకన్ జిక్కు నసం జలేశుఁ డతఁ డా వైకుంఠమన్ వీటిలో
బింకంబొప్పగ నుండుఁ బొమ్మనవుడున్ భీమాట్టహాసంబు నా
తంకత్వంబు నెఱుంగఁ జేయఁ గదలెన్ దద్దివ్యమార్గంబునన్॥ 86

వ॥ ఇత్తెఱంగున వైకుంఠమార్గంబునం జను సమయంబున, 87

తే॥ నారదుం డెదు రేతెంచి ధీర యెటకుఁ
జనియె దనవుడు వైకుంఠమునకు విష్ణు
ననికిఁ బిలుచుట కరిగెద ననుచు నసుర
యాడుటయు, నమ్మునీంద్రుండు హర్షమొంది॥ 88

1. దివ్యత్తపో. 2. మర్త్య.

వ॥ (అమ్మహాత్ముఁడు వైకుంఠంబున లేఁడు. భూభరముదాల్ప రసాతలమున నాది కిటిభావమున నున్నవాఁడన) వినియాహిరణ్యాక్షుండు మఱలి గదాదండమండిత బంధురస్కంధుం డగుచుఁ బాతాళంబునకు నరిగి దేహంబు గైకొనిన సాహసంబునుం బూని యజ్ఞవరాహంబు నక్షుల విస్ఫులింగంబు లురల వీక్షించి కృతక్ష్వేళుండై యిట్లనియె॥ 89

కం॥ ఈ ధరణి నెత్తె దేల మృ
గాధమ ! త్రిజగతికి నేన యధిపతి నిపు డా
యోధనమున డగ్గరు నక్ష
వేధోవరఘనుని [1](నీవ విష్ణుఁడవేని)॥ 90

కం॥ అని యసుర యిట్లు క్రోధం
బునఁ బలుకుచునుండ యజ్ఞపోత్రి సకలముక్
వినియు ననాకర్ణితకం
బున బహు విహారణ వినోదములఁ గైకొనియె॥ 91

సీ॥ అభినవ శరదభ్ర నిభ లోమశంబైన
యొడలు ఝాడించు నొక్కొక్కమాటు
శితవజ్ర సమఖురాహతులచేఁ బాతాళ
[2](ముట్టూత) లూచు నొక్కొక్కమాటు
కర్బురగిరికూట కల్ప దంష్ట్రికలచే
నుర్విఁ దా నొరయు నొక్కొక్కమాటు
ఘు ర్ఘురధ్వనుల పైఁగొల్పి బ్రహ్మాండంబు
నూటాడఁ జేయు నొక్కొక్కమాటు

తే॥ కెరలి పోత్రవిదారణ క్రీడ సలుపు
ఘనతర స్కంధకర్షణ క్రమము నూపు
నబ్ధిలోఁ బర్వతముల నిట్టట్టుఁ జఱపుఁ
దానె భూదారుఁడైన భూదారమపుడు॥ 92

1. నివవిష్ణుఁడ వివేనీనిక॥, 2. మట్టూత,

## హిరణ్యాక్ష హననము

కం॥ ఇవ్విధమునఁ గ్రీడించుచు
నివ్వేళనె జుట్టిపట్టి యీదితిపట్టిన్
గ్రొవ్వణఁతు ననుచుఁ గ్రోధము
చివ్వకుఁ [1](గాల్ద్రివ్వ) దైత్యశేఖరుఁ జూచెన్॥ 93

వ॥ ఇట్లు కనుంగొని, 94

సీ॥ క్రమోఁగియుగ్రత కర్ణములు కత్తరించుచు
నందంద కదలి యయ్యజ్ఞపోత్రి
తన కెదురేతెంచు దైత్యుండు హుమ్మని
గదఁ గొని పదము గ్రక్కదల వ్రేయఁ
దెరలక యాగద యురవడిఁ దిగుచుక
దానవ మోదె శాత్రవుని యురము
నతఁడు వేరొక గద [2](నంది) యుల్లాసంబు
దళుకొత్త సింహనాదంబు సేసి

తే॥ యా వరాహ హిరణ్యాక్షు లపుడు డాసి
వేసి గర్జించి తర్జించి విడిచి యొడిచి
గిరియు గిరియును బెనగెడు కరణిఁ దోప
చిత్రయుద్ధంబు నరుదంద సేసి రపుడు॥ 95

ఉ॥ ఆ సమయంబునా ద్రుహిణు డంబుదమార్గమునందు నిల్చి యో
భాసుర యజ్ఞపోత్రి! దితిపట్టిఁ బెనంగగఁ జూచెదేల, యు
ల్లాసము నొందు దైత్యుల బలంబుఁ జలంబును సంజయైన ని
వ్వాసర యావనంబె తటివధ్యు వధింపఁగ నంచుఁ బల్కెనన్॥ 96

1. కాలద్రివ్వ 2. యూఁది.

ఉ॥ క్రోడము రోషణంబగుచు ఘోరకఠోరకరంబుచే శిర
స్తాడన మాచరించుటయు దైత్యవరేణ్యుఁడు వక్త్ర నాసికా
క్రోడ వినిస్సృతాస్రుఁడయి ఘుర్ఘుర రావ మెసంగఁ గాలుచె
య్యాడక యా జగత్పతి ముఖాబ్జము సూచుచు వ్రాలెఁ గ్రమ్మఱన్॥

వ॥ ఇట్లు హిరణ్యాక్షుని శిక్షించి యమందానందంబున, 97

## వసుధోద్ధరణము

శా॥ తత్తాదృగ్వర దండసన్నిభ మహా దంష్ట్రాగ్రభాగంబుచే
నెత్తెం బోత్రి ధరిత్రి నప్పుడిల నీరెల్లన్విడంబించె లోఁ
[1](దత్తద్రింధ్ర) పరిస్రవద్బహు పయోధారాళి ముక్తాసరో
దాత్తస్ఫూర్తి వహించి చొప్పడియె హేమాంగంబుపై [2](గొ)బ్బునన్॥

కం॥ హరి యిట్లు వరాహంబై
ధర నెత్తుడు నచ్చరలకుఁ దార్యత్రిక మం
బరమునఁ బరఁగెన్ సుమములు
గురియుచు వినుతించి రజునిఁగూడి నిలింపుల్॥ 99

వ॥ తదనంతరంబ యాత్మసామర్థ్యంబు[3](న) ధరాధారంబుగా
నిల్చి నీరజాక్షుండు నిజధామంబునకు విజయంబు సేసె నంతఁ గమలాసన
నియుక్తుండై స్వాయంభువుండు మహీపరిపాలనము సేయుచుం బ్రియవ్ర
తోత్తానపాదులను నిరుపురం దనయులను నాకూతి దేవహూతి ప్రసూతు
లను కన్యకాత్రయంబునుం గాంచె నందు దేవహూతియందుఁ గర్దమ
మునీంద్రువలన విష్ణుండు కపిలావతారంబుఁ గైకొనియె ననుటయు
విదురుండు మైత్రేయు నవలోకించి, 100

---

1. దత్త్రదంస. 2. గు. 3. .........

## కర్దముండు దేవహూతిని వివాహమాడుట

కం॥ ఆ దేవహూతిఁ గర్దము
లాది పురుషు నెట్లు గొలిచి రజ్ఞాతసుం డె
ట్లీ దంపతులకుఁ బుట్టె ని
వేదింపు మనవుడు యోగి విని యిట్లనియెన్॥ 101

సీ॥ కర్దమముని యజ్ఞగర్భుని యాజ్ఞాప
నమున సరస్వతీ నదికి నేఁగి
హరిఁగూర్చి దశసహస్రాబ్దంబు లతినిష్ఠ
నద్భుతంబుగఁ దపం బాచరింప
హర్షించి వైకుంఠుఁ డచట సన్నిహితుఁడై
యతనితో నిట్లను నాదరమున
ఘనుఁడు స్వాయంభువ మనువు సదారుఁడై
తానె యచ్చటికి మోదమున వచ్చి

తే॥ నిజదుహిత దేవహూతిని నీకు నిచ్చు
ననఘ మీరాయిద్దఱకుఁ గపిలాఖ్య నేను
దశమ గర్భంబునందుఁ బుత్రత వహింతు
ననుచుఁ బలికి తిరోహితుం డయ్యె నపుడు॥ 102

వ॥ కర్దముండు ప్రదక్షిణంబు సేయుచుండు నంత, 103

తే॥ అతివ శతరూపఁ గూడి స్వాయంభువుండు
కనకరథ మెక్కి సైన్యసంఘము గొలువ
తనదుహిత దేవహూతిఁ దోడ్కొనుచుఁ గర్ద
మాశ్రమమునకు వచ్చెఁ దూర్యములు [1](మొరయ)॥ 104

---

1. మొరయ.

వ॥ వచ్చి యా క్షణంబ, 105

కం॥ తన బలములు విడియుటకుం
బనిచి యుచితసరణిఁ బ్రమిత పరివారుండై
జనసుతుఁడగు కర్దముఁ గను
గొని ప్రణతుండైన మానికులతిలకుండున్॥ 106

తే॥ అతిథేయం బొనర్చి యనామయంబు
నాగమనహేతుయుతముగా నడుగుటయును
హర్షమంతంత కొదవ స్వాయంభువుండు
వినయ నతమూర్ధుఁ డగుచు నిట్లనియె నపుడు॥ 107

తే॥ అంగీకృత పూర్ణతరా
ష్టాంగమహాయోగ నీ దయాకృతిచే స
ప్తాంగములయందు నాకున్
సంగత మైయుండుఁ గుశలసౌఖ్యం బెపుడున్॥ 108

శా॥ దాక్షిణ్యోన్నతి దేవహూతి యను నీ తన్వంగి నా పుత్రినిన్
సాక్షాదంబుజ గర్భనారదముఖాశ్రాంతశ్రుతన్ సంభృతా
పేక్షత్వం బెసఁగన్ వరింతువని యిట్లేతెంచె నిక్కన్యకా
భీష్టం గై కొనుమయ్య మామకమనోభీష్టంబు దృష్టంబుగాన్॥ 109

కం॥ ఎల్లెడ నెట్టి మహాత్ములు
నొల్లము [2](పౌనరగ నయాచి)తోపనతసుఖా
భ్యుల్లాసము గావున నీ
పల్లవపాణిన్ వరింపు భవ్యచరిత్రా॥ 110

1. పౌనర యాచి.

మ॥ అని ప్రార్థించినఁ జక్రి యాతని [1](త)లంపై సమ్మదా పూర్ణ భా
వన నోంకారము సేయు కర్దమునకున్ స్వాయంభువుం డీశుఁ డా
తనుజాతన్ శతరూపసమ్మతి యథోక్తప్రక్రియన్ బెండ్లిసే
సె నుతింపం [2](గ వి)భూషణాంబరము లిచ్చెన్ రై సమేతంబుగన్॥

శా॥ అంతన్ ధీనిధి యమ్మనూత్తముఁడు భార్యాయుక్తుఁడై కూతు న
త్యంత స్నిగ్ధత బుజ్జగించి మునిఁ బ్రేమామంత్రితుం జేసి సా
నంతాత్మీయబలౌఘుతన్ గదలి బ్రహ్మావర్తదేశంబునన్
శాంతంబౌ నిజరాజధాని కరిగెన్ గౌరవ్యవంశోద్భవా॥ 112

సీ॥ [3](ఇట) దేవహూతి యనేకవిధంబుల
బతి [4](పరి)చరణ తాత్పర్యవృత్తి
నుండంగ నమ్ముని యొక్కనా డతిగాత్రి
యైయున్న యక్కాంత నలరఁ జూచి
ఘటితతరత్నోజ్జ్వల కాంచనమయములై
సముచిత వస్తుశస్తంబులైన
భవనము ల్మేడ లుప్పరిగెలు వీథులు
నంగళ్ళు జావళ్ళు నమరి మఱియు
తే॥ మదన విహరణఖేల నాస్పదములైన
కేళిశైలముల్ కొలఁకు లాక్రీడములును
గలుగు నొక్క విమానంబుఁ గలుగఁ జేసెఁ
దదుప భోగార్థమై తనతపము పేర్మి॥ 113

కం॥ మానీంద్రుఁ డివ్విధమున వి
మానము గల్పించి, మనుకుమారికతో, వే
మానిని ! విరచిత శుద్ధ
స్నానవయి ప్రవేశమిం దౌనర్చు [5](మనుటయున్)॥ 114

1. ద. 2. (...) 3. ఇది. 4. పతిచరణ. 5. మనుడున్.

చం॥ ఘనత సరస్వతీతటినిఁ గల్గిన బిందుసరోవరంబునన్
దనుమణి తీర్థమాడఁగ ముదంబున డిగ్గి తదంతరంబునన్
గనకనికేతనస్థితులఁ గన్యల వేవురఁ గాంచె వారు న
య్యనుపమ [1](శీలకన్) సఖులమై చరియించెద మంచు నమ్రులై॥

వ॥ నిజనివాసంబునకుఁ దోడ్కొని చని యచ్చట, 116

సీ॥ ఉరురత్నపీఠిపై నునిచి సంపంగి నూ
నియఁ దలయంటి పన్నీట జలక
మార్చి శృంగారంబు నలవడఁ గావించి
యిష్టాన్నపాన సంతుష్టిఁ జేసి
రింతయు నాత్మలో హృదయేశు మహిమగాఁ
దలఁపుచున్నంత తత్తాపసుండు
కల్పిత తత్కన్యకాయుతం బగుఁ దన్ను
యానంబు నెక్కించి యఖిలజగము

తే॥ శోభనస్వైర గతులచేఁ జూపి తెలిపి
బహుశతాబ్దముల్ సంగమప్రౌఢిఁ దనిపి
తవిలి యొకనాఁడు వీర్యంబు నవవిధముగ
నునుపఁ దొమ్మండ్రు [2](గూతులఁ) గనియెఁ దరుణి॥ 117

## క పి లా వ తా ర ము

ఆ॥ మఱియు నమ్మృగాక్షి తఱిఁ బతియాజ్ఞచే
సద్వ్రితమున హరిఁ బ్రసన్నుఁ జేసి
యతని మూర్తియైన యసమానుఁ గపిలమ
హామునీంద్రుఁ గనియె హర్షమలర॥ 118

1. లీలకన్. 2. సూతుల.

వ॥ ఇవ్విధంబునఁ గర్దమునితేజంబువలన దేవహూతి గర్భంబు నందు విష్ణుండు కపిలావతారంబుఁ గైకొని యభివృద్ధి నొందుచుండు నంత నొక్కనాఁడు విరించి యమరసహితుండై యరుగుదెంచి కపిలునిం గాంచి వందనస్తవంబు లాచరించి దేవహూతికర్దములం గని మీరలు కృతార్థులరు విష్ణుండు మీకుం దనయత్వంబు నొందెనని కపిలునివలన జ్ఞానమార్గంబులు దెలిపి నిజేచ్ఛం జనియె నంత, 119

సీ॥ ఘనుఁడు మరీచికిఁ గళ యను కన్నియ,
నత్రికి ననసూయ యను లతాంగి,
నంగిరసునకు శ్రద్ధాఖ్యయౌ సతిఁ, బుల
స్త్యునకు హవిర్భువ యను మృగాక్షిఁ,
బులహునకును గ్రమంబున గతి యను తన్విఁ,
గ్రతునకుఁ గ్రియ యను కంబుకంఠిఁ,
నల వసిష్ఠునకు నూర్జాహ్వయ యను కాంత,
భృగునకు ఖ్యాతియన్ బిసరుహాస్య
తే॥ నయ్యథర్వునకును శాంతి యను సుకేశి,
నాగమోదితవిధి వివాహములు సేసి
కపిల విశదీకృత జ్ఞాన గతిఁ జరించెఁ
గర్దముఁడు ధీనిరస్తాఘకర్దముండు॥ 120

## కపిల దేవహూతి సంవాదము

వ॥ దేవహూతియుఁ గపిలునివలన విష్ణుభక్తిమార్గంబును, బ్రకృతి పురుషవివేచనంబును, నాదిగాఁగల సాంఖ్యయోగంబుఁ గాంచెనని తృతీయ స్కంధ కథావిశేషంబులు బల్కుటయు విదురుండు మైత్రేయునిఁ బ్రశంసించి, 121

కం॥ మునిశేఖర స్వాయంభువ
మనుపుత్రీచరిత్రములు క్రమంబున నాకుఁ
వినఁజేయు మనుటయును విదు
రునకుఁ మైత్రేయుఁ డత్యాదరుండై పలికెఁ॥ 122

మ ను పు త్రి కా సం త తి క్ర మ ము

వ॥ స్వాయంభువ మనువునకు నాకూతి దేవహూతి ప్రసూతులను మువ్వురుపుత్రికలం జెప్పితి నందు రుచికభార్యయైన యాకూతియందు లక్ష్మీనారాయణాదులు దక్షిణాసుయజ్ఞనామంబుల నవతరించి మిథునత్వంబు నొంది దోషుఁడాదిగా గల సుయమనాఖ్య నిర్జరులం బుట్టించి రా మన్వంతరంబున సుయజ్ఞుం డింద్రుండును, మరీచ్యాదులు మునులు నై ప్రవర్తించిరి, కర్దముభార్యయైన దేవహూతికిం బుత్రికాసవకంబు గలిగెనని వివరించితి వారియందు, 123

తే॥ విను మరీచికిఁ గళయను వనితయందుఁ
గశ్యపుఁడు పూర్ణిమయు ననంగఁ గలిగి రాత్మ
జుండు దుహితయు వార లస్తోకవృత్తిఁ
గనిన సంతతి భువనంబు నినిచె విదుర॥ 124

సీ॥ అత్రి పుత్రార్థియై యతినిష్ఠఁ దపమాచ
రించిన మిగుల సంప్రీతులగుచు
హరిహరవిధులు మువ్వురును సన్నిధి చేసి
తనయుల మయ్యెద మనుచు వరము
నొసఁగుట నత్తాపసోత్తమునకు నన
సూయాఖ్యయైనట్టి సుదతియందు
హరియు దత్తాత్రేయుఁడై పుట్టె హరుఁడు దూ
ర్వాసుం డనంగ సం[1](భవము)నొందె

1. భవంబు.

తే॥ సంగవేళ సమీరవశమున నూర్ధ్వ
మగు తదీయ తేజస్స్మృతీ యాంశమునను
నమ్మహానుభావుని లోచనాంబుజమున
నంబుజాతాసనుఁడు చంద్రుఁడై జనించె॥ 125

వ॥ అంగిరసునకు శ్రద్ధయందు [1](సినీవాలి) కూహూ, రాకా,
నుమతు లను నలువురు పుత్రికలు, నుచథ్య, బృహస్పతులను నిద్దరు
పుత్రులును గలిగిరి. పులస్త్యునకు హవిర్భువయందు విశ్రవసుండు పుట్టె,
నతనివలనఁ గుబేరరావణాదులు ప్రభవించిరి. భృగువునకు ఖ్యాతియందు
ధాతృ [2](విధాతలును), శ్రీ యను కన్యకయు నుద్భవించి రందు
ధాతకు మృకండుండు నతనివలనమార్కండేయుండునుంగలిగిరి. [3](అథర్వ)
నకు శాంతియందు దధీచి యుదయించె. ఇంక ప్రసూతి సంతానక్రమంబు
వివరించెద. 126

కం॥ విను బ్రహ్మసముం డగు ద
క్షునకుఁ మనుపుత్రి యగు ప్రసూతికి నతిశో
భనతఁబదార్వురు కన్యలు
జనియించిరి వారి నతఁడు సంతోషమునఁ॥ 127

తే॥ ధర్మునకుఁ బదుమువ్వుర [4](భారవోసి)
నగ్ని కొక్క దుహిత వివాహంబు సేసె
పితరులకు నొక్కకన్యకం బెండ్లియార్చె
భవున కొకకూతు నిచ్చె సంభ్రమము మీఱ॥ 128

వ॥ వారెవ్వరనిన శ్రద్ధయు, [5](మైత్రియు), దయయును, శాంతియుఁ,
దుష్టియుం, గ్రియయు, నున్నతియు, బుద్ధియు, మేధయుఁ, దితిక్షయుఁ,

1. సినీవాలి. 2. విధాతృలును. 3 అథర్వ, 4. .........
5. మైత్రేయు.

ప్రియాయు, ధృతియు, మూర్తియు నను వారలు ధర్మునకు ధర్మపత్నులై రందు మూర్తియందు విష్ణుకళాంశంబుల నరనారాయణులు జన్మించిరి. మఱియు నగ్నికి స్వాహాయుఁ, బితరులకు స్వధయు, భవునకు సతియును భార్యలై రి వారిలోన, 129

చం॥ మమత దొఱంగి దక్షుఁడు కుమార్గమునన్ శశిఖండ శేఖరా
వమతి యొనర్చినన్ సతి యవారిత [1](రోష) కషాయితాత్మయై
యమరిన యోగవహ్నికి నిజాంగము నాహుతిసేసెఁ దొడంతన్
హిమగిరిపుత్రియై మఱల నీశునిఁ జేరెఁ దపోబలంబునన్॥ 130

మ॥ అనుడున్ వ్యాసతనూభవుండు మునినాథా! దక్షుఁడీశాను నే
పనికై యెట్లు తిరస్కరించె సతి యా భావంబు గర్హించి త
త్తనువుం బాసిన నేమిసేసె హరుఁ డేతద్వర్తనం బెల్ల నె
మ్మనముప్పొంగఁగఁ దెల్పుమన్నఁ బలికెన్ మైత్రేయుఁ డుర్వీశ్వరా॥

దక్షయజ్ఞవినాశము

చం॥ ధరణిఁ బితామహుండు మును ద్రవ్యసమగ్రతచే సహస్ర వ
త్సర కరణీయమై హరిఁ బ్రసన్నునిఁ జేయు మఖం బొనర్చుచో
హరుఁడు మునీంద్రులున్ సురలు నర్మిలినుండఁగఁ జూచువేడ్క, స
త్వరగతి దక్షుఁ డచ్చటికి వచ్చినఁ జూచి సదస్యు లందరున్॥ 132

కం॥ సముచితముగఁ బ్రత్యుద్గతి
నమస్కృతు లొనర్చి రసమ నయనుం డిట్టం
గి మెలంగకుండె నపుడా
క్రమ మునకై దక్షుఁ డీశుఁ గని కుపితుండై॥ 133

వ॥ ఇట్లనియె.

1. దోష.

తే॥ హరుఁడు ననుగాంచి ప్రత్యుద్గమాభి వంద
నము లొనర్పక యున్నవాఁ డమరులార!
యల్లుఁడే యీతఁ డే మామనగుట యెట్లు
పెరిగెనో బ్రాజ్ఞ యితనికి గరువమునను॥ 134

చం॥ వినయవిహీనుఁడైన [1](యవివేకి)ని భిక్షున కీ విరూపలో
చనునకు నా తనూజ నతిసాధ్వి నెఱుంగక యే త్రయిన్ జతు
రునకును బోలె నిచ్చితి బుధుల్మనులి య్యశివున్ శివుండనన్
జనునె యితండు యోగ్యుఁడె ప్రశస్తసమస్తమఖాంశభాక్కుగాన్॥

కం॥ అని పలికి చేత నుదకము
నినిచి నిలిచి యీ హరుండు నేడాదిగ నిం
ద్రునితోడి హవిర్భాగం
బనువు [2](పడక) యుండుగాక యని శపియించెన్॥ 136

వ॥ రుద్రుం డా సమయంబునఁ బరాభూతుండు గావున దక్షు
వచనంబులు వినియు విననియట్ల గైకొనక యుండె. 137

తే॥ దక్షుఁజూచి ప్రకోపరక్తాక్షుఁడగుచు
నంది యామాట కపుడు దా నంది లేచి
తివిరి పశుబుద్ధి నీశు నిందించు నీతఁ
డచిరమున మేషముఖుఁ డగుననుచుఁ బలికె॥ 138

వ॥ అంత నవబృథస్నానానంతరంబునం బితామహునిచేతవీడ్కోలు
వడసి దేవతలు సహర్షులై యథేచ్ఛం జనిరి. [3](ఇక) దక్షుండు రోష
రూక్షుం డగుచు నిజనివాసంబునకు వచ్చి గంగాధరునిపై విరోధం
బేధమానం బగుచుండఁ గొండొకకాలంబున, 139

---

1. వివేకి. 2 పడగ. 3. ......

కం॥ దొరతనము మెఱయ నొక మఖ
మరుద్రకముగా నొనర్తు నని తలంచి తగన్
సిరులం గూర్చి మునులని
ర్జరులన్ రావించె బంధు జనపూర్వముగాన్ ॥ 140

వ॥ ఇట్లు రప్పించి, 141

తే॥ అల్లుఁడైన హరుం బుత్రియైన సతిని
బిలువకయ రుద్రభాగంబు వెట్టకయును
దక్షుఁ డధ్వర మొనరింప దీక్షఁగొనియెఁ
గడవ నేర్చునె భవితవ్యకార్యసరణి॥ 142

అంత,

చం॥ క్రతువొనరించుచుండగ నఖండ తదద్భుత వైభవంబు లా
యతగతిఁ జూచి మెచ్చి ఖచరాంగన లెల్లెడఁ బ్రస్తుతింపఁగా
సతి బహుభంగుల న్వినుచు సర్వము నాత్మ నెఱింగియుండియున్
బతియగు నీలకంధరునిఁ బ్రాంజలిభావముతోడ నిట్లనున్ ॥ 143

సీ॥ భూతేశ! దక్షుఁ డిప్పుడు యాగ మొక్కటి
యొనరింపుచున్నవాఁ డనుచు వింటి
నచ్చోటి కెలమి నా యక్కలు సెల్లెంద్రు
వత్తురు తమతమ వరులఁ గూడి
మనము నచ్చటి కేఁగి మహితసౌజన్యసిం
ధువులైన సకలబంధువులఁ జూచి
మాతల్లిదండ్రి సేయు సన్మానముల్ గైకొని
యొనసి సభాస్థానులెల్లఁ బొగడ

తే॥ మఱలివచ్చుట మిగుల సమ్మతము నాకు
పిలువకుండిన నేమి సంప్రీతితోడ

జనక జనపతి గురుసుహృజ్జన గృహముల
కరుగుదురు లోకధర్మజ్ఞులైన వారు॥ 144

కం॥ అబలం గావున వ్యామో
హాబలంబునఁ బుట్టినింటి కరిగెదనని వి
క్లబతఁ నిను బ్రార్థించెద
విబుధాధిపవంద్యచరణ విషసంహరణా॥ 145

చం॥ అనుటయు నవ్వి శంభుఁడు నిజాంగన కిట్లను దేవి! నీవు సె
ప్పిన యది సూడ నట్టిదియ పిల్వక[1](యైనను నాత్మబంధులన్)
గనుగొనఁబోవు టొప్పు, వెనుకన్ మఱి వారట రోష[2](దృష్టితర్జన) మొనరించి గౌరవము జారగఁ జూడనివార లేనియున్॥ 146

కం॥ మీతండ్రియైన దక్షుం
[3](డేతద్గర్వా)నుబంధ హేయచరిత్రుం
డాతని యింటికి నేగగ
నీతి యగునె మనకు నీలనీరజనేత్రీ॥ 147

వ॥ మున్ను పరమేష్ఠి యొనర్చు సత్రంబునం దేను సభాస్తార మధ్యంబుననుండి యచ్చటికి వచ్చిన దక్షునింగని యాత్మవేదికం గాయిక వ్యాపారం బప్రధానంబని తలంచి మానసికంబులైన ప్రత్యుత్థానాభివాదనంబు లొనర్చి యూరకుండిన నతం డిది యెఱుంగక నిరాకరణంబు గావించి యంతరంగకుడుంగ క్రోడసమేధమాన క్రోధానలుండగుచు మఱలి చనియెం దత్ప్రతీకారార్థంబు మద్విరహితాధ్వరంబు సేయుచున్నవాఁడు గావున నే నిప్పు డచ్చటికిం బోయినఁ బరాభవంబు నొందుదు, మఱియును, 148

1. యైన బంధులన్. 2. దృష్టి సజ్జన. 3. .........

ఉ॥ ఏ ననసేల నీవు గన కిత్త్రతి నచ్చటి కేఁగితేని మ
న్మాసినివాట దక్షుఁ డపమాన మొనర్చుట నిక్క మట్టిచో
మానసనీమ ఖిన్నత సమగ్రతరంబుగఁ బుట్టు నింతయే
లా ? నలినాక్షి ! యూరకె తలంగి మెలంగుట యొప్పు నిప్పనిన్ ॥

తే॥ తెలుపవలసిన దంతయుఁ దెలుపఁబడియె
నింక నీబుద్ధికొలది నీ కెఱుఁగవచ్చు
బోవవలసిన వల దనఁ బో మ్మనుటయు,
విని సతీదేవి భవునకు వినత యగుచు॥ 150

కం॥ పారిషదసఖీజనపరి
వార యగుచు సంభృతోత్సవంబగు జనకా
గారమునకు నరిగె దదీ
యూరూఢమదానుభావ మరయుట పనిగాఁ॥ 151

సీ॥ తల్లియు సోదరీ తతియును మఖశాల
కేతెంచినట్టి య య్యిందువదనఁ
గనుగొని యెదు రేఁగి కౌఁగిళ్ళఁ జేర్చుచు
సేమంబు నడిగి రౌచిత్యమలర
హారవిషయ క్రోధ పరవశుండై బిడ్డఁ
జూచియు దక్షుండు నీచబుద్ధిఁ
గానని యట్లుండెఁ గాని వచ్చితిఁగదా
యని యొక్కమాటయు నాడఁడయ్యెఁ

తే॥ నతనిగూర్చి సదస్యులు నట్లయుండి
రింతయును గని య య్యింతి యంతరంగ
మెంతయును రోషలజ్జితా క్రాంతి నలఁగ
నాత్మవిభుమాట సరివచ్చె ననుచుఁ దలఁచి॥ 152

కం॥ తల్లికిఁ దోడై యక్కలు
చెల్లెండ్రును నిచ్చు పూజ సేకోలును దా
నొల్లక సభ్యుల హృదయము
లల్లన నాడంగ దక్షు నపు డిట్లనియెన్॥ 153

సీ॥ నిర్జర మకుట మణిప్రభారించోళి
కలు యత్పదాసక్తిఁ దెలివినొందు
శ్రుతిశిరస్సీమంత శుద్ధముక్తాఫలం
బన మించు యత్ప్రభావాతిశయము
గరళకూటాటోప కల్మాషమైన య
త్కంఠంబు లోకరక్షాపదంబు
వితత మహామహః పలితపలితాశన కలా
పాలక్షితంబు యత్ఫాల ఫలక
తే॥ మట్టి శ్రీమన్మహాదేవు నవఘళించి
యాగ మిబ్భంగిఁ జేయంగ నలవియగునె
వెడమతివి గాక నడిమిఁద్రవే ల్విడిచి చల్లఁ
ద్రావ వచ్చునె యెట్టి నేర్పరికి నైన॥ 154

శా॥ ఉగ్రుం జుల్కఁగఁ జూచి నీవు మఖ మిట్లుద్వృత్తిమైఁ జేయఁగా
బ్రాగ్రత్వంబు దరంగునే యతనికిన్ బ్రహ్మాజ్ఞమధ్యంబునన్
జాగ్రత్త్రోటి విఖండితోరగు జగజ్జంఘాళుఁ దార్క్ష్యుం దరి
ద్రగ్రామీణ కుటీచరున్ మశక మాత్మన్ రోయగా నేమగున్॥

తే॥ ఆగమంబులు హరహీన యాగ మెట్లు
[1] (దెలిపె), నీవైనఁ జేయంగఁ దలఁచు టెట్లు?
సభ్యు లీధార్త్యమున కెట్లు చాలి నిలిచి
రింతయును మీకు మీఁదట నేమి యగునొ॥ 156

---

1. దెలిసె.

కం॥ [1](యజ్ఞాంశుఁడు) యజ్ఞేశుఁడు
యజ్ఞఫలప్రదుఁడు సకల యజ్ఞవిధివిధా
నజ్ఞుఁడు సర్వజ్ఞుఁడు నీ
యజ్ఞముఁ జూడఁగ ననర్హుఁడగునే దక్షా॥ 157

తే॥ ఈశ్వరద్రోహివైన నీయింటి కేను
వచ్చుటయుఁ దప్పు వచ్చిన వాసికైన
నేరుపున జాయఁ గూడుకోనేరవైతి ?
విఁటిదైనంబుఁ బెరటిలో నిడుట మేలె॥ 158

శా॥ యుక్తిన్సర్వుఁడు దక్షపుత్రి యని హాస్యోద్వృత్తి నర్క్క .జీర న
య్యుక్తం బేగతి నోర్వవచ్చు నిక నిన్నో తండ్రిగాఁ జాల...
.......................................సం
పృక్తంబైన హరాపవాద కర గుంభేదాఘముం దాచదక్ష॥ 159

సీ॥ వామదేవుఁడు నన్ను వలదు పోవకుమన్న
వచ్చితి నిను నీశవైరిఁ జూడ
ఈశ్వరద్వేషణు నీక్షించి నప్పుడ
పొరిగొనలేకున్నఁ బొలియు టొప్పు
నీపుత్రిమైనట్టి పాపంబునకును బ్రా
యశ్చిత్త మీదేహ మణఁచికొనుట
దేహంబు వర్జించు సాహసంబునఁ గాని
పాయదు దుఃఖ మెబ్భంగినైన
తే॥ విఘ్నమున నీమఖంబిప్డు విహతి నొందు
తావకంబైన గర్వంబుఁ దఱఁగి పోవు
ననుచుఁ బలికి ప్రవృద్ధ రోషాగ్ని యగుచు
మున్ను జలముల వార్చి ప్రాఙ్ముఖత నిల్చె॥ 160

1. యజ్ఞాతుడు.

కం॥ హర హర యనుచున్ నేత్రాం
బురుహంబులు మూసి ప్రాణ ముఖ్యానిలమున్
గరము గుదియింప నాసతి
యురవడి యోగాగ్ని మేన నొదవఁగఁ జేసెన్॥ 161

మ॥ చరణాబ్జంబుల లాక్షభంగిఁ గటిఁ జంచద్రక్తవస్త్రప్రభన్
వరవక్షస్స్థలమందుఁ గుంకుమముతేవన్ హస్తకంఠంబులన్
సరవిన్ హేమ మణీవిభూషణ విశేషచ్ఛాయఁ గేశంబులం
దురు సింధూర రజంబుభాతి సతికిన్ యోగాగ్ని [1](యొప్పెన్ గడున్)

వ॥ ఇవ్విధంబున సతీదేవి యోగానలంబు ధరియించి ముక్తశరీర
యయ్యె నా సమయంబున, 163

కం॥ అనుసిన నయ్యోగాగ్నిన్
సమసిన సతిఁగాంచి దుఃఖసంపీడితులై
ప్రమథులు పరబల ధైర్య
ప్రమాథులై దక్షుఁ దునుమఁ బాల్పడి నడవన్॥ 164

వ॥ కనుంగొని భృగుమహాముని దక్షిణాగ్నియందుఁ గ్రతువైరి
మారకంబగు హోమంబు సేసిన నందుల్మిక సాధనంబులగు జంబునామక
దేవతలు జన్మించి ప్రమథులం బలాయితులంజేసి రిట్టివృత్తాంతం బంతయు
నారదుండు వెండి కొండకుఁ జని కఱకంఠునకు నెఱింగించిన, 165

కం॥ నిటలాక్షుఁ డదరిపడి తన
జట యొక్కటి పెఱికి వ్రాని జగతీస్థలి పై
చిటయును నందు మహోద్భట
చిటచిట రవశిఖిశిఖావిశేషంబులతోన్॥ 166

1. యుప్పొంగడున్.

శా॥ చండస్ఫూర్తి భుజాసహస్ర నవ శస్త్రశ్రేణికిం దంష్ట్రికా
దండాభల్ మెఱుఁగెక్కఁజేయ నలికస్థానాక్షి దీప్తుల్ జటా
కాండోత్తుంగ పిశంగిమం బెనుప నుగ్రక్షోభుఁడై వీరభ
ద్రుం డావిర్భవనంబు నొందె నతి రుద్రుండై మహోద్దండతన్॥ 167

కం॥ ఆవిర్భవించి దేవా
యీవిశ్వము సంహరింతునే యనుడు హరుం
డావీరభద్రు సకల గ
ణావలి కధినాథుఁ జేసి యప్పు డిట్లనియెన్॥ 168

కం॥ నను విడచి యాగమొక్కటి
యొనరించియు నంత నూరకుండక సతిఁ బా
వనమూర్తి నడఁచె దక్షుం
డనఘా! దండింపు మిపుడ యా దుష్టాత్మున్॥ 169

తే॥ అనుటయు హసాద యనుచు సాష్టాంగవినతుఁ
డగుచు నవ్వీరభద్రేశుఁ డపుడ కదలి
యతిరయంబునఁ జని దక్షుయజ్ఞశాల
సొచ్చి ప్రమథావళికి సెలవిచ్చుటయును॥ 170

సీ॥ భంజ్యమానానేక పాత్రోపకరణంబు
నంభిద్యమానాజ్యకుంభశతము
భక్ష్యమాణామృతోపమ పురోడాశంబు
మఱి పీయమాన సోమరస ఝరము
పాత్యమాన విశిష్టభాగాపవరకంబు
ఖన్యమాన వితర్దికా తటంబు
బాధ్యమానాప్సరః ప్రమదాసమూహంబు
బధ్యమానమునీంద్ర బాంధవంబు

తే॥ భస్మసాత్క్రియమాణ కుంభాపదంబు
హాస్యమాన నిహంతుకామాహితంబు
నగుచుఁ గనుపట్టె యజ్ఞశాలాశ్రయంబు
వీరభద్రప్రమథ వీరవితతిచేత॥ 171

కం॥ అరుదుగ మణిమంతుఁడు భృగు
బారిబారిఁ జండీశ్వరుండు పూషను నందీ
శ్వరుఁ డాదిత్యునిఁ గవియఁగఁ
బరుషాత్మకు దక్షు వీరభద్రుఁడు దాఁకెన్॥ 172

వ॥ మఱియుఁ దక్కంగల ప్రమథులును దక్షసైనికులుం దలపడి కార్ముకంబు, కరవాలంబు, కఠారంబు నాదిగా గల సాధనంబులచేత నేసియు నఱికియుఁ బొడిచియుఁ జిత్రయుద్ధంబులు సేయుచుండు నంత, 173

సీ॥ కనుగీటితే శంకరుని దిట్టు దక్షుని
కని భృగు నుత్పాటితాక్షుఁ జేసె
నవ్వితే నీవును నవ్వేళ నని పూష
నులివేఁడి [1](పండ్లుల) గలయ డుల్చె
మీసలు గిలిపితే యీసున నీవని
నయ్యెడ భృగువు నశ్మశ్రుఁ జేసె
అపరుద్రభాగ యాగాదిష్టులే మీర
లని సభాస్తారుల యుద టణంచి
తే॥ ప్రమథు లుప్పొంగ నవ్వీరభద్రుఁ డపుడు
దక్షుని శిరంబు హాస్తపద్మమునఁ దునిమి
యఖిల జనులు హా హాయని యడల రోష
కలితుఁడై వేల్చె దక్షిణానలమునందు॥ 174

1. పండుల.

వ॥ ఇవ్విధంబున నున్నిద్ర రౌద్రరస ముద్రాభద్రుండగుచు న వ్వీరభద్రుండును కృతకర్తవ్యుండై జయశంఖంబు పూరించి ప్రమథ పరివృతుండగుచు రజతాచలంబునకు నరిగె నంత హాతశేషులగు వేల్పులు వేల్పుతేనిం గూడుకొని, 175

కం॥ పరమేష్ఠిం జేరి దక్షుని
పరిభవ మంతయును దెలియం బరచిరి మున్నా
పరమేష్ఠి హరియు వాఖమున
కరుగరు భవితవ్యమెఱింగి యౌచిత్యమునన్॥ 176

సీ॥ అక్షమాలాసనుం డమరుల విన్నవం
బుల విని దక్షుదుర్బుద్ధి నెంచి
పితృదేవత ప్రజాపతి మునిసహితుండై
సాగియ వ్వసోకసారం గడచి
నదుల నందాలకనందల దాటి సౌ
గంధికవని కుపకంఠసీమ
శత యోజనముల యున్నతియును బంచ వ
త్సతి యోజనముల విస్తృతియుం గలిగి
తే॥ యొప్పు వటభూరుహామునీడ యోగయుక్తి
బద్ధ పద్మాసనత నున్న భవునిం గాంచి
తత్కృతానతి యగుచు మోదంబు నొంది
గరిమ సంభావనాపూర్వకముగం బలికె॥ 177

ఉ॥ సోమకలాకలాప! పురసూదన! నీకును నీ గణాళికిన్
సేమమె? నిన్ను జూచుటయుం జిత్తము మోదమునొందె నిట్లు ని
ష్కామత నున్న నీ కకట! కల్గెనొ కోపవికార కారణం
బీ మహి దక్షుంబోలం గలరే, మతిహీనులు హీనకోటిలోన్॥ 178

కం॥ త్వద్భాగరహిత యాగము
సద్భావముచే నొనర్చి సమసెను దక్షుం
డుద్భావిత దయ నతనికి
సద్భావ మొనర్పవలయు సర్వజ్ఞనిధీ॥ 179

తే॥ దండ్యులై నట్టివారలఁ దప్పుకొలఁది
దండితులఁ జేసి యపుడ యా తప్పుతెలిఁగు
మఱచి కరుణాసమగ్రులై మఱల వారి
నాత్మఁ జేపట్టువారె మహాత్ము లభవ॥ 180

కం॥ అనుటయు హరుఁ డట్లు కా
కని వారలఁ గూడి కదలి యధ్వరశాలా
వనికిఁ జని దక్షు మేషా
స్యునిగా నొనరించి ప్రాణయుక్తునిఁ జేసెన్॥ 181

ఉ॥ దక్షుఁడు నిద్రితుం డభిమతంబుగ మేల్కను నట్టివై ఖరిన్
జక్షువులొప్పఁగాఁ దెఱచి సత్త్వగుణాన్విత చిత్తుఁడై విరూ
పాక్షునిఁ బ్రస్తుతించి తన యాత్మజయైన సతిం దలంచి యా
పేక్షిక దోషినై తినని యెంతయు ఖేదమునొంది యంతటన్॥ 182

తే॥ మఱలఁ బూర్వాకృతిప్రాప్తి మహిత దివిష
దాప్తముని బుత్విగన్వితుఁడై భృగూక్త
మార్గమున నల్పయాజ్ఞచే మధ్యజాత
వీర సంసర్గదోష నివృత్తిఁ గోరి॥ 183

కం॥ త్రికపాల భృత [1](హరిద్ర)
వ్యకముగ హరి గుఱించి యొక్క యాగంబు సమం
త్రకముగ నొనరించుటయును
సకలాత్మకుఁ డగుట నపుడ, సంతుష్టుండై॥ 184

1. హరిద్రి.

మ॥ గరుడస్కంధ సుఖాసనస్థుఁడు ఫణిగ్రామణ్యాహీన స్ఫటా
స్ఫురితచ్ఛత్ర విరాజమానుఁ డమృతాంభోరాశికన్యా నిరం
తర సంసేవిత దక్షిణేతర వరోత్సంగుం డనంగాయుత
స్ఫురణం జిత్పరమూర్తి చక్రధరుఁ డచ్చో దృశ్యుఁడయ్యెన్ దయన్॥

సీ॥ అలరెఁ దాపము మాన నళులు తేనియలాన
వివిధ గంధముతోన విరులవాన
సుఖమనోజ్ఞరవంపు సురదుందుభుల గుంపు
లొదవించె గరువంపు ముదము పెంపు
కనుపట్టె మఖవాటమున సురేంద్రుని పీట
నెసగు కాంతల యాట యెల్లచోట
విసరెఁ జల్లని గాలి వెసఁ గొలంకులఁ దేలి
సుమనో రజఃకేళి సోలి సోలి

తే॥ తగుఁ బ్రదక్షిణ కీల సంతాన లీల
వరలె ఘన తేజనుఃన శాలవహ్ని చాల
విష్ణుఁ డుపనిషదర్థ రోచిష్ణుఁ డటుల
దక్షునకు నద్భుతముగఁ బ్రత్యక్షమగుట॥ 186

ఉ॥ వందన మాచరించి శ్రుతివాక్యముల న్నుతిసేయుచున్న ద
క్షుం దగఁ జేరఁ జీటి దయఁ జూచుచు ఖేదము వాయునట్లుగాఁ
బొందుగఁ బల్కి సత్త్వగుణపోషివి గమ్ము సుఖింపుమంచు గో
విందుఁడు వచ్చినట్ల యతి వేగమునన్ విజయంబు సేయుడున్॥ 187

కం॥ అంతటఁ బ్రధాన యాగం
బంతయుఁ బూర్ణముగఁ జేసి యా దక్షుఁడు య
జ్ఞాంతమునఁ బూజలిచ్చి, ని
రంతర సద్భక్తిఁ బ్రణతుఁడై క్షమ వేడన్॥ 188

కం॥ కమలజ హర శక్రాదులు
తమతమ నెలవులకుఁ జనిరి తమకంబున న
య్యమలిన మతియగు సతియుఁ
హిమగిరి సుతయగుచు మఱల నీశుని జేరెన్॥ 189

వ॥ అని యిట్లు మైత్రేయుండు విదురునకు నాకూతి దేవహూతి ప్రసూతుల సంతతిక్రమం బెఱింగించి యింక నుత్తానపాదుని సంతాన క్రమంబు వినుమని యిట్లనియె॥ 190

## ధ్రు వ చ రి త్ర ము

తే॥ అనఘు విధిపుత్రుఁడైన యా మనువునకుఁ బ్రి
యవ్రతోత్తానపాదాఖ్యు లాత్మ జన్మ
[1](లందు) నుత్తానపాదున [2](కంగనలు) సు
నీతి సురుచియు నిరువు రుద్గీత మతులు॥ 191

ఉ॥ అందు సునీతి నాఁ బఱఁగు నగ్ర వధూమణికిం ధ్రువుండనన్
నందనుఁ డుద్భవించి హరి నందన సుందరమూర్తి శూల భృ
న్నందన నందనీయుఁడు ననర్గళశక్తి మునీంద్రపేయ గో
విందకథాసుధైక రసవిందుఁడు సజ్జనకైరవేందుఁడై॥ 192

కం॥ ఉత్తముఁడన సురుచికి వి
ద్వత్తముఁ డగు సుతుఁడు గలిగె వర్ణిత [3](నంఖ్యా)
నుత్తమ గుణగణ సంవృత
హృత్తముఁ డితఁ డనుచు సుజనులెల్ల నుతింపన్॥ 193

కం॥ సురుచియు నుత్తముఁడును దన
కరుదుగఁ బ్రేమాస్పదంబులై యుండుట నా
నరపతి యొకనాఁ డుత్తము
నిరవుగఁ దన తొడలమీఁద నిడుకొని యుండెన్॥ 194

1. లందుల. 2. కంగనల. 3. సఖ్యా.

తే॥ కని ధ్రువుండు పంచాబ్దముల్ గలుఁగు బాలుఁ
డగుటఁ జపలత్వమునఁ దండ్రి నర్థిఁ జేరి
తాను దొడ నెక్క నర్థింప ధరణివిభుఁడు
నెత్తుకొనఁడయ్యె మోహావిహీనుఁ డగుచు॥ 195

కం॥ సానీతు నివ్విధమ్మున
నా నరపాలుండు ప్రేమ నలరింపమికిన్
మానసమునఁ బ్రమదము ఘన
మై నెరయగ సురుచి ధ్రువుని నవు డిట్లనియెన్॥ 196

శా॥ బాలా యీగతి భాగ్య మారకయు నెబ్భంగిన్ భువింగల్గు నీ
వా లక్ష్మీధవుఁ గొల్వ మాతఁడు సముద్యద్భక్తి నా పుత్రుఁగా
వాలాయంబుగఁ జేయు నిన్ను నటులన్ వర్తిల్లినం జింత యే
లా? లాలించు నరేశుఁ డుత్తముని బోలన్, జాల లీలాగతిన్॥ 197

చం॥ అనుటయు బాలుఁడయ్యును మహామతి గావున భిన్నవృత్తిఁ గై
కొని ధ్రువుఁ డంబయున్నకడకుం జని యత్తె ఱఁగెల్లఁ జెప్పినన్
వినుచు సునీతి యో తనయ! వెఱ్ఱివె, యచ్చటి కేల యేఁగి త
జ్జనపతి కస్మదీయ మగు శబ్దముఁ జాల నసహ్య మెప్పుడున్॥ 198

ఉ॥ ఆత్మఁ దలంచినన్ సురుచి యాడినమాట, గురూపదేశ మి
[1](యాత్మకు నీ) జనిన్ సుఖము నందఁదలంచితివేని సర్వ భూ
తాత్మకు వారిరాశితనయాపరిరంభవిజృంభమాణు, గా
రుత్మత యానతుష్టు హరి రూఢి భజించుట యుక్త మిత్తఱిన్॥ 199

తే॥ అనుడు సమ్మాటయును విని యాత్మలోను
ధైర్య వర్మితుఁ [2](డైన యాత్తానపాది)
తెలివిఁ దలపోసి యింక సందేహ మేల
విష్ణు శరణంబు వేఁడెద వివిధగతుల॥ 200

---

1. యాత్మలకే. 2. .........

చం॥ శ్రుతులుపఠింప శాస్త్రములఁ జూడఁ, బురాణ చయంబు ధర్మ [1](సం
హితల) నెఱుంగ నాకు నిక నేమియు నేమిటి కెల్లమార్గముల్
మతి నిరసించి యో హరి! సమగ్ర కృపానిధి! చక్రహస్త! శ్రీ
పతి! నను బ్రోవవే యనుచుఁ బాయక పల్కి తలంచి మ్రొక్కెదన్॥

వ॥ అని విచారించి జనకకృతా నాదరజనిత లజ్జావిషాది యగు
నోత్తానపాది జననికిం బ్రణమిల్లి గృహంబు వెలువడి మార్గమధ్యంబున
నారదోపదిష్ట వాసుదేవమంత్ర తత్త్వప్రకారుఁడగుచు నరిగి కతిపయ
ప్రయాణంబులఁ గళింగ గిరి [2](సంగి) విశంకట తట కటపుట స్ఫుటస్రుత
మద ధారా ధోరణి యగు యమునాతరంగిణిం గదిసెఁ, ద త్తీరంబున
సామి వికచవిచికిల వకులముఖ కుసుమ ముకుళ సంకుల బిభ్రమద్భంభర
సంభ్రమ మధుర మధుయౌవనం బగు మధురవనంబు నందు, 202

సీ॥ త్రిషవణస్నాతుఁడై దినకరాహిత దృష్టి
యగుచు నంగుష్ఠంబు లవని మోపి
యూర్ధ్వ బాహుఁడు నిల్చి యురుభక్తి నారదో
క్తము వాసు [3](దేవమంత్ర)ము నుడువుచు
వరుసఁ బర్ణోదక వాయువుల్ గొనుచుండి
యటఁ ద్రిమాసంబుల నవియు మాని
యచలుఁడై నిర్ద్వంద్వుఁడై తపం బొనరింప
నతనికి నెల లాఱు నరుగునంతఁ

తే॥ జిత్తమెంతయుఁ గఱఁగి లక్ష్మీవిభుండు
చెన్నుమీఱంగ సన్నిధి చేసి నిలిచి
యతని వందన సంస్తుతు లాచరించి
పలికెఁ గరుణారసాన్వేష కలితుఁడగుచు॥ 203

1. సంహితుల. 2. శంగి. 3. దేవుమంత్ర.

కం॥ వత్సా! ముల్లోకముల భ
వ త్సాహస మద్భుతంబు వరనియమగతిన్
త్వత్సేవా సాఫల్య ది
దిత్సం జనుదెంచినాడఁ దెలియఁగ వినుమా॥ 204

సీ॥ జనకుని యాజ్ఞచే సకలోర్విఁ బాలించి
యిఱువదియాఱు వేలేండ్లమీఁద
నక్షత్ర తారా సనాథగ్రహశాఖు [1](స
ప్తర్షి) నిత్యకృత ప్రదక్షిణంబు
నిత్యంబు నత్పదోన్నత మున్నతమును
నగు ధ్రువస్థానంబు నంది నిలిచె
దిల జేనియంకంబు నెక్కంగ [2](దొరకొని)
[3](బడుగవై) యిట్టి మత్పదము నెక్కి
తే॥ తనుచు నానతి యిచ్చి లోకాధినాథుఁ
[4](డాక్షణంబు)న నంతర్హితాత్ముఁ డయ్యె
నభిమత ప్రాప్త ముదితాత్ముఁ డైన ధ్రువుఁడు
తిరుగ నాత్మీయపురి కరుదెంచుటయును॥ 205

వ॥ జనకుండైన యుత్తానపాదుండును సునీతి సురుచ్యుత్తములం గూడి చతురంగపరివృతుండై యెదుర్కొని, 206

కం॥ వందారుండగు సుతు నా
నందంబునఁ గౌఁగిలించి నయనజ [5](ముద్వా)
[6](స్న్యందుం) డయ్యె, సునీతియు
నందను నార్యుం జనాభినందితచరితున్॥ 207

1. సప్తఋషి. 2. దొరకని. 3. క్రొత్తుకవై. 4. దక్షణంబు,
5. మూర్ధ్నా. 6. నిస్యంద,

కం॥ వెరవున నురమునఁ జేర్చుక
యురోజములు సేఁప ముదము నొందుచునుండన్
సురుచియు నుత్తముఁడుం దగఁ
బరిరబ్ధునిఁ జేసి రతనిఁ బటువత్సలతన్॥ 208

తే॥ ధ్రువుని నుత్తము నొక్క సింధురము మీఁద
నమర నిడుకొని వివిధ వాద్యములు సెలఁగ
భాగ్యనిధియైన యుత్తానపాదుఁ డాత్మ
మందిరంబుఁ బ్రవేశించె మహిమతోడ॥ 209

ఉ॥ ఇజ్యలు పెక్కొనర్చి యమరేడితుఁడై మనుపుత్రుఁ డంతయున్
బ్రాజ్యతరోప భోగముల పై గత నిస్పృహుఁడై ధ్రువుం బ్రజా
రాజ్యనురక్తు యౌవనవిరాజితు నాత్మసమాన శౌర్యుఁ ద
ద్రాజ్యపదస్థుఁ జేసి మునిరాజులు మెచ్చఁగ నేఁగెఁ గానకున్॥ 210

తే॥ శింశుమార ప్రజాపతి శ్రేష్ఠ దుహిత
కామినీమణి భ్రమి భార్యగా ధ్రువుండు
శ్రీలు దైవార రాజ్యంబు సేయుచుండు
నంతఁ దదనుజుఁడగు నుత్తమాహ్వయుండు॥ 211

కం॥ మృగయాసక్తుండై హిమ
నగమున మృతుఁడైన తద్వినాశము వినుచున్
వగపున ధృవుఁ డప్పుడ త
ద్దిగభిముఖుం డగుచు దాడి ధీరత వెడలెన్॥ 212

తే॥ వెడలి యలకాపురంబున్న కడకు నేఁగి
యచట శంఖంబు పూరింప యక్షవీరు
లాక్షణంబ కృతక్ష్వేళు లగుచు వెడలి
యుద్ధ మొనరించి రమ్మహాయోధుతోడ॥ 213

కం॥ అన్న రనాయక సూనుఁడు
విన్నాణము మీఱ విశిఖవృష్టిఁ గురియుచుఁ
ఛిన్నాహిత మస్తక సం
ఛన్నముగాఁ [1](జేసె) జన్య జగతీస్థలముఁ॥ 214

ఉ॥ ఆజి హతావశిష్టు లగు [2](యక్షు లదృశ్యత)నొంది మాయచే
నోజపడఁ బయోదముల నుద్భవమందఁగఁ జేసి వానిచే
రాజతనూజు మీఁదఁ బ్రచురంబుగ నాయుధ హేయవస్తు సం
యోజిత చిత్రవర్షముల నుద్ధతులై కురియించి రంతయుఁ॥ 215

తే॥ చక్రిఁ జింతించి యాచాంత సలిలుఁ డగుచు
ధ్రువుఁడు నారాయణాస్త్రంబుఁ దొడఁగు నంత
నాత్మకృత మాయలన్నియు నణఁగి యక్షు
లంత నంతఁ బలాయితులైన యంత॥ 216

సీ॥ స్వాయంభువ మనువు సన్మునీంద్రులఁ గూడి
యచటికి నరుదెంచి యాత్మపౌత్రుఁ
గని వత్స! వీరల ననపరాధుల భ్రాతృ
హంతలనుచు నేల యణఁచి తిటుల
దేహికిఁ గర్మంబె దేహయోగముఁ జేయుఁ
ద ద్వినాశంబును ద ద్విధంబు
హింస మానుము భృత్య హింసచేఁ గలిగిన
యక్షేశుఁ బ్రార్థింపు మనుచుఁ బలికె

తే। యరుగునంతఁ గుబేరుండు నచట నిలిచి
వైష్ణవోత్తమ! కోపంబు వలదు విష్ణు
భక్తి నీమది నిత్యంబుఁ బ్రబలుగాక
యనుచు నతఁడుఁ దిరోహితుఁ డయ్యె నంత॥ 217

---

1. జేసి. 2. యక్షులు దృశ్యత.

వ॥ ధ్రువుండు కోపంబు మాని నిజపురంబునకు వచ్చియుండు సమయంబున, 218

చం॥ సురుచి సుతాంత సంజనిత శోకవిదారిత యయ్యె నంత భా
సురతరకీర్తి యా ధ్రువుఁడు సూనుని నుత్కలనామధేయు సు
స్థిరతర రాజ్యలక్ష్మి కభిషిక్తునిఁ జేసి విరక్తుఁడై వనాం
తరమున కేఁగి విష్ణుపదతామరసస్మృతి సక్తచిత్తుఁడై॥ 219

ఉ॥ ఉండగ నొక్కనాడు దివినుండి సువర్ణ విమానమెక్కి మా
ర్తాండ సమానతేజులు, గదాధరసన్నిభ దివ్యమూర్తు ల
య్యండజ రాజకేతు భటు లార్యులు నంద సునందనాము లొ
దండకుఁ జేరవచ్చి యుచిత ప్రియభాషలఁ బల్కి రవ్విభుః॥ 220

కం॥ ఔత్తానపాది హరి గడుఁ
జిత్తంబున మెచ్చి తన విశేషపదము ని
న్నిత్తఱిఁ బొందించుటకై
పుత్తెంచెఁ మమ్ము రమ్ము పోవగవలయుఁ॥ 221

తే॥ అనుటయును దల్లిఁ దోడ్కొని యా ధ్రువుండు
మానితంబగుఁ గనక విమానమెక్కి
యమరు లభినుతిసేయంగ నరిగి విష్ణు
పదము నందున్నవాఁడు శ్రీ భక్తకరుణ॥ 222

వ॥ ఇవ్విధంబున [1](ని)ఖిల హేయప్రత్యనీక కళ్యాణైకతాన, జ్ఞానానందైక స్వరూపతానిరూపితుండును, నస్పృష్టాశేష దోషస్వాభావికానవధికాతిశయ జ్ఞానబలైశ్వర్య వీర్య కీర్తి శక్తి తేజః [2](ప్రభృత్య) సంఖ్యేయ కల్యాణగుణ మహోదధియును, లక్ష్మీపదాంకుండును, వివిధ విచిత్రానంత భోక్తృవర్గ భోగోపకరణ భోగస్థానపూర్ణ నిఖిలజగదుదయ

1. న. 2. ప్రవృత్య.

విభవ లయ[1](లీలుం)డును, బరబ్రహ్మయుం, బురుషోత్తముండును, నగు నారాయణునియందలి భక్తియోగంబు సర్వపాపవినిర్ముక్తార్థ భగవత్ప్రియపురుష నిర్వర్త్యంబగు నని శంకించిన, భక్తియోగారంభ విరోధ్యనాదికాల సంచిత నానావిధానంత పాపంబులకుం బరిమిత కాలవర్తియగు జనునిచేతం దత్ప్రాయశ్చిత్తరూప కృచ్ఛ్రచాంద్రాయణ, కూష్మాండ, వైశ్వానర, వ్రతపతిత పవిత్రేష్టి త్రివిధాగ్నిష్టోమాది నానావిధంబులు దురనుష్ఠానంబులు గావునం దద్ధర్మంబులుం దత్ప్రాయశ్చిత్తత్వంబున నపేక్షించుట యుక్తంబు గాదని యెఱింగి వాఙ్మనసా పరిచ్ఛేద్యస్వరూప స్వభావుండును, నపారకారుణ్య సౌశీల్యౌదార్య మహోదధియును, ననాలోచిత విశేషాశేష లోకశరణ్యుండును, బ్రణతార్తిహరుండును, నాశ్రిత వాత్సల్యైకనిధియును నగు శ్రీమన్నారాయణుని సర్వోపాయంబుల శరణంబు పొందెం గావున ధ్రువుండు భగవదనుగ్రహ పాత్రుండయ్యె నిట్టి ధ్రువచరిత్రంబు నారదుండు సకలవేదితుం డగుటం జేసి మహాభాగులును, మహాభాగవతులును నగు ప్రాచేతసుల ముందర వీణాక్వణన పూర్వకంబుగాం గీర్తించె నియ్యుపాఖ్యానాకర్ణనంబున నభీష్టసిద్ధియగు ననిచెప్పి మైత్రేయునిం గనుంగొని విదురుండు, 223

కం॥ ముని శార్దూల! ప్రచేతసు
లన నెవ్వరు? వారికొలువు నందేగతి న
మ్ముని నొడివె నే విశేషము
లనుటయు మైత్రేయుఁ డనియె న వ్విదురునకున్॥ 224

## వే న చ రి త్ర ము

సీ॥ అనఘాత్మ! ధ్రువపుత్రుఁడైన యుత్కలుఁడు వా
త్సరుఁ గాంచె పుష్యుఁ డాతనికి నెసగెఁ

1. శీలుం.

సర్వతేజుండు తజ్జత నొందె నతనికిఁ
జక్షుర్మనువు తనూజాతుఁ డయ్యె,
[1](నుల్ముకుం) డతనికి నొదివె [2](నంగుండాత)
నికిఁ గల్గె వేనుఁ డా నృపతి కలరె
వేనుని దుర్మార్గ వృత్తి కోర్వఁగలేక
[3](యంగుఁడెం)దేనియు నరిగె ధాత్రి

తే॥ యంగు డరిగినమీఁదఁ దన్నఖిల [4](మంత్రి)
గణము రాజ్యాభిషిక్తుని గా నొనర్ప
వేనుఁ డున్మత్త మత్తతావిష్టుఁ డగుచు
సకల జనబాధకుండయి సంచరించె॥ 225

కం॥ స్నానము దానంబును యా
గానుష్ఠానంబు నితరమగు నియమం బె
వ్వానికిని జేయరా దని
నానా దేశములఁ జయ్య నాజ్ఞాపించెన్॥ 226

సీ॥ యాగముల్ సేయు నయ్యల [5](సోమిసానులఁ)
జెఱులు వెట్టించు వాంశికులచేత,
[6](కమ్మగాఁ) జేసిన క్రతుపురోడాశముల్
మెసఁగు నాజ్యాది [7](సమ్మిశ్రితముగ),
సజ్జనుల్ మ్రొక్కు నర్చావిగ్రహంబులఁ
దరటుల [8](వేయించుఁ) దత్తరమున
పుణ్యతీర్థములాడఁ బోవుపుణ్యులఁ బట్టి
వెట్టిమోపులు మోవఁ బట్టి మోదు

1. వుత్కలుండ. 2. నంగుడాత. 3. యరుగుడెం. 4. మంత్ర.
5. సోమసానుల. 6. క్రమ్మగా. 7. సమ్మిష్టితము. 8. వ్రేయించు.

తే॥ నవని నానావిధానూన యజ్ఞకులము
వితత శాస్త్రోక్త దేవతావితతులకును
నఖిలవిభులకు నేన నాయకుఁడ నగుచు
నతి విహీనుఁడు వేనుఁ డిట్లనుచుఁ దిరిగె॥ 227

కం॥ జారులు చోరులు నధికము
గా రాయిడి సేయఁ దఱచుగా సత్యంబుల్
దీరగ గన్యాయస్థితు
లోరువఁగా లేక ధాత్రి యుల్లల నుడికెన్॥ 228

కం॥ మానులు చేరి మఖాను
ష్ఠానము లర్థింప నేనె సర్వేశ్వరుఁడన్
'వేనాయ స్వాహా' యని
కాని మదన్యునకు వేల్వఁగా రా దనుచున్॥ 229

తే॥ ఇటు ఖలుం డింక నీయుర్వి నేలనేని
సమయు నంతయు నని మునుల్ చాల నలిఁగి
చేరి హుంకృతిమార్గంబు సేసి యతని
బొలియఁ జేసిరి జనులెల్లఁ బొగడ నపుడు॥ 230

వ॥ ఇవ్విధంబున మునులు వేనునిం గ్రోధనిహతునిఁ గావించిన నతం డనపత్యుం డగుటం జేసి రాష్ట్రంబంతయు జారచోర [1](బాధితం బగుచు నానాహింసల నొందుచు) నశింపం దొడంగినం గనుంగొని, 231

## పృథుచరిత్రము

సీ॥ తెలివివిహార సరస్వతీ నదీజలముల
నభిషేక మొనరించి యఖిలమునులు

---

1. .........

రాజ్యంబు రక్షించు రాజును [1](గల్పింపఁ)
జింతించి వేనునిఁ జేరి యతని
యూరువు [2](మథియింప నొక్క-)నిషాద నా
ముఁడు పుట్టి గిరివర ముఖ్యుఁడయ్యె
మఱియుఁ దద్బాహువుల్ మథియింప నందు శ్రీ
హరి పృథునాఁడన ఘనుండయ్యె నర్చి
తే॥ యర్చి యను కాంతయయ్యె జేయనగఁ బుట్టె
మిథున [3](భావంబు) గైకొని మెఱసి రపుడు
దుందుభిధ్వానములు దివి సందడించె
నమరకుసుమనిపాతంబు లవని నెఱసె॥ 232

వ॥ ఆ సమయంబున, 233

మ॥ పృథునిం బట్టముఁ గట్టి రా మునులు సంప్రీతిన్ మహాశీర్వచః
ప్రథితప్రాభవుఁగా నొనర్చిరి హరిత్పాలుర్ కిరీటాదులన్
శ్లథయా భక్తినొసంగి రుజ్జ్వల మహాశ్చక్రంబు చక్రంబు సం
గ్రథితారి స్ఫురణాపహారంబుగ, రమాకాంతుం డొసంగెన్ దయన్॥

కం॥ నైన్యుం డీగతి నెంతయు
[4](దైన్యంబున) ధరణీభరముఁ దాల్చుచునుండన్
వన్యములు గ్రామ్యములు నగు
ధాన్యంబులు పంటగతులఁ దఱఁగి నశించెన్॥ 235

వ॥ అప్పుడు,

ఉ॥ అన్నములేక నొచ్చి ప్రజలందరు గూడి యథాతథంబుగా
విన్నప మాచరించుటయు వైనతనూభవుఁ డద్ధరిత్రిపై,
నున్నతమైన కోపమున నొక్క- శరంబు శరాసనంబుతో
సన్నకు సన్నఁగూర్చుటయుఁ జయ్యన నింతయుఁగాంచి యుర్వరన్॥

1. గల్పించి. 2. ......... 3. భూయంబు. 4. దైన్యంబు.

తే॥ అపుడు గోరూపధారిణి యగుచు ధాత్రి
గదలి మెండేని బరువిడఁ గని విభుండు
దాను వెన్నడి జనుచు మంద్రస్వరమునఁ
బలికె నిట్లని యౌచిత్య పథ మెఱింగి॥ 237

చం॥ శ్రితజన రక్షణంబు నెడఁజేయుచు నోషధిబీజముల్ గ్రసిం
చితి విఁక ధేనురూపమునఁ జెల్గుదె దాగగ దానినెల్లఁ బా
లిత నయలీల నీవు వెడలింపుము మామక బాణఘోరణీ
గతిఁ దిలమాత్రఖండములుగా రచియించెదఁ బోనిలేనియున్॥ 238

చం॥ అనుటయు ధాత్రి యిట్లను నృపాగ్రణి! దుష్కృతకారు లెంతయున్
మొనసిన నోషధీప్రకరమున్ గ్రసియించితి జీర్ణమయ్యె నన్
గనక వధించితేని యుదకంబు సమస్తము నాక్రమించు నీ
జనపతి [1] (యొట్లు) నిల్వకోనఁ జాలునన న్నరపాలుఁ డిట్లనున్॥ 239

ఉ॥ యోగజ శక్తిచే జనుల నొప్పగ నిల్పెద నిన్ను నిష్ఫలన్
సాగక నిత్తునే యనుచు సాగరమేఖల పల్కె నో మహా
భాగ! జగత్పరేశ్వరత భాసిలు విష్ణుఁడ వీవ, నీదు మా
యా గుణవృత్తిచే నగు గదా తలపోయగ విశ్వ మంతయున్॥ 240

కం॥ ధర్మంబు దఱఁగి యెప్పుడ
ధర్మము వర్ధిల్లు నపుడ ధరఁ బుట్టి మహో
నిర్మల తేజోనిధివై
శర్మం బొనరింతు విట్లు జనులకు నెల్లన్॥ 241

ఆ॥ ఏను నీమహాత్త్వ మెఱిఁగితి నిఁకఁ బెక్కు
వాక్కు లేల భిన్నవత్స ధోగ్ధృ
పాత్ర కల్పనంబు [2] (బరగంగఁ గావింపు)
మిష్ట వస్తుతతుల నిత్తు నెపుడు॥ 242

1. యిట్లు  2. .........

వ॥ మఱియు నిమ్నోన్నతత్వంబుల మెలంగ ననువుగాక యున్న నన్ను సమస్థలిగా నొనర్పు మని తెలిపి ప్రసాదంబు నొందుటయును, 243

తే॥ మనువుఁ గ్రేపుగ నొనరించి తన కరంబె
పాత్రముగఁ జేసె వైన్యభూపాలకుండు
ధరణి ధేనువుఁ బిదికె మోదంబు మీఱ
వినుతసకలౌషధులఁ బుడమి జనుల కొసఁగె॥ 244

వ॥ ఇట్లొసఁగి యనంతరంబ యఖిలభువనవాసులం బిలిచి మీ మీ యభిమతార్థంబులు మహీధేనువుఁ బిదికికొండని నియోగించుట యును, బితరులు సూర్యుండు [1](వత్సంబుగా) [2](గాలుండు పిదుకువాఁడు నుఁగా, నామ[3](పాత్రంబున)ఁ గవ్యదుగ్ధంబును, గిరులు హిమవద్వత్స కంబును, మేరు దోహకంబునుంగా సానుపాత్రల యందు వివిధ రత్న మహౌషధు[4](లను దుగ్ధంబును), నచ్చరలు విశ్వావసువత్సకంబుగాఁ బద్మమయపాత్రంబు నందు సౌందర్యమయ క్షీరంబును, సిద్ధవిద్యాధరులు కపిలవత్సకంబుగా నాకాశపాత్రంబునందు సంకల్పమాపసిద్ధ ఖేచరత్వమయ క్షీరంబులును, గింపురుషులు మయవత్సకంబును నాత్మపాత్రకంబునుంగా మాయాక్షీరంబును, రాక్షసులు భూతవత్సంబుగాఁ గపాలపాత్రంబు నందు రుధిరాసవ క్షీరంబును, బన్నగంబులు తక్షకవత్సకంబుగా బిల పాత్రలయందు విషమయ క్షీరంబును, వనస్పతులు వటవత్సకంబుగాఁ బుష్పపాత్రల భిన్న[5](గంధము ను)క్షీరంబును, దక్కంగల సకలచరాచర భూతంబులు, నాత్మీయ వాంఛితంబులు శాశ్వతంబులుగాఁ బడసి పర మానందంబు నొంది రంత, 245

---

1. వత్సంబుగా – పో-భా. నందును, సం-భా. యందును లేదు. అముపాత్ర కలదు. 2. గాలుండు ...... గా — ఈ పదములు పో-భా. నులో గాని, సం-భా. లోను లేవు. (అపంపూర్ణము). 3. రజతమున్పాత్రంబున. 4. నాగంబును 5. వసముయంబు అని సంస్కృత భాగవతము, ప్ర॥ంచా॥అ॥ రోమాహూప పయస్సని పో-భా. ఓ. స్కం.-502.

ఆ॥ ధరణి నాయకుండు ధరపైన ధరములఁ
గార్ముకంబుకోటిఁ గడకు మీటి
గుట్టఁ బడఁగఁ గట్టి కొట్టి గదాఘాత
ములఁ సమత్వ మిలకుఁ గలుగఁ జేసి॥ 246

వ॥ భూతలమున నక్కడక్కడ దుర్గ పట్టణ ఖర్వట ఖేటక గ్రామ ఘోష పక్కణాదులు నిర్మించె. వసుంధరాదేవియుం బృథుని శాసనంబున నిలిచిన కతంబున నతనికిం బుత్రియై యవిరళప్రాణిసంకీర్ణయై యతిశయిల్లె నట్లు పూజ్యంబైన సామ్రాజ్యంబునం బరగుచుండె. 247

సీ॥ ఆ పృథుభూవరుం డశ్వమేధము లత్రి
యాజకుండుగ వేడ్క నాచరింప
శతతమాధ్వరమున సంక్రందనుండు పా
షండ వేషమున నశ్వంబుఁగొనుచు
నరుగఁ బృథుపుత్రుండను తత్సుతుండు గెల్చి
మఖములలో [1](నిల్పె) మఱల హయము
నతని నమ్మునులు జితాశ్వనాముకుఁ డని
పలికి రంతయు విని పార్థివుండు
తే॥ శక్రుపైఁ జాల కుపితుండై జలజభవుని
[2](చే సమాదిష్టుఁడై) శాంతచిత్తుఁ డగుచు
ననుపమానంబుగాఁ దపోధనము గూర్చి
యాత్మపదమొందెఁ బృథ్వాఖ్యుఁడైన చక్రి॥ 248

కం॥ ప్రధనముల కేఁగువేళలఁ
బృథుని దలంచిన జయంబు పృథివీశులకుం
బ్రథితంబగుఁ బృథుని మనో
రథిఁ జేయుఁ బ్రమాణములు నుతింప ఫలించున్॥ 249

1. నిల్చె   2. చేతనుమోదితుఁడై

కం॥ ఈ యాఖ్యానము కీర్తి ద
మాయుష్యము సౌఖ్యదం బనామయకర మా
దేయంబని పేర్కొని మై
త్రేయుఁడు విదురునకు మఱియుఁ దెలుపుమఁ బలికెన్॥ 250

## ప్రాచీనబర్హి వృత్తాంతము

మహాస్రగ్ధర॥
పృథుఁ డీరీతిం ధరిత్రిన్ బృథివియని జనుల్ పేర్కొనం జేసి యాశా
గ్రథితప్రత్యగ్ర కీర్తిక్రమవిజిత సురగ్రామణీ నిర్నిరోధ
ప్రథుఁడై యాత్మశ్రేయాప్తిం బరగిన సరిరాడ్భాఖుని దత్తనిత్య
వ్యథుఁడార్యుం డాజితాశ్వాహ్వయుఁడ తనిసుతుం డర్థిరాజ్యంబు సేసెన్

కం॥ వినుచు వసిష్ఠుని శాపం
బున నగ్నిత్రయీ జితాశ్వ భూపాలునకున్
దనయత నొందెను పావకుఁ
డనఁ బవమానుండు శుచియు నన జనవినుతా॥ 252

కం॥ అతనికి సహధర్మిణియై
ధృతిశాలిని యగు [1](నభస్వతీ) మానినియుం
దతులహవిర్ధానాహ్వయ
సుతుఁ డుదయము నొందెఁ గులయశోవర్ధనుఁడై॥ 253

తే॥ ఆ నరాధిపునకు హవిర్ధానియందు
బర్హిషదుఁ డను సుతుఁడు సంభవము నొందె
సూనుఁ డయ్యె నతనికిఁ బ్రాచీనబర్హి
యనఁగ వెలసెను నయజయోదంచితుండు॥ 254

1. నభస్వతి

కం॥ అగ్రియముఖములఁ బ్రాచీ
నాగ్రకుశాచ్ఛాదితాఖిలావని యగుటన్
దుగ్రవినిభుండగు నతఁ డ
వ్యగ్రతఁ బ్రాచీనబర్హి యన నొప్పారెన్॥ 255

చం॥ అతుల మహాప్రతాపనిధి కా నరపాలుని కబ్ధికన్యయౌ
శతధృతియందు ధీరులు ప్రశాంతమనస్కులు తుల్యసద్వ్రతో
న్నతి మహితుల్ ప్రచేతసు లనందగు నందను లేకనామ సం
గతులు పదుండ్రు పుట్టి రవికారులు శూరజనాగ్రగణ్యులై॥ 256

కం॥ జనకునిచే వారలు స
ర్గ నియోగము నొంది యేఁగగా మఱి మధ్యం
బులఁ దపముసేయఁ బ్రాగ్దిశఁ
జని చని కని రొక్క దివ్య జలజాకరమున్॥ 257

తే॥ ఆ సరోవరసలిలమధ్యమున నుండి
వెడలి చనుదెంచు పార్వతీవిభుని గాంచి
విస్మయము నొంది వారలు వినతు లిడుచు
సన్నుతించిన నతఁడు ప్రసన్నుఁ డగుచు॥ 258

సీ॥ తండ్రిపంపునఁ జేసి తప మాచరించుట
కంబుజోదరునిదాస్యంబుఁ బూని
యంబుధిమధ్యదేశంబున కేఁగు మీ
తలఁపు లెస్సది గదా ధన్యులార
హరిదాసు లగువార లరయ నెప్పుడు నాకు
నిశ్చితంబుగ మాననీయు లగుట
నరుగుదెంచితి నిప్పు డతిరహస్యము మీకు
నొకటి సెప్పెద వినుఁ డోసర ననుచు

తే॥ నలువ సర్గాది సనకాదినందనులకు
జెప్పినట్టి హరిస్తవం బొప్పఁ దెలిపె
హరియు మీపాలఁ గలఁడని యానతిచ్చి
యరుగుటయు రాజపుత్రు లాహ్లాదమొంది॥ 259

కం॥ హరుఁ డుపదేశించిన గతి
హరిపైఁ బరభక్తి తమకు నాత్మలఁ బొదలన్
శరనిధిమధ్యస్థలమున
నురునిష్ఠం దపముసేయు చుండగ నంతన్॥ 260

తే॥ పూని మఖములు సేయ బ్రాచీనబర్హి
యున్నచోటికి నారదుఁ డొక్కనాడు
వచ్చి యతఁడిచ్చు పూజలు మెచ్చి యతని
నచ్చమగు భక్తిఁ జలుఁగ నిట్లనుచుఁ బలికె॥ 261

నారద ప్రాచీన బర్హి సంవాదము

మ॥ అఖిలంబున్ దనమూర్తియై వెలుగు బ్రహ్మాండాధినాథున్ రమా
సఖుఁ గైంకర్యవిశేష తోషితునిగా సద్భక్తితోఁ జేయుచున్
సుఖియైయుండుట మేలు గాక పశుహింసుండై యహంకారియై
మఖముల్సేయగ నేమిగల్గు నృపసన్మార్యాద లూహించినన్॥ 262

చం॥ విశదమతిం బరాపరుని విష్ణునిఁ గూర్పక తన్ను నూరకే
విశసన మాచరించు నవివేకహతుం బరలోక సీమ న
ప్పశువు లితండు వర్జితకృపాగుణుఁ డంచు మహాప్రహార వే
గశమిత గర్వభంగురునిగా నొనరించుఁ జుమీ ఫలంబునన్॥ 263

కం॥ మమకారాహంకార
భ్రమకారణ కృతవికార భావ్రజము నను
త్తమ కామితా పరుసకును
యమకారిత బాధ తలఁగు టరిదిదె తలఁపన్॥ 264

వ॥ ఈ యర్థంబున కొక యుపాఖ్యానంబు గల దాకర్ణింపు మని యిట్లనియె॥ 265

## పురంజనోపాఖ్యానము

సీ॥ ఘనుఁడు పురంజనుం డను నొక్క రాజు వి
జ్ఞాతనాముం డగు సఖునిఁ గూడి
తగఁ దూర్పుదిశ నైదు దక్షిణోత్తరముల
రెండు పశ్చిమమున రెండు నైన
వాకిళ్ళు గల యొక్క వరపురం బీక్షించి
యందు సఖీదశకానుయాత
పంచాననోరగప్రతిహారయుతప్రమ
దోత్తమ యను నొక్క యువతిఁ గాంచి
తే॥ యీపురంబున నను వరియించి యుండు
మని, తదర్థితుఁ డగుచు న య్యతివఁ గూడి
యప్పురమునందు వసియించి యఖిలభోగ
సౌఖ్యములఁ దేలుచుండె నాసక్తుఁ డగుచు॥ 266

వ॥ మఱియు నతం డొక్కతఱిం బంచాశ్వయుక్తంబును, చక్రద్వయోపశోభితంబును, గూబరద్వయ విరాజితంబును, హేమపరిష్కృతంబును, బంచపాశబద్ధంబును, జతురసారథికంబును, సక్షయతూణీరకలితంబును, విపులరథికోపవేశ స్థానంబును నగు రథంబున నధిష్ఠించి, యేకాదశ చమూపతి సహితుండై మృగయావిహారంబులు సలుపుచు మఱియు నొక్కతఱి నగ్నిష్టోమా త్యగ్నిష్టో మోక్థ్యషోడశివాజపేయాతిరాత్రాప్తోర్యామ ప్రభృతి మఖంబుల నహంకారసంకలితుండై యొనర్చుచుఁ బాంచాలదేశోపవనసుఖంబు లనుభవింపుచు నకృత్యకరణకృత్యాకరణ [1] (ప్రవణుండై), 267

1. ప్రవణ్ణుండై.

ఆ॥ ఆ పురంజనాఖ్యుఁ డా ప్రమదోత్తమ
వలన సుతులఁ బడసి వఱలుచుండఁ
గాలనామయుఁ గొల్చు గంధర్వు లెప్పుడు
నాక్రమింపఁ జూతు రప్పురంబు॥ 268

ఉ॥ చారుముఖంబు లేనును ? బ్రజాగరనాముఁడు గల్గు నా ప్రతీ
హారుఁడు తత్పురిం జొరగనట్టిడి కాలుని బంట్లతో విడిక
బోరుచు నూఱువర్షములు పోయెడు నంతకుఁ జింతమీఱి ని
స్సారత నుండ నల్పతర సౌఖ్యము నొందెఁ బురంజనాఖ్యుఁడున్॥

తే॥ అంత భయనామకుఁడను నయ్యవనపతికి
నగ్రజుండైన [1](ప్రజ్వారుఁ) డగ్నిసముఁడు
హారి గంధర్వగణ హృత సారమైన
యప్పురంబు నిరోధించె నాగ్రహమున॥ 270

కం॥ రయ భయ సంపన్నుం డగు
భయనామకుఁడైన యవనపతియును భోగ
ప్రియుఁడగు పురంజనాఖ్యుని
నయుత ప్రక్రియలఁ బొదివి యార్తునిఁ జేసెన్॥ 271

వ॥ ఇవ్విధంబున గంధర్వగణపీడితంబును, గాలకన్యకోపభుక్తంబును, బ్రజ్వరార్దితంబును, భయనామక యవనప్రవిష్టంబునునైన యా నవద్వారంబునందు వసియింపఁ దరంబుగాక పురంజనుండు తన సఖుండైన యవిజ్ఞాతునిం దలంప నెఱుంగక మమతాపాశబద్ధుండగుచు నాత్మగతంబున,

ఉ॥ ఈపురి నాకు భోగముల కెప్పుడు దానక మెట్టివేళయం
దోపక గల్గు నట్టి ప్రమదోత్తమ నా సతి సర్వసౌఖ్య సం
స్థాపకుఁ డీ ప్రజాగరుఁడు సంతతియంతయు వేడ్క యున్నియున్
బాపపు దైవమింకఁ బనివాపగఁ జూచునొ యొక్కపెట్టునన్॥ 273

1. ప్రజ్వరు.

వ॥ అని విచారంబు నొందుచు, 274

కం॥ కడు యవనపీడితంబై
యొడికంబగు నప్పురమున నుండగరామిఁ
వెడలం జాలక యొకగతి
వెడలెఁ బురంజనుఁడు ఘోరవిక్ృతాకారవృఁడై ॥ 275

వ॥ ఇట్లు వెడలి చని, 276

సీ॥ తొలిఁ దొలిఁ దాఁ బురస్థుండయి చేసిన
కర్మ సంఘము విపాకంబు నొంద
గ్రతుసుత పశువు లుత్కటరోషమున వచ్చి
మర్మప్రహారోద్యమమున నిలువఁ
గడు నొచ్చి యటఁ గొంతఁ గాల మీ గతిఁబోవఁ
బుణ్యఫలైక విస్ఫురణఁ జేసి
యా ప్రమదోత్తమ యాసఖి పతిఁబాసి
తనకు నెఱింగింపఁ దక్షణమున

తే॥ సఖుని విజ్ఞాతుఁ, దెలిసెఁ ద త్సహాజ కరుణ
భాసురంబైన యచ్యుత పదముఁ గాంచె
ననుచుఁ బలికిన నారద మునివరేణ్యుఁ
బలికె నిట్లని ప్రాచీనబర్హి యపుడు। 277

మ॥ అనఘా! నీవిపు డిట్లు చెప్పిన యుపాఖ్యానంబు వేఱొండులా
గునఁ జిత్రధ్వని సంగతం బగుచు నాకుం దోచె మేల్మేలు నీ
జనితానందవచోవిశేషములు మెచ్చం జాలు సువ్యక్తమై
యొనరం బల్కుము నాపుడు న్మునియు న య్యుర్వీశుతో నిట్లనున్॥

వ॥ వినుము పురంజనుం డనఁగ జీవుండు, త త్సఖుండ విజ్ఞాతుం డన నీశ్వరుండు, నవద్వారంబన దేహంబు, ప్రమదోత్తమ యన బుద్ధి, చెలులు దశేంద్రియవృత్తులు, పంచముఖోరగంబన పంచవృత్తి యైన

ప్రాణంబు దేహంబను రథంబునకుఁ బంచాశ్వంబు లింద్రియంబులు, చక్రంబులు పుణ్యపాపంబులు, కూబరంబులు శోకమోహంబులు, హేమ రచన రజోగుణంబు, పంచపాశంబులు పంచప్రాణంబులు, సారథి బుద్ధి, యక్షయతూణీరం బహంకారంబు, రథికోపవేశస్థానంబు హృదయంబు, నేకాదశచమూపతు లేకాదశేంద్రియంబులు, పాంచాలదేశంబన విష యంబులు, సంతతి యన మనోరథంబులు, కాలనామకుండనఁ గాలంబు, గంధర్వులన దివసంబులు, ప్రజ్వరుండన జ్వరంబు, భయనామకుండన భయంబు, పురంబు వెడలుట దేహావిసర్జనంబు, ఇట్టి క్షేత్రజ్ఞునకు బుద్ధి [1](వైశద్యంబు)నం గలుగు నీశ్వరజ్ఞానంబునఁ బరమ విశుద్ధి గలుగు, నుపనిషత్తులును నీతని నెఱింగి యమృతుండగు గాని యన్యంబగు పథంబు లేదని పలుకు నిట్టి యధ్యాత్మతత్త్వంబు రాజకథామిషంబుగా నీకు నెఱింగించితి నని యిట్లనియె. 279

కం॥ ధరణీధరధర్మజాలము
నరనుత ! సద్గతికి సాధనంబునఁ జనదో
నరవర ! నరహరి [2](చరణ)
స్మరణ......విధూత సకలాఘులకున్॥ 280

కం॥ ఈ పౌరంజన నామ శు
భోపాఖ్యానంబు వినిన యుత్తముఁ డతి భ
ద్రోపేతుం డగునని ముని
యా పార్థివుతోడఁ బలికి యరిగె నిజేచ్ఛన్॥ 281

## ప్రచేతసులకు విష్ణుండు ప్రత్యక్షంబగుట

సీ॥ ప్రాచీనబర్హి యప్పగిది నారదునిచే
బోధితుం డగుచు నప్పుడ ప్రధాన

1. వైశక్యంబు. 2. శరణ.

కలిత [1](రాజ్యండై చుఁ) గపిలాశ్రమమునకు
నరిగి యచ్చట నిస్పృహాత్మ మమరఁ
గమలాక్షుదాస్యంబుఁ గైకొని యవ్విభుఁ
జేరి సేవించె నిశ్చిత్తవృత్తి
నంత నచ్చట నమ్మహాత్ముని సుతులైన
యా ప్రచేతసు లట్టు లబ్ధినడుమ
ఆ॥ నయుత వత్సరంబు లతిఘోరనిష్ఠచే
నిలచి తపము సేయ నీరజాక్షుఁ
డతి కృపాళుఁ డగుట నా రాజసుతులకు
నెదుట నిలిచె దివిజు లెల్లఁ గొలువ॥ 282

వ॥ ఆ సమయంబున, 283

సీ॥ మందార నవరత్న మంజరీ [2](ధికార్యారి)
మకుట విరాజిత మస్తకుండు
మందరాచలమందమథితాపృతాంభోధి
మహనీయ పృషతోప మస్మితుండు
[3](మందేతరానర్ఘ) మకరకుండలదీప్తి
మండితామల గండ మండలుండు
మందిరీకృత భుజామధ్య నిత్యోల్లాస
మానసతి లాలస మానసుండు
తే॥ మంజు మంజీర చరణ తామరస వహన
మహిమ నిలయిత గరుడ కోమలకరుండు
మాధవుఁడు దమ్ముఁ గరుణా సమగ్రదృష్టి
మానితులఁ జేయఁ బలికె రమ్మహిపసుతులు॥ 284

---

1. రాజ్యండైన. 2. ధికార్యారి. 3. మందేతరా నర్ఘ

తోటకవృత్తాలు: —

శ్రితధీమ [1](దదుస్థిస్నతి) సిద్ధ రసా
హిత భుజ్ముఖ పాలన యుక్త రసా
సతతామృత సన్నిభ సద్వ్యఘుసా
మతి మద్వచనోదిత మంద హసా॥ 385

శరణార్థితమస్తతిచండకరా
దురవస్థ గజాధిపదుఃఖహరా
పరిపూర్ణ భయారసభద్రతరా
ధరణీభరసంహృతిధుర్యధరా॥ 286

కలశాబ్ధిసుతాపరికర్మకృతీ
జలజాభకరాధృతచక్రధృతీ
జలజోదర కేశవసాధుమతీ
[2](వెలయన్) మము బ్రోవుము విశ్వపతీ॥ 287

సీ॥ జయ పురందరముఖ్యసర్వగీర్వాణచి
త్తామితవర్షసస్యాంబువాహ
జయ దివ్యకర్మ దిక్ప్రత్యుశ్చ(పా)కార? ని
క్లేశ కృద్ఘనకార్తికీ శశాంక
జయ దానవాంగనాజనకర్ణవేష్టన
స్ఫుట [3](జీర్ణస్వర్ణాఘ) పుష్పసమయ
జయ బహుబ్రహ్మాండసంఘాతభూమికా
చిత్రావతారణసూత్రధార

తే॥ జయ మహోపనిషన్నదీచయసముద్ర
జయ మహాసౌఖ్యనిధినవాంజనవిశేష
యనుచు నిను బ్రస్తుతింపంగ నబ్బె నిపుడు
సిత సరోరుహ నవపత్ర నేత్ర ? నేత్రా॥ 288

1. దయస్తుతి. 2. వెలయుము. 3. జీర్ణపర్ణాఘ.

చం॥ అని వినుతించు నా నరవరాత్మజులన్ హరిబల్కు నో మహా
వినయ వివేకులార ! కడు వేడుకఁ జేసిన మీ తపంబు నా
మనము గఱంచె, నింక గరిమంబున రెండవ యాశ్రమంబు గై
కొని, జనకోపదేశమునకుం దగినట్లు చరింపుఁ డందఱున్॥ 289

## మారిషాకన్యవృత్తాంతము

మ॥ వెలయం [1](గండు) మహామునీంద్రుని తపోవిఘ్నార్థమై తొల్లి యా
[2](బల) విద్వేషునిచే నియుక్తయగుచున్ బ్రమ్లోచ, యమ్మౌనిఁ బు
వ్వుల విల్కానికిఁ బ్రక్క బేలుఁగొను నవ్వేల్పుట్టగా నేలి, తా
నెలమిం గర్భముఁ దాల్చి యొక్క దుహితన్ హేలానివాసస్థలిన్॥

మ॥ కని, యమ్మౌనివరేణ్యు [3](వీడ్కొనుచు నా) కన్యాలలామంబు న
వ్వనమధ్యంబున నొక్క భూరుహముపై వర్తిల్లఁగాఁ జేసి, తా
జనుడున్, దద్రుదితధ్వనుల్ విని యదృచ్ఛావృత్తిఁ జంద్రుండు వ
చ్చి, నిజాంగుష్ఠగళత్సుధారసము [4](నిచ్చెన్ బాలయున్ వృద్ధిగాన్)॥

ఉ॥ మారిషనాఁగఁ బేరుగల మంజుల [5](విభ్రమ) న [6](వ్వధూ)మణిం
జేరి పదుండ్రు నీరలు విశేషము మీఱఁగఁ బెండ్లియాడి సం
సారసుఖానుభూతిఁ గని చక్కని యొక్క కుమారుఁ గాంచినన్
జేరెదరంచుఁ బల్కె హరి శీఘ్రత దృశ్యత యుజ్జగించుడున్॥ 292

వ॥ ప్రచేతసులు సముద్రమధ్యంబువలన వెడలి పుడమిపై నెడ సడలి, యిసుము చల్లినం జల్లించనీక దళంబులైన దళంబులతోడం బ్రతిమంబులైన శాఖానివహంబుచేత భయంకరంబులైన తరునికరంబులఁ గనుంగొని, 293

---

1. (కండు భాగవతము) గాంచి. 2 ఖిల. 3 వీడ్కొని యా
4. నీసంభాలకన్ వృత్తిగన్. 5. విప్రము. 6. నద్వధూ.

ఆ॥ విష్ణుభక్తి సలిల వీచిసంక్షాళిత
బహుళదురిత పంక భారులైన
సువ్రతా ! భవాదృశులు గల్గుటనె సుమీ
యవని రత్నగర్భ యనగ వెలసె॥ 302

కం। శీతాఖ్యన కుష్ణంబును
శీతంబుష్ణాఖ్యనకురు చిన్నిలిపెడు న
బ్భాతిస్ఫీమ భవభ్రమ
భీతులకు న్విష్ణుభక్తి ప్రియతర మెపుడున్॥ 303

వ॥ అని మఱియుఁ దదీయ కులీనుల చరిత్రంబులును, దన్మాహాత్మ్యంబులును, భగవద్భాగవత కథావిశేషంబులు నుదహరించి నారదుండు నిజేచ్ఛం జనియె నని పలికి, నీ వడిగిన దంతయుఁ దెలుపంబడియె నని మైత్రేయ మునీంద్రుండు విదురుని వీడ్కొనియె నని యభిమన్యునకు వైయ్యాసి చెప్పిన చతుర్థస్కంధ కథావిశేషంబులు సూతుండు వినిపించిన శౌనకాదిమహామునులు మహాత్మా ! సమనంతర కథావిశేషంబుల నానతీయు మని యడుగుటయును, 304

చం॥ సురగిరిధీర ధీరచిత శుద్ధ నయా, నయసంయుజా యుగం
ధర, ధరధారి దివ్య పదతామర సాహితచిత్త చిత్త భూ
నిరుపరు రామణీయ కవినిర్జయ రూపవిశేష, శేష ది
క్కరి కిటి కూర్మశైల భరకంపిత తాశ్రమహృద్భుజాయుగా॥ 305

కం॥ సకలయ తిమ్మాత్మ, సుర దు
ర్విలసిత విలయాబ్ధి లగన విహ్వాల వసుధా
వలయ స్థితికృతి విమృత్తో
జ్జ్వలతర ధరణీవరాహ వరబిరుదాఢ్యా॥ 306

స్రగ్ధర :—

ఘాటీ సాటోప భావోద్ధత పవన తరోద్ధర్షణోత్కర్ష రింఖ
త్ఖోటీ ఘోటాగ్ర రింఖా కులిశకృత మహీక్షోద విక్షోభకుల ద్వి
ట్కోటీ శబ్దగ్రహాళీ కుహర విదళనక్రూర నాశీర పీతా
ఘాట ప్రస్ఫూర్తి భేరీఘటిత భయ దశాంకార నిర్ఘట్టితాశా॥ 307

గద్యము :—

ఇది శ్రీమదష్ట భాషాకవిమిత్ర, నాగయమంత్రిపుత్ర సాహిత్య మార్గ నిశ్శంక దోనూరిపదాంక వినయ లక్ష్మీసనాథ కోనేరునాథప్రణీతం బైన బాలభాగవతంబను మహాప్రబంధంబు నందు విదురోద్ధవ సంవాదంబును, విదుర మైత్రేయ సంవాదంబును, జగదుత్పత్తి లక్షణంబును, బద్మసంభవు జన్మప్రకారంబును, దచ్చరిత్రంబును, సర్గకాల కల్ప లక్షణం బులును, సృష్టిప్రకారంబును, స్వాయంభువమను సంభవంబును, వరాహావతారంబు, దితికశ్యప సల్లాపంబులును, జయవిజయుల శాపప్రాప్తి యును, హిరణ్యాక్ష హిరణ్యకశిపుల జన్మంబులును, వసుధోద్ధరణంబును, గర్దముండు దేవహూతిని వివాహంబగుటయును, గపిలావతారంబును, గపిల దేవహూతి సంవాదంబును, మనుపుత్రికా సంతతిక్రమంబును, దక్ష యజ్ఞవినాశంబును, ధ్రువచరిత్రంబును, వేన పృథు చరిత్రంబులును, నారద ప్రాచీనబర్హి సంవాదంబులును, బురంజనోపాఖ్యానంబును, బ్రచేత సులకు విష్ణుండు ప్రత్యక్షం బగుటయును, వారలకు మారిషాకన్యయందు దక్షుండు జనియించుటయును, నను తృతీయ చతుర్థస్కంధ కథావిశేషంబులు గల ద్వితీయాశ్వాసము సంపూర్ణము. 308



# బాలభాగవతము



## తృతీయాశ్వాసము

కం॥ శ్రీలలనా హృదయేశ
శ్రీల పదాంభోజ భజనశీల, ప్రతాపో
త్తాల చళుక్యాన్వయ భవ,
లాలిత నృపయూథ, తిరుమల క్షితినాథా॥ 1

వ॥ ఆకర్ణింపుము. పుణ్యకథాశ్రవణ సమగ్రహర్షులగు శౌనకాది మహర్షులకు హరినామస్మరణ రోమహర్షణి యగు రౌమహర్షణి యిట్లను నట్లు ప్రాయోపవేశ వ్రతశీలుండగు పరీక్షిన్నరపాలునకు నాగర్భ వైష్ణవ ధర్మానురాగియగు శుకయోగి మహాత్మా! యింక ప్రియవ్రత చరిత్రంబును, దత్సంతాన ప్రభావంబును వర్ణించెద వినుమని యిట్లనియె॥ 2

### ప్రియవ్రతోపాఖ్యానము

సీ॥ ఘనుఁడు స్వాయంభువ మనుసుతుండగు ప్రియ
వ్రతుఁడు గృహస్థమార్గంబు రోసి
వైరాగ్యనిష్ఠుఁడై నారదోదిత తత్త్వ
చింతాపవిత్రిత చిత్తుఁడగుచు
తండ్రి [1](పంచిన) రాజ ధర్మంబు నొల్లక
యుండునంత పితామహుఁడు [2](దెలిసి)
యతని గర్భంబునం దాసక్తుఁగావింతు
నని దేవసహితుఁడై యరుగుచెంచి

1. పంచిన. 2. దెలిసి.

తే॥ నారదుండును [1](సమనువుగా) నమ్రులగుచు
సర్చనము సేయఁ గైకొని యాదరించి
యా ప్రియవ్రతుఁ గాంచి ప్రేమాతిశయము
మీఱ నిట్లని పలికె గంభీర ఫణితి॥ 3

కం॥ డింభక యిబ్భంగి[2](న) నా
రంభత నుండంగఁ దగునె రాజసుతునకున్
సంభృత రాజ్యశ్రీ పరి
రంభ సుఖాఢ్యుడవుగమ్ము రాజసమెసగన్॥ 4

మ॥ ఇది నామాటయ కాదు విష్ణుఁడును ని న్నిబ్భంగి శాసించె [3](నిం
డు) దయ న్నాదు ముఖంబునం దెలియ నేను న్నీవు విశ్వంబునున్
ద దధీన ంబగుటన్ దదాజ్ఞ వశమే దాటంగ నల్లాట న
భ్యుదయం బొప్పఁ గళత్రివై మెలగు సర్వోర్వీపతిత్వంబునన్॥ 5

చం॥ అదియునుగాక మోక్షమునకై మదిఁ జింత యొనర్చితేని సం
పదలకు నాస్పదం బగుచుఁ బాత్రుల మిత్రులఁ బూజ సేయుచున్
మొదలు సధర్మవృత్తి గృహమేధికి నెద్ది యసాధ్య మట్టి స
త్పదము గరస్థితామలక భావము నొందుట సిద్ధ మిద్ధరన్॥ 6

తే॥ అట్లుగావున మద్వాక్య మాచరింపు
మనుడు నవనత మూర్ధుఁడై యాదరమున
నపుడ యంగీకరించెఁ బ్రియవ్రతుండు
వనజభవుఁడును నిజధామమునకు నరిగె॥ 7

కం॥ స్వాయంభువ మనువు నృప
శ్రీయా సుతునకు నొసంగి చిన్మయ లక్ష్మీ
నాయక పాదాబ్జ స్మర
ణాయత్తుం డగుచు పలికి యరిగెన్ శాంతిన్॥ 8

1. సమనువుగా. 2. వి. 3. చింత.

వ॥ ప్రియవ్రతుండును ప్రజాపాలనపరుండై కర్దమప్రజాపతి పుత్రిక యగుట బర్హిష్మతిం బాణిగ్రహణంబు నేసె; నా దంపతుల కగ్నీధ్రుండును నిధ్మజిహ్వుండును, యజ్ఞబాహుండును, మహావీరుండును, [1](హిరణ్య రేతసుండును), ఘృతపృష్ఠుండును, సవనుండును, మేధాతిథియును, వీతి హోత్రుండును, కవియును కుమారదశకంబు జన్మించె నందు కవి మహా వీరసవనులు బాల్యంబుననుండియు నూర్ధ్వరేతస్కులై బ్రహ్మజ్ఞానులై యరిగి రంతఁ బ్రియవ్రతుండు, 9

సీ॥ భూమియే కాద శార్బుద వత్సరంబు ల
త్యుగ్రశక్తిఁ బాలించి యొక్కనాఁడు
తపనీయ గిరికిఁ బ్రదక్షిణం బొనరింప
బూని యట్లు చరించు భానుపిఱుఁద
ననుసరించు తమంబు హరియింపగా బూని
భగవదుపాసనా ప్రభవ వేగ
మగు తన యరదంబు నరుకాని వెనువెంటఁ
దోలుచు నేడు రాత్రులు చరించె
తే॥ సంభృతాశ్చర్యు లగుచు నిర్జరులు పొగడ
నపర భాస్కరనాము విఖ్యాతిఁ గాంచె
నతని రథ నేమిమార్గంబు లబ్ధులయ్యె
నడిమి యడవెల్ల దీవులై బెడగు దాల్చె॥ 10

వ॥ అదియును,

కం॥ ప్రాజ్యమ్ములు లవణేక్షు సు
రాజ్య దధిక్షీర జలమయములే డబ్ధుల్
పూజ్యమగు నొకటి కొకటి క
తి జ్యాయంబు విస్మృతి ద్విగుణితలగ్న॥ 11

1. హిరణ్యరేతుండును.

కం॥ క్రమమొప్పఁగ జంబూ ప్ల
క్షములును శాల్మలియు గుశముఁ గ్రౌంచంబును శా
కము బుష్కరమును దమ చి
హ్నములయి యీ పేళ్ళు నేఁడు నమరుం దీవుల్॥ 12

వ॥ అంతఁ బ్రియవ్రతుండు జంబూద్వీపమునకు నాగ్నీధ్రుని, ప్లక్ష ద్వీపంబునకు నిధ్మజిహ్వుని, శాల్మలి ద్వీపమునకు యజ్ఞబాహుని, కుశ ద్వీపమునకు హిరణ్య[1](రేతుని), క్రౌంచ ద్వీపంబునకు ఘృతపృష్ఠుని, శాకద్వీపంబునకు మేధాతిథిని, పుష్కరద్వీపంబునకు వీతిహోత్రుని నధిపతులం గావించి వైరాగ్యంబున నారదాశ్రమంబుఁ జేరి భగవధ్యానపరాయణుండై యుండె నిట జంబూద్వీపాధిపతియగు నాగ్నీధ్రుండు, 13

ఆ॥ భూమి నేలుచుండి పుత్రార్థియై మంద
రాద్రిచెంత నుగ్రమైన తపము
నియతుండగుచుఁ జేయఁ బ్రియమంది పరమేష్ఠి
యతని కోర్కె దీర్ప నాత్మఁ దలచి॥ 14

మ॥ నిజసేవాగత [2](పూర్వచిత్తి) యను దానిన్ దేవతాకాంత నం
బుజనేత్రం గడు నింతగా నచటికిం బుత్తేర నమ్మేటి భూ
భుజుఁడుం దానికి మోహితుం డగుచు నింపున్ మీరఁ జేబట్టి యా
ద్విజరాజాననఁ గూడి యాత్మపురి కర్థిన్ వచ్చి రాజ్యస్థుఁడై॥ 15

వ॥ ఆ పూర్వచిత్తియందు నాభియును, కింపురుషుండును, హరివర్షుండును, ఇలావృతుండు, రమ్యకుండును, హిరణ్మయుండును, ఉత్తరకురుండును, భద్రాశ్వుండును, కేతుమాలుండును నగు తొమ్మండ్రకుమారులఁగని వారలకు జంబూద్వీపంబు పంచిపెట్టి యథాశాస్త్రంబుగా యాగంబులు సేసి యా పూర్వచిత్తిం గూడి బ్రహ్మలోకంబునకుం జనియె,

1. రేతుని. 2. బూర్వచిత్త.

నా కుమారనవకంబు పేళ్ళ నవ వర్షంబులు ప్రసిద్ధంబులయ్యె, నంత నం దగ్రజుండగు నాభిమహీకాంతుండు నిజకాంతయగు మేరుదేవిం గూడి,

## నా భి చ రి త్ర ము

శా॥ సంతానార్థము వైష్ణవంబగు మహాసత్త్రంబుచే నిందిరా
కాంతుం బ్రార్థితుఁ జేయుచుండ్, హరియు నగ్రస్థాయియై యమ్మహా
స్వాంతుం గన్గొని నీకు మెచ్చితి నితేశా ! నిక్కమే నిట్టి నీ
కాంతా గర్భమునం జనింతు ననియెన్ గాతూహలం బేర్పడన్॥ 17

వ॥ ఇవ్విధంబునం బలికి తిరోహితుం డయి హరి యా మేరుదేవి గర్భాగారంబుఁ బ్రవేశించె,నద్దేవియు గర్భవతియయి నిర్భరోత్సాహంబున,

## ఋ ష భ చ రి త్ర ము

కం॥ తనయుని గాంచిన ముదమున
మనుజేంద్రుం డతని బలసమగ్రుని ఋషభుం
డనుపే రిడి వర్ధితుగా
నొనరించి నిజాధిపత్య యుక్తిం జేసెన్॥ 19

ఆ॥ వృషభు మహిమ దెలియ నింద్రుం డనావృష్టి
జేసె, నాతఁ డేలు సీమనెల్ల
నతఁడు తనదు మహిమ నతివృష్టి గురియించి
ప్రజల బ్రోచె సురలు బ్రస్తుతింప॥ 20

వ॥ మఱియు నా ఋషభుండు, 21

సీ॥ శతముఖుం డిచ్చిన సతి [1](సయంతీ) కన్యఁ
బరిణయంబై కర్మపరతఁ దాల్చి

1. జయంతి.

భరతాదిసుతుల నూర్వురఁ గాంచె వారిలోఁ
బ్రాహ్మణులైరి యెనబదియొకండ్రు
అట కుశావర్తాదు లగు మహాభాగులు
తొమ్మండ్రు నవఖండ ధుర్యులైరి
[1](కవిహరు) లంతరిక్ష ప్రబుద్ధులు పిప్ప
లాయనా విర్హోత్రులట [2](ద్రమిాఢ)
తే॥ [3](చమస) కరభాజనులు నాగ సంజ్ఞ లమరు
వారు తొమ్మండ్రు విజితారివర్గు లగుచు
పరమహంసత్వమున విష్ణు భక్తులైరి
భరతునకుఁ దండ్రి వర్షాధిపత్య మొసఁగె॥ 22

వ॥ ఆ సమయంబున, 23

తే॥ ఋషభుఁ డపగతసర్వ భోగేచ్ఛుఁ డగుచు
నాత్మపదవికి నరుగంగ నాత్మఁ దలఁచి
భరతుఁడాదిగ గల తనూభవులఁ బిలిచి
యనుపమ జ్ఞానపూర్ణ మిట్లనుచుఁ దెలిపె॥ 24

కం॥ తప మొనరింతురు [4](సంసా
రపరీ) తాపోపశమన రతులగు వా రా
తపమును ధర్మంబును వి
ష్ణుపదధ్యానామృతంబ శుభ చరితులకున్॥ 25

కం॥ దైవమునకు దైవంబులు
గో విప్రులు తత్సపర్య కుతుకము మీారన్
గావించిన యుత్తములకుఁ
గైవల్యవిభుం డభీష్టకరుఁడగు నెందున్॥ 26

---

1. కవివరు. 2. ద్రమిాళ. 3. దమన. 4. సస్పార పరిమి.

వ॥ అట్లుగావున మీరలు గో బ్రాహ్మణ సేవావిధేయులరగుచు సర్వంబు విష్ణుమయంబుగా నెఱింగి ధర్మమార్గంబునం బ్రజాపాలనంబు సేయుండని మఱియుం బెక్కుమార్గంబుల బుద్ధులం గఱపి తనూజుల వీడ్కొని పరమహంస మార్గంబునం జరియించుచు నిజపదంబునకు విజయంబుఁ జేసె నంత, 27

తే॥ నాభియేలిన కతమున నాభివర్ష
మనఁబ్రసిద్ధి వహించిన యవనిఖండ
మట్లు భరతుండు పాలించునందు కతన
వర్ణిత ఖ్యాతి భారత వర్షమయ్యె॥ 28

## భరతుని చరిత్రము

సీ॥ భరతుండు సంతటఁ బంచజనీ కాంత
యందు సుమత్యాదులయిన సుతుల
నేవురఁగాంచి తా నేలెడు రాజ్యంబు
భక్తితోఁ బాలికిఁ బంచిపెట్టి
వైరాగ్య నిష్ఠమై వరలి యేకాకియై
పులహాశ్రమమునకుఁ బోయి యచటఁ
బరగు సాలగ్రామగిరిసమీపంబున
రాజిల్లు చక్ర [1](తీర్థమున) నియమ

తే॥ [2]మలరఁ ద్రిషవణ స్నాతుఁడు నగుచు విష్ణు
భక్తిఁ దులసీ దళాదిక పత్రపుష్ప
సమితిఁ బూజలు సేయుచు సలిలవాయు
భక్షుఁడై యుండె మునులెల్లఁ బ్రస్తుతింప॥ 29

1. తీర్థంబున. 2. మరల.

శా॥ ఈలీలన్ భరతుండు విష్ణుభజనాధీనాత్ముఁడై యుండుచున్
సాల గ్రామ శిలాపవిత్ర [1](జలభాస్వచ్చక్ర) తీర్థంబులోఁ
జాలన్వేడుక నొక్కనాడు ప్రథమ స్నానంబుఁ గావింపఁగా
నాలో నొక్కటి చూటిలేడి తృషనొయ్యనన్ వచ్చి యచ్చేరువన్॥

శా॥ నీరంబానగ నొక్క సింగము మహానిర్ఘోషమున్ జేయుఁడున్
భీరుత్వంబున దాటి త త్తటమునన్ భిన్నాంగియై యీల్గు నా
సారంగాంగన గర్భ మూడిపడి కాసారంబులోఁ దేలఁగా
నా రాజర్షి వరుండు సర్వము గృపాయత్తాత్ముఁడై జూచుచున్॥ 31

ఉ॥ మాతృవిహీనమై శరణ మాత్రము లేక కురంగశాబ మి
ట్లాతురతం జలాంతరమునందు మునుంగగ నెట్టుఁ జూతు నా
చేతులఁ బోయినట్లు విలసిల్లగఁ బ్రోచెదఁగాక దీని నం
చాతఁడు దానిఁ గైకొని నిజాశ్రమభూమికి వచ్చి యచ్చటన్॥ 32

కం॥ దినదినము హరిణశాబా
వన సంసక్తాత్ముఁడగుచు వనజాక్షుని పూ
జన [2](మండన) కీర్తనముల
పనులన్నియు మఱచె జడునిభావము దోఁపన్॥ 33

సీ॥ తొడలపై నిడుకొని పుడుకుచుఁ బచ్చని
గరికపోచలు భక్తి మెరయ మేపు
తనదు కమండలోదక మరచేతిలో
నినుచుక త్రావెడునేర్పుఁ గఱపు
భుజమెక్కి వీపుపైఁ బొరలియాడుచు నిద్రఁ
జెందిన మిగుల నానంద మొందు
శార్దూలముఖోగ్ర సత్వముల్పీడించు
నని వెనువెంటఁ బాయక మెలంగు॥

1. వదన.

తే॥ రమణనాత్మీయ మోక్షాంతరాయమైన
యా కురంగంబు...¹(దే లోకమనుచు)
జడభరతుఁ డితఁడని మానిసమితి నవ్వ
నవనివిభు డుండె నాశ్రమాభ్యంతరమున ॥ 34

ఆ॥ లేడిపిల్లఁ గాన లేకయుండిన నిల్వ
నొక్క నిమిషమైన నోర్వలేడు
వెదుకు దిరుగ.............
.......... మూర్ఛనొందు విభుఁడు ॥ 35

వ॥ ఇవ్విధంబున భరతుండు హరిణవాత్సల్యంబున సముచితా
చారంబులు వదలి యవసానకాలంబున హరిణంబునే దలంచుచుఁ దను
త్యాగంబు సేసె, భావనావశంబున హరిణీగర్భంబున మృగంబై జన్మించి
చరియించుచుఁ బూర్వజన్మకృత విష్ణుసేవా ప్రభావంబున జాతి ²(స్మరణ
త్వంబు) గలిగి యాత్మగతంబున. 36

చ॥ నరపతినై జనించి నరనాథులు గొల్వఁగ నుర్వి నేలియుఁ
విరతివహించి మానితతి విస్మయమందఁ దపంబుఁజేసియుఁ
శరణవిహీనమైన మృగశాబముఁ బెంచెద నంచు వెఱ్ఱినై
గురుమమతావికారమునఁగుత్స నహించితి నేమిసేయుదుఁ॥ 37

కం॥ మమకారంబు నహంకా
రము నను నీ రెండు సంస్మరణమూలమునఁ
భ్రమియించు మోక్షమార్గము
క్రమశీలురకుఁ ³(గదధ్వగమన) ప్రదముల్ 38

సీ॥ అని యివ్విధంబున మనసులోఁ దలపోసి
హరి విష్ణుఁడే శరణ్యుఁడనుచుఁ దలఁచి

1. (.........) 2. స్మరత్వంబు 3. కదధ్వమన.

పనవి, సాలగ్రామ పర్వతోపాంతస్థ
చక్రతీర్థమున కాసక్తి నరిగి
యచట నిత్యంబు నారాయణ స్మరణంబు
నడుపుచు జీర్ణతృణంబుమేసి
యాశరీరము బాసి హరిభక్తివశమున
నాంగీరసాన్వయుఁడైన యొక్క-
తే॥ బ్రాహ్మణుని పుత్రుఁ డగుచు సంభవము నొంది
నియతి నాగర్భవైరాగ్య నిష్ఠుఁడయ్యె
నతని నుపనీతుఁగాఁ జేసి యతని తల్లి
దండ్రు లరిగిరి సుగతికి ధరణినాథ॥ 39

వ॥ అంత,

ఆ॥ సవితితల్లి కొడుకు లవినీతు లావిప్రుఁ
జదువనీ కహర్నిశంబు [1](నింటి
బయటి పనులఁగొంచు) బంటుఁజూచినభంగిఁ
జూతు రెల్లజనులు చోద్యపడగ॥ 40

కం॥ ఆ విప్రుండును సుజ్ఞా
నావేశుం డగుచు విష్ణు నాత్మఁ దలఁచుచుఁ
దా వారనియెడు భేదము
భావింపక సహుతనెల్ల పనులొనరించున్॥ 41

సీ॥ కృష్ణరక్తక్షేత్ర కేదారముల నూని
పనుపు లెటేంగి [2](కర్షనము) సేయు
కంబళ వస్త్రాదికములు లేకయ వర్ష
శీతకాలకబులుఁ [3](జేలుఁ) గాచు

1. నుండి కొనుచు. 2. నర్శనము. 3. జెలు.

ఫలపుష్ప తృణ సమిత్పర్ణాది భారంబు
[1](లెపుడు నింటికి వచ్చు) నపుడు దెచ్చు
తవుడు సంకటి కూర ద్రబ్బెడ పాయసం
బన్నంబు సమబుద్ధి నారగించు

తే॥ సదృశలోష్టాశ్మకాంచన చరితుఁ డగుచు
సుఖము దుఃఖంబు సరిగాగఁ జూచుకొనుచు
జను లితం డెట్టి బ్రాహ్మణుం డనుచుం దెగడ
దిరుగు సమబుద్ధి నమ్మహీసురవరుండు॥ 42

కం॥ ఈలాగు చరిత్రంబున
కాలం బొకకొంత యరుగఁగా నొకనా డా
[2](భీలాటవిలోఁ జలికిఁ)
బాలన మొనరించుచుండె బ్రాహ్మణుఁడు సిరిఁ॥ 43

తే॥ శూద్రుఁ డొక్కఁ డా రాత్రియ సుతులఁ గోరి
భద్రకాళికి నొక నరపశువుఁ గొనుచుఁ
బోవుచుండ న ప్పశువు నేర్పునఁ దొలంగె
నరసి యవ్వధ్యుఁ గానక యతని భటులు॥ 44

తరువోజ

ఆ చేని కావలి యట్లున్న విప్రు నతి శాంతచిత్తు వీరాసనాసీను
జూచి పట్టుకపోయి శూద్రాధిపతికిఁజూపి [3](యీతండె పశువువధ్యుఁ డనుచు
నాచండికాగృహం బందఱుఁజేరి యచ్చోట నతనికభ్యంగనాది[4](కము)
లాచరించి యలంకృతాత్మునిఁజేసి యంబికముందఱ నసువొంద నిడిన॥

1. లెపుడు యింటికి దెచ్చు. 2. భీల్యాటవి లోచనికిఁ.
3. జూపి యితఁడె పశువ్వధ్యాప్పడననుచు. 4 కంబు.

కం॥ ఎక్కువ సంతోషంబున
సక్కర్షకుఁ డాత్తఖడ్గుఁడై చండికకున్
మ్రొక్కి తన కొలఁది యెఱుఁగక
గ్రక్కున న వ్విప్రు వేగ గమకించుతఱిన్ ॥ 46

ఉ॥ చండిక యమ్మహీసురుఁ బ్రశాంతమనస్కుని విష్ణుభక్తవం
ద్యుండగునే యితం డనుచు నొప్పుగఁ జూచుచు శూద్రుచేతి యా
[1](ఖండను) దానె పుచ్చుకొని గ్రక్కున శూద్రుశిరంబుఁ ద్రుంచి యు
ద్దండతఁ జేతఁ బట్టుకొని తాండవమాడె ముదంబెసంగఁగన్॥ 47

ఆ॥ ఖడ్గశూద్ర కాళికలఁ జూచి యవ్విప్రుఁ
డప్పు డీశ్వరాజ్ఞ [2](యనును) గాని
భీతి రోషతోష భిన్నుఁడు గాఁడయ్యె
విష్ణుభక్తు లట్టివిధము వారు॥ 48

కం॥ తదనంతరంబ నిర్గత
మదుఁడై యాంగిరస వంశమాన్యుఁడు దుర్గా
స్పదము వలన వెలువడి ప్రా
క్పదమునకు న్వచ్చి తొంటిభంగిఁ జరించెన్॥ 49

ఉ॥ అంతట నొక్కనాఁడు విజితాహితబంధుఁడు [3](సింధుమేదినీ
కాంతుఁడు) సాంఖ్యయోగ మతగణ్యుని నిక్షుమతీ మహానదీ
ప్రాంతనివాసునిన్ గపిలుఁ బ్రార్థన సేయుట కా ద్విజన్మ స
స్యాంతికభూమి నేగుతఱి నా నృపు బెస్తలు నవ్వులాటకున్॥ 50

ఆ॥ ఇతఁడు శిబిక మోవ నెంతయు నేర్పరి
యనుచు నతనిఁ బట్టుకొనుచుఁ బోయి
యతని మూపుమీఁద నా నృపయాన దం
డాంత మెత్తి నడువు మనుచుఁ బలుక॥ 51

1. ఖడ్గము. 2. యతని. 3. ఇతని పేరు రహూగణుఁడు.

కం॥ మెడ యొఱఁగ మూపు జడియఁగ
వడిసెడి బడఁగైన నడుము వడవడ వణఁకన్
[1](కడువడి శిబికను మోయుచు)
నడువఁగ నొదుదుడుకుల గమనం బపుడయ్యెన్॥ 52

తే॥ [2](మహీవరుం డప్డు) డోలాయమానమైన
నాత్మయానంబుఁ గాంచి వాహకులతోడ
గమన విషమతచే నిట్లు గాసిఁబెట్ట
నేమి కారణమనుడు వా రిట్టు లనిరి॥ 53

శా॥ దేవా! యీతఁడు వింతబెస్త యొకఁ డర్థిన్నీదుయానంబు నీ
సాలిన్ మోచుచు నున్నవాఁ డనుచు హాస్యప్రాయసంభాషులై
యా విప్రోత్తముఁ జూపినన్ గని విభుం డద్ధీరు సామాన్యుగా
భావంబందుఁ దలంచి రాజసపదప్రౌఢంబుగా నిట్లనున్॥ 54

తే॥ ఓరి భృత్యవశగ యిట్టిభారమునకు
మోవ నోపని యబలుండ [3](వేవిధమున)
నేల వచ్చితి దండింతు మివుడు పట్టి
నడవఁజేయుదు నిన్ను సన్మార్గమునను॥ 55

కం॥ అని యిట్లుద్ధతిఁ బలికిన
మనుజేంద్రునితోడ [4](విగత) మదమత్సరుఁడై
యనఘుండాంగిరసుఁ డి
ట్లనియెం దద్భావమునఁద్భుటాశ్చర్యముగాన్॥ 56

ఆంగీరస రహూగణ సంవాదము

వ॥ నరేంద్రా భృత్యత్వంబును భారంబును దేహంబునకేగాని నాకుం గలుగనేరవు పీనత్వకృశత్వాదికంబులు దేహకర్మంబులుగాని

1. (.........) 2. మహీవరుం డపుడు. 3. డెవ్విధమున. 4 విమత.

యాత్మధర్మంబులుగావని పెద్దలచేతఁ జెప్పంబడు. ముక్తుండుగాక దేహినై కర్మభోగంబునకు లోనగుటం జేసి యబలుండ నగుట సిద్ధంబు. సహజ స్వభావంబుఁ జెందిన నాయందు నీ శిక్ష వ్యర్థంబగునని పలికి తనకుం జరమం బైన యద్దేహంబునకుఁ "ప్రారబ్ధ కర్మణో భోగాదిన్నైవ క్షయ" యను శాస్త్రవాక్యంబునం గర్మం బవశ్యభోక్తవ్యంబుగావున నట్లు భోగ్యంబైన భారవహనంబు నెగ్గింపక యన్గించుచు నడుచునవ్విప్రుని విస్మయాకలిత లోచనుండగుచు వీక్షించి పులకిత శరీరుండై నరవల్లభుండు పల్లకి దిగ నురికి కృతప్రణామాంజలియై సవినయంబుగా నిట్లనియె. 58

కం॥ మునివరుఁడవో దేవుండవో
యనఘాత్మక యిట్లు నన్ గృతార్థుని జేయన్
జనుదెంచితి సత్యము నా
జ్ఞానసాగోచరము నీదు మహిమ దలంపన్ ॥ 59

కం॥ మూఁగంబోలిన యఘముల
[1](పీఁగంగా) దోలజాలు విజ్ఞానపథం
[2]బేఁ గపిలువలనఁ దెలియఁగ
నేఁగుచునున్నాఁడ నీవ యిటఁ గపిలుఁడవో ॥ 60

వ॥ దేవా! ప్రమాణమూలంబై లోకించుచున్న స్వామి భృత్యత్వాది లోకవ్యవహారం బెట్లుసత్యం బయ్యెఁ దెలుపవే యని యడుగుటయు, దేహేంద్రియాశ్రయుండగు జీవునకుఁ దదీయ ధర్మంబులచేతఁ గర్తృత్వం బాపాదింపంబడుఁగావున నీలోకవ్యవహారంబునకు సత్యత్వంబా పాదకంబు గాని నిత్యంబుగా దనిన నవ్విప్రాగ్రజన్మునకు భూపాలాగ్రణి యిట్లనియె.

తే॥ ఏనొనర్చిన యపరాధ మెల్లమఱచి
యిప్పుడు చిత్తాంబుజంబునఁ గృప వహించి

1. పింగంగా. 2. చేక.

విమలవిజ్ఞాన వాక్యోదకములచేతఁ
బరిహరింపుము మత్పంకభారమార్య ॥ 62

వ॥ అని ప్రార్థించిన దేవునకు మహీదేవుండిట్లనియె, 63

శా॥ దుర్వారక్రమమైన మాయ కధినాథుండై మునుల్ భక్తితో
'సర్వం విష్ణుమయం జగ' త్తనుచు శాస్త్రప్రక్రియల్ చాటగా
నిర్వాణప్రదుఁడై వెలుంగు నచటన్ [1](నిశ్చింత) నారాయణున్
సర్వాంతస్థునిగా నెఱుంగుము మహీశా ! నిర్మలజ్ఞానతన్ ॥ 64

కం॥ సత్వరమతి విజితేంద్రియ
జిత్వరునకు సర్వసమతఁ జెందించుమహా
సత్వగుణము బలసినతఱి
తత్వజ్ఞానోదయంబు తానె చెలంగున్ ॥ 65

సీ॥ ఒకచోట మెఱయు నుల్మ్కపిశాచముఁ గాంచి
యనలాశ వెనుమెట్ట నరుగుభంగి
కదుమించు మృగతృష్ణికా కదంబముఁ జూచి
సలిలపానోద్యుక్తిఁ జనినలీల
గంధర్వనగరంబు గనుగొని మెచ్చుచు
దా నందు [2](విహరింప) దలఁచు పగిది
అనిలసంభృతరజోహతలోచనుండయి
దిగ్భ్రాంతి నొందెనిఁదిరుగు కరణి

తే॥ ధనికధనకాంక్షఁ దనునిత్యతాప్రచింత
నీమణాసక్తి నజ్ఞానహీనవృత్తి
విప్రలబ్ధుండుగాక యుర్వీతలేశ !
హరి భజింపంగవలయు మోహోదరునకు॥ 66

1. నిశ్చిత్తు. 2. విహరించు.

మ॥ కదళీస్తంభమునట్లసారఘనమై కాండోపరివ్యక్తబు
ద్బుదమట్లస్థిరమైన మేనికి సుఖంబుల్ గోరి నిత్యంబుఁ గృ
త్యదరిద్రుం డయి చిత్తవీథి మమతాహంకారముల్ [1](మానలే
ని) దురారంభుని కిందు నందుఁ గలదే నిర్వాణ మూర్వీశ్వరా॥ 67

వ॥ ఏను దొల్లి ఋషభునకు భరతుండను కుమారుండనై రాజ్యంబునేసి విరక్తుండనై యొక్క మృగపోతంబు మీఁది మమతాదోషంబున మోక్షపదభ్రంశంబు నొంది మృగంబనయి జన్మించి క్రమ్మఱనకారకారుణిక భగవత్కటాక్షవీక్షావశంబున లబ్ధజ్ఞానుండనై ద్రిమ్మరుచున్నవాఁ డనని యెఱింగించి మఱియునుం బెక్కువిధంబులం దత్త్వజ్ఞానమార్గంబుఁ దెలిపినఁ గృతార్థుండై సింధుదేశాధీశ్వరుండు ప్రణామంబునేసి తపంబునకుంజనియె విప్రుండును నిజేచ్ఛం జరియించుచు వాసుదేవబ్రహ్మంబుఁ గలసె నిట్లు భరతుండు జన్మత్రయంబున ముక్తుండయ్యెనని చెప్పి శుకుండు పరీక్షిత్తున కిట్లనియె. 68

కం॥ ఈ భరత చరిత్రంబే
శోభనమతి వినుఁ బఠించు సురుచిర భక్తి
ప్రాభవమున నతఁ డచల
శ్రీ భర్తృకృపాకటాక్ష సిద్ధివహించున్॥ 69

వ॥ అని చెప్పి మఱియు నిట్లనియె నట్లు భరతుని యనంతరంబ సుమతి యను కుమారుండు రాజ్యస్థుండై॥ 70

కం॥ భరతుఁడు బాలతఁ గ్రమ్మఱ
నరుదెంచెనొ యనుచుఁ బ్రజలు హర్షమునొందన్
మరియాదఁ దప్పకుండగ
ధరఁ బతి పాలించె నిత్య ధార్మికబుద్ధిన్॥ 71

1. మానవేని.

సీ॥ అతనికి దేవజిత్తను పుత్రుఁడయ్యె దే
వద్యుమ్నుఁడతని కుజ్జ్వలతఁ గలిగె
నతనికిఁ బరమేష్ఠియయ్యెఁ బ్రతిహరుండు
వానికిఁ దనయభావంబు నొందె
ప్రతిహర్త యతనికిఁ బ్రతిభూముఁ డతనికి
నతనికి [1] (నుద్గీథుఁడను) సుతుండు
నతనికి విభునాముఁ డతనికిఁ బృథుషేణుఁ
డతనికి నక్తుండు నతనికి ధృతి 72

గీ॥ [2](గల్గి) రాధృతి కుదయించె గయుఁ డతండు
సతత కృతయజ్ఞుఁడగుచు నిర్జరులఁ దనిపె
ధన్యుఁ డితఁ డచ్యుతుని యవతార మనగఁ
బెక్కు-గాలంబు బ్రజల సంప్రీతి బ్రోచె॥ 73

వ॥ మఱియును,

సీ॥ అతనికిఁ జిత్రరథాఖ్యుండు జనియించె
[3] (సమ్రాట్టువానికి సంభవించె
నతఁడు [4] (గాంచె మరీచి నతనికి బిందుమం
తుఁడు పుట్టెఁ గల్గె మధువు నతనికి)
నతనికి [5] (వీరవ్రతాహ్వ) యుం డుదయించె
[6] (మధు)నాముఁడతనికిఁ బ్రథితుఁడయ్యె
[7](భావనుం డ) తనికిఁ బ్రభవించె నతనికిఁ
ద్వష్ట యనంగ నందనుఁడు వెలసె

---

1 నుద్గీత. 2 (...... 3. సామ్రాజ్య. 4. గాంచెను మరీచి నతనికి బంధు, మతుండని పుట్టె గల్గె మధు మతనికి. 5. వీరవ్రతాపా. 6. పృథు. 7. భావనుండ.

తే॥ విరజుఁ డతనికి సుతుఁ డయ్యె విమల కీర్తి
యతఁడు తుదగాఁగ నిట్లు ప్రియవ్రతాన్వ
యంబు చరితంబుఁ దెలిపితి నర్థి దీని
వినినఁ జదివిన నరుఁ డొందు విమలశుభము॥ 74

కం॥ అని పలుకుటయుఁ బరీక్షి
న్మనుజేంద్రుఁడు విస్మయాబ్ధిమగ్నాత్మకుఁడై
యనఘు శుకయోగిచంద్రుఁ
గనుఁగొని యిట్లనియెఁ బ్రమదగద్గద మలరన్॥ 75

శా॥ దేవా ధాత్రిఁ బ్రియవ్రతుం డరదముం ద్రిప్పంగ నెన్నెంటఁ దా
శేవందోర్లగ దీవు లంబుధులు బుట్టెన్నెంతగానంటి త
ద్భావిస్తారము ద్వీపవారిధుల యొప్పున్ దత్ప్రమాణంబు, లో
కావస్థానములున్, గ్రహస్థితులు సువ్యక్తంబుగాఁ దెల్పవే॥ 76

## బ్రహ్మాండ గోళలక్షణ ప్రస్తావము

ఉ॥ నావుడు ద్వీపవారినిధి నద్యచలగ్రహలోక సంస్థితుల్
భావము మెచ్చ సాంతముగఁ బల్కఁగ నోపునె శేషుఁడైన ధా
త్రీవర! యే నెఱింగినగతిన్ వినిపించెదఁగాక యంచు సం
భావన సేయుచున్ శుకుఁడు బల్కెఁ బరీక్షితుతోడ నేర్పునన్॥

సీ॥ ఉర్వీశ! వినుము సర్వోర్వికి విస్తార
మొనరె నేబదికోట్ల యోజనములు
లక్షయోజనముల లాలితం బగుచు నే
రెడుదీవి వట్టువై నడుమ నొప్పు
నందును మధ్యస్థమై యోజనము లెను
బదినాల్గు వేలయంగ బరగు, పొడవు

పదియాఱువేలగు పాతును నంతియ
మొదలి [1](విస్తృ)తియు, ముప్పదియు రెండు

తే॥ వెలయ నామీఁది విరివియు, వినుతి నొంద
భూతలచ్ఛత్ర కలశ విస్ఫూర్తిఁ దాల్చి
యఖిల శైలంబులకు భర్తయగుచు మిగుల
మెరయు హేమమయంబైన [2](యా) మేరు శిఖరి॥ 78

వ॥ ఆ మేరువునకుఁ జతుర్దిశంబును నవసహస్ర యోజనవిస్తృతం బగు నిలావృతవర్షంబునకు నుత్తరభాగంబున [3](నీలంబును, శ్వేతంబును నగు శృంగంబుల సీమా) పర్వతంబులు రెండువేల యోజనంబుల [4](పాతు)ను, ఖరపును నౌన్నత్యంబును గలిగి క్రమంబున నవత్యశీతి సప్తతి సహస్రయోజనాయామంబులై పూర్వ పశ్చిమసముద్రంబులు సొచ్చియుండుఁ, దన్మధ్యప్రదేశంబుల రమ్యక, హిరణ్మయోత్తర, కురు వర్షంబులుండు నిలావృతంబునకు దక్షిణంబున నిషధ హేమకూట హిమాలయంబులు పూర్వోక్తశైలంబుల పరిమాణంబులం బ్రకాశించు తదనంతరంబు హరివర్ష, కింపురుషవర్ష, భారతవర్షంబులు చెలంగు నిలావృత పూర్వ పశ్చిమంబుల, గంధమాద మాల్యవంతంబులు, దక్షిణోత్తరంబుల నిడుపుల నిషధ [5](నీలాయామంబుల) మోచి [6](మున్నిటియద్రుల) విరివిం గనుపట్టు తత్పూర్వ పశ్చిమప్రదేశంబులు సముద్రాంతంబులై భద్రాశ్వ కేతుమాలావర్షంబులు విలసిల్లు వర్షంబులెల్ల నవసహస్ర యోజన విస్తారంబులై యుండు మఱియును, 79

తే॥ కనకగిరికి [7](నల్దిశల) విష్కంభ నగము
లయుత యోజనోన్నతము లొప్పారుచుండు
మందరంబును మరి, మేరుమందరము సు
పార్శ్వమును గుముదము ననం బ్రభలు మించి॥ 80

---

1. విస్తృ. 2. నా. 3. నీలంబను శృంగంబును నను శని. 4. పొంతు
5. నీలయుంబుల. 6. మున్నీటి యద్రువల. 7. నాల్గు.

సీ॥ మందరంబున దియ్య మామిడి మేరుమం
దరమున నేరేడు తగు సుపార్శ్వ
మునఁ గడిమియునుం గుముదమున మఱ్ఱియు
శతయోజనముల విస్తృతులు గలిగి
సమత నేకాదశ శతయోజనోన్నతం
బులు నయి కేతువు లొప్పె మెఱయు
బ్రథిత నందన చైత్రరథములు వైభ్రాజ
సర్వతోభద్రము ల్సంజ్ఞలైన

తే॥ నాల్గు నుద్యానవనములు నాలుగింట
జెలగుఁ దూర్వాదిగా నెన్న వలయు నదియు
దక్షిణాస్థిత మేరు మందర నగమున
వెలసి నట్టి విశేషంబు విను మహాత్మ॥

కం॥ జంబూతరువున మత్తే
భంబులగతి వ్రేలుచుండు ఫలముల రసపూ
రంబు వడసి ప్రవహించుఁ గా
జంబూనది యను విశిష్టసంజ్ఞ సెలంగన్॥

కం॥ ఇంబుల షోడశవర్షయు
తంబైన హిరణ్మయంబు తన్నది జంబూ
లంబగుటఁ జేసి భువిలో
జంబూ నదమను ప్రసిద్ధి చాల వహించెన్॥ 83

ఉ॥ అప్పుడు సెప్పినట్టి కనకాద్రితుదన్ జతురాస్య పట్టణం
బొప్పులకుప్పయై యయుతయోజన విస్తృతిఁ గాంచ[1](నాఢ్యమై)
చెప్పఁగ జాలి యుండు బుధసేవ్యతఁ దత్పురి నష్టదిక్కులన్
దప్పక యుండు దిక్పతినిధానపురంబులు [2]పౌరవోత్తమా॥ 84

1. నాఢ్యమై. 2. కార.

సీ॥ వామనాకృతి విష్ణువరపాదనఖహతి
నయిన బ్రహ్మాండరంధ్రాంతరమున
బహిరుల్ల సత్పయోలహరిక యేతెంచి
విష్ణుపదీనామ విహిత యగుచు
ధ్రువుండు సాద్భుతమహోత్సవమునఁ దల ధరి
యింప సప్తర్షు లూహించి మ్రొక్క
నమర విమానమార్గము వట్టి యరుచెంచి
రయమున బ్రహ్మపురంబు సొచ్చి
తే॥ తచ్చతుర్ద్వార నిర్గతత్వంబునుండి
క్రింద భద్రాశ్వ భారత కేతుమాల
కురుపదంబులు దడుపుచుఁ గూడెఁ బూర్వ
దక్షిణాపరోత్తర సముద్రముల నధిప॥ 85

ఆ॥ అట్టిగంగ సీత యనఁ దూర్పునను దక్షి
ణమున నలక [1](నందనా) సుచక్షు
వనఁ బ్రతీచి భద్రయన నుత్తరంబున
నాల్గు పేళ్ళు గలిగి నడచె నధిప॥ 86

కం॥ హిమగిరికి వచ్చు నా సమ
యమునన్ శివుఁ డభ్రగంగ నాత్మశిరోభా
గమున ధరియించె [2](నతి) సం
భ్రమమున నందుండి నడచె భాగీరథియై॥ 87

ఉ॥ భారత కర్మభూమి భువి భారతవర్షము తక్కగల్గ నో
ప్పారెడి యష్టవర్షము లుదారమతుల్ [3](త్రిదివచ్యుతుల్ శుభా)
కారులు శిష్టపుంగవులు గైకొనుచోటులు తన్నివాసులౌ
వారయుతాయువుల్ నడచువారు గజాయుతసత్త్వ లెన్నగన్॥ 88

1. నందదా. 2. నతి. 3. దివచ్యుతస్మృతు.

వ॥ ఇట్టి వర్షంబులలోను బుణ్యార్జనాస్వాదంబగుచు నుత్కృష్టం బైన భారతవర్షంబునందు గల విశేషంబులు వినుము.

భా ర త వ ర్ష ప్ర కా ర ము

సీ॥ వినుతింపఁ [1](దగు నిలా) ద్వీపకశేరు మం
తంబులు తామ్రపర్ణము, గభస్తి
మంతంబు, నాగసౌమ్యములును గంధర్వ,
దారుణంబులు నన దక్షిణోత్త
రములు యోజన సహస్రములు దైర్ఘ్యమున ని
య్యొనిమిది దీవులు నెసఁగు నందు
తూర్పుదీవులఁ గిరాతులు పశ్చిమద్వీప
ముల యవనులు బలస్ఫూర్తి నుందు
తే॥ రఁట మహేంద్రంబు మలయసహ్యములు శుక్తి
మంతమును బుక్ష వింధ్యనామములు పారి
యాత్రమును నను సప్తకులాచలములు
చాలఁ బెంపొందు భరతవర్షంబునందు॥ 90

వ॥ మఱియుం ద్రికూటంబును జిత్రకూటంబును, ఋషభంబును, ఋష్యమూకంబును, గోవర్ధనంబును, గోముఖంబును, నాదిగా గల పర్వతంబుల సంఖ్యంబులు గలిగియుండు, నింక మహానదుల సంభవంబు వినుము. యమునా, సరస్వతీ, చంద్రభాగ, బాహు, రవిపాశ, దేవకి, కౌశికి, గండకి యను నదులు హిమవంతంబున జనియించె. పితృ సోను యతులు? ఋషికుల్య వంశకర, అంగుళీత్రిదివ యను సింధువులు మహేం ద్రంబున సంభవించె. తామ్రపర్ణి పుష్పజాత ప్రత్యయిలావతి ? యను నేఱులు మలయాచలంబున నుదయించె. కావేరి, గోదావరి, కృష్ణవేణి,

1. దగునట్టి నిలా.

తుంగభద్ర, సుప్రయోగ, భీమరథి యను తరంగిణులు సహ్యామహీధరంబున వెడలె. మందస మందవాహిని కుమారి పలిశిని యను తటినులు శుక్తిమంతంబున నావిర్భవించె. శోణ, నర్మద, తమస, కరతోయ, చిత్రకూట చిత్రకోసల మందాకిని, నిషధావతి శుక్తిమతి యనుసరిత్తులు ఋక్షపర్వతంబున నవతరించె. నిర్వింధ్యనిషధావతి వేగవాహిని, పయోష్ణి కుముద్వతి, మహావారి యను నిమ్నగలు వింధ్యనగంబునం బొడమె. వేదస్మృతి, చర్మణ్వతి యవంత్యాదిగా గల వాహినులు పారియాత్రశైలంబునం బ్రభవించె మఱియు బుణ్యనదీ నదంబు లసంఖ్యాతంబులై యుండు. 91

ఉ॥ కోఁచతనంబు గర్వమును గూడక యున్నదుల న్నిజాంగముల్
దోఁచిన యట్టి నిర్మలమతుల్ దురితంబులఁ బుణ్యవహ్నిచేఁ
గాఁచి సమగ్రశాశ్వత సుఖప్రదయౌ యపవర్గలక్ష్మిఁ జే
సాఁచి ప్రతిగ్రహింతు రిది సత్యము సత్యఘనాభినందితా॥ 92

వ॥ ఇది భారతవర్షప్రకారంబు. 93

(ధరణీప్రమాణము) లేక ద్వీపసముద్రనద్యాదివర్ణనము

తే॥ తెలివిమీరెడు నేరేడు దీవి తొల్లి
యశ్వమేధాశ్వమార్గంబు నరయువేళ
సగరసుతఖాత భూప్రదేశములయందు
దీవు లెనిమిది యుదయించె ధీవిశాల॥ 94

వ॥ అవియును స్వర్ణప్రస్థ, చంద్రకళ, ఆవర్తన, రమణక, మందే హారుణ, పాంచజన్య, [1](సింహళ) లంకనామంబులు గలిగి సముద్రాంతర్గతులై యుపద్వీపంబు లనంబడు నివ్విధంబున, 95

1. సింహ.

మ॥ పొలుచున్ నిశ్చిత లక్షయోజనము జంబూద్వీప మాద్వీపమున్
వలయాభన్ లవణాబ్ధిఁ జుట్టుకొని తావద్వి [1](స్తృతి)స్మించు న
జ్జలధిం దొట్టి ద్విలక్షయోజన సవిస్తారంబు ప్లక్షాఖ్య ము
జ్జ్వలమౌ [2](దీవి యపార)మం దలరుఁ దజ్జంబూ సమస్థూలతన్॥

వ॥ ఆ ప్లక్షద్వీపంబునందు నిధ్మ[3](జిహ్వ) కుమారనామంబుల వెలసిన శివ, యశస్య, సుభద్ర, శాంత, క్షేమ, అభయ, [4](అమృత నామ)ంబులను సప్తవర్షంబులయందును, మణికూట, వజ్రకూటేంద్రసేన, [5]జ్యోతిష్మత్సువర్ణ), హిరణ్యగ్రీవ మేఘమాలంబులను, సప్తకులపర్వతంబులును, నరుణయు, నృమణయు, [6](నాంగిరసియు), సావిత్రియు, సుప్రభాతయు, ఋతంభరయు, సత్యంభరయు నను సప్తమహానదులుం బ్రసిద్ధంబులై యుండు, ప్లక్షంబాదిగా గల యారుదీవులయందును నుండు మహాత్ములు శత సహస్రవత్సర జీవులును, దృష్టిమాత్ర జాతగర్భులును, జాతమాత్ర తేజోబలసంపన్నులును, దేవతాసములు నై విహరింతు రా ప్లక్షద్వీపంబునకుఁ జుట్టునుం దద్ద్విలక్షయోజన విస్తారప్రశస్తంబగు నిక్షురస సముద్రంబు ముద్రంబై యుండు నవ్వారిధిం దిరుగు[7](వాఱి)కొని చతుర్లక్షయోజన విశాలంబగు శాల్మలీద్వీపంబు తావద్విస్తార భాసుర సురాసముద్ర ముద్రితంబయి యొప్పు నందు, 97

కం॥ ఆ దీవికి గుఱుతయి యే
కాదశ శతయోజనములఁ గడు నున్నతమై
మేదుర దళమగు శాల్మలి
పాదప మొప్పారు విబుధ పరిషన్నుతమై॥ 98

1. స్మృతి. 2. (దిరివపాగ......). 3 జిహ్మ. 4. (.........).
5. సువర్ణ (ధూమ్రవర్ణయని తెలుగు భాగవతము, సుపర్ణయని సంస్కృతభాగవతము).
6. ఆంగిరసయు. 7. వారి.

వ॥ ఆ ద్వీపంబు యజ్ఞబాహుపుత్రులగు సులోచన, సౌమనస్య, రమణక, దేవబర్హ, [1](పారిబర్హ), [2](ఆప్యాయన), అభిజ్ఞాతులను నామంబుల సప్తవర్షంబులును, [3](స్వరస), శతశృంగ, వామదేవ, కుంద [4](కుముద), పుష్పవర్ష, [5](సహస్ర)శ్రుతు లను కులాచలంబులును, నను మతియు సినీవాలియు, సరస్వతియు, కుహువు, రజనియు, నందయు, రాకయు, నను మహానదులును ప్రఖ్యాతంబులు. 99

మ॥ తగ నా ద్వీపము నావరించిన సురోదన్వంతునిం జుట్టి, త
ద్ద్విగుణంబైన వెడల్పుతోడుతఁ గుశద్వీపంబు పత్రాంచల
స్థగితాంభోదకదంబకం బగు కుశస్తంభంబు జంబూసమం
బగు మానంబునఁ జిహ్నమై మెఱయ నొప్పారుఁ జతుర్థంబుగాఁ ॥

వ॥ అందు [6](హిరణ్యరేతా)త్మజులగు వసు, వసుదాన, దృఢ రుచి, నాభిగుప్త, స్తుత్యవ్రత, విప్ర, వామదేవనాముల నామంబుల వర్షంబులును, బభ్రు, చతుశ్శృంగ, కపిల, చిత్రకూట, దేవానీ కోర్ధ్వ రోమ, ద్రవిణంబులను గులాచలంబులును, రసకుల్యయు, మధుకుల్యయు, [7](శ్రుతవిందయు), [8](మిత్రవిందయు), దేవగర్భయు, ఘృతచ్యుతయు, మంత్రమూల యను బుణ్యాపనదులును గణ్యంబులై యుండు. 101

సీ॥ ఆ కుశద్వీపంబు నరికట్టికొని ద్విచ
తుర్లక్షయోజన స్తుతవిశాల
మై ఘృతాంబుధి యొప్పు, నతులత ద్విగుణిత
గలదు క్రౌంచద్వీప మలఘుచరిత
యొనర షోడశ లక్షయోజన కలిత వి
స్తారశస్తంబైన దధిపయోధి

---

1. పారిభద్ర - సం॥ భా. పాఠాంతర (బర్హ) వారిభద్ర. 2. అప్యాయ.
3. స్వర. 4. ముకుందయనియు పాఠాంతరము (సం॥ భా). 5. సమంత.
6. హిరణ్యరోమ. 7. మిత్రవిందయు, శ్రుతవిందయు.

పరిఘనా నద్దీవి దిరిగిరా నుండుఁ గ్రౌం
చాచలం బందు చిహ్నిత వహించు
తే॥ నందు నధిపతియైన ప్రియవ్రతాత్మ
జుండు ఘృతపృష్ఠుఁ డేవుర సుతులఁ గాంచి
క్రమముతో వారి నామధే[1](యముల నెగడు)
వర్షములఁ గల్గఁజేసె నవార్యమహిమ॥ 102

వ॥ అవియును [2](నామోద), మధువహంబును, [3](మేఘపృ
ష్ఠంబును), సుదామంబును, ఋషిజ్యంబును, [4](లోహితార్ణంబును),
వనస్పతియు ననంబరగె నందు శుక్ల వర్ధమాన భోజనోపబర్హణానందనందన
సర్వతోభద్రంబులను సప్తసీమాద్రులును, నభయయు, నమృతౌఘయు;
[5](నార్యకయుఁ), దీర్ఘవతియుఁ, [6](దృప్తిరూపయుఁ), బవిత్రవతియు,
శుక్లయు నను సప్తపుణ్యస్రవంతులుఁ గాంతి నొసంగుచుండు. 103

తే॥ తద్వరణమై యెసంగు నా దధిపయోధి
యయుత శాఖాహ్వాయద్వీప మసమభూతి
రాజితంబగు విస్తార యోజనముల
వెలయు ముప్పదిరెండులక్షలు సెలంగ॥ 104

తే॥ అనఘ! జంబూసమాన మహత్త్వమైన
శాకవృక్ష మద్దీవిఁ బ్రశస్తినొందు
దానిపేరన యద్దీవి దాఁ బ్రసిద్ధ
మయ్యెఁ దద్విశేషంబుల నమర వినుము॥ 105

వ॥ తదధీశుండైన మేధాతిథి యా ద్వీపంబునందు పురోజవ,
మనోజవ, [7](వేపమాన), ధూమ్రానీక, చిత్రరథ, బహురూప,

1. యంబుల నెడు. 2. (......) 3. మేఘపుష్పంబు 4. లోహితాక్షంబు.
5. అనార్యకయు. 6. తృష్ణయు, రూపవతియు. 7. దేవగ్రామ,
(పవమాన యని పాఠాంతరము. సం॥ భా).

[1](విశ్వాధారు) లను కుమారులను, గుమారులనామంబుల సప్తవర్షంబుల నొనర్చె నందు, నీశానంబును, [2](సురుశృంగం)బును, బలభద్రంబును, శతకేశరంబును, సహస్ర[3](స్రోతంబు)ను, దేవపాలంబును, మహానసంబును నను సప్తకులాద్రులును, ననఘయు, నాయుర్దయు, నుభయస్పృష్టియు, నపరాజితయుఁ, బంచపదియు, సహస్ర[4](స్మృతి)యు, నిజధృతియు నను సప్తమహానదులం గొల్చు నద్దీవిచుట్టుం దిరిగి తత్సమ విపులత్వంబున దుగ్ధార్ణవంబన వర్ణనీయంబై యుండు. 106

కం॥ పాలకడలికడ నరువది
నాలుగులక్షలగు యోజనముల వెడలుపై
చాల విరివియై చుట్టును
రా, లలితం బయ్యెఁ బుష్కరద్వీప మిలన్॥ 107

వ॥ అందు,

తే॥ అయుతప్రతాపాఢ్యమై హిరణ్మయతఁ గాంచి
యబ్జగర్భుని యాసనంబగుచు మించి
తన్మహాద్వీపలక్షణత్వము వహించి
పుష్కరంబొప్పు వాసనల్ భూమి నించి॥ 108

వ॥ ఆ ద్వీపంబునకు మధ్యప్రదేశంబున నయుతయోజన విస్తీర్ణో న్నతంబగు మానసోత్తరపర్వతంబు చుట్టును దిరిగివచ్చియుండు నా శైలం బునకు నంతర్బహిఃప్రదేశంబులు వీతిహోత్రనందను లగు రమణక ధాతు కుల నామంబుల నర్వాచీన పరాచీనంబులగు రెండువర్షంబు లయ్యె మఱియు నమ్మానసోత్తరపర్వతమునందు, 109

1. విశ్వాధరు. 2. ఊరుశృంగ. 3. వ్రాతంబు. 4. ధృతి.

చం॥ ప్రణుతములైన దిక్పతిపురంబులు చెన్నొనఁగూర్చి జతుర్దిశాం
గణముల వత్సరాత్మక సుఖక్రమ శాశ్వతమైన యా(¹నభో)
మణిరథ మానగాగ్ర గతమార్గమునన్ గనకాద్రికిం బ్రద
క్షిణముగ సంచరించు నని చెప్పుదు రార్యులు వంశపావనా॥ 110

కం॥ ²(ఆదివి జాతుర్వర్ణ్య వి)
భేదముఁ బరికింప లేమిఁ బెరయుచు సమతన్
మోదింతు రెల్లవారలు
నాదిత్యజ్యేష్ఠుఁ డుండు నం దనిశంబున్॥ 111

తే॥ పంచి యా పుష్కరాంతరీపంబుఁ జుట్టి
కొని, జతుష్షష్టి లక్షయోజన విశాల
ముండు, శుద్ధోదకంబుల నొప్పు వార్ధి
సవతు చెప్పంగనగునె యేడవది యగుచు॥ 112

వ॥ మేరునగంబుననుండి సప్తద్వీపంబులు సప్తసముద్రంబులు నేక భాగంబున రెండుకోట్లు నెనుబదిమూడులక్షలు నెనుబదివేల యోజనంబులును, శుద్ధోదకం బవ్వల నాదర్శనీయంబైన నిర్మలభూమి మానసోత్తర మేర్వంతరప్రమాణంబునఁ గోటియు న్నెనుబదియేడులక్షలు నేబదివేల యోజనంబులు, నవ్వలఁ గాంచనభూమి యెనిమిదికోట్లును, ముప్పదితొమ్మిదిలక్షల యోజనంబులు నగు నక్కాంచనభూమిం జుట్టికొని చక్రవాళాచలంబుండు, నదియు గ్రహప్రకాశ తమోమధ్యస్థంబగుటంజేసి లోకాలోకం బనంబడు మేరులోకాలోక మధ్యప్రదేశంబు బంద్రెండు కోట్లును నెనుబదిలక్షల యోజనంబులు నిది పంచాశత్కోటి విస్తీర్ణ భూమండలంబునకుం జక్రవాళంబు వర్తుల మధ్యరేఖగతి విరాజిల్లుచుండు.

1. దియఘం. 2. ఆ దివిజతుర్వర్ణ్య ది.

తే॥ అతులమహిమఁ జతుర్దిశా స్థితదిగీశ
పుర చతుష్టయమైన యద్ధరముమీఁద
భువనసంరక్షణార్థమై భుజగశాయి
చక్రధరుఁ డెల్లకాలంబు సంచరించు॥ 114

కం॥ ఆలోకాలోకాహ్వాయ
శైలమునకు [1](నవలఁ) గలుగు జగతీవలయం
బాలోకగురుఁడు దక్కఁగ
నాలోకము సేయ నోపఁ డన్యుం డధిపా॥ 115

వ॥ ఇది ధరణీప్రమాణం బింక సూర్యాదిగ్రహప్రకార ప్రచా
రంబు వివరించెద॥ 116

## జ్యోతిశ్చక్రసంస్థానము

సీ॥ సొరిది మాసంబు లంచులు ఋతువులు గమ్మ
లై వత్సరాత్మకంబైన యినుని
రథమున మూఁడురంధ్రంబులు గల చక్ర
మొక్కటి యది మానసోత్తరాద్రి
మీఁదఁ జరించుఁ దన్మేరులగ్నాగ్రమై
నందున నిరుసుతో నంటి యిరుసు
లఁట రెండు మేలిమి ననిలపాశంబున
ధ్రువమండలంబునఁ [2](దవిలి) యుండు

తే॥ నట్టి యరదంబు పూని గాయత్రి యాది
యైన ఛందంబు లేడు హయంబులగుచుఁ
బరఁగు దన్మధ్యమునఁ బొల్చు భాస్కరుండు
వసించుఁ దన్మండలాభ్యంతరమున॥ 117

1. నవులు. 2. దవిధి.

వ॥ ఇవ్విధంబునం గాలచక్రానుసారియగు సూర్యుండు వృషభాది పంచరాసులయందు మందంబును, వృశ్చికాది పంచరాసులం దీవ్రంబును, విషువనామకంబులగు మేషతులలయందు సమానంబులైన గమనంబుల మానసోత్తరపర్వతంబునందుఁ బూర్వ దక్షిణ పశ్చిమోత్తర దిగలంకారంబులైన దేవధానియు, సంయమనియుఁ, బ్రమోచనియు, విభావరియు ననఁ నింద్ర యమ వరుణ సోమనగరంబుల మీఁద వెడలి తొమ్మిదికోట్లు నేబదియొక్క లక్షలు బరిమితంబగు నప్పర్వతంబు దిరుగుచు భువన ప్రకాశంబు సేయుచు నుండు. 118

శా॥ నిష్ఠాచిత్పరకాష్ఠ లుద్భటజవాన్వీతుల్ తదచ్ఛద్రథ
ప్రష్ఠుల్ సౌరపవిత్రసూక్త జపకర్తల్ వాలఖిల్యాదు లం
గుష్ఠాయామ తనుల్ తపోవిభవయుక్తుల్ వైష్ణవప్రక్రియా
శ్రేష్ఠుల్ షష్టి సహస్రసంఖ్యమును లర్థిం గొల్తు రద్దేవునిన్॥ 119

సీ॥ అయ్యర్కమండలి కటమీఁద లక్షయో
జనముల యెడఁ గల్గి చంద్రుఁడొప్పు
నయ్యోషధీశుని యవల నంతియ మీఁద
నుండును నక్షత్ర మండలంబు
నొనర నాపై నొక్కరొకరికి మీఁదయి
తద్ద్విగుణాంతర స్థాయులగుచు
శుక్రుండు బుధుఁడు కుజుండు గురుండు న
ర్కజుఁడును నుందు రా రవిజు నుపరి

తే॥ భాగమున యోజనమ్ములు బదునొకండు
లక్ష లగునెడ సప్తర్షు లీక్షణీయు
లగుచు నుండు రిందఱును న య్యమరగిరిని
ధ్రువుని వలగొని వర్తింతు రవనిపాల॥ 120

వ॥ అట్టి సప్తర్షులకు దశలక్షయోజనోర్ధ్వభాగంబున శింశుమార చక్రపుచ్ఛాగ్రంబున నుత్తానపాద పుత్రుండగు ధ్రువుండు నిత్యనివాసియై విష్ణుపదంబునకుం బ్రదక్షిణంబు దిరుగుచుండు. 121

కం॥ ధ్రువునిచరిత్రము మున్నే
వివరించినవాఁడ నింక విశ్రుతహరివై
భవ శింశుమార చక్ర
స్థ విశేషము లేరికైన శక్యమె తెలియన్॥ 122

తే॥ వర్తులంబై యధోముఖ వర్తనమున
రమ్యమగు శింశుమార చక్రమున నెపుడు
గ్రహములును తారకలును నంగములఁ దవిలి
యలరు విష్ణుని దివ్యాంగ మది నృపాల॥ 123

వ॥ సూర్యమండలంబునకుఁ బదివేల యోజనంబులక్రింద రాహు మండలంబును, రాహుమండలంబునకు దిగువ నంతియయెడను సిద్ధచారణ విద్యాధరలోకంబును, తావత్ప్రమాణంబగు తదీయాధస్తనప్రదేశంబున భూతప్రేత పిశాచ యక్షరాక్షస నివాసంబును, నందులకుఁ గ్రింద మేఘ మండలంబును విరాజిల్లుఁ దన్మేఘమండలాధఃస్థితంబగు నిద్ధరణీచక్రంబు నకు నధస్సప్తలోకంబులు వివరించెద నాకర్ణింపుము. 124

## పా తా ళ లో క ము లు

సీ॥ అతలంబు వితలంబు సుతలంబు నంట తలా
తల [1](రసాతల మహాతలము లవల)
పాతాళమును గాగ భూతధాత్రికిఁ గ్రింద
గ్రమమున నేడులోకంబులుండు

1. రసాతలమ్ములవల.

నిడుపు వెడల్పును, నెడయు నొండొంటికి
సమముగా లక్షయోజనము లమరు
నచ్చోటఁ బవలు రే యను విభేదంబు లే
దినుని తేజంబు దూరని కతమున
తే॥ నహిఫణా మణుల్తిమిరంబు నపహరింప
రసరసాయన భోజులై యెసఁగ మెసఁగ
నంగనాయుక్తు లగుచు రమ్యస్థలముల
నధిప! యుందురు తద్రమ్యులైన ఘనులు॥ 125

వ॥ అందుఁ గ్రమంబున నతలంబునకు మయాత్మజుండగు బలుండును, వితలంబునకు హాటక హేతుబీజుండగు హాటకేశ్వరుండును, సుతలంబునకు నిజనగరప్రతీహారి భూత పీతాంబరుండగు బలియును, తలాతలంబునకుఁ ద్రిపురనిర్మాతయగు మయుండును, మహాతలంబునకుఁ గద్రూగర్భజనితంబగు సర్పసమూహంబును, రసాతలంబునకు హిరణ్యపురనివాసులగు నివాతకవచ కాలకేయులును, పాతాళంబునకుఁ ద్రింశత్సహస్రయోజనవిస్తార లక్షయోజనౌన్నత్య సన్నుతుండగు శేషుండును, నధీశ్వరులై యుండుదు రందు శేషునిప్రభావంబు వినుము. 126

శా॥ ఇద్ధాత్రీతల మెంత [1](యంతయు మహాశీర్షాను)వాళిస్థలిన్
సిద్ధార్థంబుగతిం జెలంగు నమర జ్యేష్ఠాదు లానమ్రులై
సిద్ధార్థంబుగ సన్నుతింతు రతనిన్ సేవ్యుండు సంకర్షణుం
డిద్ధశ్రీమహితుం డనంతుఁడని వాసీంద్రాఘ సంయుక్తులై॥ 127

కం॥ ఫణివిభుఁడు సహస్ర ఫణా
మణిఘృణులు తమో హారణసమగ్రము లగుచున్
బ్రణుతస్థితి నొప్పారగ
గణనీయాంతరప్రకాశకత్వము నొందున్॥ 128

1. రమంతయును మహా యాశాను.

ఉ॥ చూచి మనోనుషంగములు చొప్పడి కోర్కులు సందడింప ని
ద్రాచరణం బెఱుంగక కృశాకృతులై యరతుల్వహించి, ల
జ్జాచలనంబుఁ గాంచుచు భుజంగమకన్యక ల య్యనంతునిక్
గాచుక తమ్ము నాతనికిఁ [1](గా మరు)జేచగ గొల్తు రెప్పుడున్॥ 129

కం॥ అనుటయు నభిమన్యుసుతుం
డనఘా! నరకంబు లనగ నవి యెచ్చట నే
యనువునఁ జొప్పడునో నా
విని యవ్వైయాసి పలికె వినుఁ డఖిలమ్ముల్॥ 130

## న ర క లో క ము లు

వ॥ పూర్వోక్తంబైన జగదండంబునకు దక్షిణదిగంతరాళంబున యమలోకం బాలోకనీయంబగు తత్రత్యులగుచు నగ్నిష్వాత్తాది పితరులు నిజగోత్రజులకు నాశీర్వచనం బొసంగుచుండుదు రా లోకంబు నందుఁ బాపకర్ములకుఁ గర్మానుభవస్థానంబగు నరకంబు గలదు. తద్విధంబు లెన్నియేనియుఁ గల వందుఁ బ్రధాన నరకంబులు సెప్పెద, తామిస్రంబును, నంధతామిస్రంబును, రౌరవంబును, మహారౌరవంబును, కుంభీపాకంబును, కాలసూత్రంబును, అసిపత్రవనంబును, [2](శూకముఖంబును), నంధకూపంబును, క్రిమిభోజనంబును, సందంశంబును, దప్తసూర్మియు, వజ్రకంటక శాల్మలియు, వైతరణియుఁ, [3](బూయోఘంబును), ప్రాణరోధంబును, విశసనంబును, లాలాభక్షయు, సారమేయాదంబును, నవీచియుఁ, [4](ప్రపాతనంబును) నను నేకవింశతి నరకంబులును, క్షారకర్దమంబును, రక్షోగణభోజనంబును, [5](శూల)ప్రోతంబును, దందశూకంబును, [6] (నవటనిరోధనంబును), [7] (నపర్యా)వర్తనంబును, సూచీ

1. గామరు. 2. శూకరముఖంబును. 3. పూయోదంబుఁ.
4. అయఃపానంబును. 5. శూత. 6. అవటనిగాలగోదంబును. 7. ఉపర్యా.

ముఖంబు నను నుపనరకంబు లేడునుం గూడి యష్టావింశతి నరకంబు లనం బడు తనుత్యాగానంతరంబునఁగర్మాయాతయాతనాదేహప్రవిష్టు లగుదుష్ట జీవులఁ గింకరులు గొని చని యమునిముందట నిడిన నతఁడుఁ దత్పాపాను రూపంబుగఁ దత్తన్నరకంబులం ద్రోయించు నందు, 131

తే॥ పరవధూపుత్ర విత్తసంపదల నెవ్వఁ
[1](డారజంబున) హరియించు నతనిఁ బట్టి
కట్టి తామిస్ర మను నరకమునఁ ద్రొబ్బి
యమభటులు పెక్కుబాధల నలఁతు రెపుడు॥ 132

కం॥ శ్రోత్రియునియింతి సఖునిక
ళత్రము నృపకాంత బంధులలనను దోషా
మత్రతఁ బొందిన కుజనునిఁ
దత్రత్యులు వైతు రంధతామిస్రమునన్॥ 133

తే॥ జీవనార్థంబు మృగ ఖగశ్రేణి హంత
లైన క్రూరులు పాశసంయమితు లగుచు
రౌరవంబున నమ్మహా రౌరవమున
రురుసబాధితు లగుచుందు రురుతరముగ॥ 134

సీ॥ విప్ర మాతాపితృ విద్వేషు లొగిఁ గాల
సూత్రతప్తాయసపాత్రకములఁ
బొరలుదుర్ శ్రుతిమార్గ విరహిత పాషండ
వర్తకు లసిపత్ర వనమునందు
దోలినఁ బత్రాసిఁ జాల ఖండిత దేహు
లగుచుఁ జరింతు రత్యార్తులగుచు
ధాత్రి నదండ్యుల దండించినట్టి దు
ష్కర్ములు శూకముఖమున నుంద్రు

1. ఆరజంబై.

తే॥ మశక మక్షికాయూకాది విశసకుండు
పడు భయదమైన యంధకూపంబులోన
కేవలాఘమయుండై నఁ గేవలాది
క్రిమియ కుడుచుచుఁ గ్రిమిభోజనమున మునుఁగు॥ 135

కం॥ కడుఁ బ్రల్లదుఁడై సాధుల
జడత గడవఁ బలుకు నతఁడు సందంశములోఁ
బడి కాఁగిన పటుకారుల
నోడ లెల్లం దిగుపఁ బడుచు నుండు నరేంద్రా॥ 136

ఉ॥ మేదిని లోభ కాముకులు మించి యసన్మతులై హిరణ్య ర
త్నాదిక చౌర్య[1](వృత్తి) సురతానుభవంబుల మేనుఁబెంచు సో
న్మాదులు త[2]ప్త(సూ)ర్మిఁ బలుమారు ప్రతప్తకళంక పుత్రికా
ఖేద కరాళపాళికలఁ గీల్కొనియుందురు కింకరాజ్ఞచేఁ॥ 137

సీ॥ భటులు [3](వేశ్యాంగనా) పరుని శాల్మలిలోన
డంతురు శాల్మలి తరువునందు
వరధర్మహంతను వైతరణీనది
ముంతురు విణ్మూత్రముల మడుగుల
శూద్రాంగనారతు శౌద్రపూయోఘంబు
నందుఁ ద్రొక్కుదురు చీమల్లఁ ద్రావ
శునక కృతాఖేటకునిఁ బెట్టుదురు శస్త్ర
బాధలఁ గడుఁ బ్రాణరోధసీమ

తే॥ సమరకాంతలకై యజ్ఞ మైసకామి
విశసనములోన [4](విశసింతు) రశనిహతుల
కోశపానంబు సేయించికొనిన వారిఁ
దరిమి యునుతురు రేతోహ్రదంబునందు॥ 138

1. (.........) 2. సూ. 3. వశ్యాంగనా. 4. గ్రశవింతు.

కం॥ క్షితి వహ్ని విషప్రదుల, న
యిత దోషాకరుల సారమేయాదనునం
దతినిష్ఠురగతి శునకా
యుతంబు లెడతెగక కఱచుచుండుఁ బొరలగా॥ 139

తే॥ కూటసాక్షిత్వ మొనరించు కుజనుల య్యు
వీచి కింకరుల్ చెవిఁ బడఁ ద్రోచుటయును
చట్టుపై బడి చిద్రుపలై సరసగూడి
యటుల మఱియును దుఃఖార్తు లగుదు రెపుడు॥ 140

తే॥ కల్లుద్రావెడువారలఁ గల్లలాడు
నరులఁ బట్టి రసాయతనంబులోన
నగ్ని దగ్ధంబుగాఁ గాఁచినట్టి యుక్క-
నీరు పోయుదురు వదనముల్నిండ భటులు॥ 141

సీ॥ గర్వోద్ధతుఁడు ఘోరకర్దమంబున నధో
ముఖుఁడయి బాధల మునుఁగుచుండు
పారలు రక్షోగణ భోజనంబున రక్క-
సులు గోసి తినఁ బ్రాణిబలికరుండు
అనపరాధులఁ [1](గొఱఁతనువైచు) నతఁడు శూ
లప్రోతమున శూల లగ్నుఁడగుచు
దందశూకంబులో దండపన్నగముచేఁ
బీడితుండగు జంతు భీషకుఁడు
తే॥ తలఁపఁ బశుహంత ధూమరోధంబులోన
ద్రొబ్బఁబడి యుండు విషవహ్ని ధూను శిఖల
నతిథిఁ గ్రోధాంగుఁడై చూడు నట్టివాని
గన్నులావర్తమునఁ గుక్కగములు మెసఁగు॥ 142

1. గొఱఁతనువైచ.

ఆ॥ ధనము గల్గియుండి దానధర్మంబులు
చేయకుండు నట్టి చెనటిఁ బట్టి
సూచిముఖమునందు సూదులు వరపుచు
గూలఁద్రొబ్బి లజ్జఁగొంద్రు భటులు॥ 143

లయవిభాతి ॥

మఱియును నరక్షితుల, నొఱసి తెగువల్ గలిగి
వఱలుజనుబంట్లు తఱి యెఱిగి ఖలులన్ నే
తఱిమియును బట్టుముల నఱకియును గట్టియల
మెఱమియుఁ, దదంగముల నెఱుకువ మెరంగన్ ?
వెఱచరవ మోదియును, నుఱికి వడిఁ దన్నియును
విఱిగి నెఱకల్మిగుల, నుఱుమగుచు రాలన్
పఱచు జెనుపాటులటు నఱుజగుచు నుండు నది
యెఱిఁగి తెలుపంగ గడు నరుదు ధరణీశా॥ 144

లయహారి ॥

జిఱజిఱనఁ దిరిగి యొక తెఱపి గవి, నలుదెసల
కొఱగుచునుఁ బరువులిడి వెఱఁగుపడువారున్
పిఱుసనక యుఱుముకొని యుఱుము జలదములక్రియఁ
గఱకు భటు[1](ల దలచినఁ) దెఱగు సెడువారున్
తఱలఁబడి ధృతిఁదొఱగఁ [2](జఱుచుఱనఁ) జఠరశిఖి
మెఱియుఁ దమ దురితములు నెఱిఁబలుకువారున్
[3](గఱుదుల)వి తనువు లరవరలగుచు నెఱగఁబడి
మొఱలిడుదు రచట గడు వెఱవున మహీశా॥

1. లదవిచెనం  2. జుఱచున.  3. గళదుర.

కం॥ దోషులు నరకముఁ బుణ్యా
శ్లేషులు త్రిదశాలయంబుఁ జెందుదు రమరన్
దోషసుకృత రహితాత్ములు
భూషింతురు మర్త్యలోకమున్ జన్మముచేన్॥ 145

తే॥ ఈవిధంబున బ్రహ్మాండ మెల్ల నీకు
నానరఁ దెలిపితిఁ బరిణామయుతము గాగ
నీప్రపంచ మింతయును లక్ష్మీశ్వరునకు
స్థూలమూర్తినా నొప్పారు శుభచరిత్ర॥ 146

కం॥ జననాథ యీ జగ ద్వ
ర్ణన విష్ణుస్థూల మూర్తి రమ్యస్తవమున్
[1](వినినన్) బఠియించిన వ్రా
సిన నఘము లణంగు శుభము చేకురు మిగులన్॥ 147

వ॥ ఇవ్విధంబునఁ బంచమస్కంధ కథావిశేషంబులు వినుపించుట
యును, 148

చం॥ అనఘచరిత్ర ! యిట్లు నరకావళిఁ జెప్పితి వట్టి ఘోర దుః
ఖ నిలయముల్గనుంగొనగఁ గ్రమ్మఱ జన్మము నొందరాక యే
యనువునఁ బ్రాణి ముక్తుఁడగు నట్టివిధం బెఱిగింపు మన్న న
జ్జనపతికిం దిరంబగు ప్రసాదమునన్ శుకయోగి యిట్లనున్॥ 149

ఉ॥ కొందఱు బ్రహ్మచర్యమునఁ గొందఱు దానమునన్ దపంబునన్
గొందఱు సత్యశౌచములఁ గొందఱు భూతదయాప్రసక్తిచేఁ
గొందఱు సౌఖ్య మందుదురు కొందఱు విష్ణుపదారవింద భ
క్తిం దెలివొంది కాంతురు సుధీజనసన్నుత మోక్షమార్గమున్॥ 150

1. (.........)

కం॥ పంకజనాభునిఁ గూర్చిన
కింకరు లుద్భేద టంక కృత్తకళంకుల్
సంకుల సంక్రమ యమరా
ట్కింకర శంకాకరాంక కీర్తితచరితుల్ ॥ 151

వ॥ ఈ ప్రస్తావంబునకు నుచితంబైన యజామిళోపాఖ్యానంబు వివరించెద నాకర్ణింపుము. 152

## అ జా మి ళో పా ఖ్యా న ము

కం॥ జనవర కన్యాకుబ్జం
బను నగరమునందుఁ దొల్లి యవనీసురనం
దనుఁ [1](డొక్కఁ) డజామిళుం
డనునాతఁడు గలఁడు భాసురాంగుం డగుచున్॥ 153

వ॥ యథాకాలంబునం జౌలోపనయనసంస్కృతుండై, 154

శా॥ ఉద్యద్భానుసమాన తేజులు గురుల్ [2]((ప్రోద్య)త్ప్ర)కాశంబునన్
సద్యఃప్రాజ్ఞతమీరఁ దెల్ప సవయస్సంగప్రతీతాత్ముఁడై
యాద్యావస్థఁ బితృప్రయత్నవశుఁడై యామ్నాయముఖ్యంబుగా
విద్యాభ్యాసముఁ జేసె నాతఁడు గుణావిర్భావసంభావ్యుఁడై ॥ 155

వ॥ అంత,

కం॥ కందర్పదర్పకం బతి
సౌందర్యకరము విలాససంస్థానం బా
నందితజననేత్రము నై
పొందెడుప్రాయము తదంగమున నుదయింపన్॥ 156

---

1. నొక్క నరుడ 2. (.........). 3. కంధతి.

సీ॥ కనుపట్టె విస్తారకలితమై వక్షంబు
కరములు దీర్ఘతారకము లయ్యె
గౌరవరేఖానుగము లయ్యె మూపులు
కనుదోయి ధవళతావినుత మయ్యె
తనుతరం బయ్యె మధ్యప్రదేశంబు రో
మావళి దర్శనీయత వహించె
స్వరము గంభీరమై వఱలె నితంబభా
గము పృథుత్వంబున నమరి యుండె
తే॥ నూరుదండంబు లాపూర్తియుతము లయ్యె
మొలచె నూనూగుమీసలు మోమునందు
నాలుగంచుల నవయౌవనమున మెఱసె
మహిసురాత్మజుఁ డభినవమదనుఁ డనఁగ॥ 157

వ॥ అంతఁ గృతవివాహుండై, తండ్రిపనిచినపను లొనరించు చుండి యొక్కనాడు, 158

ఉ॥ ఆవసుధాసురాత్మజుఁ డుదారతఁ గానకు నేఁగి యచ్చటం
బావనసీమఁ గ్రొవ్విరులుఁ బర్ణములు న్గుశము ల్సమిత్తులున్
ధీవెలయంగఁ గొంచు నరుదెంచుచు నొక్కయెడం గుడుంగగ
ర్భావసథంబునందు విషమాస్త్రనిశస్త్రికనుం గణంకతోన్॥ 159

కం॥ ఒకభటునితోడ వేడుక
నొకబాలిక యుపరిసురత మొగి పలుపంగాఁ
బ్రకటకటుల నయ్యిరువుర
మకరాంకాయత్తచిత్తమత్తులఁ గనియెన్॥ 160

వ॥ మఱియు నయ్యిరువురును గామ్యచేష్టావశంగతులగుచు నుండుటయుఁ గనుంగొని, 161

ఉ॥ చిత్తము సంచలించి కడుఁ [1](జిత్తజుఁ డొత్తిలి యుంగుటంబు)చే
నత్తుకమొత్తఁ దుత్తునియలై తనధైర్యము కత్తళంబు కిం
చిత్తును లేకపోవ, నతిచిత్రమహాత్తరమోహమత్తుఁడై
తత్తరపాటుతోడ నిజధామముఁ జేరి వివిక్తశాయియై॥ 162

ఉ॥ మజ్జనభోజనాదులకు మాటికిఁ దల్లియుఁ దండ్రియుం గడుఀ
బుజ్జనమొప్ప లేపినను బోవక శంపలికై నిజాన్వయం
[2](బుజ్జనసేసె) నింద కొడిగొగ్గి విశిష్టతఁ బారఁదోలి పెఀ
లజ్జఁ బరిత్యజింపఁగ దలంచెఁ బురాకృతపాపశక్తిచేఀ॥ 163

వ॥ మఱియు నతం డాత్మగతంబున, 164

ఉ॥ అప్పటికాంత కాకలికి కాలతకూనకు [3](నామిటారికిం)
గుప్పలుగా మదీయ[4](పిత) గూర్చినవిత్తము గల్గునంతయుఀ
దప్పక యొప్పగించి బలితంబగు దాని మనోజకేళులం
దెప్పలఁ దేలకున్న నిఁక దేహము నిల్వదు వేయు నేటికిఀ॥ 165

వ॥ అదియునుంగాక యనంగబ్రహ్మతంత్రంబు సకలసుఖసాక్షాత్కారక్షమంబై లక్ష్మీశ్వరప్రభృతిసేవ్యంబై గర్వాతిశాయి యగుట వలన నిర్వాణకాఖ్యవాచకంబులగు శాస్త్రవాక్యంబులచేత స్మరస్థిరతారుణ్యమత్తమత్తకాశినీనితంబబింబకామమోక్షంబాదియగు సౌఖ్యంబె చెప్పంబడునని స్వసంవేద్య పరమానందస్వరూప సురతసౌఖ్యంబునకు మోక్షసుఖత్వంబు ప్రతిపాదించి యదియు ననంగభజనంబును విడిచి సిద్ధింపదనియును దదుచిత తర్కమార్గంబుల వితర్కించిన, 166

---

1. జిత్తముడొత్తిలియుంగళంబు. 2. వర్జన చేసె. 3. యూ దీరికి.
4. లత.

శా॥ యాగార్థంబుగఁ దండ్రిగూర్చినధనం బాకట్టెణిం జేర్చి, యా
యాగం బచ్చరవేదులం దగులగాఁ దాఁ దత్ప్రరోక్షస్థితి
ప్రాగల్భ్యంబు లెఱుంగు నెవ్వఁ డిపుడే ప్రత్యక్షమార్గంబునన్
భోగం బందెద, దీని నే నని మనోభూసత్రదీక్షాఢ్యుఁడై॥ 167

కం॥ ద్విజుఁ డాచేటికతోడన్
సజ్జ్గి యొనరించి చదువు సంధ్యయుఁ గులమున్
త్యజియించి యెప్పుడు స్మర
సిజకేళిం దేలుచుండె శిష్టులు దెగడన్॥ 168

తే॥ ధరణిసురుఁ డవ్విధంబున దాసిఁ గూడి
కాపురముచేసి సుతదశకంబుఁ గాంచె
నందులోన నారాయణుం డని యదృచ్ఛఁ
బిన్నసుతునకుఁ బేరిడెఁ బ్రేమ నతఁడు॥ 169

వ॥ అంత,

సీ॥ అతనిదుర్వృత్తికి హాసియించెనో యని
నెటివెంట్రుకలకుఁ బొండిమ జనించెఁ
విప్రుల కేల యీవిషయేచ్ఛ యని నిషే
ధము సేయుకై వడిఁ దల వడంకె
ద్విజరాజు కితని నద్విజు విడఁ దగునని
తలచినభంగి దంతములు సడలె
శ్రుతిదృష్టిరతివిరహితున కే మేలను
పొలుపున శ్రుతిదృష్టిబలము లగలె
ఆ॥ సుగతి దగునె యిట్టి శూన్యాత్మునికి నను
పగిదిఁ గాళ్ళు దొట్రుపడఁ దొడంగె
అఖిలరోగమూలమైన వృద్ధత్వంబు
గదిరి యతని నిట్లు గుదియఁ దిగిచె॥ 170

కం॥ సాష్టాశీతిసమంబులు
కష్టత గనునంత నంతకాలంబున సం
దృష్టు లయిరి యమభటులుఁ
త్వష్టాశితతనులు పాశధరు లాతనికిన్॥ 171

వ॥ అత్తెఱంగున నజామిళుం డట్టి యమకింకరులం గాంచి తదా
కృష్యమాణప్రాణుం డగుచు భీతుండై, 172

కం॥ ఆయెడ మమతావశుఁడై
యాయాత్మకనిష్టపుత్త్రు నాసన్నుని నా
రాయణ నారాయణ నా
రాయ ణటంచున్ ద్రివార మాహ్వానించెన్॥ 173

తే॥ అట్లు తమనాథుఁ బేర్కొన్న యంతలోన
విష్ణుదాసులు నలువురు విష్ణుమూర్తు
లచటి కరుదెంచి యవ్విప్రునసువు లీడ్చు
యమభటుల ద్రొబ్బి రర్ధచంద్రాంతరముల॥ 174

వ॥ ద్రొబ్బుటయు నుబ్బుపడి యబ్భటులు మగల నగధరదాసులం
గని యిట్లనిరి. 175

శా॥ ఓహో వైష్ణవులార! యీచెనటి నత్యున్మత్తు దాసీపతిన్
మోహాంధు న్నరకార్హు నేము దిగువన్ ముగ్ధాత్ములై మీర లు
త్సాహం బొప్పఁగ నడ్డపెట్టఁ దగదే సాధించి మీవంటివా
రాహా! మేఱలు దప్పినం బరులు రాఁగాదన్ శక్తులే॥ 176

వ॥ అనుటయు గాలకింకరులకు విష్ణుకింకరు లిట్లనిరి. 177

ఉ॥ ఓ యమదూతలార! యితఁ డుగ్రతరాఘమయుండు సర్వహే
యాయన మిట్టిదయ్యు మరణావసరంబున నూరకైన నా
రాయణశబ్దమ్ముం బలికె నందునఁజేసి పవిత్రుఁడయ్యె న
న్యాయము సేయ మేము నరకార్హుఁడు గాఁడిక నీతఁ డెన్నడున్॥

## నారాయణ నామ ప్రభావము

సీ॥ బహుళదుర్భరమహాపాతక పర్వత
హరిహేతి నారాయణాహ్వయంబు
సంభావితాజవంజవబంధనేభ పం
చాస్యంబు నారాయణాహ్వయంబు
ఘటితతాపత్రయ కాననప్రజ్వల
దనలంబు నారాయణాహ్వయంబు
సంభృతదుస్తరాజ్ఞానాంధతమసోద్య
దర్కుంబు నారాయణాహ్వయంబు
తే॥ భూరితరభీషణాపదాంభోధరస్ఫు
టానిలస్ఫూర్తి నారాయణాహ్వయంబు
సకలకల్యాణకల్యతార్జనమహోర్జి
తామరాగంబు నారాయణాహ్వయంబు॥ 179

మ॥ పగచే నోర్వకనైనఁ గేలి[1](నయినన్) భావంబునన్ మచ్చికన్
నెగడం బిడ్డలపేరుపెట్టి[2](యయినన్) లీలోక్తినైనం దగన్
భగవన్నామముఁ జేరుకొన్నయతఁ డంతఃపాపనిర్ముక్తుఁడై
సుగతిం బొందు, నెఱుంగకైన నసలున్ సోకంగ మై [3]వాకఁడే॥

కం॥ కావున నీతని దడవక
పోవలయున్ మీర లనుచుఁ బురుషోత్తమునం
సేవకులు యమభటుల స
ద్భావముతోఁ జెప్పి చనిరి తాముౝ వేగన్॥ 181

సీ॥ అంత నయ్యమదూత లాత్మీయపురి కేఁగి
యధిపతి కానతు లగుచు నిల్చి

1. నైన. 2. యైన. 3. వకఁడే.

తమపరాభవమెల్లఁ గ్రమముతో వినిపించి
యో దేవ యింక నే డాదిగాగ
పాపపుణ్యంబు లేర్పరుపంగఁ గూడదు
నీయాజ్ఞ యిట్లయ్యె నేఁటితుదకు
ననుటయు నవ్వి కృతాంతుండు వారితో
ననియె నో భటులార కినుక వలవ

తే॥ దయ్యజామీళుఁ డతిదోషి యయ్యు మరణ
సమయమున విష్ణునామసంస్మరణఁ జేసి
సత్కృతనఁ బవిత్రాత్ముఁ డయ్యె నాత్మ
నపుడుఁ దొల్లియు మర్యాద యటుల జరుగు॥ 182

కం॥ శ్రీమన్నారాయణనా
మామృతము సమస్తజనుల కరుదుగ దోష
స్తోమముల నడఁచి సద్యః
కామితఫలదానకల్పకత్వముఁ బొందున్॥ 183

శా॥ కృష్ణా కేశవ వాసుదేవ హరి లక్ష్మీకాంత నారాయణా
విష్ణో [1](యచ్యుత) శంఖచక్రధర పృథ్వీధారకా యంచు సం
తృష్ణం బేర్కొనువారిఁ గాంచి భయభక్తి [2](ప్రహ్వులై) దూరవ
ర్తిష్ణుత్వంబున నుండుఁ డీరలు మదాదేశంబున న్నిత్యమున్॥ 184

కం॥ అని యిట్లు యముఁడు భటులకు
ననుమానము వాయఁ దెలిపినంతట నిట న
య్యనఘుఁ డజామీళుఁడు చే
తనఁ గ్రమ్మఱ నొంటి లేచి తనమదిలోనన్॥ 185

---

1. దచ్యుత. 2. ప్రవరులై

ఉ॥ ఇచ్చట మద్భయంకరత నిప్పుడు నిల్పినవారి మువ్వురన్
గ్రచ్చరఁ బారఁద్రోలి నను గాచిన వైష్ణవు లాత్మపుణ్యులై
యెచ్చటి కేఁగిరో యహహ యేగతి వచ్చెనొ నాకు విష్ణునా
[1](మోచ్చరణా)సమానశుభయోగము తత్సమయంబునన్ వడిన్ ॥

కం॥ యౌవనముతోడి భార్యం
బో విడిచి కుబుద్ధి దాసిఁ బొందినకతనన్
జీవావసానవేళన్
శ్రీవల్లభు నొడువఁ గనుట చిత్రము గాదే॥ 187

ఉ॥ భాగ్యము చేసితిన్ మిగులఁ బ్రస్తుతమయ్యె మదీయజన్మమున్
యోగ్యత నేటికిన్ ఫలమునొంది కృతార్థుఁడ నైతి సావిత్రో
ఋగ్యజుషాదివేదసుతు నీశ్వరుఁ బేర్కొనఁ గంటి నింకవై
రాగ్యపథంబుఁ గైకొని తిరంబుగఁ బూనెద విష్ణుదాస్యమున్॥ 188

తరువోజ ॥

అని యిట్లు దలఁచి య య్యవనిసుపర్వం
డపుడ సమస్తేషణాసక్తి విడిచి
ఘనభక్తియుక్తి గంగాద్వారమునకుఁ
గడువడిఁ జని విష్ణుకైంకర్యపరతఁ
గని యోగమార్గముక్తశరీరుఁ డగుచు
గరుణతోఁ దను మున్ను గాచినయట్టి
యనఘుల నల్వుర నచ్చటఁ గాంచి
యంతంతఁ బ్రణతుఁడై యానంద మొందు॥ 189

---

1. మోన్పతరా.

కం॥ వారిం గూడిన సువిమా
నారూఢుండగుచుఁ జూచి యమరులు వొగడన్
సారంబగు వైకుంఠముఁ
జేరి మహానందలీలఁ జెలఁగుచు నుండెన్॥ 190

కం॥ క్షితినాథ సచ్చరిత్రా
యతిభద్రం బైన యీయుపాఖ్యానము స
న్మతిఁ జదివిన వినిన రమా
పతికిం బ్రియదాసు లగుచుఁ బరగుదురు జనుల్॥ 191

వ॥ అని యివ్విధంబునఁ జెప్పిన విని పరీక్షిత్తుండు మహాత్మా! ప్రచేతసులకు మారిషాకన్యయందు జన్మాంతరంబు నొందిన దక్షుని సంతానంబుచేత జగత్త్రయంబు నాపూర్ణంబయ్యెనని యపుడానతిచ్చితి, తత్ప్రకారంబు విన మదిఁ గౌతూహలంబయ్యెడు ననుటయు శుకయోగీంద్రుం డిట్లనియె నట్లు సంజనితుండైన దక్షుండు కొంత సృష్టి యొనర్చి సంతుష్టుండు గాక వింధ్యపాదంబున యఘమర్షణతీర్థంబున, 192

దక్షుఁడు తపం బాచరించుట

కం॥ హరిఁ గూర్చి భక్తిఁ బహువ
త్సరముల [1](నతి)ఘోరతపము చరియించిన న
ప్పురుషోత్తముఁ డతనికి నా
దరమునఁ బ్రత్యక్షమయ్యె దయ దైవారన్॥ 193

సీ॥ తరుణార్కబింబంబుఁ బరిహసింపఁగఁ జాలు
వరకిరీటముతోటిశిరమువాని

1. లల.

కరుణారసంబుచేఁ బరిదగ్ధమగుచు న
ప్పురిగెడుచూడ్కిచే బెరయువాని
గురుకౌస్తుభద్యోతభరముచేఁ గడు మించు
సిరికి సౌధంబైన యురమువాని
సురుచిరహాటకాంబరకాంచికామనో
హరతరకటిసీమఁ బరగువాని

ఆ॥ గరుడకరవిరాజచరణాబ్జములవాని
[1](హరి రమేశుఁ) బరమపురుషుఁ గాంచి
[2](యరితిఁ) గొనుచు దక్షుఁ డిరవొందఁగా మ్రొక్కి
గరిమె నభినుతించె నిరతుఁ డగుచు॥ 194

కం॥ నుతుఁడై హరి దక్షునకుఁ
జతురాస్యునిపుత్రిఁ జారుచరిత నసిక్నిన్
సతిగా నొసంగి సంతతి
వితతంబుగఁ జేయు మనుచు విజయము చేసెన్॥ 195

## దక్షసంతతిప్రకారము

ఆ॥ ఆయసిక్నియందు హర్యశ్వనాముల
గనియెఁ దక్షుఁ డయుతతనయవరుల
వారుఁ దండ్రియాజ్ఞఁ దారు ప్రజాసర్గ
సిద్ధికై తపంబు సేయఁ [3](జనిరి)॥ 196

ఉ॥ నారదుఁ డాకుమారులకు నందితమైననివృత్తిధర్మముల్
వారకఁ దెల్పి విష్ణుపదవాసులుగా నొనరించి తానె య
ద్దారుణవార్త నేరుపున దక్షునకున్ వినిపించె దక్షుఁడున్
ధీరుఁడు గావునన్ మనము నిల్పుక క్రమ్మఱ సర్గలోలుఁడై॥ 197

1. హరి బరమేశు. 2. అర్థి. 3. మనిరి.

ఉ॥ ఆతనుమధ్యయందు [1](శ)బళాశ్వులు నాగ సహస్రపుత్రులన్
జాతులఁ [2](జేసె) వారలును జాగి వనంబున కేఁగి యాదిమ
భ్రాతలభంగి నారదుప్రభావమునన్ హరిఁ జేరి రంత ని
ఖ్యాతుఁడు దక్షుఁ డింతయును నారసి నారదుమీఁదఁ గ్రోధియై॥

సీ॥ ఇదియాదిగా నిన్ను నెల్ల మునీంద్రులుఁ
గలహకారుఁ డటంచు గర్హసేయ
నొకచోట నిల్వఁ గూడక త్రిమ్మరుఁడవు గాక
యని యుగ్రముగ నారదుని శపించి
తనయంతటనె కాని ధాత్రిఁ దత్త్వజ్ఞాన
మొరులు దెల్పినఁ బుట్టకుండు ననియు
జనులకుఁ గామంబుఁ ఘనతరంబగుఁ గాక
యనియును నియమించె నంత నతని

ఆ॥ హృదయభేదవృత్తి నెఱిఁగి చతుర్ముఖుఁ
డరుగుదెంచి [3](తెలివి నడలు)మాన్చి
నిలుచు నింక నీకుఁ గలుగుసంతతి యని
సృష్టి కభిముఖాత్ముఁ జేసి చనియె॥ 199

వ॥ అంత దక్షుం డా యసిక్నియందుఁ బుత్రికల నరువదింటిం బుట్టించి యందు ధర్మునకుఁ బదుగురను, భూతునకు నిద్దఱ, నంగిరసున కిద్దఱఁ, గృశానున కిద్దఱఁ, [4](దార్క్ష్యునకు) నలువురఁ జంద్రునకు నిరువది యేడ్వురఁ, గశ్యపునకుఁ బదుమువ్వురఁ, బుత్రీకరణపూర్వకంబుగాఁ నొసంగె నందు ధర్మునకు భాను వను భార్యయందు వేదాదులును, లంబయందు విద్యోతుండును, [5](గకుద)యందు సంకటుండును, [6](జామి)

1. (.........). 2. యరిగి. 3. తెలివి ... డలు. 4. తక్షునకు.
5. కకుద్దేవి, పోతనభాగవతము, సంస్కృతమునకూడ. 6. ధామి.

యందు దుర్గంబులును, విశ్వయందు విశ్వనామదేవతలును, సాధ్యయందు సాధ్యగణంబులును, మరుద్వతియందు మరుద్వంతుండును, ముహూర్త యందు [1](మౌహూర్తిక) నామ దేవగణంబులును, సంకల్పయందుఁ గాముండును, వసుదేవియందు ద్రోణప్రాణధ్రువార్కాగ్ని దోషవస్తు విభావసులను వసువులును బుట్టి రా వసువులయందు ద్రోణునకు హర్ష శోకభయనామములును, ప్రాణునకు సహానాదులును, ధ్రువునకు [2](బురు లును), నర్కునకుఁ [3](దర్షాదులు)ను, నగ్నికి ద్రవణికాదులును, స్కందుండును, దోషునకు శింశుమారుండును, వస్తువునకు విశ్వకర్మయు విభావసునకు వ్యుష్టిప్రముఖులును, జనియించిరి. ఇది ధర్ముని సంతతి ప్రకారంబు. మఱియు భూతునకు సురూపయం దేకాదశరుద్రులును, బహురూపయందు భూతప్రేతాదులు సంభవించిరి. అంగిరసునకు స్వధయందుఁ బితృగణంబులును, సతియందుఁ బుత్రత్వంబున నథర్వవేదు లును నుదయించిరి. కృశాశ్వునకు నర్చిష్కరయందు ధూమ్రకేతుండును వేదశిరునకు ధిషణయందు దేవలుండును గలిగిరి. తార్క్ష్యునకు వినతయందు గరుత్మంతులును, గద్రువయందు భుజంగంబులును, బతంగియందుఁ బక్షులును, యామినియందు శలభంబులును బ్రభవించె. చంద్రుండు కృత్తికాది సప్తవింశతితారకలయందు ననపత్యుం డయ్యె నని చెప్పి శుకుండు పరీక్షిత్తున కిట్లనియె. 200

కం॥ భూనాథ! ముజ్జగంబులఁ
గానంబడుచున్నయట్టి కశ్యపమునిసం
తానము వివరించెద నవ
ధానంబున వినుము సమ్మదం బొదవింతుఁ౯॥ 201

---

1. ముహూర్తిక. 2. బురంబులు; పుర అని సంస్కృత భాగవతము
3. నిషాదులు.

## దేవాసుర నరతిర్యగాది జన్మప్రకారము

వ॥ అదితియు, దితియుఁ, దనువుఁ, గాష్ఠయు, నరిష్టయు, సరమయు, సురభియు, నిలయుఁ, దామ్రయుఁ, దిమియుఁ, గ్రోధవశయు మునియు, సారసయు నను పదుమువ్వురుభార్యలయందును నదితికి వివస్వంతుడును, [1](నర్యముండును) [2](బూషుండునుఁ), ద్వష్టయు, సవితయు భగుండును, ధాతయు విధాతయు, వరుణుండును మిత్రుండును, శుక్రుండును, నురుక్రముండును నన నన్నిద్దఱు జనియించిరి. దితికి హిరణ్యకశిప హిరణ్యాక్షు లన నిద్ద ఱుదయించిరి దనువునకు నముచిత ప్రముఖులగు దానవులు పెక్కండ్రు పుట్టిరి. కాష్టకు వినాశక్రోధాదులగు యాతుధానులు పుట్టిరి. అరిష్టకు ద్విమూర్ధ, శంబర, అరిష్ట, హయగ్రీవ, విభావసు, అయోముఖ, శంకుశిర, స్వర్భాను, కపిల, అరుణి, పులోమ, వృషపర్వ, ఏకచక్ర, అనుతాపక, ధూమ్రకేశ, విరూపాక్ష, విప్రచిత్తి, దుర్జయు లను పదినెనమండ్రు జన్మించి రందు విప్రచిత్తికి సింహికయను భార్యయందు రాహువు జ్యేష్ఠుండుగాఁ బుత్రశతంబు పుట్టె. సరమకుఁ బ్రజలును, సురభికిఁ బశువులు, నిలకు వృక్షంబులుఁ, తామ్రకు శునక గృధ్రాదులును, దిమికి జలచరంబులును, గ్రోధవశకు సర్పంబులును, ముని యను భార్యకు మేనకాసహజన్యాదులగు నప్సరసలును, సారసకు గంధర్వులును బుట్టిరి. మఱియుఁ గశ్యపునకు రాక్షసకన్యకలగు పులోమయుఁ, గాలకయు నను భార్యలయందుఁ బౌలోమకాలకేయు లన నరువదివేవురు రాక్షసులు జన్మించిరి. ఇంక మున్నుఁ జెప్పిన యదితి దితుల సంతతిక్రమంబు వర్ణించెద నం దదితికుమారులగుఁ బన్నిద్దఱి యందును వివస్వంతునకు శ్రద్ధ యను భార్యయందు శ్రాద్ధదేవుండును, మనువును సంజ్ఞ యను కన్యయుం బుట్టి మిథునీభూయంబు నొందిరి. యముండు నద్దేవియందు జనియించె. ఛాయాదేవియందు శనైశ్చరుం

1. నార్యభూముండును. 2. పూతయు.

డును, సావర్ణిమనువును, తపతి యను కన్యయుం బుట్టిరి. అర్యమునకు మాతృక యను పత్నియందుఁ జర్షణు లనువారు పుట్టి మనుష్యజాతిం బరగిరి. పూష యనపత్యుం డయ్యె. త్వష్టకు దైత్యానుజయైన రచన యను భార్యయందుఁ దపోబలసంపన్నుండగు విశ్వరూపుం డను కుమారుఁడు పుట్టి యతండు కొండొకకాలంబు బృహస్పతిం దలంగి పోయిన దేవతలకు నాచార్యుండై యుండె నని చెప్పుటయుఁ బరీక్షిన్నరేంద్రుండు శుకయోగిచంద్రుం గనుంగొని, 202

కం॥ గురుఁ డేల తలఁగి పోయెఁ
గురుమతియగు విశ్వరూపకుఁడు వేల్పులకుఁ
గురుఁడై యేమి యొనర్చెఁ
సురలోకమునందు ననుడు శుకుఁ డిట్లనియెఁ। 203

సీ॥ నరనాథ విను సురేశ్వరుఁ డొకనాడు కొ
ల్వున నుండి గురుఁడు వచ్చిన విశిష్ట
సముచితంబగు నుపచారంబు సేయక
[1](దృప్తత నున్న) యద్ధిషణుఁ డలఁగి
యాత్మగేహమునకు నరుగఁ బ్రశ్చాత్తప్తు
డై యింద్రుఁ [2](డరిగి) తా ననునయించి
తెచ్చెద ననుచుఁ దద్ధిషణాలయమునకు
జనుడు నాతం డదృశ్యత వహించె

తే॥ అంత వృత్తాంత మంతయు నాక్షణంబ
చారముఖమునఁ దెలిసి రాక్షసులు శుక్రు
భజనమున సిద్ధతేజఃప్రభావు లగుచు
దాడి వెట్టిరి నిర్జరధామమునకు॥ 204

1. దృప్తవునున్న. 2. డరుగ......జయించి.

శా॥ కయ్యం బయ్యె సమర్త్యదైత్యులకుఁ దత్కాలంబునన్ వాసవుం
డయ్యాచార్యు న[1](వజ్ఞ)చేసి యబలుండై యేగె, దైతేయు [2](ల
క్షుయ్య)శ్రీనిధి నాకలోకము మహోత్సాహంబుతోఁ జొచ్చి [3](హె
చ్చయెన్ బెంపన) యుండి రంతటను జంభారాతిముఖ్యామరుల్॥

కం॥ ఖిన్నులయి పద్మసంభవుఁ
డున్నకడకు నేఁగి వినుతు లొనరించి నిజా
పన్నతఁ గలిగిన దెంతయు
విన్నపములు సేయ నతఁడు విని యిట్లనియెన్॥ 206

శా॥ అత్యౌన్నత్యము నొంది వజ్రి సభలో నాచార్యుఁ డేతెంచినన్
బ్రత్యుత్థానము చేయఁడయ్యె నతఁడాభావంబు గర్హించి సాం
గత్యం బొల్లక పోయినట్లగుట రక్షస్సంఘు మీక్షించి యా
ధత్యంబున్ భజియింప నిట్లు కవిపాదద్వంద్వసంసేవనన్॥ 207

ఆ॥ గురుపదాబ్జసేవకులకు నిర్జరులార!
కొంగుపసిఁడి సర్వమంగళంబు
గురునిఁ బరిభవించు కుమతి విశ్వద్రోహి
యనగఁ బరగు [4](శీత)కాత్ముఁడగుచు॥ 208

వ॥ అట్లు గావున మీర లీసమయంబునం ద్వష్టకుమారుండగు విశ్వరూపుని నాచార్యుగాఁ జేకొనిన శుభంబు చేకురు నని యానతిచ్చి చతుర్ముఖుం డనిపిన నియ్యకొని యయ్యాఖండలుం డమరపరివృతుండై విశ్వరూపునికడకు నరుదెంచి యతనిఁ గురునిగాఁ బ్రార్థించిన నతండు నంగీకరించి పితృసహోదరుండగు నింద్రునకు నారాయణకవచంబను స్తోత్రంబు నుపదేశించిన, 209

1. పజ్జ. 2. లక్ష్మయ్య. 3. చ్చయ్యం జంపగ 4. సీత.

కం॥ నారాయణకవచస్తవ
సారంబున దైత్యబలము సమయించి పున
స్స్వారాజ్యపదప్రాప్తి ను
దారుండై వజ్రి యుండెఁ దద్దయుఁ బ్రీతిన్ ॥ 210

## వి శ్వ రూ ప సం హా ర ము

వ॥ విశ్వరూపకుండును రెండవబృహస్పతి యన నుండుచుం దన
యజ్ఞహవిర్భాగంబు మాతృవాత్సల్యంబున [1] (మాతామహులైన)
దైత్యులం జేర్చుచు నున్న నెఱింగి మహేంద్రుండు కోపించి సోమపాన
సురాపానాన్నఖాదంబులు సేయు నతనిత్రిశిరంబులును ఖడ్గంబున ఖండించె
నది.యుం గ్రమంబునం గపింజలంబును గలవింకంబునుం దిత్తిరియు నయ్యె
నట్లు గురుండును బ్రాహ్మణుండును నైన విశ్వరూపుని వధియించుటం
జేసి యింద్రునకు బ్రహ్మహత్యాదోషంబు సంప్రాప్తంబగుటయు, 211

సీ॥ తద్దోష మొక్కయబ్దము భుజియించి మ
హేంద్రుఁ డతిశ్రాంతహృదయుఁ డగుచు
ధరణిపయోవృక్షతరుణులఁ బ్రార్థించి
భువికి ఖాతము తానె పూడుటయును
జలమున కఖిలసంశోధనశుద్ధత
త్వంబుఁ జెట్లకు నికృత్తంబు లయ్యు
మఱియును గూర్చుసామర్థ్యంబుఁ గాంతల
కెపుడు కామోపభోగేచ్ఛ కలిమి
తే॥ వరములుగ నిచ్చుటయును దద్దురితమెల్ల
వారు బంచుక నెఱియభావమున, నురుగు
సరణి, నిర్యాసమూర్తి, రజఃప్రకార
మునఁ బరిగ్రహించిరి లోకములు నుతింప॥ 212

1. మాతామహుండైన.

వ॥ అంత,

## వృత్రాసురసంభవము

కం॥ పుత్రునిఁ జంపుట కోర్వక
పాత్రుండగు త్వష్ట యింద్రుపై మారణముక్
సత్త్ర మతినిష్ఠ సేయఁగ
వృత్రుం డను నొక్క యసుర వెడలెఁ దదగ్నిన్॥ 213

వ॥ అట్లుదయించి యంజనాద్రినిభుండును, బ్రతిదిన [1](శరపాత) మాత్రప్రవర్ధమానశరీరసమున్నతివిస్తారుండును దంష్ట్రాకరాళవివృతవదనుం డును శూలహస్తుండునునై వృత్రాసురుండు మహేంద్రసంహారణో ద్యుక్తుం డగుచు నరిగిన, 214

ఆ॥ ఎద్రి దివినివాసు లెల్ల నిర్జరులు న
య్యసురమీఁద బహువిధాస్త్రశస్త్ర
వితతు లేసి రవియు, వృత్రుండు దిగ మ్రింగె
వారిఁ బరపె సఫలవైరుఁ డగుచు॥ 215

స్రగ్ధర : అంతన్ భీతిల్లి శక్రాద్యమరు లసురమాయం జయింపన్ బలం బా
వంతైనన్ లేదు ధైర్యం బణఁగె నిలుచు టెట్లంచు నత్యంతచింతా
క్రాంతన్ స్వాంతానుతాపగ్రథితులయి పయఃకంధిమధ్యస్థు లక్ష్మీ
కాంతున్ సంతాపహారిన్ గని నతులు నుతుల్ గ్రక్కునం జేసి భక్తిన్॥

వ॥ ఇట్లు విన్నవించిరి. 217

ఉ॥ దైవతసార్వభౌమ యవధారు భవత్కరుణాసమృద్ధికిన్
బావలమైన వాసవునిఁ ద్వష్టతనూజుఁడు వృత్రనామసం
భావితుఁ డొక్క రక్కసుఁడు పైకొని నొంచుచు నస్మదీయశ
స్త్రౌఘములెల్ల మ్రింగి యనియం దవిజేయత నున్నవాఁ డొగిన్॥ 218

---

1. శరదూయ.

వ॥ ఇంద్రుం డిట్లనియె. 219

ఉ॥ వేదుక మీఱఁ ధర్మపథవిద్విషులం బొలియించి, దేవగో
బాధబరక్షణంబునకుఁ బాల్పడ నో హరి! నీకె చెల్లు ని
ట్లోడని నీధురంధరత కొక్కరుఁ డర్హుఁడె యెట్టివేళయుం
దేడికి మోవ శక్తమగునే? మదహస్తి వహించు పల్లముల్॥ 220

మ॥ ప్రకృతిం దాటి వెలుంగుటం బ్రకృతికిం బార్థక్యముం బొందియుల్
బ్రకృతిప్రత్యయవైఖరిల్ బ్రకృతితోఁ బ్రస్ఫూర్తిమైఁ గూడియున్
బ్రకృతిల్ లీలఁ గలంచి సృష్టి యొనరింపఁ జేసియుల్ సృష్టికిల్
బ్రకృతాధీశత నుండు నిన్ను వినుతింపం బ్రాకృతుం డోపునే! 221

## దధీచి చరిత్రము

చం॥ అనుటయు మందహాసము ముఖాబ్జమునం దిగురొత్తఁ జూచి య
వ్వనరుహనేత్రుఁ డిట్లనియె వాసవ! సర్వము నే నెఱుంగుదుల్
వినుము దధీచి నాఁగ నొక విశ్రుతుఁడైన మునీంద్రుఁ డున్నవాఁ
డనువున యాచకాకృతిఁ దదంగము మీఁదలు వేఁడఁ డిత్తఱిల్॥ 222

శా॥ స్వచ్ఛంబైన తపోవిశేషగరిమల్ సారప్రశస్తంబులై
తచ్ఛల్యంబులు కల్యముల్ కడు మహేంద్రా! యందు వెన్నెమ్మ నీ
సచ్ఛస్త్రంబగు విశ్వకర్మకృతమై శంఖాహ్వయంబై తదం
చచ్ఛక్తిల్ రిపుఁ గెల్చికై కొనుము నీస్వారాజ్యముల్ [1]బ్రాజ్యముల్॥

కం॥ మఱియును గలిగిన జిల్లర
నెఱికలు శస్త్రములు గాఁగ నియమంబున న
త్తఱిఁ గైకొని నిర్జరులు ప
గఱఁ బరిమార్పంగ శక్తిఁ గాంతురు మిగులల్॥ 224

1. బూజ్యముల్.

ఆ॥ అనుచు నాన తిచ్చి హరియు నంతర్హితుం
డయ్యె నింద్రుఁడాదియైనసురలు
నాదధీచియున్న యాశ్రమంబున కరు
దెంచి సంభ్రమమునఁ గాంచి రతని॥ 225

వ॥ కాంచి కుశలప్రశ్నం బొనర్చి రందు మహేంద్రుండు, 226

కం॥ అర్థిజనకల్పవృక్ష ! స
మర్థుఁడవగు నిన్ను నీదు మహితాంగము నే
నర్థించుచున్నవాఁడఁ గృ
తార్థత నా కొసఁగు మనుచు నతఁ డిట్లనియెన్॥ 227

ఉ॥ ఈ మహియందు యాచకు లనేకవిధంబులవార లుందు రం
దేనును, [1](మున్ను) వేడ నొకఁడేనియు నా విని యుండ నైన నీ
కేమి ప్రయోజనంబునకు నెక్కుడు నాదు శరీర మొద్ది నీ
నామ మెఱుంగఁ జేయు మనినన్ విని యాతని కింద్రుఁ డిట్లనున్॥ 228

కం॥ ఏ నింద్రుఁడ వృత్రాసురు
చే నొచ్చుచు నున్నవాఁడ శ్రీకరమగు నీ
మే నిచ్చిన గెల్తు నసుఁడు
నా నిర్జరవరునితోడ నతఁ డిట్లనియెన్॥ 229

తే॥ దేహిదేహవిభేదంబుఁ దెలిసి యుండి
దేహి యొక్కఁడు వచ్చి నన్ దేహి యనిన
దేహ మిచ్చుట కేమి సందేహ మిట్టి
దేహ మేల యశస్స్థిరదేహ మనుచు॥ 230

వ॥ అని పలికి దధీచి వాసవునిం గనుంగొని పరిగ్రహింపు మనుచు
యోగముక్తశరీరుండై వాసుదేవబ్రహ్మంబుఁ గలసె నింద్రుండును నతని

1. (.........)

కోలెమ్మున విశ్వకర్మ నిర్మించిన [1](శతాస్ర)యుక్తంబైన వజ్రాయుధంబుఁ
ధరియించెం దక్కు నెమ్ములు నిర్జరులు శస్త్రంబులుగా నమర్చికొని రిట్లు
క్రమ్మఱ నాయుధపాణులై మహేంద్రాదిబృందారకులు వృత్రాసురుని
తోడిసమరంబునకు నడచిన వృత్రుండును దైత్యదానవగణపరివృతుండై
యురవణించె నిట్లిరువాగును నర్మదా తీరంబునఁ గయ్యంబుబాఱుతనం
బునం గలసి యతిఘోరంబైన యుద్ధంబుఁ జేసి రప్పుడు, 231

సీ॥ పటహాభేరీశంఖపణవగోముఖమహా
రావంబు శబ్దాంతరములఁ గప్పె
చతురంగబలచలచ్చరణ [2](సమ్మర్దోత్థ)
రజ మకాలాంధకారము నొనర్చె
శస్త్రాస్త్రసంఘట్టజాతానలస్ఫులిం
గములు నిర్జరవిమానములఁ బరపె
ప్లవమానభటవక్త్రపద్మచారణహంస
పదములై కీలాలనదులు వాఱె
తే॥ భూతికుటపూతనపిశాచభూరిచిత్ర
నటనముల నెల్ల ఘనకదంబములతోడ
దేవదానవపౌరుషోద్దీర్ణ మగుచు
ఘోరతరమైన యా రణక్షోణియందు॥ 232

వ॥ అంత నయ్యమరులకోల్తలకు నోహటించి రక్కసుల మోహారంబు
దెరలి పఱచిన వృత్రాసురుం డొక్కరుండ నిలచి మేఘావరణముక్తుండగు
చండకిరణుండునుం బోలెఁ బ్రకాశించుచుం బలాయమానులగు నాత్మీయ
భటుల భర్త్సించి దిగ్గ నమరులమొగ్గరంబు సొచ్చి కమలాకరంబుఁ
బ్రవేశించిన గంధసింధురంబుభంగి నాకులఁ జీకాకుపఱవఁ దొడంగిన, 233

1. శతాశ్రి. 2. సమర్ధోర్ధ.

సీ॥ ఐరావతారూఢుఁడగు నింద్రుఁ డభిముఖుఁ
డై గద వైచె నయ్యసురమీఁద
యదియ పుచ్చుక వృత్రుఁ డమరేభ మదహస్తి
భాసురకుంభముల్ పగుల మోఁది
సునిశితభయదప్రశూలంబు వైచిన
ఖండించి తోడ నాఖండలుండు
తద్దక్షిణకరంబు దంభోళిధారచేఁ
ద్రుంచిన మిగులఁ గోపించి యతఁడు
తే॥ వామకరమునఁ బరిఘ తీవ్రముగ నంది
హనువు నొప్పించుటయు శక్రుఁ డార్తుఁ డగుచుఁ
గరమునందున్న కులిశంబు ధరణి వైచి
సిగ్గుపడి యుండెఁ దల వాంచి చేష్ట దక్కి॥ 234

వ॥ అయ్యవసరంబున,

కం॥ కనుఁగొని వృత్రుండు మహేం
ద్రుని నిట్లను నో సురేశ! దురమున హస్తం
బున నున్న హేతి వదలితి
నని సిగ్గునఁ గుంద వలవ దనుతాపమునన్॥ 235

ఉ॥ [1](కైదువు జార)వైచిన విఖండితశౌర్యునిఁ జంప రెన్నఁడున్
మాదృశవీరు లింక ననుమానము నొందఁగ నేల విశ్వరూ
పాదయవృత్తివైన గురుహంతవు శస్త్రమునంది నిగ్రహం
చే దగు నాజిలో నను జయింపుము విష్ణుకృపాబలంబునన్॥ 236

వ॥ మఱియుం బురుషునకు జయాపజయంబులును సుఖదుఃఖం
బులును బరమేశ్వరాధీనంబులుగాని యాత్మేచ్ఛం గలుగవు. విష్ణుభక్తుండ

1. (.........)

వగు నీకు నసాధ్యం బెయ్యది విష్ణుమాయాప్రవర్తితం బైన విశ్వంబునందు విష్ణుమాయ గడవ నొక్కరుండు శక్తుం డగునె, నారాయణపదకంజపరాగ పుంజంబులు మదీయ మోహాంబురాశి నాపోశనించు భవజ్జీవితుండనై హరిపాదమూలంబుఁ జేరెద ననుచుం దెలిపిన నింద్రుండు క్రమ్మఱ వజ్రాయుధంబు నందుకొని, 237

ఆ॥ తనకు నెదురు వచ్చు ఘనుఁడైన యావృత్రు
సచివ భుజము వజ్రఖండితముగఁ
జేయ నతఁడు రక్తసిక్తాంగుఁడై ధాత్రి
కొరగి నోరుఁ దెఱది యింద్రు మ్రింగె॥ 238

కం॥ మ్రింగుటయును శక్రుఁడు క్లి
ష్టాంగుండై యసురయురము హరికృపచే ను
ప్పొంగుచుఁ జించి వడిఁ గా మా
తంగంబును దాను వెడలెఁ దద్దయు వేడ్కన్॥ 239

తే॥ ఇవ్విధంబున వెడలి సురేశ్వరుండు
దారుణం బైన దంభోళిధారచేత
మహీధరోత్తుంగశృంగసమాన మైన
తచ్ఛిరం బుర్విఁ బడఁ ద్రుంచె ధారుణీశ॥ 240

వ॥ అనంతరంబ వృత్రశరీరంబువలన వెడలిన దివ్యతేజంబు వైకుంఠమార్గంబునం జనియె నిట వృత్రారియు జరాపస్ఫపరిభూత చండాలవనితావేషంబున బ్రహ్మహత్యాదిదోషంబు వెనుతగిలినం బలాయితుండై యీశానదిగ్భాగంబున మానససరోవరంబునఁ గమలనాళాంతరాళంబునం దంతురూపంబున రూపేది దివ్యవత్సరసహస్రంబు గడపెం దత్పాపంబు నీశానప్రభావంబునం దత్ప్రదేశప్రవేశంబునకు సమర్థంబు గాదయ్యె నంత బృహస్పతియు, గతక్రోధుండై యమరావతిం జేరి యుండెం దత్కాలంబున, 241

తే॥ నాక మేలుచు నహుషుఁ డింద్రాణిఁ గోరి
గురునియనుమతి నేర్చి యక్కొమ్మ వనుప
ఋషివరులు మోచు యానంబు నెక్కి రుష్ట
కలశభవశప్తుఁడై యజగరత నొందె॥ 242

వ॥ ఆసమయంబున,

సీ॥ ఇంద్రుండు దివమున కేతెంచి హితమనో
హరవాక్యముల గురు ననునయించి
తత్ప్రసాదముఁ గాంచి తదనుజ్ఞఁ జేకొని
హరికి నర్పణముగా నశ్వమేధ
యాగంబు బహుదక్షిణార్పణప్రీణిత
మునిజనాభీష్టితంబుగ నొనర్చి
యాయఘంబున ముక్తుఁడై దేవసంఘంబు
హర్షింపఁ దొల్లింటియట్ల నుండె

తే॥ ననుడు విని యో మహాత్మ! వృత్రాసురునకు
నట్టి సుజ్ఞాన మెట్లబ్బె నట్టి సుగతి
గమన మెట్లొనగూడెఁ దత్క్రమముఁ దెలుప
వే యనిన భూపతికి శుకుం డిట్టు లనియె॥ 243

ఉ॥ దండిగ శూరసేనవిభుతన్ విలసిల్లుచుఁ దొల్లి చిత్రకే
తుండను రాజు కోటినవతోయజనేత్రలఁ గల్గి పుత్రహీ
నుండయి చింతనొందగ ఘనుండొక నంగిరసుండు మానిచం
ద్రుం డరుదెంచి యానృపతితో నుచితోక్తులు పల్కి వేడ్కతోన్॥

తే॥ పుత్రకామేష్టిఁ జేయించి పొల్పుమీరు
నాహవిశ్శేషమును దదీయాగ్రమహిషి
యగు కృతద్యుతి కిచ్చి తా నరిగె నంత
నమ్మృగాక్షియు గర్భిణియై చెలంగి॥ 245

కం॥ సుతుఁ గాంచుటయును భూ
పతి కృతకృత్యతఁ బ్రమోదభరితుండై యా
సుతుమీఁదను సతిమీఁదను
వితతప్రేమప్రసాదవివశత నుండెన్॥ 246

కం॥ అంత నతని తక్కిన సతు
లెంతయు నీరసము పూని యిహపరవిముఖ
స్వాంతు లయి విషం బిడి సుతు
నంతము నొందించుటయు నృపాగ్రణి యంతన్॥ 247

ఉ॥ భంగము నొందుచున్ వివిధభంగుల [1](నూహాలు) సేయుచుండునం
తం గరుణం దదీయజడతావికలత్వముఁ బాపఁ గోరి య
య్యాంగిరసుండు నారదసహాయత నచ్చటి కేఁగుదెంచి రా
జుం గని యర్థిఁ బల్కెఁ బ్రుతిసూక్తపథానుగతత్త్వవైఖరిన్॥ 248

వ॥ వినుము శుద్ధుండై క్షేత్రజ్ఞుండు కర్మవశంబున జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనోవిషయంబు లనియెడు షోడశవికారంబులచేత నుపలక్షితంబైన లింగశరీరంబు నధిష్ఠించి షోడశోపాధ్యంతర్గతుండై మఱియుం బ్రకృతి మహదహంకార పంచమహాభూతంబులు వికారంబులు గూడనైన చతుర్వింశతితత్త్వంబులకుఁ బంచవింశుండై ప్రకృతిగుణంబులగు సత్త్వరజస్తమంబులం బొందుచు నీశ్వరజ్ఞానపర్యంతంబు సంసారంబు ధరియించుచు షడ్వికారంబులు దేహంబునకుం గాని యాత్మకు గలుగ వయ్యాత్మ యచ్ఛేద్యుం, డదాహ్యుం, డక్లేద్యుండు, [2](నిత్యుండు), సర్వగతుం డచలుండు సనాతనుం డతనికి దేహాంతరగ్రహణంబు జీర్ణ చేలంబు విడచి నూతనవస్త్రంబుఁ బరిగ్రహించునట్లు పుత్రమిత్రకళత్రాది మమతానుబంధంబులు స్వప్నార్థతుల్యంబులు గావున, 249

1. (.........). 2. డనిత్యుండు.

కం॥ నీ వెవ్వఁడ వితఁ డెవ్వఁడు
భావింపుము పితృతనూజ[1](భావ మ)సత్యం
బో వసుధాధిప! యింతయు
నే విశదముగా నొనర్తు నీక్షింపు తగన్॥ 250

మ॥ అని యిట్లాడి కుమారుఁ జూచి విను జీవా! చాల పోషించి నీ
జనకుం డేడ్వఁగ నేల మాన్పు వని యాసన్మౌని భాషింప నో
యనఘా! నిత్యము జన్మనాశములపాలై యున్న నాకింక నే
జని నెన్నంగల తండ్రి యీతఁ డనియెన్ సత్యంబుగా బాలుఁడున్॥

ఆ॥ అనిన విని విరక్తుఁడై చిత్రకేతుండు
నారదాంగిరసులఁ జేరి మ్రొక్కి
వారివలన భాగవతధర్మవేదియై
యమున కేఁగి నియతుఁ డగుచు నుండె॥ 552

సీ॥ అంత నకారణహరికరుణావృత్తిఁ
జిత్రకేతుఁ డతిశ్రేష్ఠలీల
విద్యాధరుండయి విష్ణుదత్తవిమాన
యుక్తిఁ ద్రిమ్మరుచుండి యొక్కనాఁడు
రజతాద్రిమీఁద నిర్జరమునిపరివృతు
గౌరీసమేతు శంకరునిఁ గాంచి
సభలోన నంగనాసక్తతఁ దగునె యి
ట్లని హసించుటయు నయ్యద్రితనయ
తే॥ శాసకుఁడె మాకు నితఁ డని చాల నలిగి
యసురవై పుట్టు మనుచు చయ్యన శపించె
నతఁడె యాత్వష్ట్రసరదక్షిణాగ్నియందు
వృత్రుఁ డన సంభవించె బవిత్రమూర్తి॥ 253

1. భావశమన.

తే॥ అట్లు గావున విష్ణుభక్త్యుపహృతాఘుఁ
డైన వృత్రుండు సుగతికి నేఁగు టరుదె
విష్ణుదాసుకృపాపాంగవీక్షణంబు
గలుఁగు నేనియు సాధ్యంబుఁ గలదె మఱియు॥ 254

కం॥ ఈవృత్రవధాఖ్యానము
పావన మాయుష్య మఖిలభద్రాత్మకతా
భా[1](వితము) మానవులకుఁ
గావిం గోర్కులు నొసంగుఁ జదివిన వినినన్॥ 255

వ॥ ఇది త్వష్ట్రుసంతతిప్రకారంబు. ఇంక సమనంతరవృత్తాంతంబు వినుము. సవితున కగ్నిహోత్ర పశు, సోమ పంచమహాయజ్ఞంబులు పుట్టిరి. భగునకు మహీప్రభువిభులు పుట్టిరి. ధాతకు నమావాస్యయుం బౌర్ణమాసియు ననుమతియు శినీవాలియు నను పుత్రికాచతుష్టయంబు గలిగె. విధాత కగ్నిపురుషాదులు పుట్టిరి. వరుణునకు భృగువాల్మీకు లుదయించిరి. మిత్రున కరిష్టపిప్పలులు జనియించిరి. సఖులైన యమ్మిత్రావరుణులకు నిరువురకు నూర్వశిదర్శనంబునం బొడమినవీర్యంబు గలశంబుల నిడిన నగస్త్యవసిష్ఠులు ప్రభవించిరి. శక్రునకు జయంతుండును, ఋషభుండును విదుషుండునుం గలిగిరి. ఉరుక్రమునకు బృహచ్ఛ్లోకుండు పుట్టె నతనికి సౌభగాదులు పుట్టిరి. ఇది యాదిత్యవంశంబు. 256

కం॥ తత్తత్సంతానక్రమ
వృత్తము లాంతములు గాఁగ వివరింపగ నో
యుత్తమచరిత్ర పన్నగ
సత్తమజిహ్వాలకునైన శక్యంబగునే॥ 257

1. వింతము.

వ॥ మఱియు నా కశ్యపమునీంద్రుండు దితియను భార్యయందుఁ బుట్టిన యిరువురలోన జ్యేష్ఠుండైన హిరణ్యకశిపునకు జంభాసురపుత్రి యగు దత్త యను పత్నియందుఁ బ్రహ్లాదానుహ్లాద సంహ్లాదాహ్లాదులను సింహికయుం బుట్టిరి. సింహిక రాహుమాత యయ్యె. ప్రహ్లాదునకు విరోచనుండును, ననుహ్లాదునకు బాష్కలమహిషులును, సంహ్లాదునకుఁ బంచజనుండును, హ్లాదునకు వాతాపీల్వలులును బుట్టి రందుఁ బ్రహ్లాద పుత్రుండగు విరోచనునకు బలి పుట్టె. బలికి సహస్రబాహుండగు బాణుం డాదిగా సుతశతకంబు గలిగె. హిరణ్యాక్షున కుపదానవియందు శకుని, శంబర, కాలనాభ, మహానాభ, ఘటోత్కచప్రముఖులు పుట్టిరి. వెండియు దితిగర్భస్థుండగు నొక్కబాలుండు నిలువ తొమ్మండ్రు కుమారకులై దైవత్వంబు నొంది యింద్రసఖు లైరని చెప్పి శుకయోగీంద్రుండు పరీక్షిత్తునిచేత నిట్టి యేకోనపంచాశత్కుమారచరిత్రంబు విశదీకరింపుమని కృతప్రసన్నుం డగుచు నిట్లనియె. 258

## ఏకోనపంచాశత్కుమార చరిత్రము

చం॥ అనుపమవృత్తియైన దితి, యాత్మతనూజులు వజ్రపాణిచేఁ
జని రని యల్కమై నతనిఁ జయ్యన నోర్చుతనూజుఁ గోరుచున్
దనపతియైన కశ్యపుని [2](దత్పర)వృత్తిఁ గడుం భజింప న
య్యనఘుఁడు సంతసిల్లి యబలా! వర మిచ్చెద వేఁడు నావుడున్॥

ఉ॥ ఆ దితి యింద్రహంతయగు నాత్మజుఁ గోరిన హాని యెంతయున్
ఖేదము నొంది యింక నొకనేర్పున నివ్వర మిత్తుఁ గాక యం
చాదృతిఁ జింతఁ జేసి దితి యాస్యసరోజముఁ జూచి యిట్లనున్
బైదలి! నీవు నొక్కవ్రతపద్ధతిఁ దెల్పెద సల్పు మంతయున్॥ 260

---

1. దాహ్లాదు. 2. దత్వర.

సీ॥ సన్నుతమార్గ మాసంబాదివత్సరం
బగుటయు నందాకఁ బ్రతిదినంబు
నుర్వీధరునకు సర్వోపచారవిశేష
ములు [1](భగవన్మంత్ర)మున నొనర్చి
యన్నంబుచే ద్వాద[2](శాహుతు) ల్వేల్చి ము
త్తైదువులకుఁ బూజ లమరఁ జేసి
యుండుచో నశుచిత్వ మొందక సంధ్యల
నిద్రఁ జెందక హింస నెరయ మాని
తే॥ హరిఁ దలంచుచుఁ బుంసవనాఖ్యమైన
యీవ్రతము బూర్ణముగ నిల్పి యెసఁగువేడ్క
వెలయ నుద్యాపనము సేయవలయు దీన
నీదు కోరికె ఫలియించు నీరజాక్షి॥ 2᠎61

కం॥ అని యానతిచ్చి యాసతి
ననువుగ మన్నించి మాని యాత్మనివాసం
బున కేఁగె దితియు గర్భం
బును వ్రతమును నొక్కకాలమున ధరియించెన్॥ 2᠎62

కం॥ బలభేది యంత నింతయు
నలవడఁగాఁ దెలిసి భీతుఁడై చెలుచుమతిన్
ఫలపుష్పాది [3](సమర్హణ)
ముల సేవకు బ్రాఁతి నుండె మద్దియచెంతన్॥ 263

వ॥ ఇవ్విధంబునం గాచుక యుండు నంత, 264

చం॥ వ్రతనియమశ్రమాలసత వామవిలోచన యొక్కనాఁ డశౌ
చత, దివసావసానమునఁ [4](జాగిలి) నిద్రితయైనచో శత
క్రతుఁడు ముదంబుతో నెడరుఁ గాంచి సమగ్రపుమాయఁ జేసి త
త్సుతసహితోదరంబు సడిఁజొచ్చి భయానకవజ్రపాణియై॥ 265

1. భగవన్మంత్ర. 2. శాతాక్వ. 3. సమర్షణ. 4. జాగిమి.

తే॥ భవ్యతర తేజుఁడైన యబ్బాలు నేడు
దునుకలుగఁ జేసి యొక్కొక్కతునుక నేడు
సేసి, తునుకలుగాఁ జేయఁ జెడక యవియు
నన్నియును నందఱును గుమారు లగుచు నిలిచి॥ 266

ఉ॥ హింస యొనర్ప నేల మను నిందఱఁ దమ్ములఁ గావు మో సురో
త్తంస! భవద్విధేయమతిఁ దప్పక యుండెద నంచుఁ బల్కఁ ద
ద్ధ్వంశము మాని నిల్చి వితతంబుగ విస్మయ మొంది సత్కృపా
మాంసల చిత్తవృత్తి శతమన్యుఁడు సమ్మతి తత్పమేతుఁడై॥ 267

తే॥ తెలివి నుదరంబు వెలువడి దితికి మ్రొక్కి
యో జనని! వీరు నేను నీకొక్కరూప
యనుచుఁ బ్రార్థించి వారితో నాత్మపురికి
నరిగె దితియును సంతుష్ట యగుచు నుండె॥ 268

వ॥ ఇట్టి యింద్రుండు నమరావతికి నేఁగి యాప్తులగు నయ్యేకోన
పంచాశత్కుమారులకు దేవత్వంబును సోమహావిర్భాగంబులు నొసంగి
సుఖం బుండె నీక్రమంబున, 269

కం॥ హరికరుణం [1](దిత్యుదరాం
తర)మున జనియించి వజ్రధరునకు సఖులై
పరగిన వేల్పుల యద్భుత
చరితము సకలాఘహరము జగతీనాథా॥ 270

వ॥ అని షష్ఠస్కంధకథావిశేషంబులు పలికిన యోగీంద్రువచనం
బులు విని పరీక్షిన్నరేంద్రుండు, 271

మ॥ సకలప్రాణులకుం సముండు హరి యాసర్వేశ్వరుం డింద్రర
క్షకుఁడై యేల వధించు రక్కసుల సద్గర్థిత్వపాపాన్వైన నా'

1. తియుదరాంతర.

యకుఁడై సర్వగుఁడైన యద్దేవుఁడును మిత్రామిత్రసద్భావభా
వకుఁడై నం జనియింపవే యతనికిన్ వైషమ్యనైర్ఘృణ్యముల్॥

చం॥ అనుటయు రాజచంద్రునకు నాశుకుఁ డిట్లను నట్టి యీశ్వరుం
డనఘుఁడు సర్వభూతసముఁ డట్టిదియయ్యు గుణత్రయంబునం
దనయము సత్త్వముం బెనుచు [1](నాతుద రెంటినణంచుఁ)గావునన్
జనవర సాత్త్వికుల్ హితులు శత్రులు చక్రికి నుద్రజస్తముల్॥ 273

తే॥ సత్త్వగుణమునఁ బొదవి నిర్జరులు పుట్టి
రా రజస్తమోగుణముల నసుర లొదవి
రట్లు గావున సంరక్ష్యులైరి సురలు
దండ్యులైరి రక్కసులెల్ల ధరణినాథ॥ 274

వ॥ ఈ ప్రకారంబు మున్ను నారదుండు ధర్మనందనునకుం
దెలిపినవిధం బంతయు వివరింతునని యిట్లనియె. 275

సీ॥ మును రాజసూయాఖ్యముఖ్యాధ్వరంబున
చక్రనిర్దళితుఁడై చైద్యుఁ డపుడు
తేజోమయంబున దేవకీనందను
తనువు సొచ్చినయద్భుతంబుఁ జూచి
ధర్మపుత్రుఁడు నారదమునీంద్రుఁ గనుగొని
యిది యేమి వింత నే డిచట నొదవె
నుతనిష్ఠులకుఁ బ్రసన్నులకుఁ జేరఁగరాక
కీర్తనీయంబైన కృష్ణుమేను

తే॥ తలఁప నాజన్మవైరసంకలితుఁడైన
చేదిపతి యెట్లు దాఁ బ్రవేశించె ననుచు
నడుగుటయు నారదుఁడు పాండవాగ్రజునకుఁ
బలికె వీణారవము కూడి పలుకుచుండ॥ 276

---

1. నాతుర రెంటినకొంచు.

తే॥ తెలియ మానావమానముల్ దేహమునకు
గాని పరమాత్మ కెచ్చటఁ గలుగ వధిప
యతఁడు సర్వగుం డవ్యయుం డనులుఁ డగుని
కెందుఁ దగులదు నైషమ్యహేయబుద్ధి॥ 277

కం॥ వైరవశంబునఁ జిత్తమ
హోరాత్రము లతనిఁ దగిలి యుండుటవలనన్
వైరియుఁ బంకజనాభుని
జేరుఁ జుమీ భక్తియోగశిష్టుఁడ వోలెన్॥ 278

తే॥ కామమున గోపికలు, భీతిఁ గంసుఁ, [1](డహిత
మననమునఁ జేదివిభుఁడు), ప్రేమమున విూర,
లేము భక్తి, నచ్యుతుఁ గంటి మెట్టులైన
నుడుగక దలంప హరిఁ జేరి యుండవచ్చు॥ 279

వ॥ అదియునుం గాక, 280

హిరణ్యాక్ష హిరణ్యకశిపుల వృత్తాంతము

సీ॥ విష్ణుగృహద్వారవేత్రపాణులు జయ
విజయాఖ్యు లొకనాడు విభునిఁ గొల్వ
వచ్చిన సనకాదివరమునీంద్రులఁ జూచి
యడ్డగించిన వార లలుకఁ బూని
యవనిపై రాక్షసులై పుట్టుఁ డని శపి
యించి గ్రమ్మఱఁ గరుణించి యపుడు
జన్మత్రయంబున జక్రివైరముఁ బూని
తిరుగఁ జేరుదురు తద్దివ్యపదము

1. హితభువనమునఁ జేర విభుఁడు,

తే॥ ననుచుఁ బలికిన నా ప్రతీహారవరులె
తత్పదభ్రష్టు లగుచు నిద్ధరణిమీఁద
గణ్యగతి హిరణ్యాక్షహిరణ్యకశిపు
లనఁగ, జనియించి రాదిఁ గ్రూరాత్ము లగుచు॥ 281

కం॥ అందు హిరణ్యాక్షుండను
మందుని హరి ధరణి నెత్తుమతమునఁ గిటిమూ
ర్తిం దెలివి నొంది హతుఁజే
సెం దాపసగణములెల్లఁ జే జే యనఁగన్॥ 282

తే॥ తనయుఁడై నట్టి ప్రహ్లాదు ననఘు నెపుడు
నూరకయ గాసిఁబెట్టంగ నోర్వలేక
హరి [1](నృసింహుఁడై దీపించి) యా హిరణ్య
కశిపుఁదైత్యుని విదళించెఁ గరనఖరముల॥ 283

ఉ॥ ఆ [2](విబుధారులే) మఱియు నట్టి బలంబుఁ జలంబు మించగా
రావణకుంభకర్ణులయి రాజసలీలఁ జనించి యుండ ల
క్ష్మీవిభుఁడు న్నరాకృతి విశిష్టత రాఘవుఁడై నిశాతబా
ణావళిచేత వారల రయంబునఁ ద్రుంచె సురారి మెచ్చఁగన్॥ 284

ఉ॥ ఇట్టిడివారలే మఱల నీ శిశుపాలకదంతవక్త్రులై
పుట్టిరి కృష్ణుఁడై హరియుఁ బుట్టె విరోధముఁ బూని యవ్విభుం
డిట్టి తదీయ్యచక్రహతిఁ ద్రెస్సి విశాపత నొంది పూర్వపుం
బట్టున నిల్చి రాత్మవిభుపాదపయోరుహభక్తియుక్తులై॥ 285

తే॥ అనుటయు హిరణ్యకశిపుఁ డయ్యాత్మజన్ము
నేల నొప్పించె రమావరుం డెవ్విధమున
నృహరియై వాని విదళించె నిర్ణయించి
తెలుపవే యను ధర్మజుఁ బలికె మౌని॥ 286

1. దేవుఁడై దీపించి. 2. విభుధారులే.

కం॥ విను హరి కిటియై కనకా
క్షునాముఁ ద్రుంచుటయుఁ గనకకశిపుఁ డడలుచున్
జనని ననుజతరుణులఁ ద
త్తనయుల రావించి నిలిపి ధైర్యము వెలయన్॥ 287

కం॥ అందు జనయిత్రితో నని
యెం దల్లీ ! నీ తనూజుఁ డిపుఁ డా హరిచే
ద్రుంచె న్మదిలో నిఁక వం
తం డెరలఁగ వలదు కర్మతతి యట్లగుటన్॥ 288

ఆ॥ జనని యనఁగఁ దండ్రి యనఁ దోడఁబుట్టువు
లనగ నాలు బిడ్డ లనఁగఁ గూడి
యుందు రొక్కవేళ నొకవేళఁ జనుదురు
తరువునందుఁ బక్షితతులయట్లు॥ 289

కం॥ జననీ యీ యర్థమునకు
ననువందెడు ప్రేతబంధుయమసంవాదం
బను నొక యితిహాసంబున్
వినఁ జేసెదఁ దాన శోకవివృతి యణంగన్॥ 290

ప్రే త బం ధు య మ సం వా ద ము

సీ॥ నరనుతుండగు [1](నుశీనర) దేశపతి సుయ
జ్ఞాఖ్యుండు ఘోరజన్యస్థలమున
వరవీరనిహతుఁడై పడియున్న నతనికాం
తలు గుంపులై కూడి దైన్య మెసఁగ
బహువిధంబుల విలాపములు సేయుచునుండ
యముఁ డచ్చటికి బాలుఁ డగుచుఁ జేర

1. (.........).

వచ్చి, యా రోదించువారల వారించి
వారితోఁ బలుకు నో వనితలార !

తే॥ యేల శోకించెదరు, పతి యెచట నున్న
వాఁడు మేనికి నాశం బవశ్యభావి
తమవినాశం బెఱుంగక తారు పరుల
నాశమున కేడఁ బొక్కుట [1](న్యాయ్య)మగునె॥ 291

కం॥ ఎఱు కొకఁడు తొల్లి వేగడు
తఱి ధనువు శరములఁ గొనుచు వనమునకును నే
డ్తెఱ నరిగి యచట నొక్కెడ
మెఱయుఁ గుళింగాఖ్యపక్షిమిథునముఁ గనియెన్॥ 292

కం॥ కని యందుఁ బెంటిపిట్టన్
ఘనమగు తనచేతిజిగురుగండియచేఁ గ్ర
క్కునఁ దిగిచి నులిచి చిక్కం
బునఁ బెట్టినఁ జూచి పలుకు పుంబక్షి వగన్॥ 293

శా॥ కాంతారంబుననుండి యేరికిఁ గలంకల్ సేయ కావంతయున్
జింతాక్లేశము లేక యుంటి మిటులం జేసెం గదా దైవ మీ
సంతానంబున కేది త్రోవ బ్రతుకన్, సంప్రాప్తమైనట్టి యీ
యంతస్తాపము నోర్వఁగాఁ దరమె కాంతాసంతతభ్రాంతతన్॥ 294

చం॥ అని విలపించుచున్ మిగుల నార్తి వహించు కుళింగపక్షి న
వ్వనచరుఁ డెక్కుడైన గరువంబునఁ జూచి పరేతరాజత
ర్జని కెనయైన కోల రభసంబున నైచిన వ్రాలెఁ బక్షి దై
వనియమవిభ్రమంబుఁ గడువం దరమే వినుఁ డెంతవారికిన్॥ 295

1. న్యాయ.

కం॥ అటుగాన దైవమాయా
ఘటనకు మీ రింక వగవఁగా నేల నిజో
త్కటకర్మవశత మేను వి
ఘటితం బగు నిత్యుఁ డాత్మఁ గణుతింపంగన్॥ 296

వ॥ అని యివ్విధంబున, 297

కం॥ ఇంతయుఁ బలుకుచు వారల
కంతర్హితుఁ డగుడు నంత నౌశీనరభూ
కాంతునికాంతలు మనముల
సంతాపం బుడిగి చనిరి సద్మంబులకున్॥ 298

తే॥ కావున వివేకమున నిట్టి గతి యెఱింగి
నీవు గోడండ్రును మనుమలు నెమ్మనముల
నా హిరణ్యాక్షుఁ గూర్చినయడలు మాని
యుండఁ దగునని పలుమారు నూరడించి॥ 299

కం॥ అలయక తప మొనరించెద
తలఁపునఁ గలిగిన యభీష్టతతు లెల్ల ముదం
బలవడఁ గాంచెద నంతం
గొలవగలన్నియును దీర్చికొనియెద ననుచున్॥ 300

వ॥ తపంబు సేయ నిశ్చయము చేసి కదలి కతిపయప్రయాణంబు
లరిగి యొక్కయెడ, 301

## హిరణ్యకశిపుడు తప మాచరించుట

సీ॥ శాఖిశాఖాశిఖాసంఘాతసంభూత
జనితజీమూతాధ్వసంవరంబు
కేళికలాలోల కిన్నరీజనమన
స్సంపాదితాహ్లాదసంబరంబు

సంచరద్వ్య[1](స్త్రై)ణసంభృతాధిత్యకా
వర్తికాసారాంబుపరిసరంబు
విపులశృంగచ్ఛాయవిహృతహేళిహయాళి
సంతతభ్రాంతిజశ్రమభరంబు

తే॥ కాన వచ్చె ననంఖ్యసంగతివిశేష
మహిమవిహారణాగీర్వాణమందిరంబు
క్రమమణిదీపికాయుతకందరంబు
సన్నుతతరంబు మందరక్ష్మాధరంబు॥ 302

మ॥ కడుపారం మకరందపూరముల ఝుంకారంబు మీఱంగ గ్రో
లెడుతేటుల్ వెనువెంట రాఁగులకు [2](నోలిం దా సమర్పింప న)
ల్లడఁ బ్రావఁగ వచ్చు దెమ్మెరలు సౌఖ్యశ్రీల నేలింపుగా
[3]గడు మెచ్చుం దగియుండె మందరకుభృత్కాంతారపర్యంతముల్॥

తే॥ ఇది మనోహరమై యున్న [4](దిట) మదీయ
తపము ఫలియించు నిందు సత్వరము గాఁగ
ననుచు నప్పర్వతం బెక్కి యందు మిగులఁ
జెలువుమీఱి దేవద్రోహి చేరి యచట॥ 304

మ॥ క్షితి నేకాంఘ్రియ మోపి యూర్ధ్వముఖమై చేదోయియుండంగఁ జే
సి [5](తరణ్యాహిత)దృష్టియై యచలమై చిత్తంబు నిల్వంగ మా
రుత మాహారము గాఁగ సుస్థిరశరీరుండై యమందేహుఁడై
దితిసూనుండు తపం బొనర్చె మునిపంక్తిం బ్రిమించె నీతం డనన్॥

కం॥ అతినిమ్నతోడ వల్మీ
కతతాంగుం డగుచుఁ బెద్దకాలంబు తపః
స్థితుఁడగు నతనిశిరంబున
వితతతపోవహ్నిదీప్తి వెడలె ఘనంబై॥ 306

1. స్త్రై. 2. లోవిందాసర్పావిన. 3. గడ 4. (......). 5. తరుణ్యాహిత.

వ॥ అంత,

ఉ॥ అందుల కోర్వలేక యమృతాశను లందరుఁ గూడి యాశతా
నందనుపాలి కేఁగి దితిసందనుచందము విన్నవింప, నిం
పొంది యతండు హంసతతియోజితయానము నెక్కి [1](యప్పుడ)
మ్మందరభూధరంబున కమందగతిం జనుదెంచి యచ్చటన్॥ 307

కం॥ అతనికిఁ బ్రత్యక్షుండై
దితిసుత! నీ కేమి వలయుఁ దెలుపు మనవుడున్
శతధృతికి హిరణ్యకశిపుఁ
డతులితమగుభక్తిఁ బ్రణతుఁడై ప్రాంజలియై॥ 308

సీ॥ అఖిలసురాసుర యక్షగంధర్వవి
ద్యాధరభూతనరాహితిర్య
గాదులచే శైలపాదపశస్త్రాస్త్ర
గణముచే నార్ద్రశుష్కములచేత
ఖానిలజ్వాలనోదకాచలాదులచేత
సహజీవనిర్జీవచయముచేతఁ
బదిదిక్కులందు లోపలను వెల్పల రాత్రి
[2](బవళుల)ఁ జావు పొప్పడకయునికిఁ

తే॥ ద్రిభువనజయంబు నతిదిశాధిపసమగ్ర
మహిమ ననివార్యశౌర్యసంపదయుఁ గలుగ
నిన్నియు వరంబులుగ నాకు నింపుమీఱ
దేవ! దయసేయు మనుచుఁ బ్రార్థించుటయును॥ 309

1. యప్లుమ. 2. పగళ్ళ.

కం॥ అగుఁగాక యని వరంబులు
తగ నన్నియు నొసఁగి చనియె ధాత సమగ్రం
బగు తేజ మలరి దైత్యుఁడు
సగర్వుఁడై వచ్చె నాత్మసదనంబునకున్॥ 310

తే॥ ఇట్లు వచ్చి యాజ్యసమిత్సమేధమాన
హవ్యవాహను[1](లీలఁ) దితాత్మజుండు
చక్రిపైఁ బూర్వవైరంబు సంస్మరించి
భువనబాధాకరుం డయ్యె వివిధగతుల॥ 311

సీ॥ అమరేంద్రు నిర్జించి యనలు నివర్తించి
యముని దండించి క్రవ్యాదు నొంచి
వరుణుని మర్దించి, వాయువుగం డణం
గించి కుబేరు నృక్కించి, యీశు
నొత్తి భోగులఁ ద్రొక్కి, యుష్ణభానులమేపు
మాపి, యశ్వినుల యాలాప ముడిపి,
సాధ్యులఁ జెఱచి, ఖేచరుల గారించి, సి
ద్ధులఁ గాసిజేసి, యక్షుల నలంచి,

తే॥ గరుడగంధర్వకిన్నరవరులఁ బాఱఁ
దోలి, యచ్చరసీమల నేలి యెల్ల
మానులను దేహవట్టంబుగా నొనర్చి
యఖిలభువనాధిపతి తానయయ్యె నతఁడు॥ 312

వ॥ ఇవ్విధంబున హిరణ్యకశిపునామకుండు త్రైలోక్యాధిపత్యంబున నొప్పుచుండ నతనిచేత బాధ్యమానులగు నిర్జరులు కర్జంబు చెడి, సిద్ధవిద్యాధరగరుడగంధర్వాదిసహితు లగుచు నొక్క యేకాంతంబున మంతనంబుండి యశరణశరణ్యుండగు హరిం గుఱించి యిట్లనిరి. 313

1. (......లా)

## ప్రహ్లాదచరిత్రము

శా॥ ఈ దైత్యుండు గణింగి మమ్మదయుఁడై యుబ్బఁగి భంగింపఁగా
నీదై నట్టి కృపావిశేషము సమున్నిద్రంబుగాఁ జేయ వే
లా? దాక్షిణ్యనిధీ! పురాణపురుషా! లక్ష్మీశ! నీకంటె లే
రే దక్షుల్మఱి మమ్ముఁ బ్రోవ నిది సుమ్మా వేళ కుయ్యో మొఱో॥

మ॥ అనునంతట్ వినువీధి నచ్యుతుఁ డదృశ్యాకారుఁడై నిల్చి యా
య్యనఘుం డుద్ధతి మీఱి నాత్మసుతుఁ బ్రహ్లాదాఖ్యు మద్దాను వ
ధ్యునిగాఁ జూచుఁ దదర్థ మే నచిరకాలోద్యుక్తిసంయుక్తి స
ద్దనుజుం ద్రుంచెద నంచుఁ బల్క నమరుల్ దైన్యవ్యథంబాయుచున్॥

కం॥ వనజదళాక్షమహాత్త్వముఁ
గొనియాడుచు నిదియ నిజము గొబ్బున నీక న
ద్దనుజుఁడు సను నని మనముల
ననురాగము వొదల నరిగి రాశ్రమములకున్॥ 316

వ॥ హిరణ్యకశిపునకుఁ బ్రహ్లాదానుహ్లాద, సంహ్లాదాహ్లాదు లను
గుమారచతుష్టయంబుఁ గలిగె నందు, 317

సీ॥ విశ్వగర్భపదారవిందచింతనముతోఁ
గూడనే జనయిత్రికుక్షి నుండె
బరమేష్ఠిజనకాంఘ్రిపద్మభక్తిపురస్స
రంబుగా మాతృగర్భంబు వెడలె
హరిదివ్యనామధేయస్తవోచ్చారణ
శ్రీపూర్వకముగ భాషింపఁ దొణఁగె
భూతభవ్యభవత్ప్రభుప్రీతితోఁ గూడ
నహరహం బభివృద్ధిమహితుఁ డయ్యె

తే॥ బద్మనాభస్వరూపరూపగుణవిభవ
సంస్మరణదత్తచిత్తసంచారమార్గ
ఖండితాఖిలకలుషతాకలితసజ్జ
నాదికాహ్లాదుఁడైన ప్రహ్లాదుఁ డనఘు॥ 318

ఉ॥ [1](అంజలిఁబట్టి) కన్నుల ముదశ్రులు రాలఁగ రోమహృష్ట సే
నం జెలువొందఁ గంఠమున నాదము గద్గదభావ మొందఁగాఁ
గంజదళాక్ష! చక్రధర! కైటభమర్దన! వాసుదేవ! నీ
కంజలి యంచుఁ బల్కు [2](ననయంబును) దైత్యతనూజుఁ డెల్లెడన్॥

సీ॥ నిజహృదయాబ్ధికి నీరజాతాక్షుచిం
తనము సుధాకరోదయముఁ గాఁగ
చలనిజజిహ్వాకాచలచాతకమునకు
విష్ణునామోక్తి సువృష్టి గాఁగ
రమణీయనిజశరీరవిహారభూమికి
హరిశబ్ద మభినవాభ్రారవముగ
దీపితనిజజీవదీపంబునకుఁ జక్ర
లాంఛనభక్తి తైలంబు గాఁగ
తే॥ వినుతనిజజన్మకుంకుమంబునకు ధరణి
హరిచరణపూజనము [3]తుషారాంబు గాఁగ
నితర మెఱుఁగక చరియించు నీడ్యమాన
చరితుఁడై నట్టి ప్రహ్లాదుఁ డురుయశుండు॥ 320

వ॥ ఇత్తెఱంగున మాతృగర్భావిర్భావసమయసముదిత వివేకాది
గుణగణభూషణుండును, మధురభాషణుండును, నిరంతరనివృత్తహరిచరణ

1. అంజని. 2. మధురంబుగ. 3. సాఘృతంబు.

స్మరణ సుధాభిషేకుండును, బుణ్యశ్లోకుండును, సకలభూతసమతానిరస్త దుస్తరాహంకారుండును, జితేంద్రియవికారుండును, నగు ప్రహ్లాదుం డనన్యప్రయోజనుండై నారాయణస్మరణలోలుండును, నారాయణమంత్ర జపైకశీలుండును, నారాయణవందనసావధానుండును, నారాయణైక ధ్యానుండునునై సంచరింప దితినందనుండు కనుంగొని, 321

శా॥ చంపం జూడఁడు వాసవాదిదివిషత్సంఘుంబులం బోర హిం
సింపం జూడఁడు భానువిశ్వవసురాజీముఖ్యవర్గంబులన్
నొంపం జూడఁడు కిన్నరాధికసుధాంధోయోనులన్ వారిఁ బా
లింపన్ గోరఁడు నీ జడాత్ముఁ డీఁక నేలీలన్ మదాభుండఘన్॥

కం॥ జనునకు విద్యాభ్యాసం
బునఁ గాని వివేక మాత్మఁ బొలుపొందదు కా
వున నీ జడుఁ జదివించెద
నని శుక్రాత్మజులఁ బిలచి యనురాగమునన్॥ 323

వ॥ ప్రహ్లాదునకు విద్యాభ్యాసము గఱపుఁ డని యప్పగించిన నొప్పనఁగొని చండామార్కనాములగు నిరువురు పుత్రు లాదైత్య పుత్రునిం దోడ్కొని నిజభవనంబునకుం జని యతనికి విద్యాభ్యాసంబుఁ గలుగఁ జేయుచుండు నంత, 324

తే॥ జడుఁడు బ్రహ్లాదుఁ డేపాటిఁ జదివె నొక్కొ
కలుఁగుచాతుర్య మంతయుఁ దెలియవలయు
ననుచుఁ గురుపుత్రయుతముగా నాత్మపుత్రు
భక్తిఁ రావించె నౌత్సుక్యభరితుఁ డగుచు॥ 325

వ॥ ఇట్లు రావించి గురుతనయులఁ గూర్చుండ నియమించి యువహితుండై 326

కం॥ తనయుఁ దొడమీఁద నిడుకొని
యనఘాత్మా! యెద్ది నీకు నభిమత మగుచున్
వినుతంబగు నది మా కిపుఁ
డనువొంద న్విన్నగఁ జేయు మని పలుకుటయున్॥

వ॥ ప్రహ్లాదుండు తండ్రి కిట్లనియె॥ 328

మ॥ మమతాహంకృతు లుజ్జగించి మదిఁ గామ్రశ్రేణి నిశ్శ్రేణినా
క్రమణభ్రాంతిఁ బరిత్యజించి శమసామ్రాజ్యస్థుఁడై యిందిరా
రమణున్ విష్ణు నశేష శేషిఁ గరుణారాశిం దదీయైక శే
షమతిన్ మర్త్యుఁడు గొల్చు టెంతయు నభీష్టంబార్య నాకెప్డునున్॥

చం॥ అని తను జీరికిం గొనక యాడిన తద్వచనంబు విస్మయం
బున విని యాహిరణ్యకశిపుం డతనిం గని వత్స! నీకు నీ
యనుచితమైనభాషణము యత్నమునన్ వినిపించినట్టి దు
ర్జను నెఱిగింపు మూఢుని శాసితుఁగా నొనరింతు నాపుడున్॥

కం॥ బుద్ధిజ్ఞానాదికముల
సిద్ధముగా హరియ పుట్టఁ జేయు నరునకున్
సిద్ధం బిది యని తనయుఁడు
సద్ధర్మము పలుకఁ [1](బలికె) జనకుఁడు మఱలన్॥ 331

మత్తకోకిల॥

నాసహోదరుఁ ద్రుంచి నాకు ఘనంబుఁగాఁగ విరోధియై
యీసునన్ విహరించు విష్ణుని నిచ్చటన్ భయ మేది త
ద్దాసవృత్తిఁ జరించువాని విధంబున న్నుతిసేసె దో
రీ సురావళిఁ దోలుటో యిది రీతిగాఁ గనుఁ బోలుటో॥ 332

1. బిలికె.

తే॥ సకలనిర్జరవరుల తేజముల మాపి
యేన భువనంబు లన్నియు నేలుచుండ
నింక నోరి విష్ణుం డన నెవ్వఁ డున్న
వాఁడు గలిగిన వారింప వలదె నన్ను॥ 333

వ॥ అనుటయుఁ బ్రహ్లాదుండు శుక్రతనయులం జూచి యిట్లనియె॥

సీ॥ ఎవ్వనినెఱుగమి నే వెన్నుఁ డనియెడు (?)
విభ్రాంతి యంతయు విస్తరిల్లు
నెవ్వనిఁగడుభవాహితుఁడై నయాసుర
యోనిజాతులు గొల్వ నొల్లకుండు
రెవ్వనివీక్షింప నెల్ల సంశయములుఁ
జెడు కర్మతతు లెల్ల నడఁగిపోవు
నెవ్వనితోఁ బాసి యీప్రపంచంబునఁ
గలతృణాగ్రంబును గదలఁజాల
తే॥ దెవ్వనికిఁ బద్మజాతాండ మెల్ల నపుడు
వర్ణితస్థూలమూర్తినా వరలుచుండు
నట్టి పురుషోత్తముని విష్ణు నాశ్రయించి
యన్య మెఱుఁగడు నాచిత్త మఖిలగతుల॥ 335

వ॥ అనిపలుకుటయు, శుక్రతనయులు సక్రోధులగుచు, హిరణ్యకశిపుం జూచి దేవా! యితండు దుష్టాత్ముండు, తన్ను దానే కొన్ని కఱదులు గఱచి యఱచుచున్నవాఁడు. యూష్మాకీనార్భకనిర్భయవచనంబులయం దాస్మాకీనోపదేశశంకాకళంకాంకారోపణంబు సేయవలదు. వివిధోపాయంబుల దండించి యితని భవచ్చిత్తానువర్తి యగునట్లుగా నొనర్చెదమని ప్రహ్లాదునిఁ దోడ్కొని చని త్రివర్గసంవర్గగణనీయంబైన శాస్త్రంబు లుపన్యసించిరి, వత్సా! నేము నీతండ్రియెదుట సంభావనీ

యుల మగునట్టుగా సంభాషింపుమీ యని బుజ్జగించి దైత్యపుంగవు నుంగిట నిడి యితనిఁ జదివించి బుద్ధిమంతునిగా నొనర్చితి మని విన్నపంబు సేసిన, 336

చం॥ అతికరినాత్మఁడైన యమరాహితశేఖరుఁ డార్యుఁడైన యా
సుతుఁ దనయంకపీఠమున జూపఱ మెచ్చఁగ నిల్పి, వత్స! శా
శ్వతమతి విద్యలందుఁ గల సాంప్రతికావ్యసనంబుఁ దెల్పి, నీ
చతురతఁ దెల్పుమా యనుచు సమ్మదపూర్వముఁగాఁగఁ బల్కినన్॥

కం॥ ఆదరమేదురమునఁ బ్ర
హ్లాదుం డాఫలుకు వినుచు నాస్థానీర
క్షో[1](దంభ స్తంభన సం)
పాదంబగు వాక్య మొకటి పలికె మహాత్మా॥ 338

శా॥ తంత్రీ విద్యలు సెప్పి రీగురుసుతుల్ తన్మార్గముల్ చాలఁ గై
కొంత్రీ యుర్విఁ ద్రివర్గ[2](కాములు నయోగ్యుల్వారలం) జూచియే
మంత్రాత్మజ్ఞులు తత్ప్రకారముల నేలా తెల్ప? సూక్ష్మేక్షణుల్
గంత్రే యర్థము దాని నంతయును వక్కాణింతుఁ జిత్రంబుగన్॥

శా॥ లోకప్రస్తుతశాస్త్రజాలముల నాలోడించియున్ లిప్సచేఁ
బైకొన్నట్టి విచారమార్గమున నొప్పం జూడఁగా నిశ్చితం
బేకం బయ్యెఁ బహుప్రకారముల లక్ష్మీశుండు నారాయణుం
డేకాలంబున నెల్లవారలకు సుధ్యేయుండు సంసేవ్యుఁడున్॥ 340

ఉ॥ ఎడ్డెకుఁ జేయుసత్కృతము లెగ్గడి కిచ్చినయట్టి కన్నియల్
గుడ్డికిఁ జూపు నద్దములుఁ గుత్సితవృత్తికిఁ జేయు దానముల్
గొడ్డగునట్టిమ్రాని కొనగూర్చినప్రోదులు చక్రహస్తుపై
నొడ్డిన భక్తిలేనిగడయుక్తికిఁ జెప్పినశాస్త్రజాలముల్॥ 341

1. దంభస్తం......సం.. : 2. కా ...లుగునవున్ యయోగ్యుల్వారలం.

మ॥ మృగనాభిం దపదీయవర్ణగరిమోన్మేషంబుఁ, హేమంబునన్
బ్రగుణామోదవిశేష, మిక్షువున సారశ్రీఫలోద్భూతి, చె
న్నగుగంధప్రచురప్రసూనతతియం దమ్లానభావంబులై
తగు మెచ్చంగ మనీషికిన్ హరిపదధ్యానాదరం బబ్బినన్॥ 342

సీ॥ మహాత్మ యనఁగవచ్చు మర్త్యునిజన్మంబు
హరిదాస్యకరుణార్థ మయ్యె నేని
అరరె యనఁగవచ్చు నధికజాతిత్వంబు
విష్ణుభక్తిఁ జెలఁగి వెలసె నేని
చాగురే యనవచ్చు సకలశాస్త్రప్రౌఢి
నారాయణాజ్ఞప్తిఁ గూరె నేని
బాపురే యనవచ్చు పటుతరవాగ్జన్మ
మచ్యుతస్తుతులచే నలసె నేని
తే॥ అవు నవు ననఁగవచ్చు మహాతపంబు
మొదల కృష్ణార్పణోద్యుక్తి మొలచె నేని
అట్లు గాకున్న నిది యెల్ల నరసి చూడఁ
గా నజాగళస్తనములు గాన వేంద్ర॥ 343

కం॥ ఘోరములగు తపములచే
నూరక యేలా నలంగ నొకపరియైనన్
నారాయణనామసము
చ్చారణనిష్ణాతుఁ డయిన [1](సంస్మృతియణఁగున్)॥ 344

సీ॥ [2](విను తులాపూరుషంబు)ను హేమగర్భంబు
బ్రహ్మాండకల్పాంఘ్రిపములు గోస

1. సంస్మృతియణఁగున్. 2. వినుతులాపూరుషంబు.

హస్రంబు కామధేన్వాఖ్యసువర్ణాశ్వ
హైమాశ్వరథహేమహస్తిరథము
లును బంచలాంగలంబును ధరిత్రీవిశ్వ
చక్రకల్పలతాభిసంజ్ఞకములు
సప్తసాగరసముజ్జ్వలరత్నధేనుమ
హాభూతఘటములు ననఁగ వరుస

తే॥ వెలయు షోడశదానము లర్హితవిధుల
నాచరింపంగఁ గలిగినయట్టిఫలము
తలఁప హరిశరణాగతిధర్మసార
షోడశాంశంబునకుఁ జూడ నీడురాదు॥ 345

చం॥ బలవదపుణ్యశైలపవి, పాతకవారిధికుంభసూతి, సం
కులకలుషాహి[1](తార్క్ష్య), మతి ఘోరతరాఘదవాగ్ని, సంవళత్
కలుష[2](మదానకేంద్ర)హరి, కల్మషమేఘమహానమీర మం
కిలిపడకుండఁ జేయు హరి[3](కీర్తన) మెత్తఱి నెల్లవారికిన్॥ 346

తే॥ అని విజృంభించి పలుకు నందనునిమాట
లెల్ల విని దైత్యుఁ డా పురోహితులఁ జూచి
బాలు నిబ్భంగిఁ జెఱచి తిదేల యనుచుఁ
బలుకుటయు వార లతనితోఁ బలికి రిట్లు॥ 347

కం॥ దితిసుత! నీతనయుఁడు మా
మతిలోనన్ రాఁడు మాకు మఱలఁ దెలుప ను
ద్యతుఁ డైనాఁ డీ విందుకుఁ
బ్రతికారముఁ దలఁపు మాకుఁ బనిలే దింకన్॥ 348

---

1. పక్షము. 2. మదావ ఖేంద్ర. 3. కీర్తను.

కం॥ అనుటయు సుతుఁ[1](గనుఁగొని) దు
ర్వినయా! నీ కిట్టి చెనటి విపరీతము లే
మనుజుఁడు [2](గఱపెనొ యాదు
ర్జను దెలుపుము యనుచు) నలిగి జనకుఁడు పలుకన్॥ 349

తే॥ సుతుఁడు నవ్వుచుఁ బల్కె నో దితితనూజ!
యెవ్వ రెవ్వారి కుపదేష్ట లెంచి చూడ
నెట్లు చెప్పిననైన నీ హీనమతులఁ
బుట్ట నేర్చునె హరిపదాంభోజభక్తి॥ 350

కం॥ చదువులు చదివితి నన్నియు
జదువులలోఁ జదువు నన్ను జదివింపరు మా
చదువులయొజ్జ ళ్ళదియును
జదివెద మోక్షార్థ (?) విష్ణుసంశ్రయము సుమీ॥ 351

ఉ॥ వాదము లింకఁ జెప్ప నొడువం బనిలేదు సమస్తశాస్త్రసం
వాదము గల్గునట్టి యొకవాక్యము సెప్పెద నెల్లవారికిన్
వైదికధర్మకర్మపరివర్తనకీర్తితవైష్ణవాంఘ్రిప
ద్మోదకసేవఁ గాని, భవరోగము మానదు వేయు నేటికిన్॥ 352

వ॥ అని యివ్విధంబునఁ బ్రహ్లాదుం డాహ్లాదంబున విజృంభించి పలికిన పలుకులు ములుకులు చెలువునం జెవులం గలుకు్కరనం దాకిన నాఁకఁగొనక యా దితిసుతుండు తనతొడలపై నిడికొనిన యా కొడుకుం దొడిం బడఁద్రోసి లేచి మంత్రులం జూచి యిట్టి జనకద్వేషి యగు దోషి నెచ్చటనైన వినియునుం గనియును నెఱుంగుదురే యని భాషించి రోషరూక్షణంబులగు వీక్షణంబుల నదరులు చెదర రాక్షసుల నీక్షించి యిట్లనియె. 353

1. గొని నీదు, 2. గరపెను వానిన్ జను దెలుపుగననుచు.

సీ॥ చూచితిరే యిట్టి చోద్య మస్మత్కులం
బునఁ బుట్టి భార్గవపుత్రవివృత
శాస్త్రార్థతాత్పర్యసంగతి యంతయుఁ
బెడచెవిఁ బెట్టి తాఁ బెద్దవోలె
నన్ను గైకొనకయు మున్ను పితృవ్యారి
యగు హరి సర్వేశుఁ డనుచు నతని
భృత్యునికై వడిఁ బ్రేలెడి వలదన్న
నంత కంతకు మీఱి యాడఁ దొణఁగె
తే॥ దనయుఁ డనుపేరఁ బుట్టె గదంబు వీని
దుష్టు ఖండింపఁ గులము నిర్దోష మగుచు
నిలుచు నామీఁదియాన, మార్వాలుక కిపుడు
తిరిగి మీఱలు వీని వధింపుఁ డలిగి॥ 354

వ॥ అని నియోగించుటయును, 355

## ప్రహ్లాదుని బాధపెట్టుట

లయగ్రాహి ॥

అత్తఱి నమర్షతతి చిత్తత వడిం బొడము
క్రొత్తయగు రాగమున, నెత్తురుమొగంబుల్
జొత్తిలెడిన ట్లమరఁ దత్తరపుఁ బొబ్బల వి
యత్తల మగల్చి పెనుమొత్తమగు దైత్యుల్
పుత్రకున కబ్బెనన [1](యెత్తి) శితశూలముల
నొత్తి పొడువన్ దితిజసత్తనయుఁ డోస
రోత్తమ! పురాణపురుషోత్తమ! హరీ యనుచు
హా త్తి? యనుగాని యనఁ డెత్తి యితరంబుల్॥ 356

1. మెత్తి.

లయగ్రాహి ॥

మందమతి యిట్లు భటబృందము వడిం బొడువ
నందకధరుండు తన డెందమున భక్తిం
బొందుఁడగు నయ్యసురనందనుఁడు భీతిపడి
యెందుఁ జొరఁబోవఁ డెచటం దరలఁ డార్తిం
గ్రిందఁడు విచేతనత నొందఁడు విషాదగతిం
గ్రిందుపడఁ డా ఘనుని యందమగుమేనుం
గంద దొకయించుక యనం దగునె యింక మరి
యం దెపుడు నెత్తురులు చింద వని పల్కున్ ॥ 357

తే॥ ఇవ్విధంబున నారాతిసేంద్రుఁ డప్పు
డటుల బాధింప మున్నటియటుల నున్న
సుతునిఁ గనుఁగొని యిది యేమిచోద్య మనుచు
నుదితచింతాభరాక్రాంతహృదయుఁ డగుచు॥ 358

వ॥ మఱియుం గుమారమారణసమారంభంబు సంస్తంభింపనేరక హృత్కంధరమందిరాకుంఠవై కుంఠకంఠీరవనిరస్తఖేదుండగు ప్రహ్లాదుని గజనఖంబుల చేత మెట్టించియు గరళవిషంబులు వెట్టించియు నురగపతుల చేతఁ గఱపించియు నుగ్రానలజ్వాలలయందు దహింపించియు సాగర మధ్యంబున వేయించియు శైలతలంబులఁ ద్రోయించియు, శీతాతపవర్షంబులయం దునిచియు, శీఘ్రపవాతంబున కెదురుగాఁ బంచియు నుక్కం గట్టించియు, నుపవాసంబులు వెట్టించియు, సమ్మెటల మోదించియు, శస్త్రంబుల నూదించియు, నవనిగర్భంబున నిల్పించియు, నభిచారహోమంబులు వేల్పించియు, నానావిధోపాయంబుల నతని మాయంజేయఁ జాలక సంతాపాంతరితాంతరంగంబున నిట్లని వితర్కంబుఁ జేసె. 359

ఉ॥ అంచితభక్తి విష్ణు ననయంబును సన్నుతిఁ జేయు వీనిఁ జం
పించెద నంచు నిర్దయతఁ బెక్కగు బాధలు పెక్కుమార్లు సే
యించితి దేహమున్ విడఁడొకింతయు వంత నలంగఁ డెంచినన్
పంచశరద్వయస్కుఁడగు బాలుఁడు చిత్రము పుట్టె గట్టిగన్॥ 350

కం॥ ఊహఁగక బాధలు సేయుచుఁ
గడు నిర్దయవృత్తి నొంపఁ గాంక్షించు ననున్
చెడనాడఁ డొక్కనాడున్
విడువఁడు నిజశమగుణంబు విస్మయ మిదియున్॥ 351

కం॥ కొడు కని చూడక వల దిశఁ
గడు మహిమాన్వితుఁడు వీఁడు కారణజన్ముం
డడగం డెబ్బంగుల నీ
తొడరువున నపాయ మొదవుఁ దుది నెట్లయినన్॥ 352

తే॥ అని విచారంబు నొంద శుక్రాత్మజాతు
లధిప! శిశువాక్యముల కింత యలుఁగ నేల
తెలుపుదము వీని నిపుడ యేతెంచు శుక్రుఁ
డంతమీఁద భద్రంబగు ననుచుఁ బలికి॥ 353

వ॥ ప్రహ్లాదునిఁ దోడ్కొని నిజభవనంబునకు నరిగిరి. హిరణ్య
కశిపుండును త్రైలోక్యసామ్రాజ్యపూజ్యుండై యుండె నంత, 354

## ప్రహ్లాదుడు దైత్యకుమారులకు హరితత్త్వము బోధించుట

సీ॥ ప్రహ్లాదుఁ డా భృగుప్రవరులు సెప్పెడు
ధర్మార్థకామైకతాననశాస్త్ర
ములు ముముక్షువునకు నలవడ వని విచా
రించి, వారలు వినుపించుమాట

లూరక వినుచుండి యొకనాఁడు వా రను
ష్ఠానార్థ మొందేనిఁ జనినవేళఁ
దనతోడఁ జదివెడు దైత్యకుమారులఁ
బిలుచుక యెంతయుఁ బ్రియముఁ జేసి

తే॥ వారలకు మోక్షశాస్త్రంబు వలనుగాఁగ
దెలుపఁ దలఁచినఁ గృపారసవిలసనమున
బాలహృదయము లానందభరితములుగఁ
బలికె నిట్లని యశదృశప్రజ్ఞఁగలిమి॥ 365

తే॥ జగతి [1](మర్త్యులై) పుట్టి సంసారసౌఖ్య
సక్తులై యుండి బోధలేశంబు లేక
పంకజాక్షునిఁ గొల్వని బాలిశులకుఁ
గలుఁగనేరదు కడ యన్యకారణముల॥ 366

సీ॥ నరునకు సఖుఁడైన నారాయణుఁడు మున్ను
బదరికాశ్రమభూమిఁ బరమనియతి
నుండుచు నారదయోగికిఁ గరుణచేఁ
దెలిపె వైష్ణవధర్మవిలసనంబు
నారదమునిబోధనమున నే నిబ్భంగిఁ
గమలనాభునిఁ గొల్వఁ గంటి మంటి
ననుటయు నద్భుతం బంది యో ప్రహ్లాద
[2](విడకయేఁ గూడి యెప్పుడును మనము)

తే॥ పెరిగితిమి నారదుఁడు నీకుఁ గరుణ నెన్న
డిట్టి విజ్ఞానమార్గంబు నెఱుఁగఁ జేసె
ననుచు నౌత్సుక్యమునఁ దన్ను నడుగునట్టి
యర్భకులఁ జూచి మఱియుఁ బ్రహ్లాదుఁ డనియె॥ 367

1. మర్త్యుఁడై. 2 విడక యెప్పుడుఁ గూడి మనము పెరిగి.

తే॥ ఘనుఁడు మాతంబ్రిడియైనట్టి కనకకశిపుఁ
డట్లు మును మందరాద్రిపై నమరవరులఁ
బఱవఁ గోరి పిపీలికాభక్షితాంగుఁ
డగుచుఁ దప మాచరించు నయ్యవసరమున॥ 368

వ॥ ఇంద్రుం [1](డెదిరిఁ) గని యమరసంఘసహితుండగుచు మన
యుర్వీడునకు దాడివచ్చి యెల్లవస్తువులఁ గొల్ల పట్టించి యుల్లంబున
నల్లసిల్లుచు మజ్జననిఁ జెఱపట్టి యాడ్చుకొని గగనమార్గంబునం బోవు
సమయంబున నారదుండు యదృచ్ఛాగతుండగుచుఁ గనుంగొని, 369

శా॥ అంతర్వత్ని మఱుందలిం గడు గుణాఢ్యన్ దీని నియ్యింతి నా
వంతైనం దయలేక యిట్లు చెఱసేయం బాడియే యింద్ర! నీ
యంతఃక్రోధము దైత్యుపై నిలిపి నాకై పోవని మ్మిప్పు డీ
యింతి న్నావుడు నమ్మునిం బలికె దేవేంద్రుం డుదారంబుగన్॥

కం॥ ఆప్రసవముగా నీదై
త్యప్రేయసిఁ గాంచి పుత్రు నదసీయ్యుని వ
జ్రప్రహతుఁ జేసి మీకు న
తిప్రీతిగ నిపుడు నమ్మతిం జెఱ విడుతున్॥ 371

తే॥ అనుటయును నవ్వి యా యంబుజాక్షికుక్షిఁ
బరమభాగవతుండు సంభవము నొందు
నతఁ డవధ్యుండు బుధవర్యుఁ డనుచు నిట్లు
విశదముగఁ దెల్పు మునిపల్కు విశ్వసించి॥ 372

కం॥ ఘనుఁడగు నయ్యింద్రుఁడు కృప
[2](ననువుగఁ) జెఱ విడచి సనియె నట మునియును మ
జ్జననిం దోడ్కొని యాశ్రమ
వనమునకును నరిగి యచట వాత్సల్యమునన్॥ 373

1. డెదురు గని. 2. ఘనవత్సరోగ.

తే॥ జగతి నింతికి నీళ్ళాడ సమయమైనఁ
దండ్రియింటికి నరుఁగుట ధర్మమెపుడు
తరుణి! కావున నిది నీకుఁ దండ్రిభవన
ముందు మిచ్చుట నని పల్కి యూరడించి॥ 374

కం॥ వనితా నీ గర్భంబున
ననఘుఁడు హరిభక్తుఁ డొదవు నట్లగుటఁ దగన్
వినుతజ్ఞానపథము నీ
కనయంబునుఁ దెలుపవలయు నని తెలిపెఁ దయన్॥ 375

వ॥ అని గర్భస్థుండైన నన్నుపలక్షించి నారదునిచేత నుపదిష్టంబైన జ్ఞానమార్గంబు భగవదనుగ్రహంబున మఱువంబడక యున్నయది యని తెలిపి నారదోక్తంబులైన యాత్మస్వరూపభాగవతధర్మాదివిశేషంబులు సెప్పి యిట్లనియె॥ 376

తే॥ ఇంకఁ బెక్కేల వినుఁడు చెయ్యెత్తి మీకుఁ
జాటి చెప్పెద ముమ్మారు సత్య మనుచు
వేదమునకంటె శాస్త్రంబు వేరు లేని
యటుల హరికంటె దైవ మన్యంబు లేదు॥ 377

మ॥ తులసీపర్ణవిమిశ్రితంబగుచు నెందుం బ్రస్తుతంబైన యా
జలజాతాక్షపదాభిషేకజలముల్ సద్బుద్ధిచేఁ జిహ్వపైఁ
జులుమాత్రం బిడ నేర్చు [1] (పుణ్యుఁ) డనిశత్రుభ్యద్భవాంభోధి య
గ్గలికం దాటఁగఁ గాంచు నీసులభమార్గం బెచ్చటం గల్గునే॥ 378

వ॥ కావున,

1. వ్యుఁడు.

కం॥ భార్గవు లుపదేశించు కు
మార్గములం బోవ నేల మాధవసేవా
నర్గళవృత్తి న్మన మప
వర్గముఁ జేకొనఁగవలయు వరమతు లెన్నన్॥ 379

ఆ॥ అనుచుఁ గనకకశిపుతనయుఁ డయ్యయివేళ
దైత్యసుతుల భృగుమతంబు మరలి
విష్ణుభక్తిఁ దెలుప వివశులై వారలు
గడువిరక్తిఁ బూనఁ గఁగుటయును॥ 380

కం॥ శుక్రునితనయుఁడు దెలిసి య
తిక్రూరచరిత్రుఁడైన దితిసుతుకడకున్
సక్రోధత నరిగి తదీ
యాక్రమ మెఱిఁగింప నతఁడు నతికుపితుండై॥ 381

వ॥ ప్రహ్లాదుం బిలిపించి యిట్లనియె॥ 382

తే॥ సురలు నాపేరు సెప్పిన స్రుక్కుచుండ
వెఱవ కోరి! [1](విష్ణుని నీవు విభుఁడటంచుఁ)
బలికి యసురార్భకుల నెల్లఁ బఱపికొంటి
తెలియ నతఁ డెప్పు డెచ్చటఁ గలఁడు చెపుమ॥ 383

వ॥ అని పలుకుటయును బ్రహ్లాదుండు తనతండ్రి కిట్లనియె॥ 384

కం॥ హరి యెచ్చోటఁ గలండని
యరుదుఁగొనుచు నడుగ నేల యసురేశ్వర! తా
నరయఁగ నేర్చిన నెచ్చోఁ
గర మనురాగంబుఁ గలదు కలఁ డచ్చోటన్॥ 385

1. విష్ణుని విభుఁ డటంచు.

సీ॥ కలఁడు ధారుణియందుఁ గలఁ డంబువులయందుఁ
గలఁడు నక్షత్రసంఘంబునందుఁ
గలఁ డంబరమునందుఁ గలఁడు భానునియందుఁ
గలఁడు సుధాకరజ్వాలనులందుఁ
గలఁడు తేజమునందుఁ గలఁడు వాయువునందుఁ
గలఁడు దివాళ్ళి దిగ్గణమునందుఁ
గలఁడు తిర్యక్కులఁ [1](గలఁడు త్రిమూర్తులఁ)
గలఁడు సారాసారవిలసనములఁ

తే॥ గలఁడు సదసదంతర్బహిఃకలితవృత్తిఁ
గలఁడు సకలకాలంబులఁ గలఁడు సకల
దేశముల నింకఁ బెక్కేల తెలిపె దేని
కలఁడు నీయందు నాయందుఁ గలఁడు చక్రి॥ 386

కం॥ అనవుడు విని దితితనయుఁడు
ఘనరోషవికారుఁ డగుచుఁ గఠినాత్మక వి
ష్ణునిఁ జూపెదె యీ స్తంభం
బున ననుటయుఁ దండ్రిఁ జూచి పుత్రుఁడు వలుకన్॥ 387

చం॥ అనుటయు దానవేంద్రుఁ డదయాత్మతఁ గద్దియఁ డిగ్గి యిందు వి
ష్ణునిఁ గనఁ జూపకున్న మఱి సుద్దులు చెప్పఁగ నాకు నీఖలుం
డునిమెద నేటితో ననుచుఁ దోరపుహస్తము సాఁచి వేసె న
వ్వినుతసభానికేతనము విస్మయదం బగునట్లు కంబమున్॥ 388

వ॥ ఇవ్విధంబున వ్రేయుటయును, 389

1. గలఁడతి తిర్యక్కు.

## న ర సిం హా వ తా ర ము

సీ॥ పరివహాపవనఝుంపాకంపితాంభోధి
ఘుమఘుమాకారవిభ్రమము సెలఁగ
సంకర్షణస్ఫుటాసంఘసంభూతాగ్ని
చిటచిటారవశంక చెలువు సూప
పుష్కలావర్తకాంబుధరసంఘటితఘు
[1](ర్ఘురరవగర్జానుకరణ) మలర
నిర్ఘాతపాతౌఘనిర్భిన్నకుంభినీ
పటపటాకారసంభ్రమము నిగుడ
తే॥ నుదితభూరిస్ఫులింగకీలోత్కరములఁ
బ్రేలగింజలై భువనముల్ పెటిలుపడఁగ
పెటిలు పెటిలని యత్యంతభీషణమున
భాసురంబైన యుక్కుకంబంబు పగిలె॥ 390

వ॥ అమ్మహాస్తంభంబున స్తంభమహారంభ విజృంభితసంరంభుం డును, ధళధళాయమాన దంష్ట్రాదండాంతరాళ తరళతర జిహ్మాభీల వివృత ముఖుండును, నదభ్ర[2](భీక)రభ్రుకటి సమాలింగితస్ఫులింగ దుష్ప్రేక్ష ణీక్ష[3](ణే)క్షణుండును, [4](నగాగ్ర)నిర్భిన్నపయోధరసటాచ్ఛటాబంధురకంధ రుండును, హిరణ్యకశిపుకఠోరశరీరధరణీధరవిదారణభిదురావతారణావధా రిత నఖరప్రహసితప్రహరణుండును, నూర్ధ్వసముద్ధాపితకఠినకర్ణప్రకాండ ఖండిత విమలశంకాసంఘాతసమంజిమభరుండును, నిబిడతరనిశ్వసితశ్వసన వివరణసముద్ఘాతసంధివేళాలోహితాంబురుహుండును, ననవద్యసకలావ యవమహితమణిఖచితభూషణుండును, నాకంఠకంఠీరవ మనుజ తనుతా

1. ర్ఘురగర్జానుకరణమలర. 2. (.........). 3. (.........)
4. నగాగ్ర.

విచిత్రచరిత్రుండును, హిరణ్యకశిపుప్రహ్లాదవిషయరౌద్రకరుణారసద్వయ ద్విధాసమాకృష్టిపరిక్లిష్టహృదయకమలుండును, సకలదేవతాసంస్తూయమానుండును నగు శ్రీ నరసింహదేవుం డావిర్భవంబు నొందిన, 391

చం॥ కనుఁగొని దానవేంద్రుఁ డధికంబగు ధైర్యముతోడ నిట్లు నె
మ్మన వెడరూపునం బడుచు మాటలకై జగడంబుసేయవ
చ్చినయతనిన్ మదీయజయశీలనిరర్గళదోర్మహార్గళా
ఘనతరసారసంహరణకారునిఁ జేసెద నంచు నుద్ధతిన్॥ 392

తే॥ ఖడ్గఫలకాదిసాధనగ్రాహి యగుచు
గగనమండలసంచారకారి యగుచు
నవనవప్రస్ఫురితసింహనాదుఁ డగుచుఁ
జేరుటయుఁ జూచి శ్రీనరసింహుఁ డపుడు॥ 393

కం॥ గరుడుఁడు భుజగము వట్టెడు
కరణి [1](నురియు) కా హిరణ్యకశిపునిఁ గృతహుం
కరణుండై యొడిసి మహో
భర మలరఁగఁ బట్టి తొడలపై నిడుకొనుచున్॥ 394

చం॥ అతినిశితప్రదీప్తనఖరావళిచే దితిపుత్రుపొట్ట యు
ద్ధతి విదళించి నెత్తురులు దద్దయుఁ దోయిటఁ బారఁజల్లుచున్
దృతవిగతాసుఁ జేసి మది దుస్సహరోషమునం దదాంత్రసం
తతిఁ బెకలించి పట్టె నతిదారుణభంగిఁ గరాంబుజంబులన్॥ 395

తే॥ వైరియే వీఁడు నరయ దౌవారికుండు
తగునె యున్న్యనకై పురాతనుని నొంప
ననుచు సిగ్గుచేఁ బోలెఁ బ్రహ్వంబులైన
నృహరి నఖములు రక్షించు నిఖిలజనుల॥ 396

1. నరయకా.

కం॥ దనుజునివక్షము నరహరి
పనివడి చించుటలు తనదుపదసేవకులన్
గనిమనితిమనుటకై ?
మనమున్నిత్యార్థమరయు మతిగా నోపున్॥ 397

వ॥ ఇవ్విధంబున సంధ్యాసమయంబున దేహళీప్రదేశంబున నఖముఖంబులచేత హిరణ్యకశిపువిశసనం బొనర్చి యుద్ధసన్నద్ధులగు తదీయ రాక్షసవీరులఁ జక్రాకారజ్వలజ్జ్వాలిజ్వాలాహుతిత్వంబు నొందించి మహాసంరంభంబున విజృంభించు శ్రీనరసింహదేవునిం జతుర్ముఖుండు సురతరకుసుమవర్ష దివ్యదుందుభిధ్వానపూర్వకంబుగా సాష్టాంగప్రణామం బొనర్చి కరకమలముకుళకీలితాలికుం డగుచు నిట్లని వినుతించె॥ 398

దండకము :—

జయ జయ జగదీశ సర్వాంతరాత్మన్, మహాత్మన్ సమస్తశ్రుతిఖ్యాత హేయ ప్రవజప్రత్యనీకత్వ సుశ్లోక కల్యాణ భూమైకతాన స్ఫుటజ్ఞానమోదస్వరూపత్వ సంపూర్ణకీర్తే, పరబ్రహ్మ నారాయణశ్రీశముఖోక్త్యమానన్యసాధారణాఖ్యా సమాఖ్యాత విశ్వైకనాథత్వపూర్తే, స్వభావప్రభూతాప్రమేయానతిక్రామి తేజోబలైశ్వర్య వీర్యాద్యసంఖ్యేయభాస్వద్గుణప్రస్రవంతీపతే, స్వాభిలాషానురూపైకరూపాద్భుతా చింత్యనిత్యానవద్యాసమౌజ్జ్వల్యసౌందర్యసౌగంధ్యలావణ్యతారుణ్య సంస్తుత్యరూపత్వ సిద్ధోన్నతే, స్వోచితానంత నానావిధానూన భూషాగణ స్వస్వరూపా నిశాచింత్య శక్తిక్షతావద్యదివ్యాయుధశ్లిష్ట నిత్యస్వతుంగోజ్జ్వల శ్రీసదాశ్లేషతా యుక్త సుజ్ఞానసారక్రియైశ్వర్యవద్దివ్యసూరిస్తుతాంఘ్రిప్రభా, భాసురక్షీరపాథోధిమంథాన సంధానలేఖా సముద్భూతి మత్కౌస్తుభాకార వాస్సార నిర్వర్తితశ్రీదకల్యాణ నిత్యప్రదీపక్రియోపక్రమశ్రీగృహ ప్రస్ఫురత్తోరణస్రగ్వి శేషీభవద్వైజయంతీసగీరంభ లబ్ధప్రకర్షాతి

సంరబ్ధ దేవద్విషత్కంఠపీఠీ గళద్రక్తధారాహుతి ప్రీణితారజ్వాలజ్వాలి చక్రప్రభా చక్రమజ్జత్తమోఽనుక్రమోద్యోత ఖద్యోతచంద్రార్కు హృద్ద్యోతమానాతి పీతానుసాధారణోద్భాసినీవార శూకాభ తేజోగ్ర జాగ్రద్విశిష్టాతురాకార తాపాది వేదోప సంగీత సూత్కృస్థితే.

సృజసి జగదశేషమిత్థం తదావస్యపాంగస్య భావోజ్జ్వలౌదార్య గాంభీర్య సౌశీల్య వాత్సల్యవా, నేకదా. హంసి నిశ్శంక సంకర్షణాకార భాగ్యైకదైవం భవద్భూమిభారం సముత్తారయ న్మత్స్యమూర్తే, సమస్తశ్రుతిస్తేయ విస్తారితాస్తోక ఘోర్త్యాపరావర్త్య హృత్తోస్మకాఖ్యాసురాభీల కోలాహలాసార సంహారధారా ధురాధీర వైసారిణోద్భావతారం దధానః పథాఽనేన పాథోధిపాథశ్చరజ్జంతుసంతాన సానాధ్యమాదావ కార్షీ రితీదం పునర్వేత్తి సత్యవ్రతోఽద్ధా, విరుద్ధాశయాదిత్య దైత్యావళీమధ్యమా నోరుదుగ్ధాంబుధిక్షుబ్ధభూమీ ధరాధస్తన ప్రస్తరాఘర్షణా నిత్యమేవాచ్ఛరు క్కచ్ఛపత్వేనసోఢుం పరంశేకిథాః, దర్శితభ్రూలతా చాలనాపాంగరంగస్థలీ నృత్యదాలోకమందస్మితాదిక్రియా విప్రలబ్ధాఽమరారాతి హృద్ధస్త పద్మస్థగాంగేయ భృంగారరంగత్సుధాధారయా వారయా మాసిథా దిత్యపత్యాశనాయా మహాయాస మాదౌ వరాహాకృతిర్భీకరా నల్పకల్పాంతయోద్వేల వారాశి కల్లోలడోలాసువేలా పరస్తీరి థాఽహోహిరణ్యాక్షరక్షస్యధిక్షేపణక్షోభకారిణ్యముం దీర్ఘనిర్ఘాతనిర్ఘోష జిద్ఘుర్ఘరారావకృన్మంక్షువక్షశ్ఛిథ క్షోణిమేతాంసముత్క్షిప్య రక్షాపరస్త్వం నిచిక్షేపిథాహీంద్ర మూర్ధస్వపారంచకర్థామరోల్లాస మాసన్న పాతత్వ తత్త్వాన భిజ్ఞత్వదీయాస్తిభావోప జిజ్ఞాసు దైతేయ హస్తోద రాస్ఫాలన స్ఫార సంరంభ బంభజ్యమానాయస స్తంభ గర్భస్థితావిర్భవన్నారసింహాకృతీ రంహసావిద్విషన్నాస్తివాదం గతార్థం కరోషి, త్వమిత్థ గరుత్మత్పతిత్రోటి కోటీ సమాంచన్నఖోద్భాసి హస్తాబ్జయోరాంత్రజాలాన్యహో హాల్లక ప్రాకృతార్చ్చిరుచిం తన్వతే.

ప్రకృతి మహదహంకృతీ యోరులీలాసమారబ్ధహైమాండమధ్యం సమధ్యాస్య లోకత్రయం నిర్మిమాణో భవాం స్తత్రచిత్రం చరీకర్తి కర్తృత్వ మస్మాదృశాం సాక్షిభావం జరీగర్తి వర్వర్తిచాంతర్బహి స్తే మహాన్సర్వ దానంతకోట్యర్బుదాజాండ, భాండావృతై కై కరోమత్వకీర్తి ర్నరీనర్తి లోకేషు శేషే విశేషేణ శేషే.............................. ప్రత్యూతాత్రైవలోకేహి మాత్రీయసి, స్వాశ్రిసంసేవకం వీక్ష్యపుత్రీయ సీత్థంబుభూషస్యనేకావతారో జగచ్చాదిమంతం భవత్తోనుబోభోతిబో భోమిచావాభవన్నాభిజన్మా బతానేక శోఽస్మాశ్రుతిశ్చాపి పశ్చా త్కృతా శేష దేవప్రభావం గుణాధార కల్యాణమూర్తిం భవంతం శనై రీడుమీడుం నిపాప్మాఽజరోపీత మృత్యుర్విశోకోఽజిఘత్సాఽపిపాసాఽతి గశ్చేతి హేయం గుణౌఘం నిషిధ్యస్వయం సత్యకామ స్తథాసత్యసంకల్ప ఇత్యాదినాఽవర్త్మనా త్వద్గుణత్వం బ్రవీతి,త్వమాద్యం పరంబ్రహ్మ విష్ణో త్వమధ్యాత్మదీప స్త్వదాత్మాహిలోకః, ప్రభోమాంతు జన్మాంతరేష్వప్య విజ్ఞాత యాపాప్మకపాదాశ్రయం మాకృశిష్ఠా నిరాపమ్య నిష్కారణాపార కారుణ్యవారాశి భావప్రసిద్ధిం సమృద్ధింసదా దేవ సేవేతమాం త్వామహం.

జలధి దుహితృగాఢవక్షోజ కుంభద్వయాశ్లేష సంభావితానంద పారీణ తే సింహనాదాద్భుసారావిణం................త్రిలోకత్రయం, సేవనాయాత దేవానియం తేదృగుచ్చార్య రో రోద్ధి బో భోక్తి దూరావ లోకోత్సవం, సిద్ధగంధర్వ విద్యాధరాదిప్రజాస్సాధు......చతుర్భావం భవాన్పూర్వ పశ్చాంతమాలోక యాస్మాక దయాపూర్ణదృష్ట్యా, సముద్యద్దినేశాత పామృష్టహృష్టాంబుజాతప్రభా గర్వనిర్వాసనోల్లాసవిష్టే ధనుర్మీనకూర్మధ్వజచ్ఛత్ర కుంభప్రకీర్ణాదిరేఖామనోజ్ఞే, నమద్దేవతా కోటి కోటీలసచ్ఛాణికోల్లేఖ సుశ్లాఘ మాణిక్యవిద్యన్నఖేందుప్రసాదాతిగణ్యే, సదా సచ్ఛరణ్యే, త్వదీయే పదే మూర్ధ్నిమే దేహి, పద్మాక్ష లక్ష్మీపతే దేవ తుభ్యం నమః శ్రీనృసింహాచ్యుతానంత విష్ణో హరే పాహి మాం పాహిమాం పాహిమాంపాహిమాం పాహిమాం. 399

కం॥ అని యివ్విధమున వనజా
సనుఁ డతి భక్తి న్నుతించుసమయమునఁ ద్రిలో
చనముఖులగు ననిమిషులుఁ
వినుతించిరి వేరు వేర పేరనృసింహాకుఁ॥ 400

వ॥ ఆసమయంబున నింద్రాదిసహితుండగు చతుర్ముఖుండు రోష సమాక్రాంతస్వాంతుండై న నరసింహుని నుపశాంతునిగా నొనర్చుటకు నసమర్థుండయి యిందిరాదేవియు నద్దేవునిం డాయ నసమర్థయగుటం గనుంగొని ప్రహ్లాదునిచేతఁగాని యికార్యంబు చక్కం బడదని తలంచి యతనిని నియోగించుటయు నబ్భాగవతశేఖరునిచేత సంస్తూయమానుం డగుచుఁ బ్రసన్నుండై వెన్నుం డక్కుమారుం జేరఁ బిలిచి కరుణావ లోకనంబుల నవలోకించి శిరంబునం గరం బిడి [1](సస్మితుం) డగుచు, వత్సా! వరంబు వేడుమనుటయు నబ్బాలకుం డిట్లనియె॥ 401

ఉ॥ కామములం ద్యజించి మదకారణబోధితబోధదుర్గమం
బై మహనీయమైన భవదంఘ్రిసరోరుహభక్తిమార్గముఁ
నేమము మీరఁ బట్టి నిను జేరఁగఁ గోరెడి నన్ను 'గోరుమా
కామితవస్తు విత్తు' నని కారియఁబెట్టుటయుక్తమే? హరీ!॥ 402

సీ॥ నీపాదతీర్థంబు నెరవుగా జిహ్వకు
నమృతపారణగాఁగ నలరి యలరి
నీదివ్యమంగళాన్వితవిగ్రహంబుఁ దృ
ష్టికి ముఖ్యలక్ష్యంబుఁ జేసి చేసి
నీసత్కథాస్తోత్రనియమవిశేషంబు
నిత్యకృత్యంబుగా నిలిచి నిలిచి
నీముఖోల్లాసంబు నిఖిలకాలంబుల
స్వాధ్యాయముల వేడ్క సాగి సాగి

1. సంస్మితుం.

తే॥ నీప్రసాదంబు సంపాదనీయ మనుచుఁ
దలఁపులో నెల్లకాలంబు తలఁచి తలఁచి
పొదలఁగాఁ జేయుమయ్య నా కిదియ వరము
పురుషోత్తమ, నరసింహా, భూరిరింహా॥ 403

కం॥ అనుటయుఁ బ్రహ్లాదునిఁ గనుఁ
గొని వత్సా! నీకుఁ దక్కఁ-కోర్కెఁ గలుఁగునో
యని వరముఁ గోరుమని నీ
మన మరసితి ననుచు నృహరి మఱియుం గరుణన్॥ 404

సీ॥ మహిమ దీపించి యామన్వంతరం బసు
రేంద్రుఁడవై భోగసాంద్రవృత్తి
నెగసి యామీఁద బరేశుండనగు నన్నుఁ
జేరెదు మీతండ్రి వైరకలితుఁ
డగుచు నాచే హతుఁడై పవిత్రుండయ్యె
నీవె ముఖ్యుఁడవు మత్సేవకులకు
నతుల భక్తి మది తదవతారకథ విను
వారలు న్ననుఁ జేరువార లనఘ
ఆ॥ యనుచుఁ బల్కి వేడ్క నంబుజవాసినిఁ
జేరఁ బిలిచి యంకసీమ నునిచి
యదితిగర్భముఖ్యులగు వేల్పుబెద్దలఁ
గరుణఁ బెంపుమీరఁ గారవించె॥ 405

వ॥ ఆసమయమున శుక్రుండు ప్రహ్లాదు నసురభర్తగా భగవ త్సన్నిధియందు పట్టంబుఁ గట్టె. [1](నర)మృగేంద్రుండును నిర్జరుల నిజ స్థానంబులకు ననిపి యంతర్హితుం డయ్యె నని యెఱింగించి ధర్మనందనునకు నారదుం డిట్లనియె. 406

1. నగ.

కం॥ పరమేష్ఠి యసురవరులకు
వరము లొసఁగి సేయునట్టి వైయాత్యము లి
[1](వ్వరు)సనఁ జక్రమునం బెట్టును
సరసిజదళనేత్రుఁ డాత్మసౌభాగ్యమునన్॥ 407

వ॥ మఱియును,

కం॥ మయుమాయా[2](చేతఁ ద్రి)పురా
లయదైత్యులఁ గెల్వ లేక లాగరిన యుమా
దయితునకు నశ్రమంబున
జయ మొసఁగెడి చక్రి దివిజసంఘము వొగడన్॥ 408

ఉ॥ నా విని ధర్మనందనుఁడు నారదు నిట్లను నో మునీంద్ర! ల
క్ష్మీవిభుఁ డివ్విధంబున నృసింహత నొందుట యానతిచ్చుటన్
బావనతన్ భజించితి నపారగుణాకర యింక నమ్మహా
దేవుఁ బురారి సేసినకృతిత్వము మాకును దెల్పవే దయన్॥ 409

వ॥ అనుటయు రాజర్షికి దేవర్షి యిట్లనియె. 410

త్రి పు ర వి జ య ప్ర స్తా వ ము

సీ॥ అమరనిర్జితులైన యసురులు భీతులై
మహిమాఢ్యుఁడై నట్టి మయునిఁ జేరి
శరణాగతుల మమ్ముఁ జయ్యనఁ గావవే
యనుచు వేడిన నతం డనువు మెరయ
నాయస రాజత హైమంబులైన పు
రంబులు మూఁ డంబరమునఁ దిరుగు
నట్లుగా నొనరించి యవి వారి కావాస
ములుసేయ వారలు బలిమి మించి

1. వ్వరు. 2. (చే - ద్రి).

తే॥ కామసంచారులై పేర్చి కదనములఁ బ
రాజితులఁ జేయ సురలు గర్వంబు లుడిగి
పార్వతీవల్లభునిఁ జేరి ప్రణతు లగుచు
విన్నవించిరి దైతేయవిభ్రమంబు॥ 413

వ॥ అప్పుడు,

కం॥ శంకరుఁడు పురము లణఁపఁగ
సంకల్పముఁ జేసి రాక్షసస్త్రీజనతా
[1](టంకా)హుంకరణచ్యుతి
ఝాంకృతిఁ గావించి విడచె నొక ఘనశరమున్॥ 414

తే॥ ఆశరముచేత హతులైన యసురవరుల
నమృతకూపంబులో ముంచి యపుడ మయుఁడు
బ్రతుకఁ జేయుడు గనుఁగొని భర్గుఁ డాత్మ
నధికచింతాభరాక్రాంతుఁ డగుచు నుండ॥ 415

చం॥ సరసిజసూతి క్రేపగుచు చంగున దాఁటుచు వెంటవెంట రా
హరి యొక ధేనువై తన శుభాకృతిఁ జూచి రిపు ల్విచేష్టతన్
బొరయఁగ వారి యాలయము ఘోరనఁ జొచ్చి తదంతరస్థకూ
పరసముఁ ద్రావె నంతయును భ్రాంతత నొందె మయుండు నంతటన్॥

వ॥ విష్ణుండును బితామహసమేతంబుగాఁ బురంబు వెలువడి నిజమూర్తిం గైకొని యాత్మీయమహిమచేత శరశరాసనాదికంబులు గల్పించి ప్రాధాన్యం బొసంగి సెలవిచ్చుటయు, శంభుండు మహాసంరంభంబున నొక్క బాణంబునఁ బురత్రయంబు నీఱుసేసిన, బృందారకులు దుందుభులు మొరయించి మందారకుసుమంబులు గురిసి, యతనిం

1. హుంకా.

బురారి యని నుతించిరి. హరిహరహిరణ్యగర్భపురుహూతాదులు నిజ నివాసంబులకు నరిగి రని చెప్పిన విని సంతోషించి ధర్మనందనుండు మునీంద్రా! వర్ణాశ్రమాచారధర్మంబులు వివరింపవలయు ననుటయు నారదుం డిట్లనియె. 417

## వర్ణాశ్రమాచారధర్మవివరణము

సీ॥ తలపంగ దాన మధ్యయనంబు యజ్ఞంబు
ననియెడు కర్మత్రయంబు బ్రాహ్మ
ణులకు, రాజులకు, వైశ్యులకు, ధర్మముల్
రీతిగా దానద్విజాదిసేవ
నములు శూద్రులకు ధర్మము, యాజనాధ్యాప
నప్రతిగ్రహములు విప్రవృత్తు,
లవనిపాలనము శస్త్రాభ్యాసమును నర
పాలకజీవికల్, పాశుపాల్య
తే॥ కృషులు వైశ్యజీవనములు వృషలులకుఁ ద్రి
వర్ణభవసేవ సముచితవర్తనంబు
సత్యవాక్యవ్రతంబును సర్వభూత
దయయుఁ గలుగంగవలయు నందఱకు నెపుడు॥ 418

వ॥ ఇది వర్ణాశ్రమధర్మంబు లింక నాశ్రమధర్మంబులు వినుము.

సీ॥ ఉపనీతుఁడై వటుం డెపుడు కౌపీనదం
డాజినయజ్ఞసూత్రావిరుద్ధుఁ
డగుచు సాయంప్రాతలం దగ్ని వేల్చుచు
నత్తెఱంగుననె భిక్షాశి యగుచు
కడఁక నాపోశనకర్మావహితుఁ డయి
దివసంబునందు నిద్రితుఁడు గాక

యాచార్యునింటఁ బాయక సను శ్రేయుచు
నెనసి వేదములఁ బఠియింపవలయు

తే॥ బ్రహ్మచర్యంబు ద్వాదశాబ్దములు నడపి
యవల నేయాశ్రమంబైన నందు ముఖ్య
బ్రహ్మచర్యంబు ఋషిఋణభంజనైక
కారణం బతిశుద్ధంబు కౌరవేంద్ర॥ 420

శా॥ దారస్వీకృతిఁ జేసి న్యాయ్యమున నర్థప్రాప్తి సంపన్నుఁడై
సారజ్ఞానత దేవపిత్రతిథిపూజాతత్పరుండై దయో
దారుండై సుతబాంధవాతురసుహృద్దాసాదులం బోషణ
శ్రీరమ్యాత్ములగా నొనర్చు గృహి వర్తించుఁ హరిం గొల్చుచుఁ॥

మ॥ తనకాంతామణిఁ గూడియైన సతిఁ బుత్రశ్రేణితో [1](నిల్పి యై)
నను గాంతారము సొచ్చి నిస్పృహత వన్యగ్రాసియై శాంతిదాం
తినిరూఢస్థితి వల్కియై జటిలుఁడై ధీవిస్ఫురద్విష్ణుఁడై
న, నుతింపం దగు నమ్మహాత్ముఁడగు వానప్రస్థుఁ డుర్వీశ్వరా॥ 422

తే॥ సంఘరహితుఁడై కామాదిశత్రుతతి న
డంచి యింద్రియచయము మర్దించియును త్రి
దండముఁ గమండలువుఁ దాల్చి తపము హరికి
నర్పితము సేయు నాతండు యతివరుండు॥ 423

వ॥ అని మఱియును బ్రహ్మోదాజగరసంవాదాది విశేషంబులు వివరించి ధర్మనందను నామంత్రించి నారదుండు నిజేచ్ఛం జనియెనని యాభిమన్యవునకు వైయ్యాసి చెప్పినవిధంబు సూతుండు వినిపించిన శౌనకాదిమహామునులు మహాత్మా! సమనంతరకథావిశేషంబు లానతీయుమని యడుగుటయును, 424

1. నిల్పియై.

శా॥ విద్వద్రక్షణకల్పవృక్ష రిపుపృథ్వీనాథ నిర్నిద్రసం
విద్విద్రావణ కృత్ప్రసిద్ధగురు ఖర్వీకృత్యతిప్రౌఢరా
జద్దైవవిధ్యగుణప్రయోగజనతాసంగీయమానప్రథా
హృద్యక్రీర్తిప్రణతాంబురాశితనయాధీశాంఘ్రిపాథోరుహా॥ 425

కం॥ మన్నె దళధూమకేతువ !
మన్నియమృగబేటకార మాళవరాయా
త్యున్నతమస్తకశూలా
మన్నెసురత్రాణ ! బిరుదుమన్నెవిభాళా॥ 426

మా లి నీ॥ శ్రుతబహువిధశాస్త్రా - [1](సుప్రసిద్ధోరుశస్త్రా)
వితతగుణధురీణా - విష్ణుసేవాప్రవీణా
[2](చతురిమనవ)భోజా - సజ్జనాహ్లాదితేజా
ధృతధరణికళత్రా - తిమ్మభూపాలపుత్రా॥ 427

గద్యం॥ ఇది శ్రీమదష్టభాషాకవిమిత్ర నాగయమంత్రిపుత్ర సాహిత్యమార్గ నిశ్శంక, దోనూరిపదాంక, వినయలక్ష్మీసనాథ కోనేరునాథప్రణీతంబైన బాలభాగవతమను మహాప్రబంధంబునందు ప్రియవ్రతోపాఖ్యానంబును, నాభి, ఋషభ, భరతచరిత్రంబులును, ఆంగీరసరహూగణసంవాదంబును, బ్రహ్మాండగోళలక్షణ ప్రస్తావంబును, ద్వీపసముద్రనద్యాది వర్ణనంబును, జ్యోతిశ్చక్రసంస్థానంబును, పాతాళనరకస్థితులును, నజామిళోపాఖ్యానంబును, నారాయణనామప్రభావంబును, దక్షతపశ్చరణంబును, దత్సంతతి ప్రకారంబును, దేవాసురనరతిర్యగాది జన్మంబులును, విశ్వరూపజననంబును, దత్సంహారంబును, వృత్రాసురసంభవంబును, దధీచిచరిత్రంబును, ప్రహ్లాదజన్మంబును, దచ్చరిత్రంబును, శ్రీనరసింహావతారంబును, త్రిపుర విజయప్రస్తావంబును, [3]వర్ణాశ్రమధర్మవివరణంబును నను బంచమషష్ఠ సప్తమస్కంధకథావిశేషంబులు గల తృతీయాశ్వాసము. 428

1. సుప్రతిసిద్ధోమశస్త్రా. 2. చతురిమమన. 3. బుద్ధావతారంబును అసంగతంబగుట విడిచితిమి.

# బాలభాగవతము

## చతుర్థాశ్వాసము

కం॥ శ్రీభాగవతకథాసం
శోభితకావ్య[1](ప్రణేతృ) సుకవీంద్రవచ
స్సౌభాగ్యజనితసమ్మద
లాభ, సుగుణయూథధామ లక్ష్మీనాథా॥ 1

వ॥ ఆకర్ణింపుము పుణ్యకథాశ్రవణసమగ్రహర్షులగు శౌనకాది
మహర్షులకు హరినామస్మరణరోమహర్షణియగు రోమహర్షణి యిట్లను
నట్లు ప్రాయోపవేశవ్రతశీలుండగు పరీక్షిన్నరపాలుం డాగర్భవైష్ణవధర్మా
నురాగియగు శుకయోగి నాలోకించి, 2

## స్వాయంభువాది మనుచరిత్రము

తే॥ మనువు లన నెవ్వ రెవ్వ రేమనువుకాల
మున రమాభర్త యెబ్బంగి జనన మొందె
నేమి యొనరించె మనువులు నెంద రిప్పు
డరిఁగి రిది దెల్పఁ దగునని యడుగుటయును॥ 3

కం॥ అకలంకచరిత ! నీవి
విష్ణుకథాప్రశ్నంబు మిగులఁ జోద్యం బిదియుఁగా
సకలముఁ జెప్పెద వినుమని
శుకుఁ డిట్లను నా నరేంద్రచూడామణికిన్॥ 4

తే॥ శాస్త్రపద్ధతియగు చతుష్టయసహస్ర
మితదినుండగు నప్పరమేష్ఠి కిప్పు
డనుసరించు ద్వితీయపరార్ధవేళఁ
బరఁగుచున్న వరాహకల్పంబునందు॥ 5

కం॥ పదునలువురు మనువులలో
సదభీష్టత నార్వు రిపుడు [1](చని రీజగతిన్)
మొదలియతఁడు స్వాయంభువ
పదవిఖ్యాతుండు మున్న పలికితి నతనిన్॥ 6

చం॥ అపరిమితప్రభావమున నమ్మనుకాలమునందు విష్ణుఁడుం
[2](గపిల)సుయజ్ఞనామములుఁ గైకొని తత్సుతులందుఁ బుట్టె నా
కపిలుఁడు యోగమార్గగతిఁ గైకొని మించె సుయజ్ఞుఁ డాన్నపుం
గృపయరి నొంచుదైత్యుల ననేకులఁ ద్రుంచె సుదర్శనంబునన్॥ 7

సీ॥ స్వారోచిషుం డనఁజాలు రెండవమను
వవనిఁ బాలింపంగ నచ్యుతుండు
విభునామధేయుఁడై వెలయు వేదశిరస్కుఁ
డను విప్రునకుఁ దుషితాంగనకును
ప్రభవించి మును నెనుబదియెనిమిదివేవు
రవునన బ్రహ్మచర్యంబు నడిపి
మూఁడవమను వౌత్తముఁడు విరాజిల్లంగ
ధర్మాఖ్యునకు సూనృతకును సత్య

ఆ॥ సేనుఁ డనఁగఁ బుట్టి దానవసంఘంబుఁ
జక్రహతము సేసి సకలదివిజ
మనుజగీయమానమహిముఁడై పుండరీ
కాక్షుఁ డింద్రమిత్రుఁ డనగ వెలసె॥ 8

1. చవిరి (.........). 2. గలవి.

కం॥ అరుదుగ నాలవమనువై
కర మలరెడు తామసంబు కాలమునం దా
హరిణీహరి మేధులకుఁ
హరిహరి యన నుదయ మందె నసురులఁ బ్రోవన్ ॥ 9

కం॥ జననాయక యీతామస
మను కాలమునందె క్రూరమకరగ్రహణం
బునఁ జిక్కినయట్టి గజేం
ద్రునిఁ జయ్యనఁ గాచె నచ్యుతుఁడు దయఁబేర్మిన్ ॥ 10

ఉ॥ నా విని యాత్రేయుఁడు మనంబున విస్మయమంది యో మహా
త్మా! వనచారియా గజము నంబుచరంబగు నక్ర మెట్లు వై
రావిలబుద్ధిఁ బట్టె, హరి యక్కరి నేక్రియఁ గాచెఁ దెల్పుమా
నావుడు యోగివర్యుఁడు నరనాథున కిట్లను సమ్మదంబునన్ ॥ 11

## గ జేం ద్ర మో క్ష ము

తే॥ రజత[1](కాంచనాయ)సశిఖరములు నయుత
యోజనవిశాలతయుఁ దావదున్నతియును,
గలిగి చూపట్టు [2](నడు)బాలకడలిలోన
నొకత్రికూటాఖ్యమైన శిలోచ్చయంబు ॥ 12

వ॥ మఱియు నుర్వీధరసార్వభౌమగర్వనిర్వాపణధూర్వహ సప్తాశ్వ మహాశ్వకట్టాకఖురపుటఘట్టన నితాంతదంతురిత గ్రావోదగ్రశిఖరకులా గ్రంబై బిలోగ్రంబై యనవరతస్రవ[3](ఝ్ఝరాంబు) సంబంధ సంభావిత విశంకట తటోపల సంఘాతసంఘర్షణోత్కృష్టపటీరతరుసంభవదతనుసతను కీర్తిశంకాకరానంతసుగంధబంధురంబై, సగంధసింధురంబై, ఖరకిరణ

1. కాయ. 2. కడు. 3. ఝరాంబు

కిరణవిసరణవిరహితతమఃసారుహామంజుమంజుతర మధుర మత్త మధుకర గానానుకూలముగ్ధస్నిగ్ధకామినీసంగీతప్రసంగమహిమగం బై బహుమృగం బై కటకతటనివిష్టకరిగణాకృష్టభగ్నస్యందమాన హరిచందనామోద మేదుర గంధవాహశిశిరితశిఖరోపాంతనివిష్టజాంబవక మిథునలిహ్యమాన వివిధఫల [1](విసర)పరిమళసురభితపరిసరం బై, వరతరం బై, సరభస కేసర సహస్రఖర నఖరధారాదారితమత్తమాతంగ కుంభస్థలయుగళగళిత స్థూల ముక్తాఫలజాలసరణివ్యక్తతరాలక్తరససేకపదపంక్తిసూచిత సురపుర వార నారీసంచారవిలసితం బై యొప్పు నత్త్రికూటపర్వతంబు, 13

శా॥ దంతివ్రాతము లొక్కనాఁడు రవి యస్తగ్రావశృంగంబులం
దంతర్ధానము నొందునత్తఱి వశా [2](టాట్యాను)భూతిం బరి
శ్రాంతిం జెంది జలావగాహనమహాశాపార[3](వశ్యంబు)నః
ధ్వాంతస్తోమములో యనంగఁ గదలెం దత్కాననాంతస్థలిన్॥ 14

సీ॥ ఉగ్రవిహారసంయుక్తంబు లగుటకు
మన్మథపాతనమహిమ యమర
కృష్ణమూర్తిత్వమంగీకరించుట కురు
శ్రీస్థలాకర్షణక్రీడ యొనర
చక్రధరత్వంబు సంగతం బగుటకు
వల్లకోద్వహనసవ్యాప్తి యలర
ఘనభావవిస్ఫూర్తికలితంబు లగుటకు
గనకాభివృష్టియుక్తత వహింప
తే॥ ప్రచుర[4](పుష్కరత్వమునకు) బహులదావ
భంజనప్రౌఢి యౌచిత్యపదమునొంద
బెక్కువిధములఁ గ్రీడించె నుక్కు మీఱి
హస్తియూథంబు లక్కాననాంతరమున॥ 15

1. విస. 2. టిట్యాను. 3 వస్యంబు. 4. పుష్కరత్వానను.

తే॥ ఇవ్విధంబున విహరించు నిభకులంబు
వలనఁ గురుతర మదపారవశ్యయుక్తిఁ
గోటి పిడియేనుఁగులు దన్ను గొలువ వెనుకఁ
జిక్కి నొక హస్తిరాజంబు చిత్రగతుల॥ 16

కం॥ బడిఁ దప్పి యెదుగనేరక
పిడి[1](యేన్గుల)తోడఁ గూడి పెక్కువిధముల౯
విడువని విహారణముల నె
య్యెడల వినోదములు గనుచు నేఁగుచు నొకచో॥ 17

సీ॥ చిఱుతగాలికిఁ బుట్టు కుఱుగడ ఉయ్యాలల్
గా నూఁగి యాడు జక్కవల చేతఁ
దమ్మితూడులు ద్రుంచి కొమ్మల [2](కందించి)
పెంపొందు రాయంచపిండు చేతఁ
బూదేనపొత్తుల భోజనంబున కర్థిఁ
గదువులుగట్టు తుమ్మెదలచేతఁ
దరులు తీవెలు విరు లురియ నెల్లపుడు పైఁ
బడి కప్పుకొన్న పుప్పొడులచేతఁ

తే॥ గరుడపచ్చలచెలువుతో విరసపడఁగఁ
బదరు[3](క్రొమ్మించు) నాచుజొంపములచేతఁ
జాల వేడుక లొదవింపఁ జాలునొక్క
కొలను జేరె నయ్యేనుగుకులముసామి॥ 18

కం॥ కొలకులఁ దేటుల మొరపం
బులకు లలి న్నెలవు లగుచు మొగము లవియు చెం
గలువుల నెత్తావుల పెం
జలువల నయ్యేన్గురాజు సంతస మొందె॥ 19

1. యేనుగుల 2. కట్టించు. 3. క్రొమ్మరుచు.

వ॥ ఇత్తెఱంగునం జేరి యత్తోయజాకరంబు సొచ్చి యందు, 20

కం॥ వారణరాజము కరిణీ
వారంబులు దాను నీరవారిజనాళా
కారకర కాండములచే
వారి యథేష్టముగఁ బెక్కువరుసలఁ ద్రావెన్॥ 21

సీ॥ పుష్కరంబులచేతఁ బూరించి జడిగొన
సలిలపూరంబులు చల్లు లాడి
ముదముతో నామూలముగ నాళ[1](దండ)ముల్
విఱిచి పద్మంబుల ప్రేటు లాడి
చరణఘాతంబుల జలచరయూథంబు
లట్టిట్టు వడి దాగ నిండి యాడి
యన్యోన్యశుండాసమాకర్షణంబుల
భిట్టారముల మించఁ బెనఁగి యాడి

తే॥ దప్పి తీరిన సంతసం బుప్పతిలగ
[2](గప్పి)కొనియున్న జలకేళికాంత పొదల
కరిణిలును దాను విహరించె సరసిలోన
నగ్గజేంద్రంబు పారవశ్యంబు నొంది॥ 22

ఉ॥ ఆక్రమవృత్తి నిట్లు సలిలాశయ మెల్ల నిభాళిచేత, ర
మ్యాక్రమబాధ నొందుటయు నత్తఱిఁ గాంచి య[3](సహ్యాన్నతి మై)
నక్ర మొకండు పూర్వచరణంబులయందు గజేంద్రుఁ బట్టె, ని
ర్వక్రతఁ జేయు హుంకృతులవై ఖరి వారి గుభుల్ గుభుల్లనన్॥ 23

ఉ॥ పట్టుటయుం జవంబున నిభంబు కరంబున వేసి లావుమైఁ
బట్టినఁ [4](బట్టు) వాపుటయు, వాయక మున్నిటియట్లు పట్టె, యి
ట్టట్టు చలింపనీక సలిలాటము గాటము సూప దంతని
ర్ఘట్టనచేత నమ్మకరగాత్రము నొంచెఁ గరీంద్ర మెత్తెరన్॥ 24

1. దంత. 2. గ్రప్పి. 3. వింహ్యావృత్తిమై. 4. బుట్టు.

వ॥ మఱియును నక్రకరిమకరంబులకుం బరస్పర సమాకర్షణంబుల నితరేతరనిపీడనంబుల నన్యోన్యబలప్రకటనంబుల నేన జయించెదననుచుఁ జలంబులు దలంబులుగా బహువిధంబులం గలహంబు సహస్రవత్సరంబులు జెల్లునంత కరిణీపరివృతుండగు కరీంద్రుండు స్వస్థానస్థితంబగు మకరంబునకు బలం బెక్కి తనబలంబు నడగుట తెలిసి పురాకృతసుకృత పరిపాకవశంబున నిట్లని విచారంబు సేసి, 25

శా॥ ఈ నక్రంబు బలచ్ఛలంబుల భరం బేపారి మించె న్నిజ
స్థానోగ్రంబగు దీనిఁ గెల్తు నను నాసల్గాడ [1](వృద్ధిఘ్న)తన్
నానాభంగుల [2](నాకుశక్తి) యనుమానం బెద్ది యివ్వేళయం
దే నెవ్వాని మదీయరక్షకునిగా నీహించి ప్రార్థించెదన్॥ 26

కం॥ ప్రకటశ్రీలం దశల
క్ష[3](కరటి)కరిణీవిభుత్వసంపన్నుఁడ నే
నకటా యేమిటి కిచ్చో
టికి వచ్చితి నూర కిట్టి డెప్పర మొదవన్॥ 27

చం॥ విసువక రాత్రియుం బవలు వేళ్లాక [4]వాదములేక ఘోరు నీ
మొసలికిఁ జిక్కి గెల్తునను మోసపుబుద్ధి సహస్రవత్సర
వ్యసనము నొందు నాకు నొకయప్పుడు నొక్కరుఁడైనఁ గన్గొనం
బొసగడు, నన్ను నిప్పుడిఁకఁ బ్రోవఁగ [5](దిక్కగు నెవ్వఁ డీశ్వరా)॥

కం॥ అనుచుం [6](దలపోయుచు ని)
ర్జనదేశమునం దనన్యసాధ్యంబగు ని
ప్పనికై సర్వేశ్వరుఁ జ
య్యన శరణము వేడవలయు నని యిట్లనిమెన్॥ 29

1. వృద్ధిఘ్న 2. నాకశక్తి. 3. కంటి. 4. బాదము.
5. నెవ్వఁడు దిక్కు యీశ్వరా. 6. దలపోసి యా.

ఉ॥ విశ్వముఁ గల్గఁజేసియును విశ్వములోనన యుండియుం గృపా
శాశ్వతలీల విశ్వ మనిశంబును బ్రోచియు నొక్కవేళ న
వ్విశ్వములీలకై పరిభవించియుఁ దా వెలుగొందు నెవ్వఁ డా
విశ్వము దానయైన కృతి వేడుక నిప్పుడు నన్నుఁ గాచుతన్॥ 30

కం॥ ప్రకృతిమహదహంకారా
దికవాతవితానమార్గదీపితమగు నీ
సకలజగచ్ఛ్రయమున కా
దికారణం బెవ్వఁ డభినుతించెద నతనిన్॥ 31

ఉ॥ సారతరత్రయీపథము సాంఖ్యము పాశుపతంబు వైష్ణవా
చారము నాదిగాఁ గలుగు సన్మతముల్ వివరించి చూచినన్
వారిధిఁ జేరు వాహినులవైఖరి నెవ్వనిఁ జేరి యుండు నా
కారుణికోత్తముఁ వరదుఁ గైకొని నే శరణంబు వేడెదన్॥ 32

సీ॥ రూఢిగా మనముతోఁగూడ వాక్కులుఁ దెల్ప
వశముగా కెవ్వనివలన మఱలు
క్షేత్రజ్ఞుఁ డెవ్వనిఁ జిత్తంబులోఁ గాంచి
యమృతమై దీపించు నద్భుతముగ
[1](పరిహృత)విషయస్వభావులైన మునీంద్రు
లర్పింతు రెవ్వాని కాత్మతపము
వేదశాస్త్రపురాణవితతు లెవ్వనిలీల
కడముట్ట వినుతింపఁ గానకుండు

తే॥ సకలభూతౌఘములయెడ సమతఁ గలిగి
సాక్షియై యెవ్వఁ డసమానసరణి మెలఁగు
నాదియును నంతమును లేక యలరు నెవ్వఁ
డతని శరణంబు వేడెద నఖిలగతుల॥ 33

1. పరివృత.

ఉ॥ అనఘున కాదిపూరుషున కంచితవృత్తికి హేయతావిహీ
నున కపవర్గభర్తకు మనోజ్ఞగుణాఢ్యున కార్తరక్షణం
బనయముఁజేయు ధీరునకు యజ్ఞఫలప్రతిపాదనార్థద
త్తునకు నచింత్యశక్తికి నకుంఠునకున్ మొఱవెట్టి మ్రొక్కెదన్॥ 34

చం॥ ప్రకృతికి వేఱుగా, వికృతపంక్తికి భిన్నునిగాను, దానక
త్వకలితుఁగా, నిరత్యయసదాతన[1](వైభవుఁగా), మునీశ్వరుల్
ప్రకటచిదాత్మదృష్టిఁ గనిపట్టుదు రెవ్వని నట్టి సాంఖ్యయో
గకుశలవేద్యు మాదృగుపకారకు దిక్కుగ మ్రొక్కి పిల్చెదన్॥ 35

తే॥ అనుచు భాషించి యంతటఁ దనివి నన
చతురమతిఁ గల్పితేశ్వరసన్నిధాన
మగుచు నగ్గజరాజ మత్యంతదైన్య
వికృతి దోపంగ నిట్లని విన్నవించె॥ 36

కం॥ శరణాగతసంరక్షక
కరుణాకర సకలలోకకారణ నిఖిలా
శరణశరణ్యావరేణ్యా
స్ఫురణాశ్రయ నన్నుఁ గావఁ బూనుము తండ్రీ॥ 37

శా॥ అంతర్యామితచే నెఱుంగు దఁట లోకానీకనిత్యస్ఫుటా
త్యంతాలక్షితకర్మసంతతి, యనాథశ్రేణి మొఱ్ఱో యనన్
సంతాపంబునఁ జూచి యేలు దఁట, యెన్నన్ జాలి లేదన్న చో
సంతోషంబున నిల్చి యుందు వఁట, యో సర్వేశ రక్షింపవే॥ 38

మ॥ బిసినీపత్రములందుఁ గానఁబడు నబ్బిందుచ్ఛటల్పాటిగా
ననువు ల్చంచలనంబు నొందెడి [2](సమోహాహం) బయ్యెడిన్ మేను, న
వ్యసనం బయ్యెడు నింద్రియవ్రజము దిక్కై ప్రోవ నన్యుండు లేఁ
డసమానప్రతిభాన, నాదయిన కుయ్యాలించు వేగంబునన్॥ 39

1. వైభవముగా. 2. సమ్మోహం.

ఉ॥ కావగదయ్య గ్రక్కున నకారణబాంధవ, యాలకించు కు
య్యో వినుత [1](ప్రభావ)యుత యో శరణాగతకల్పవృక్ష మొ
ఱ్ఱో విమలాత్మ ! కావదగు నో పురుషోత్తమ ! విశ్వనాథ ! నీ
వే వెలయంగ నడ్డపడవే నను నార్తునిఁ బ్రోవవే దయన్॥ 40

వ॥ అని యివ్విధంబున నగ్గజేంద్రుండు మొఱయిడుచు సర్వేశ్వ
రుండు తన్ను రక్షించుటకై చనుదెంచె నని దీర్ఘోష్ణనిశ్వాసక్రియాసమభి
హారంబులు, సేయుచు నంతరిక్షనిహితేక్షణుం డగుచు నెదురు సూచు
చుండ, విధిరుద్రాదులు వినియునుం బూర్వోదాహృతగుణసంపద తమ
యందు లేకుండుటం జేసి యూరకుండుటయును, 41

రగడ :— అట్టిసమయంబునం దలరువై కుంఠమను
పట్టణమునందు శోభనమైన నగరు గను
పట్టు శశికాంతముల భాసురంబగు మేడ
చుట్టుఁ గల మందారసురకుటజములనీడ
దండిక్రొవ్విరులవలతలిమమునఁ బవళించి
యుండి హరి, గజము కుయ్యో యనుట నాలించి
భయము నొందినయట్టి భద్రేభపతిఁ గాంచి
దయ మెఱయ నిలుపంగఁ దలఁచి గ్రక్కున లేచి
సిరికి నెఱిఁగింపఁ డచ్చెరువుగా హస్తముల
వరరుచుల నెసఁగఁ దాల్పఁడు శంఖచక్రముల
ఖగసార్వభౌము నెక్కఁడు, పరిజనముఁ జీరఁ
డొగిఁ జారుసిగఁ [2](జక్కనొత్తఁ డొప్పులు దేర)
పెనుమేలమునఁ జేతఁ బెనకొన్న [3](సిరికాంత)
చనుమఱుంగగు కొంగుఁ జారసీఁ డొక్కింత

1. ప్రభావ. 2. చక్కనొత్తు డెప్పులు దెగ. 3. శిబికాంత.

తనవెనుక లచ్చి, సిరితరువాత ఖగపతియు
వినుతింప విహగేంద్రువెనుక నాయుధపతియు
నట వరుస వెదుక సేనాధిపతియును మునులు
పుటభేదనమునఁ గాపురములుండిన ఘనులు
[1](తవిలి) వెనువెంట మందల ? నడుగ కేతేర
నవధానగతిఁ బరాకగుచందమేపార
నడుగ గమకించి సిరి [2](యడుగ) భయపడి తొలఁగి
విడువు [3](సంవ్యాన)మని విన( బలుక లేక [4](యొగి)
కలయ నడు మసియాడఁ గలహంసముల గడవఁ
గలగతుల నుతుల కక్కజపు గుత్తియై నడవ
వినువీధిఁ దేవతావితతి ముదమున నిక్క
కని యంజలులు మస్తకములఁ [5](జేర్చుచు) మ్రొక్క
జయ రమాహృదయేశ జయ సకలవిబుధేశ
జయ జలదసంకాశ జయ [6](జయ) హృషీకేశ
యని పెక్కుగతుల నెయ్యమును భక్తియు నెగడ
ననువుపడు మధురవాగారభటియును వొగడ
నతిరయంబునఁ జనుచు నగ్రభాగమునఁ గడు
వితతసౌభాగ్యమై వెలసి వినుతింపఁబడు
కొలను గనుగొనుచు వైకుంఠపురనాయకుఁడు
వలనొప్ప నాచతుర్వర్గఫలదాయకుఁడు
దనుజ [7](శిరమునుఁ ద్రుంచ దర్పమునవా(క్రుచ్చి)
ఘనతరంబైన చక్రంబునకు సెల విచ్చి

---

1. తవుల. 2. (.........). 3. సవ్యాన. 4. యుడుగ.
5. జేర్చి. 6. (.........). 7. శిరముల ద్రుంచి దర్పమునఁ గ్రుచ్చి.

పసుపుటయు నది మిగులఁ బ్రతిభయంబై తరణి
వనసీమ సతిఁగూడ వచ్చి ప్రాలెడుకరణిఁ
గొలను సొచ్చి యకుంఠకుటిలారవముల మించి
నలి మిఱుగురులఁ గ్రమ్మ నక్రంబుతలఁ ద్రుంచి
వెడలివచ్చుటయుఁ గని వేల్పు లలరులవాన
జడిఁ గొలిపె దుందుభులు చరచిరంతఁ లోన
నంచితంబైన వదనాంబుజము గడియించి
పాంచజన్యమును సంభ్రమ మలరఁ బూరించి
జగదేకభర్తహస్తముఁ జూచి వెడలంగఁ
దిగిచి కరిభయ ముడిపె [1](దివి)తేజ మలరంగ॥ 42

కం॥ హరిహరసంస్పర్శనగత
గురునక్రగ్రహణజనితఘోరాఘత న
క్కరికరణి కెరలి దనకర (?)
కర్మమె విలసిల్లె వీతకల్మషవృత్తిన్॥ 43

వ॥ వినుము హూహూనామధేయుండైన [2](గంధర్వుండు దేవల
ముని)శాపంబున మకరం బయ్యె నింద్రద్యుమ్నుండనురాజు విష్ణునింగూర్చి
తపంబు సేయుచుండి హరిధ్యానసమయంబున నభ్యాగతుండగు నగస్త్యునకు
సత్కారంబు సేయకునికి నతనిచేత శప్తుండై గజం బయ్యె నందుఁ జక్ర
హతంబైన నక్రం బా త్రొంటియట్ల హూహూనామగంధర్వుండై యు
ద్దేవదేవునకు వందనస్తుతిగీతంబు లొనర్చి నిజలోకంబున కరిగె గజేం
ద్రుండును నజ్ఞానరహితుండయి విష్ణుసన్నిభుం డయ్యె నా సమయంబున
నరవిందనయనుం డిందిరాదేవి నాలోకించి ప్రేమాతిరేకంబున, 44

1 (.........). 2. గంధర్వుం డెవలముని.

సీ॥ మును నవ్వులకుఁ బట్టుకొనిన పయ్యెదకొంగు
వదలక కదలిన యదుటుదనము
ఇదెపని సుమ్మని యిటు పోయి వచ్చెద
నని తెల్పి చెప్పని యాగడంబు
పాలిండ్లమీఁది కేర్పడ మాటు చాలమి
కటు పరాకైనట్టి యవినయంబు
నను గూఁడి జవమున నడవ నోపనివేళఁ
గై దండ యొసఁగని కైతవంబు
తే॥ నెంచి తప్పులుగ మది దలంచవలదు
భక్తసంరక్షణత్వరాపరత నిటుల
నరుఁగుదెంచుట యయ్యె జ మ్మంబుజాక్షి
లీలఁ గృపసేయుమా యంకపాళి కిపుడు॥ 45

కం॥ అని పలికి లచ్చి నాలిం
గనపూర్వస్నిగ్ధవచనకౌశలముల మ
న్ననఁ జేసి సితాంబుజలో
చనుఁ డానందమున మానసము మెఱుఁగెక్కన్॥ 46

ఆ॥ ఎవ్వఁడేని యీగజేంద్రమోక్షకథాంశ
మవహితాంతరంగుఁ డగుచు విన్నా
యతఁడు సాధు [1](తముఁడు నతఁడు) నానక్తుఁ
డతఁడు పుణ్యుఁ డనుచు నాన తిచ్చి॥ 47

వ॥ గరుడారూఢుండై సపరివారుండై నిజనగరంబునకు విజయంబు సేసె నని చెప్పి శుకుండు పరీక్షిత్తు నవలోకించి తరువాత మనువుల వృత్తాంతంబులు విను మని యిట్లనియె. 48

1. తముండతఁడు.

## రైవత చాక్షుష వర్తనము

సీ॥ అవనీంద్ర రైవతాహ్వయుఁడు చాక్షుషమను
వతనికాలంబున నచ్యుతుండు
శుభచరిత్రుండైన శుభ్రనామునకు వి
కుంఠాఖ్య యైనట్టి గుణవతికిని
దనయుఁడై వైకుంఠుఁ డనఁ బేరుపడ భూమిఁ
గోమరొప్ప నిలిపె వైకుంఠపురము
ననఘుఁడు చాక్షుషుం డౌ నవమను వయ్యె
నవ్వేళ హరి యజితాఖ్యుఁ డగుచుఁ
తే॥ బుట్టె సంభూతికై రాజపుణ్యునకును
బాలకడలిలోఁ గూర్మమై పరగ నతఁడె
మందరాగంబు మోచె నమర్త్యకోటి
కతఁడె యయ్యంబునిధి దచ్చి యమృత మొసఁగె॥ 49

వ॥ అనుటయుఁ బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం జూచి, 50

తే॥ పాలమున్నీటఁ గచ్ఛపలీల నద్రి
నేల ధరియించె జలజాక్షుఁ డెవ్విధమున
నమృత ముత్పాదితము సేసి యమరకోటి
కొసఁగె నింతయుఁ దెలుపుమా [1](యసమమహిమ)॥ 51

వ॥ అనుటయు యోగీంద్రుండు రాజచంద్రున కిట్లనియె. 52

శా॥ దూర్వాసోమునితిట్టుతాకున నమర్త్యుల్ వీతతేజస్కులై
దుర్వారక్రమ విక్రమించి తము దైత్యుల్ పోర నిర్జించినన్
గర్వంబు ల్చెడి సర్వయున్నకడ కేకగ్రీవతం బోయి యా
నిర్వేదస్థితి విన్నవించిరి సమున్నిద్రత్రపం గ్రుంకుచున్॥ 53

---

1. యనఘమహిమ.

ఆ॥ ఇట్లు విన్నవించు నింద్రాది దివిజుల
వివిధభాష లెల్ల వినుచు ధాత
వారిఁ గూడి విష్ణుఁ జేరి యింతయుఁ దెల్ప
నతఁడు గరుణ నిట్టు లనియె మఱల॥ 54

ఉ॥ దానవవైర మిప్పు డనుచితంబగునే సురలార! మీకు స
త్త్వానుగుణప్రచారము గదా నయ మిప్పటికిం దదీయసం
ధానముఁ గైకొనుం డెపుడు దైవబలంబున మీరు నాసుధా
పానము గల్గిన[1](ష్ట) యవిపన్నతఁ గెల్చెద రెల్ల దైత్యులన్॥ 55

## సముద్రమథనము

వ॥ ఆ సుధాపానం బెట్లు గల్గు [2](ననిన) దైత్యులతో మైత్రి [3](వాటించి) వారును మీరునుం గూడి పయఃపాథోధియందుఁ దృణలతౌషధివిశేషంబులు వైచి మందరనగంబుఁ గవ్వంబు సేసి వాసుకి దరిత్రాడుగాఁ గూడఁ దిగిచి, మథియించిన నం దమృతంబు వొడము, నమ్మృతంబు మీకును, బ్రయాసంబు దైత్యులకునుం జేకుఱు నమ్మృతపానంబున నాయుర్బలాభివృద్ధి యగుట నహితు లప్రయాససాధ్యు లగుదు రని యానతిచ్చి యనుపుటయును, 56

ఆ॥ బలియుఁడైన యట్టి బలితోడ వైరంబు
బయలుపడగ నీక బలవిరోధి
కపటమైత్రి సేసి కమలనాభోదితం
బైన నీతిమార్గ మనుసరించి॥ 57

వ॥ మఱియును,

1. ష్ణ. 2. నని. 3. వారించి.

సీ॥ శంబరునికి వినయంబు సేసి, యరిష్ట
నేమితో సామంబు నెరయఁ బలికి
త్రిపురవాసుల యల్కఁ దీర్చి, జంబున కింపు
గావించి, యా హయగ్రీవువిగ్ర
హము మాన్చి, నముచి బాణాదుల లోఁ జేసి
కొని, విప్రచిత్తి శకుని విరోచ
నప్రహేతులకు సఖ్యప్రీతిగలిపి, శుం
భనిశుంభముఖ్యుల ననుసరించి
తే॥ మఱియు నమ్మయ మాలి సుమాలి వజ్ర
దంష్ట్ర పౌలోమి కాలకాత్మజ నివాత
కవచులఁ బ్రియంబు లాడుచుఁ [1](గలసి మెలసి
దివి) జదనుజులఁ [2](గలియంగఁ) దిరిగె వజ్రి (?)॥ 58

తే॥ అక్కసెల్లెంద్రబిడ్డల మైన మనకు
[3](చేల) వైరంబు లిన్నాళ్ళు [4](నెఱుఁగ)మైతి
మింక మన కందఱకుఁ బతి యీశుఁ డతఁడు
త్రిప్పుకొనునట్లు మనమెల్లఁ దిరుగవలయు॥ 59

చం॥ అని ప్రియభాషలాడి యమరాధిపు డుండఁగ నొక్కనాడు మె
ల్లనఁ బలిఁ జేరి దానవకులంబు వినంగ సుధారసాప్తికై
వననిధిమంథనోద్యమము వర్ణన సేయుఁడు నబ్బలీంద్రుఁడుఁ గా
విని, యగుగాక యంచుఁ గడువేడుక మేకొన సిల్చి రందఱుం॥

వ॥ ఇవ్విధంబున బలి యొడంబడి నడచుటయు సురాసురవిసరంబు లమృతరసరసనోత్సుకరసనులగుచుఁ బాలకడలి గిరగిరఁ ద్రిప్పం దలపెట్టి యొక్కటిదైమై కదలి యమందరయంబున మందరంబునకుం దరంబు లిడి

1. గలగితనుదితి. 2. గల్గంగ. 3. చేర. 4. మెరగ.

యందఱు నొక్కపెట్టునం బట్టి యువ్వెత్తుగా నెత్తుకొని చనుచు భరంబు
భరియింపంజాలమి నమ్మేదినీధరంబు మీఁదఁ బడి చిదచిదసేయుటయు,
నింద్రాదిబృందారకు లాత్మగతంబున, 61

ఉ॥ ఇప్పటి కింతసేసె నిఁక నెంతకుఁ దెచ్చునొ యీప్రయత్న మో
యప్ప, రమాధినాథ ! మము నందఱు నూరక వెట్ట్రిక్రోఁతులన్
నిప్పులఁ ద్రవ్వఁ జేయుగతి నేర్చిన కిప్పనికిం [1](దగిల్చితీ)
[2](నెప్పర) మింక నీవె దయనిల్పక యేగతిఁ దాఁటఁగా నగున్॥ 62

చం॥ అని తలపోయునంత హరి యండజనాయకు నెక్కి యంబరం
బున రవికోటితేజమున బోరన నిల్చి దయార్ద్రదృష్టిచే
ననిమిషదైత్యభేదముల యత్నము మానిచి హస్తపంకజం
బున నవకందుకంబుగతిఁ బూనె నమందము మందరాగమున్॥ 63

ఆ॥ ఇట్టు ధరముఁ గేల నెత్తుక మధువైరి
తవిలి దేవదైత్యతతులుఁ గొలువఁ
గడలి పాలకడలిఁ గదిసి తత్తటమున
డించె బలయశం బుదంచితముగ॥ 64

వ॥ అంత,

సీ॥ ఫలభాగ మీ నొడంబడి సర్పపతియైన
వాసుకిం దరిత్రాడు సేసి మంద
రాగంబు బవరి యొందమరించి యయ్యద్రిఁ
బాలమున్నీటిలోఁ బట్టి నిలిపి
యహిఫణాగ్రహణకాంక్షాయత్తులైన వే
ల్పులఁ జూచి హరి మాయఁ బొదివి దైత్యు
లే మొల్ల మీ పుచ్ఛ మీరలు పట్టుడు
విడువుఁ డిప్పుడు మాకుఁ బడఁగ వంక

1. దగిల్చితి చ. 2. నెప్పల.

తే॥ యనిన నేకొని యా వేల్పు లమరఁ దోఁకఁ
బట్టుటయు దైత్యులు ఫణంబు వట్టి రట్లు
కలిసి యిరువాగుఁ దరువంగఁ గణఁగునంతఁ
గుదురు లేమి మున్నీటిలోఁ గ్రుంగె శిఖరి॥ 65

## కూర్మావతారము

కం॥ క్రుంగెడి మందరశిఖరిఁ గ
నుంగొని చింతించు సురల నూల్కొల్పుచు శ్రీ
రంగదురస్స్థుండగు హరి
యంగీకృతకార్యనిర్వహణభారుండై॥ 66

తే॥ లక్షయోజనవిస్తారలలితమైన
కర్పరము శైలములఁబోలు కాళ్ళు భీష
ణాంగములుఁ గల్గు కూర్మమై యంబురాశిఁ
దరసి (?) యెత్తె సమ్మందరధరము నపుడు॥ 67

కం॥ క్రతుభుజులలోననుండియు
నతులితగతిఁ గూర్మ మగుచు నచలము నెత్తెన్
నుతియింపఁ దరము గా దిఁక
మతిఁ దలఁపఁగ నైనఁ దరమె మధురిపుమహిమన్॥ 68

వ॥ అత్తెఱంగునఁ గూర్మంబు గుదురై నిలుచుటయును, 69

మ॥ మథియింపంగ దొణంగి రా కడలి సామర్థ్యంబు లేపార ను
ద్గ్రథితానల్పశిరోజధారులు సముద్యద్దంబరుల్ కీర్తితా
శ్లథదోస్సారు లమర్త్యదైత్యసుభటుల్ సవ్యాపసవ్యక్రమి (?)
గ్రథితస్మాధరసంవళద్ఘుమఘుమాకారంబు తోరంబుగన్॥ 70

తే॥ ఇట్లెఱుంగున దేవదైత్యోత్తములు స
మగ్రబలములఁ దనరు నయ్యవసరమునఁ
బాలమున్నీటిలోన నాభీలగతి [1](హా
లాహాలం) బుద్భవించెఁ గోలాహాలమున॥ 71

మ॥ పొగలు న్మంటలు మింట నంటి నెగడన్ భూరి స్ఫులింగౌఘముల్
నిగుడ న్నిక్క [2](యుగాత్యయార్క)పటలిన్నిర్జించు తేజంబునన్
జగము ల్మ్రింగఁ గణంగునట్టి గతి నాశాచక్రమున్ నిండి బి
ట్టగలం జేసె సమస్తలోకతతి నాహాలాహాలం బుద్ధతిన్॥ 72

సీ॥ భసితసాత్కృతదుర్గపట్టణశాఖాన
గరఖేరుఖర్వటగ్రామకులము
శుష్కీకృతాంబుధిస్రోతస్వినీమహా
ఖాసనరోదేవఖాతగణము
తప్తత్ణప్లుష్టవిద్యాధరఖచరగం
ధర్వకిన్నరవిమానవ్రజంబు
దారితానేకభూధరధరాదిక్సంధి
బంధపద్మభవాండభాండతటము

తే॥ సాదితామర్త్యమర్త్యలోకోదరంబు
దళితమృగపక్షియూథంబుఁ దర్శితోరు
సప్తపాతాళవిష్టపస్థాయికంబు
నై విజృంభించెఁ గాలకాలాఖ్యవిషము॥ 73

హా లా హ ల భ క్ష ణ ము

ఉ॥ ఆ సమయంబునందు జగ మట్లు నలంగగఁ జూచి యంబుజా
తాసనముఖ్యులైన ఘను లా రజతాద్రికి నేఁగి యందు దే
[3](వానుర)మథ్యమాన సలిలాకరజాతహాలాహాలోద్ధతా
యాసము విన్నవించి రసమానుసకున్ నుతిపూర్వకంబుగన్॥ 74

1. హా లంబెద్భవించె. 2. యుగాంత్యయార్క. 3. వాసవ.

వ॥ విన్నవించి యనంతరంబ, 75

కం॥ లోకేశువచనములకుఁ
లోకహితార్థంబు[1](పొంబె) లోలుండై యా
శ్రీకంఠుఁడరుగు[2](దెంచెం
గాకోదరవహ్నిశమన)కార్యపరుండై ॥ 76

ఉ॥ వచ్చి పయఃపయోధిదరి వాసవముఖ్యులు గొల్వ మించు న
త్యుచ్చతరధ్వనిం బొగడ నుగ్రుఁ డుదగ్రపుకాలకూటపుం
జిచ్చు నదల్చి రాఁ దిగిచి చిత్రముగా నరచేత నిల్పి లో
మచ్చర మేద జాంబవసమంబుగ మ్రింగుచు నిల్చెఁ గుత్తుకన్॥ 77

ఉ॥ కన్నుల నెఱ్ఱ పుట్టదు వికాసము దప్పదు మోముదమ్ములో
నన్నుఁ జనింప దేమియును నంగము లించుకయుం జెనుర్ప వా
పన్నత నాల్కయుం దటమువారదు లోకహితాభిలాషియై
యున్నతకాలకూటశిఖ యొక్కవడిం గడికొన్న శూలికిన్ ॥ 78

కం॥ [3](హర) గంగాధర శశిశే
ఖర గౌరీరమణ భర్గ కరుణాకర శం
కర జయ [4](జయ యని) హరిపద్మ
హరిహయముఖు లభినుతించి రప్పుడు మహేశున్॥ 79

ఉ॥ అంజకకాలకూటముఁ బ్రియంబున మ్రింగి జయించినట్టి మృ
త్యుంజయసన్మహత్త్వమున నొప్పెడు నిక్కథ యెవ్వఁడేని భ
క్తిం జదువున్ వినుం దగ లిఖించు నతండు విషాళిగూఢపా
త్పంజభయంబులం జొరఁడు పూర్ణతరాయువు నొందు భూవరా॥

1. పొపి. 2. దెంచెగా, కాకోదరాగ్నిప్రశమన.
3. హరి. 4. జయుని.

ఆ॥ అంత మఱియుఁ దరువ నవ్వార్థిఁ దెల్లని
మొదవు పాలఁ గురియు పొదుగుతోడ
నొదవఁ గోర్కు లొసఁగు నిది యని హరియాజ్ఞ
యొనర మునులు పుచ్చుకొనిరి దాని॥ 81

వ॥ మఱియు మథ్యమానంబైన యప్పయోధియందు, 82

సీ॥ [1](చంద్రోపమంబయి జవమున సరిలేని
యుచ్చైశ్శ్రవంబను నొక్క హయము
ధవళమై నాల్గు దంతంబుల నొప్పారు
నైరావతం బనునట్టి గజము
యెప్పుడుఁ బరువమై యేపారి కోర్కులఁ
గడపక యొసఁగెడు కల్పతరువు
ములోకములఁ జెల్వమునకు మేల్బంతులై
రాజితంబగు నప్సరోజనంబు

తే॥ క్రమముతోఁ బుట్టుటయు సమగ్రప్రమోద
మేదురంబైన హృదయంబు మెత్తఁగాఁగ
నమరపతి పుండరీకాక్షునాజ్ఞఁజేసి
కోరి యన్నియు వానిఁ గైకొనియె నిపుడు॥ 83

ఆ॥ మఱియు నమరదైత్యమథ్యమానంబగు
పాలకడలిలోనఁ బ్రభలు మెఱయఁ
జక్కదనము కెంకి సంపన్నిధానంబు
సిరి జనించె మిగులఁ జిత్రమగుచు॥ 84

సీ॥ పంకజంబులప్రతిపదములు పదములు
విద్రుమచ్ఛాయల వేళ్ళు వేళ్ళు

1. చందోపమంబై.

ఇషుధికాంతులకుఁ జేరిక్కలు పిక్కలు
 బెడగు మున్నీటికిఁ గడలు తొడలు
మహిఁ గల్మిలేముల మధ్యంబు మధ్యంబు
 శోభితావర్తసనాభి నాభి
మెఱుగుల వసియించు మేలిండ్లు పాలిండ్లు
 కల్పవల్లియుగంబు కరయుగంబు
తే॥ కంబుగర్వంబునడఁచ మెడ బింబఫలము
సావి మోవి, మనోజ్ఞతాసాక్షు లక్షు
లొప్పు వింజామరంబుల కప్పు కొప్పు
సవతు గలుఁగునె సిరికి ముజ్జగములందు॥ 85

వ॥ మఱియును,

సీ॥ కడువిలాసంబులు గలిగిన శశిరేఖ
 పదియాఱువన్నెల పసిఁడిబొమ్మ
ప్రాణంబు వచ్చిచొప్పడిన చిత్రపురూపు
 మెఱసి యుర్వికి వచ్చు మెఱపుతీఁగ
తళుకువెన్నెల మీఁగడల నొనర్చిన కుప్ప
 యమృతంబులోన మీఁదైన తేట
నడవ నేర్చి చెలంగు నవకంపుఁ బువ్వుఁదీగె
 యవయవంబుఁగల్గు నాణిముత్య
తే॥ మహహ జగమున సౌందర్యయావనాధి
దేవతాదేవి యీరీతిఁ దెలివి నొందె
నంగనారత్న మీ లేమ యనుచు సారెఁ
బొగడిరి సురాసురలు పొల్చి పొలుపుఁ జూపి॥ 86

వ॥ అంత నద్దేవికి నింద్రుండు మణిమయపీఠంబు వెట్టె, దిగ్వేదం
డంబులు శుండాదండంబులం దీర్థోదకంబులు వంచి మంగళస్నానంబు

సేయించె. మేఘంబులు నానావాద్యస్వనంబుల నుత్పాదించె. మునిజ నాశీర్వాదంబులు నప్సరోనర్తనంబులు గంధర్వగానంబులు ప్రవర్తిల్లె. సముద్రుండు హేమాంబరంబును వరుణుండు వైజయంతియను మాలికె యును, విశ్వకర్మ కాంచనమణిమయాభరణంబులును, శారదాదేవి హారంబును గమలాసనుండు కమలంబును బన్నగపతులు కుండలంబులు నొసంగిరి. వేదంబు లనేకవిధంబుల నుతియించె. జగంబుల కెల్లఁ దల్లి యప్పల్లవాధర యని దిక్కు లొక్కటం బలికె నప్పుడు, 87

శా॥ క్షీరాంభోధితపఃఫలంబయిన యా సీమంతినీరత్న మా
తీరక్షోణిఁ జెలంగు దేవదనుజాధీశాదులం జూచి యె
వ్వారి న్మెచ్చక నిత్యశోభనగుణవ్రాతు న్మనోజ్ఞు హరి
న్ధీరుం గల్వలదండచే జగము మోదింపన్ వరించెన్ నృపా॥ 88

కం॥ హరి చూచి సిరిముఖాబ్జము
సిరి హరిపేరురముఁ జూచి సిగ్గు నటింపన్
మరుఁడును నపు డోరచూపునఁ
దిరముగ విరితూపు వంకదిద్దుచుఁ జూచెన్॥ 89

కం॥ వనజాక్షుఁడు యుక్తంబని
మునుకొని భుజమధ్యదేశమునఁ దిరముగ న
వ్వినుత శ్రీవత్సాంతిక
మున నిల్పె రమాసతిం బ్రమోదము మీరన్॥ 90

వ॥ ఇవ్విధంబున సర్వేశ్వరుండు లక్ష్మీపాణిగ్రహణం బొనర్చిన యనంతరంబ కృతమథనసాధనంబైన యాక్షీరోదకంబునందు, 91

సీ॥ క్షీరబిందువులు మౌక్తికవిభ్రమముఁ జూప
సరిలేసి హాటకాంబరము చెలఁగ
లలితమాణిక్యకుండలదీప్తిఁ గప్పిన
కొమరున కరుణనేత్రములు మెఱయ

[1](సురము)పై నొప్పారు విరిదండచేఁ బోలె
నూర్పుల నామోద ముప్పతిల్ల
నాకంఠపీతపయఃకాంతియో యన
మందహాసము మోమునందు బెరయ

తే॥ నమృతకలశవిరాజితహస్తపద్ముఁ
డనఘమూర్తి ధన్వంతిరియను సుపర్వ
వైద్యుఁ డాయుర్నిగమనాదివర్ధనుండు
సంభవము నొందె హరికళాంశత్వనుతుఁడు॥ 92

కం॥ పోడమిన యాఘనుచేతన్
గడు నొప్పుచునున్న యమృతకలశముఁ గని యా
ప్పుడ తోడిబడఁ దిగుచుక వడ
వడిం బరువిడి సుర లమరవరు లెదవడిగన్॥ 93

## విష్ణుండు మోహినీరూపమును దాల్చుట

వ॥ విష్ణుండు వేల్పులం జూచి మీరు వెఱవకుండుం డేను మోహనవనితారూపంబుఁ గైకొని యసురవరుల వంచించి మీకు నమృతముం బంచిపెట్టెద నని పలికి రక్కసులలోన వెక్కసంబుగఁ గలహంబు పుట్టించి వార లొక్కనిచేతి యమృతకలశంబు నొక్కరుండు దిగిచికొని పరువు లిడుచుఁ జీకాకుపడుచునుండు సమయంబునందుఁ గామినీరూపంబుఁ గైకొని నిల్చుటయు నా దైత్యపుంగవులు గనుంగొని,

ఉ॥ చక్కెరబొమ్మ వెన్నెలల సారపుమీఁగడ కుందనంబునం
జెక్కనిచ్చుకంబుకడ శిల్లిక(?)యున్న మెఱుంగు క్రొమ్మిహీం
చక్కెరవిల్తుఁ డెన్నఁడును జాపముగూర్చని మేటికోల యీ
చక్కని ముద్దులాడి యని సారెకు మోహినిఁ బల్కి రందఱున్॥ 95

1. పురము.

కం॥ కలికిలతకూన చిలుకల
కొలి కెలజవ్వని మిఠారిగుబ్బలనవలా
పులుకడిగినముత్తెము వల
పులవదనిక నిగర మనుచుఁ బొగడిరి లేమన్॥ 96

ఆ॥ ఇట్లు పొగడిమగకు నీ లేమ సమముగాఁ
బంచి యిడిన నమృతపాన మమరు
ననుచు డాయ వచ్చి యమృతభాండముఁ జూపి
యా లతాంగిఁ బలికి రసురవరులు॥ 97

మ॥ రమణీ! యీ యమృతంబు మాకు సరిగా రాఁ జూచి వేఁ బంచి పె
ట్టుము నీ వేగతిఁ బెట్టి తాగతినె కూడన్ మాకు మారాడ నే
రము నీపాదములాన యీపని విచారంబైన యే మందుఁ బో
వము మాప్రాణములున్ భవత్కరమున న్వర్తించు నబ్జాననా॥ 98

వ॥ అనుటయు నమ్మోహిని యమ్మోహాంధుల కిట్లనియె 99

ఉ॥ కత్తులబోను లెవ్వరికిఁ గానఁగఁ గూడని లోనిజీకటుల్
చిత్తజుమంత్రయంత్రములు చెల్వను పైఁ బచరించి మించు పె
న్మిత్తులు సాహసక్రియలు నిక్కడ లుత్కటపాపపుంజముల్
కుత్తినకోతు లంగనలు కూడునె నమ్మఁగ వారి నేరికిన్॥ 100

తే॥ అయిన నను నమ్మి విభజించునట్టి పనికి
నడిగికొంటిరిమటి మంచి దాయె నమర
వరులకును మీకు నమృతంబు నచ్చుకొలఁది
పంచి యిడుదుఁ గూర్చుండుడు బంతు లమర॥ 101

వ॥ అని పల్కుటయు విశ్వసించి దైత్యు లమృతకలశం బప్పణంతికి
నొప్పగించి నేల్పులును వారును స్నానదానజపహోమాదికంబు లొనర్చి
మణిమంటపంబునకు నరుదెంచిన నక్కపటకామిని కుశాసనంబులయందు

ప్రాఙ్ముఖులుగా సురలనుఁ, బ్రత్యఙ్ముఖులుగా నసురులను నిలిపి పంక్తి ద్వయంబు గావించి ప్రదక్షిణాకారంబుగా వడ్డించెద నని పలికి యమరులకు నమృతంబు వోయుచు, 102

ఉ॥ వచ్చెద బావలార! తగవా యిటు గ్రుక్కులు మ్రింగ నింతలో
నొచ్చెము గాదె మీ కనుచు నొయ్యనఁ బయ్యెదజార్చి నవ్వుచుఁ
దచ్చనమాట లాడుచును దానవులం గను బ్రామి భక్తితో
నచ్చపలాక్షి యాయమృతమంతయుఁ బోసె సురాళి కేర్పడన్॥

ఆ॥ అమరవరులఁ గూడి యమృతపానము సేయు
రాహుదైత్యు శశియు రవియుఁ దెలుప
దానవారి చక్రి దళితమస్తకుఁ జేయ
నతఁడు దివి శిరోగ్రహాత వహించె॥ 104

కం॥ వచ్చిన వేల్పుల కీగతి
నిచ్చకమున నమృత మెల్ల నిచ్చి రమేశుం
డచ్చపడు నిచ్చఁ జెలఁగుచు
నచ్చో నంతర్హితాత్ముఁ డయ్యె రయమునన్॥ 105

కం॥ ఆడినపంతము విష్ణుం
డీడేర్చక సురల కమృత మిడి చనుడు వృథా
జోడాయె కటకటా యను
జాడన్ బలి రిత్తయలఁత జడుఁ డయ్యె నృపా॥ 106

వ॥ ఆ సమయంబున,

చం॥ అమరుల కాపుఁడైన హరి యంగనయై చనుదెంచి యిచ్చె న
య్యమృతము గల్గునంతట యనర్థము పుట్టెనటంచు నుగ్రులై
తమకముపై బలిప్రముఖదానవయోధులు వేల్పుమూఁకతో
సమరము సేయఁ బూని మొనసాగుచు నిల్చిరి శస్త్రపాణులై॥ 107

## దేవదానవయుద్ధము

చం॥ కలఁగిన దైత్యులం గని సగర్వత సర్వసుపర్వవీరులుం
జెలఁగుచు సింహనాదములు సేసి యెదిర్చిరి గోత్రభేదియున్
బలియును [1](డాసి రత్తఱి రణం బొనరెన్ ఘన)శస్త్రఘర్షణం
బుల జనియించు వహ్నికణముల్దివి దిక్కులఁ బిక్కటిల్లఁగన్॥ 108

చం॥ గమనములేని తేరులును ఖండములైన గజాశ్వపంక్తియున్
[2](గ్రమముగ నెత్తుటేరులును గండలప్రోవు ల)సత్యనర్తన
క్రమములు సూపునట్లులును గల్గ రణం బొనరించి దైత్యులన్
సమయఁగఁ జేసి రెన్నఁ దగు సత్త్వముతోఁ ద్రిదివేశపుంగవుల్॥

మ॥ విరథుండై బలి మాయ సేయుటయు నావృత్రారిసైన్యంబుపై
గురిసెం [3](బర్వతముల్, దవాగ్ని)వొదలెన్ ఘోరానలంబొత్తిలెన్
దరువు లైచ్చఁబడియెన్ ఫణుల్ [4](సురనిశాంతంబు) న్నిరోధించె దు
స్తరకల్పాత్యయశంకఁ దోఁచి యమరుల్ సంభ్రాంతులై రెంతయున్॥

ఉ॥ నొచ్చి సురు ల్హరిం దలఁప నూత్నగతి న్గరుడాధిరూఢుఁడై
వచ్చి యతండు నిల్వ ననివారత దానవమాయ లన్నియున్
విచ్చెఁ దమంబు లర్కుఁ గని విచ్చినకైవడి నంత భీతులై
విచ్చిన వేల్పులున్ మఱల వేగమె మూఁకలు గట్టి రుద్ధతిన్॥ 111

## కాలనేమి సుమాలుల సంహరణము

ఉ॥ ఆలములోన నప్పుడు రమాధిపు నందఱు మేలు మేలనన్
గాలునిఁ జూడఁ బో ననిచె గర్వము మీరినకాలనేమి న
మ్మాలిసుమాలులన్ బ్రతుక మానఁగఁ జేయుచు మాల్యవంతుఁ ద
ల్లీలనె బుద్ధిఁజెప్పి వరలెన్ సరళీకృతపాంచజన్యుఁడై॥ 112

వ॥ అంత,

1. డత్తరినిరణంబొనరెర్ఘున. 2. (.........)టె రులునుగండలప్రోవులు.
3. (.........). 4. సురనితాళంబుల్,

## జంభ, పాక, బల, నముచి దళనము

సీ॥ శ్రవణకఠోర[1](భాషణ)ము లాడుచు దివ
స్పతి బలి నపుడు మూర్ఛితునిఁ జేసె
నతనిపా టోర్వక యడ్డంబు వచ్చిన
జంభుని నణఁచి తత్సహాజు లగుచుఁ
బరగిన [2](పాకుండు) బలుఁడును నముచియుఁ
నెదిరింప నందులో మొదలివారి
నిపుణుగఁ దంభోళినిహతిచేఁ బరిమార్చి
నముచికి నార్ద్రశుష్కములచేతఁ
తే॥ గలుగ దవసాన మనుచు సంగతము గాగ
నభ్రవాణిచే బోధితుఁ డయ్యె నార్ద్ర
మును నశుష్కంబునగు ఫేన మొనర వైచి
రాజసంబున నముచిశిరంబుఁ ద్రుంచె॥ 113

ఆ॥ పాకవైరియశము పాడిరి గంధర్వు
లాడి రచ్చరలు బలారియెదుట
విరులు చల్లి మానివరులు దీవించిరి
నముచిసూదనుని మనంబుఁ జెలఁగ॥ 114

వ॥ అంతఁ జతుర్ముఖప్రేరితుఁ డగుచు నారదుం డరుగుదెంచి సమరంబు వల దని నివారించుటయు నంబుజాక్షునిచేత ననుజ్ఞాతుం డై యనికంబు మాని యమరవల్లభుండు స్వారాజ్యంబునం బూజ్యుం డై యుండె, బలియును హతశేషదైత్యపరివృతుం డగుచు హేమాచల శిఖరంబుఁ జేరె నని చెప్పి శుకుండు మఱియు నిట్లనియె. 115

1. భూషణ. 2. సాకుండు.

## హ రి హ ర స ల్లా ప ము

శా॥ వైకుంఠుండు లతాంగియై సుధ [1](సుపర్వశ్రేణి) కెట్లిచ్చె నం
చా కైలాసమునందు శూలి యొకనా డాస్థానమధ్యంబునం
దాకర్ణించి సవిస్మయుం డగుచు బెంపారంగ సతీయుక్తుఁడై
వైకుంఠంబున కేఁగుదెంచెఁ బ్రమథవ్రాతంబు సేవింపఁగన్॥ 116

తే॥ ఇట్లు వచ్చి హరుండు లక్ష్మీశుఁ బూజ
సేసి వినుతించి యో దేవ చెలువ వగుచు
నమృత మిడి తట వేల్పుల కట్టిరూపుఁ
జూడ వేడ్క యయ్యెడు నాకుఁ జూపవలయు॥ 117

కం॥ అని ప్రార్థించిన నగుఁ గా
కని పురుషోత్తముఁడు మందహాసముతోఁ గ
న్గొని మోసబోకుమీ హర
యని పలికి యదృశ్యుఁ డయ్యె నచ్చట నంతన్॥ 118

కం॥ హరి యెచటి కేగెనో యని
హరుఁడు వెదకుచుండి యొక్క యతిరమ్యవనాం
తరసీమ బంతి యాడుచు
సరసతఁ గ్రీడించు నొక్క జవ్వనిఁ గనియెన్॥ 119

వ॥ మఱియు నాచంచలాక్షి పంచశరమహానట పంచశాఖాంచల సంచాలిత సూత్రావలగ్న రత్నపాంచాలికయుఁ బోలెఁ బరిపరివిధంబులం గదలుచు సుమేషుయోషా కరభూషాయమాణ నిస్తులకస్తూరికాసంపుటక శోభాపటలవిజయమార్గ విందుకంబగు కందుకంబు కూర్చుండి యాడెడు తఱి రతివ్యత్యయవిభ్రమం బుద్భవింపఁ జేయుచు లేచి [2] (తఱిమికొట్టి)

1. సుపర్వశ్రేణి. 2. తఱిమిక్రోటి.

యాడెడునెడ శబ్దనిర్ణయానుసంధానత్వరాయమాణ చరణనటీపాటవంబుఁ దేటపఱుపుచుఁ బతనోత్పతనలాఘవనిరీక్షణ విచక్షణ [1](విక్షేప)క్షేపంబులు దృష్టిదోషపరిహారార్థ సమర్థితమసారసార (?) నీరాజనంబులతోఁ జెలిమి సేయుచు, యెగురవైచి పట్టుతఱి నిట్టట్టు పరువులిడిన నిరుపేదకౌను వలుద వట్రువగుబ్బపాలిండ్ల నిబ్బరంపుభరంబున విఱుగదయ్యో భళీ భళీ యను కరణిం గంకణనూడిగంబుల ఝణఝణత్కారంబుఁ దోరంబుగా నడుగు లిడునెడం గెంజాయ లకాలసంధ్యాశంక [2](నంకురింపం) జేయ హార పరివర్తనోద్దాత్తకుచకుట్మలంబుల నించుకించుక నయనప్రాహుణికత్వంబు నొందించుచు బహువిధచాతుర్యంబులం బుట్టచెండాడుచుండ ఖండపరశుండు పుండ్రేక్షుకోదండకాండధారాదారితధైర్యుం డగుచు న మ్మోహనాంగిం జేరి మనోవికారంబున, 120

ఉ॥ ఎవ్వరిదాన వీవు కమలేక్షణ! నీకుల మెద్ది పేర ని
న్నెవ్వఁడి యందు రిచ్చటికి నెన్నఁడు వచ్చితి విట్టిరూపమే
నెవ్వరియందుఁ గాన కుసుమేషుని మోహనమంత్రశక్తియో
నవ్వులుదేరు నింక వచనంబుఁ బ్రసాదము సేయఁగాఁ దగున్॥ 121

ఉ॥ అంగజకేళిసౌధశిఖరాంచలచంచలహేమకుంభదీ
ప్తిం గడకొత్తుఁ జాలు నునుబింకపుఁ జన్నులదోయి నా పరి
ష్వంగసుఖానుభూతికి [3](వెసం) గృపసేయుచు నన్ను భృత్యుగా
నంగన! యేలుకోఁ దగు నయత్నత నింక విచారమేటికిన్॥ 122

కం॥ అనుచుండ నబల యెగచి
మ్మినబంతికిఁ బరువు లిడుచు మెఱుఁగగు జఘనం
బునను వలువ జాఱుఁడు తా
మనసిజహరుఁ డెదుగఁ దరులమాటున కరిగెన్॥ 123

1. విక్షప. 2. నుకరింపంజేయ. 3. దెసం.

కం॥ అరుగుటయు హరుఁడు తోడనె
యరిగి కరము సాప నబల యవసన యగుచున్
బరువిడిన హరుఁడు తోడనె
బరువిడి వడిఁ బట్టి కాంచెఁ బరిరంభంబున్॥ 124

తే॥ ముదిత క్రమ్మఱ బాహువిర్ముక్త యగుచుఁ
బరువిడఁగఁ బోకు నిలు నిలు పద్మగంధి
యనుచు వెన్నడి జనునంత హరుని వీర్య
మవనిపైఁ జారెఁ గలధౌత మయ్యె నదియ॥ 125

శా॥ వీర్యభ్రంశము జెల్లునంత హరుఁడున్ వీతాతనుభ్రాంతియై
ధైర్యభ్రంశము విష్ణుమాయ యని యాత్మం గాంచి యంతంతఁ ద
న్నార్యాదేవియు భూతసంఘము బరీహాసంబుఁ గావింప న
స్థైర్యం బెచ్చటఁ గృచ్ఛఁ గాదె యనుచుం దా నచ్చటన్ నిల్చినన్॥

ఉ॥ వనజాక్షుండు తదాకృతిన్ వదలి పూర్వంబైన రూపంబుఁ గై
కొని భూతేశునిఁ జేర వచ్చి మది సిగ్గుద్దేర్చి యేమాయె న
న్ననుమానంబరఁ జూచితే యనుచు నెయ్యం బొప్ప మన్నించి పో
మ్మనినం బోయె నిజేచ్ఛ శంకరుఁడు భార్యాభృత్యసంయుక్తుఁడై॥

మ॥ కమఠంబై జలరాశిమందరము చక్రంజేసి యామీఁదఁ ద
త్సముదీతామృతపూరముం గరుణచే సర్వంబు వామాక్షియై
యమరవ్రాతముఁ ద్రావఁ జేసిన కృపాయత్తున్ రమానాయకున్
విమలాంభోరుహపత్రలోచనుని సేవింతుం దలంతు న్మదిన్॥ 128

వ॥ అని పలికి శుకుండు సమనంతర మనువృత్తాంతంబు
విను మని, 129

## వైవస్వతాదిమనువృత్తాంతము

సీ॥ ఇప్పుడు నడుచువాఁ డేడవమనువు వై
వస్వతుం డిమ్మనువరునికాల
మున నదితికిఁ గశ్యపునకు వామనుఁ డన
జనియించి విష్ణుండు జగము లేలు
బలిఁ జేరి మూఁ డడుగులు నేల యడిగి లో
కత్రయీ గాఁగ నాక్రాంతి నేసి
యింద్రున కర్పించె నిట మీఁదఁ గాఁగల
వాఁ డొప్పు సూర్యసావర్ణి యనఁగ
తే॥ నెనిమిదవమను వవ్వేళ వనధిశయుఁడు
[1](దేవగుహు)కి సరస్వతీదేవియందు
సార్వభౌముండు నాఁబుట్టి శక్రపదవి
నఖిల నేలించు బలిచేత మనుజనాథ॥ 1

వ॥ అటుమీఁదఁ దొమ్మిదవమనువైన దక్షసావర్ణికాలంబు
సర్వేశ్వరుం డంబుధారాయుష్మంతులకు నద్భుతాఖ్యుండై జనియించు
బదియవ మనువగు బ్రహ్మసావర్ణికాలంబున విషూచి విశ్వజిత్తుల
విష్వక్సేనుం డనఁ బ్రభవించు నేకాదశమనువైన ధర్మసావర్ణికాలంబు
[2](నార్యకునకు) ధర్మసేతుం డన సంభవించు. ద్వాదశమనువైన భద్ర
సావర్ణికాలంబున [3](సత్యమహాసూనృత)కుఁ [4](స్వధామాఖ్యుం) డై
యుదయించు. త్రయోదశమనువైన వేదసావర్ణికాలంబున [5](బృహ

1. దివిగుహి. 2. అసూర్యసూనుఁడై. పోతన భా॥ సం॥ 8. ప. 4
సం. భా॥ ఆర్యకస్యసుత స్తత్రధర్మసేతురితిస్మృతః. స్కం 8. అధ్యా. 13. శ్లో 25
3. సత్యతపస్సూనృతులకు (పో. భా॥ స్కం 8. ప. 424.) సం. భా॥ అంతరం సత్య
మహసః సూనృతాయాస్సుతో విభుః (సత్యసహసఃపాఠాంతరం)స్కం. 8, అ. 13. శ్లో. 2
4. సూనునకుద్యుదామ ఖ్యుండు. 5. ప్రహీంతిజైత్యహోత్రులకు.

దేవహోత్రుల)కు యోగవిభుండన నావిర్భవించుఁ, జతుర్దశమనువగు నింద్రసావర్ణి కాలంబున బృహద్భానునామంబున నవతరించు విష్ణుండివ్విధంబున నం దత్తత్కాలంబుల నవతరించి దుష్టనిగ్రహశిష్టరక్షణంబు లొనర్చు, నిట్లవతరించిన యవతారంబులు నవతరింపం గల యవతారంబులును వివరించితి ననుటయు నరేంద్రుండు, 131

## వా మ నా వ తా ర క థ న ము

కం॥ శ్రీమహిళాపతి కశ్యప
భామకు నెట్లుదయమందెఁ బ్రాహ్మణకుండై
యేమిటి కడిగెన్ బలిఁ బద
తామరసాక్షుండు తొల్లి దైన్యము దోపన్॥ 132

వ॥ అని యడుగుటయును యోగీంద్రుం డిట్లనియె. నమృతపానానంతరంబునఁ బురందరజితుండగు బలిదైత్యుండనవరతసేవా[1](సమాకృష్ట)శుక్రచిత్తుం డగుచుఁ దత్కారిత[2](విశ్వజిద్యాగుండై) కంఠీరవధ్వజయుక్తకనకరథదివ్యధనుర్బాణంబుల నగ్నిదేవునివలనను, గమలజునివలనఁ గమలమాలికయును శుక్రువలన శంఖంబు ననుగ్రహంబుగాఁ బడసి యమందప్రభావుండై గురుజనాశీర్వాదంబుఁ గైకొని దుర్దాంతకృతాంతదర్పాపహదైత్యనికర పరివృతుం డగుచు ధాటీసమాటీకన[3](నిరాఘాటత్వ)ంబునఁ జని యమరావతీపురంబుఁ జుట్టుముట్టి వెడపెట్టుటయును నంత, 133

కం॥ అమరులకుఁ బ్రళయభైరవ
డమరుడ్డామరవిసారిడానాదములై
సమయించె ధైర్యముల దై
త్యమహోద్భట పటహపటల ధణధణ రవముల్॥ 134

1. సకృష్ట. 2. విశ్వభిద్యాగుండై. 3. నికాఘంటత్వ.

చం॥ శతమఖుఁ డంతలోన నవిషహ్యతరోదితభీతితోఁ బృహ
స్పతికడ కేఁగి యీదనుజభర్తప్రతాపముఁ గంటిరే మహో
ద్ధతుఁడయి వచ్చినాఁ డితనిఁ దార్కొని గెల్వఁగ రాదు మాకు నే
గతిఁ జను టొప్పు నంచు నడుగన్ గురుఁ డప్పుడు వేల్పుతేనితోన్ ॥

ఉ॥ భార్గవముఖ్యు లిచ్చినప్రభావమునం గడుఁ గ్రొవ్వుబుట్టి దు
ర్మార్గుఁడు వచ్చినాఁడు తరమా యిపు డా ఖలుఁ గెల్వ నీసుహృ
ద్వర్గము నీవు నిత్తఱి దివంబున నిల్వక పోయి రంధ్రసం
వర్గణమైనవేళఁ గని వైరి నడంచుట మేలు నావుడున్ ॥ 136

తే॥ నిర్జరులఁ గూడి యింద్రుఁ డా నెలవు విడిచి
పోయె నందేని గురువాగ్విధేయుఁ డగుచు
సులభగతి నమరావతి సొచ్చి బలియు
సిరుల నెలకొన రాజ్యంబు సేయుచుండె॥ 137

కం॥ హయమేధశతము సేసెన్
జయశీలుఁడు భార్గవానుశాసనసరణిన్
బ్రియమంది రెల్ల ప్రజలును
నయయుతమగు నతనిపాలనంబున నధిపా॥ 138

సీ॥ అంతఁ గశ్యపముని కంగనయైనట్టి
యదితి నిజాత్మజులైన సురలఁ
బరపి యా త్రిదివంబుఁ బలి యేలుచుండుట
యోర్వక వగఁ గుందుచుండి యుండి
యొకనాడు తనభర్త యుబుసుపోకకు నిజ
గృహమున కరుదేర విహితసరణి
నుపచారములు సేసి యుల్లంబులోఁ బట్టి
విడువని వగ యెల్ల విన్నవించి

తే॥ తిరుగఁ దిరుగ నాబిడ్డలు దీను లగుచుఁ
దిరుగుచుండ నెట్లోర్తు నీకరుణ నెఱపి
యమరులకుఁ దొంటివలె భద్ర మమరుతెఱఁగు
దలఁపఁ దగునని దయఁబుట్టఁ బలుకుటయును॥ 139

వ॥ కశ్యపమునీంద్రుండు కులపాలికారత్నంబునుం గనుంగొని,

మ॥ విహరించు న్నిధు లింటిలోఁ బెరటిలో వేగించు దివ్యావనీ
రుహసందోహము దన్నుఁ దాఁ గరము జేరుఁ దేవరత్నంబు, ప్ర
త్యహముం వేలుపుటావు వాకిటికి హంభా యంచు నేతెంచు సు
మ్మహిళయ్యాశయు భక్తితోఁ గొలుచు ధన్యశ్రేణికిం బ్రేయసీ॥

ఉ॥ కావున నీవు నవ్విభు నఖండదయానిధి భక్తవత్సలుం
బావనుఁ దీర్ఘపాదు హరిఁ భక్తిఁ భజింపు మతండు నీతనూ
జావళిపాటు మాన్పుటకునై రిపువర్గమునెత్తి పాల్గొనుఁ
నావచనంబు సత్యముగ నమ్ముము కొంగుపసిండిగా సతీ॥ 142

వ॥ అని పలికి పయోభక్షం బను వ్రతం బాచరింపు మని తద
నుష్ఠానప్రకారంబు లన్నియుం దెలిపిన ఫల్గునమాసప్రథమదివసంబున
నుపక్రమించి నారాయణోద్దేశంబున ద్వాదశదివసంబులు వ్రతంబు సలు
పుటయు, వ్రతాంతంబునం బ్రత్యక్షంబైన లక్ష్మీపతి నదితి బహువిధం
బుల స్తుతియించి, 143

కం॥ బలి నాబిడ్డలఁ బోరిఁగొని
నెలవులుఁ గైకొనుట మొదలు నిద్రాహారం
బు లెఱుంగ దీనికై మది
గలిగిన [1](వెతలెల్ల) మాన్చి కావుము దేవా॥ 144

---

1. యతఁడెల్ల.

వ। అని పరిదేవించుటయు నరవిందనాభుండు మందహాసంబున
నదితిం గనుంగొని, 145

కం॥ వ్రతనియమము మెచ్చితి నీ
సుతుం డగుచు నుదయమంది సురలం బునశ్శ్రీ
యుతులం జేసెద నని స
మ్మతి భాషించుచు నదృశ్యమానుం డయ్యెన్ ॥ 146

తే॥ అంత నదితియు నిట్టివృత్తాంత మెల్లఁ
బతికి నెఱిఁగించి సంతోషభరితహృదయ
కమల యగుచుండె గొండొకకాలమునకుఁ
గర్భవతి యయ్యె హరికళాక్రాంతి కలిమి॥ 147

ఉ॥ కన్నులు తెల్పునం బెరసె, కౌను వివృద్ధి వహించె, నాభి యు
భ్యున్నతి నొందె, నేర్పడుచు [1](నొప్పె) వినీలత రోమరాజి, లో
నన్నుఁ జనించి చూచుకములందుఁ గరల్ గనుపట్టె, నింతికిన్
వెన్నుఁడు గర్భగోళమున వేడుక పెంపున నిల్చియుండుటన్ ॥ 148

కం॥ పదునాలుగులోకంబులు
నుదరంబునఁ దాల్చు విష్ణు నురుతరభాగ్యా
భ్యుదయంబువలన నప్పుడు
ముదిత కృశంబైన యుదరమును ధరియించెన్॥ 149

వ॥ తదనంతరం బా దశమమాసంబునందు, 150

కం॥ దివసంబుజవ్వనముఃతఱి
శ్రవణద్వాదశి నమర్త్యజననికి లక్ష్మీ
ధవుఁ డుదితుఁ డయ్యె సరసిజ
భవసన్నుతిపూర్వకముగఁ బ్రమదం బెసఁగన్॥ 151

1. నెరపె.

వ॥ ఆదేవదేవుని యవతారంబున సకలచరాచరంబులుఁ బ్రమో
దంబునొందె. తాపసాగ్నిహోత్రంబులు ప్రదక్షిణజ్వాలంబు లయ్యె.
వాయువులు సుకరంబులై విసరె. సురకుసుమవర్షగంధర్వగానాప్సరో
నర్తనాదులు ప్రవర్తిల్లె నప్పుడు, 152

కం॥ దరమును నరియును సర
సిరుహంబుఁ జతుర్భుజములఁ జెలఁగగఁ బీతాం
బరుఁడును గౌస్తుభరత్న
స్ఫురితుఁడునై బాలుఁ డొప్పె శుభనిజమూర్తిన్॥ 153

చం॥ అదితియు మౌని కశ్యపుఁడు నట్టిగతిం బ్రకటప్రభావుఁడై
యుదయము నొందినట్టి జలజోదరుఁ బ్రస్తుతిఁ జేసి రంత నా
యుదధిశయుండు నట్టి విధ ముజ్జనసేయుచు సప్తవర్షతా
విదితమునీంద్రబాలకునివేషమున న్నిలిచెం బురోవనిన్॥ 154

కం॥ ఈదృశమగు జగమున బహు
భేదసకలనామరూపబృంహకుఁ డగు న
య్యాదిమునికిఁ బేరిడె ముని
ద్వాదశదివసంబునందు వామనుఁ డనఁగన్॥ 155

కం॥ ఉపనయనము నపనయనము
నెపుడును జగములకు నొసఁగు నీశ్వరునకుఁ గ
శ్యపముని వైదికపద్ధతి
నుపనయనముఁ జేసె మునిజనోపేతుండై॥ 166

సీ॥ సవిత సాక్షాద్బృహిస్మా సావిత్రి నా బృహ
స్పతి జన్నిదంబు కశ్యపుఁడు ముంజ
నదితి కౌపీనంబు నవని కృష్ణమృగాజి
నంబు సోముండు దండంబు గమల

భవ్యుఁడు సమస్తతీర్థవిశేషపుణ్యాంబు
మహితమాణిక్యకమండలువును
శారదాభామిని జపమాలికయు సప్త
మునులు కుశపవిత్రములు నొసంగ
తే॥ యక్షుఁ డక్షయ మనుచు భిక్షార్థపాత్ర
మర్థి నిచ్చినఁ బూని మాయావటునకు
భవతి భిక్షాం ప్రదేహి యన్ పలుకులోనె
యన్నపూర్ణాంబ మణిభిక్ష యందుఁ బెట్టె॥ 157

వ॥ ఇవ్విధంబున నుపనీతుండైన వామనుండు యాచకద్విజముఃఖంబున బలిదైత్యుండై దాత యని విని యెఱింగినవాఁడై దేవతార్థంబు తదర్థనార్థియై కదలి చని చని నర్మదానద్యుత్తరణంబు సేసి, 158

సీ॥ ఆశ్రావయాదివాక్యవిశేషభాసుర
స్వనదైర్ఘ్యసంచితశ్రవణమహము
ప్రకట (స్రువద్రుధు[1]హోపభృ) దులూఖలముస
లైణాజినాదిక వ్యాపృతంబు
కృష్ణాదిః స్వరోత్కృష్టతరోద్గాతృ
సంపాదితాదానసామకంబు
ప్రణయనాదికరమ్యపావకసాత్కృత
[2](సాన్నాయ్య)కృతగంధసంకరంబు
తే॥ నైప్రశాస్త్రుదితానువాక్యానువేద్య
మానదేవతాకృతసన్నిధాన[3](వినుత)
మును విశిష్టసామాజిక ముపకరణము
లమరు బలిమఖశాలాశ్రయంబుఁ గాంచె॥ 159

---

1. (ధ్రువోప......) 2. సాన్నాయ. 3. నుతముస్సైధి.

తే॥ కాంచి యందుఁ బ్రవేశించి కడలిపట్టి
తిరపుటిక్కఁ బ్రాహ్మణులపైఁ జిలిమిషములు
చేసి నవ్వుచు మానవశ్రేణులెల్లఁ
జేరి సేవింప సభ్యులఁ జేర వచ్చి॥ 160

సీ॥ త్రయ్యుతి[1](ప్రౌఢతర) ప్రభాకరకుమా
రిల శాస్త్రచాతుర్య విలసితములు
వేదాంతవాగర్థ విధులును గౌతమ
కణభోజి పాణిని గ్రంథరుచులు
కాపిలమతయుక్తిఘటనలు బహుపురా
ణేతిహాసగ్రామ్యజాతకథలు
నాటకాలంకార నైపుణాభినయంబు
కావ్యప్రహేళికా కౌశలంబు
తే॥ లాదిగాఁ గల విద్యారహస్యతతుల
ఘనతరోదారపటునిరాఘాటఘణితి
వహ్నిసన్నిభులగు మునీశ్వరులతోడ
గోష్ఠిఁ జేసె నవ్వటుఁ డటు కొంతతడవు॥ 161

వ॥ ఇట్లు వినోదించి దండకమండలుఛత్త్రాదిధారియగు నమ్మాయ ధారి తన తేజంబునకు సభాసదు లెల్ల విస్మితులగుచు నుండ బలిం జేరఁ జని దర్భాలంకృతదక్షిణకరంబు సాఁచి గంభీరమధురంబుగా నాశీర్వదిం చిన బలియుఁ బ్రత్యుత్థానంబు సేసి ప్రణతుండై యుచితాసనాసీనుం గావించి పూజ యొనరించి యిట్లనియె. 162

ఉ॥ ఎవ్వరివాఁడ వన్న నిను నెన్నఁడు గానము నీవు వచ్చుటల్
జువ్వె విశుద్ధి నిమ్మఖము శోభిత మయ్యె మదీయపాపముల్
దవ్వయి పోయె పూర్వసుకృతంబులు జేకుఱె నీమనంబులో
నెవ్విధమైన కోర్కెఁ గల దిప్పుడ యానతి యిమ్ము మాణవా॥ 163

1. ప్రౌఢచులు.

వ॥ అనుటయు నమ్మాణవకుండు గృహపతి కిట్లనియె. 164

ఉ॥ ఎవ్వరివాఁడఁ గాను జగమెల్ల నివాసము నాకుఁ దండ్రి నా
నవ్వ యనంగఁ బేరు గురుతైన నెఱుంగ ననాథుఁడ న్నిజం
బెవ్వరికైనఁ బాలుపడి యేనె భరింపగఁ జూతు గాని న
న్నెవ్వఁడు నస్మదీయుఁ డని యిచ్చఁ దలంపఁడు దానవోత్తమా॥

కం॥ అది యట్లుండఁగ నిను నీ
యదనునఁ జూడంగఁ గంటి నానందకళా
స్పద మయ్యె నాదు హృదయము
వదాన్యభావప్రసిద్ధవర్యుఁడ వగుటన్॥ 166

సీ॥ ధర మున్ను మీ ప్రపితామహుండు హిరణ్య
కశిపుండు తమ్మునిఁ గనకనేత్రు
నణఁచిన విష్ణుపై నరిగి సాధించెద
నని భయంకరశూలహస్తుఁ డగుచు
[1](దాడిగా) వైకుంఠధామంబునకు నేఁగి
వెదుకంగ నా హరి యెదురు పడగ
నోపక భీతిల్లి యుచ్ఛ్వాసపదనంబు
వెనుకొని యాతని తనువుసొచ్చి

ఆ॥ యత్తెఱం గెఱుంగ కతని నా దైత్యుండు
గానలేక జగముఁ గలయఁ దిరిగి
[2](తిరిగి) విసిగి వైరి తెగిపోయె నని రోసి
విడచెఁ గలఁడె యట్టి పేరుఁ డింక॥ 167

కం॥ నీతిపరుఁడు ధర్మవిదుం
డాతత సుజ్ఞానశీలుఁ డసమానుఁడు మీ
తాత యయిన ప్రహ్లాదుం
డేతన్మాత్రుండె కీర్తి కెన్నిక కెక్కెన్॥ 168

1. తాదిగా. 2. యరిగి.

తే॥ అమరు లర్థింపఁ గరుణించి యసువు లొసఁగె
ఘనుఁడు మీతండ్రియా విరోచనుఁడు దెలివి
నీవు వారల మించితి వింద్రుఁ దోలి
యేలితివి ముజ్జగంబుల నిద్ధమహిమ॥ 169

శా॥ కొంప ల్సేరగ నోడి మ్లేచ్ఛులకుఁ [1](గింకర్వాణులై) యాయనూ
ర్యంపశ్యావధి భూమిభృద్గుహల నిత్యావాసులై యుండి జీ
వింపక్ రోయు నమర్త్యకోటిఁ [2](బరువుల్ వెట్టింతు వీ వంచు)వ
ర్ణింపం జాలు భవత్ప్రయాణజయభేరీభూరిభాంకారముల్॥ 170

తే॥ ఇట్టి మీ వంశమున జనియించినట్టి
వార లెల్ల మహాభాగ్యవంతు లధికు
లెట్లు వర్ణింపఁగా నోపు నేకజిహ్వుఁ
డై నమాదృశుం [3](డేతద్యశోంబురాశి)॥ 171

కం॥ అడుగన్నేర నపూర్వుఁడ
గడు వేసటబరప నొల్లఁ గ్రతుకాలముగాఁ
గడపక నాయడుగున మూఁ
డడుగులు ధర ధారవోయు మంతియ చాలున్॥ 172

బ లి మ థ న ము

కం॥ అనుటయు [4](నీకొంచెం) బే
మని యడిగితి నన్ను జూచి యనువుగ నడుగం
జనదే యను దైత్యుని వా
మనుఁ డనుపమయుక్తిసరణి మఱలం బలికెన్॥ 173

---

1. గింకరవాణులై. 2. బర్వుంబెట్టెడిపోవంచుచు.
3. డు తద్వంశోంబురాశి. 4. నీకుం బెంచే.

కం॥ ఆసకుఁ దాసుం డెవ్వఁడు
దాసుఁ డతఁడు సకలలోకతతి కా యాసన్
దాసిగఁ జేసిన యతనికి
దాసు లగుదు రెల్లవారు దైత్యవరేణ్యా॥ 174

వ॥ కావున,

ఆ॥ అవధి లేని యాస నలత నొందగ నొల్ల
నిప్పు డడిగినంత నిచ్చితేని
యంతరంగసీమ నదియ బ్రహ్మాండంబు
గాఁ దలంచి ముదముఁ గాంతు నధిప॥ 175

వ॥ అని పలికిన నౌఁగాక యని బలి యొడంబడిన యా సమయంబున శుక్రునిచేత నితండు వటుమాత్రుండు గాడనియును మాయావేషంబున వచ్చిన విష్ణుం డనియును నితండు నీ యడుగున ముజ్జగంబులాక్రమించి యింద్రుని నిలుపు ననియును సర్వస్వహరణవేళయం దసత్యంబునం బాపంబు లే దితనిం ద్రోసిపుచ్చుట కర్జం బనియును బహుప్రకారంబులం దెలుపంబడినవాఁడై యిట్లనియె. 176

ఉ॥ బ్రాహ్మణమాత్రుఁడై నఁ గడు భాగ్యముఁ జేసితిఁ గాక నా పర
బ్రహ్మమె యర్థియైన నిఁకఁ బల్కెడి దేమి యతండు రాజ్యముం
జిహ్మత నాక్రమించు ననిచెప్పితి వైన నసత్యవాణి యా
[1]బ్రహ్మవిదీశ! నారసనఁ బట్టదు చెప్పకు మింక నేమియున్॥ 177

కం॥ అని యిట్లు తనదు వచనము
వినక పలుకు బలికిఁ గ్రోధవివశుఁడు శుక్రుం
డనతిచిరము([2]నఁ బదభ్రంశ)
శన మగు నని దైవవశత శాపం బొసఁగెన్॥ 178

1. బ్రహ్మవిధీశ 2. నం బదభ్రం.

వ॥ ఇవ్విధంబున శాపంబు నొందియు సంతాపం బెఱుంగక వైరోచని సంధ్యావళికరకమలకనక కలశోదకంబుల వామనపదప్రక్షాళనంబు సేసి, 179

మ॥ అమితబ్రహ్మరహస్యమార్గగమనాయాసక్తిమచ్చేతసే
విమలాచారజుషే పదత్రయమితోర్వీం విష్ణురూపాయ తు
భ్యమహం సంప్రదదే నమో న మమ నిత్యప్రీతిరస్త్వంచు ని
స్తముఁడై గ్రక్కున ధారవోసె బలి యుత్సాహంబు సంధిల్లగన్॥

కం॥ వైరోచనిదానాంభో
ధార హరి ప్రతిగ్రహించుతఱి దివి వాది
త్రారావపుష్పవర్షము
లారూఢి నొనర్చి పొగడి రమరులు వేడ్కన్॥ 181

కం॥ చండాంశుసహస్రద్యుతి
నిండార నొకింత యింత నిక్కుచు నాఖ
ర్వుం డరుదుగఁ బెరిగెం బ్ర
హ్మాండోపరిభాగ ముత్తమాంగము మోవన్॥ 182

తే॥ దిక్కులం దానయై కడు బిక్కటిలుచు
సకలజగదాత్మకుండైన జలజనాభుఁ
డంఘ్రి నొక్కట ధరయెల్ల నాక్రమించి
కప్పె నడుగున నొక్కట గగనతలము॥ 183

మ॥ తనలోకంబున కేఁగుదెంచిన యుపేంద్రశ్రీపదాంభోజమున్
వనజాతాసనుఁ డాత్మశోభనకమండల్వంబుపూరంబుచే
ఘనభక్తిం జలకంబు సేసె విధితో గంగాదు లర్చించి వం
దనముల్ చేసి నుతించె గంగ నడఁచెం దత్పాదతీర్థంబులన్॥ 184

వ॥ అంత త్రివిక్రముండు పూర్వక్రమంబున వామనుం డయి నిలిచి బలిం బిలిచి కపటకోపంబున, 185

తే॥ ధారవోసితి గద పదత్రయమిత్తో ర్వి
యందు మిన్నును మన్ను రెం డడుగు లయ్యె
నింక నొకపదంబునకుఁ జో టెట్టు చూప
వలయుఁ గాకున్న నన్నృతాఘ మొలయు నిపుడు॥ 186

వ॥ అంత పలుకునంత బద్ధుండైన బలి యాం సర్వేశ్వరుం జూచి దేవా ! నీవు పరమపురుషుండవు. ప్రమత్తాధ్యాత్మిక నవవిధ సంసార ప్రవర్తకుండ(?)వనంతకోటి బ్రహ్మాండ నాయకుండవు. సాక్షాత్కారంబున నీకు దానంబు సేయం గలిగిన సౌభాగ్యం బసాధారణంబు. నీవు ఘటించిన నేమి యగు. నీ వకారణబంధుఁడవు. నీవే దయఁ దలంప మా తాతయైన ప్రహ్లాదుండు నీకుఁ గూర్చినభక్తుండు గాఁడే. నీ తృతీయపదంబు మదీయ శిరంబుమీఁద ననుగ్రహింపు మని పలికినంత పితామహుండును బ్రహ్లాదుండును సనుదెంచి యవ్వామనునకుం బ్రణామంబులు సేసి, 187

చం॥ కలగక వేడినట్టిగతి గల్గినయంతయు నీకు నిచ్చె స
త్ఫలదుఁడవైన నీవె యిట దానము భక్తి ప్రతిగ్రహించి తీ
బలి యిఁక బంధనంబునకుఁ బాత్రుఁడె యీతనికాంతయో మహా
బల పతిభిక్ష పెట్టు మని పల్కెడు నీకృప నిల్వఁగాఁ దగుఁగా॥ 188

చం॥ అనవుడు నమ్మహామహుని కాపద వచ్చినవేళ చిత్త మే
యనువున నుండునో యనుచు నారయ పూనిక నిట్లు చేసితిఁ
గనఁబడఁ జేసె ధైర్యగుణ గౌరవ మంతయు నింక నిట్టి స
జ్జనుఁడు జగత్త్రయిం గలఁడె సత్యతరంబుగ నిచ్చ మెచ్చితిఁ॥ 189

తే॥ ఇతని సావర్ణిమనువేళ నింద్రపదవి
యందు నిలిపెద నీతఁడు నంత దనుజ
స్వజనసంగతుఁ డగుచు రసాతలంబుఁ
జేరి యుండును నచ్చోట రక్షింతు నేన॥ 190

చం॥ అని దయ నానతిచ్చి జలజాక్షుఁడు బంధవిముక్తి సేయుఁడున్
దనుజవరేణ్యుఁ డవ్విభుపదంబు శిరంబునయున్ ధరించి లో
చనముల శీతలాశ్రువులు జారఁ దనూలత రోమహర్షమున్
అనువుపడంగఁ దాల్చి ప్రముదాద్వయసౌఖ్యనిమగ్నభావమున్॥ 191

ఉ॥ ఆదిమపూరుషుండు నపుడా బలి నెంతయు నాదరించి ప్ర
హ్లాదునిఁ జేరి యో శుభగుణాకర! నీవును నీకుఁ గల్గు దా
యాదులతో రసాతలమునందు వసింపుము నేను మీకు నా
హ్లాదము పుట్టునట్టి గతి నచ్చట నెప్పుడు నిల్చి యుండెదన్॥ 192

సీ॥ అని పంపుటయును మహాప్రసాదం బని
ప్రహ్లాదుఁ డప్పుడు బలియుఁ దాను
కలిగిన బంధువర్గంబుఁ గూడి రసాత
లమునకు నొక్క బిలంబు పట్టి
చనియె వామనుఁడు నచ్చట శుక్రుఁ జూచి యు
ద్ధ్వరశేష మీడేర్చ వలదె యనిన
నతఁడు నో దేవ! నీ వరుదెంచినప్పుడ
ఫలియించెఁ గ్రతు వని ప్రస్తుతించె

తే॥ నదితియును గశ్యపుఁడు వచ్చి యభినుతింప
వారిముందర వేడ్క నవ్వనజభవుఁడు
వ్రతములకు శోభనములకు వామనుండె
కర్త యని నియమించెఁ దత్కరుణ కలిమి॥ 193

తే॥ త్రిదివరాజ్యంబు క్రమ్మఱఁ ద్రిదశపతికి
నొసఁగె వామనుఁ డమరు ల([1]హో యనంగ)
తెలివితో నన్నముచ్చటఁ దీర్చునట్టి
వాఁడు తమ్ముఁడై యిష్టదైవమ్ము గాఁగ॥ 194

వ॥ ఇవ్విధంబున ధర్మకృత్యంబు నిర్వర్తించిన వాసుదేవుని దేవేం
ద్రాదులు దేవయానంబున నిడుకొని యమరావతికి నేగిరి. బ్రహ్మాదులు
నిజనివాసంబులకుం జని రని చెప్పి శుకుండు, 195

కం॥ ఈవామనావతారము
[1]హావిభవమ్ము వినినయట్టి యనఘుఁడు ధర్మ
[2](ప్రావణో(య))జ్జ్వలవృత్తియు
శ్రీవృద్ధుల నొందుఁ జతురశుభమతిఁ బాదలుఁ॥ 196

వ॥ అని పలికినప్పుడు, 197

## సత్యవ్రతోపాఖ్యానము

తే॥ దానవాంతకుఁ డెబ్భంగి మీన మయ్యె
నేమి యొనరించె జలధిలో నెట్లు దిరిగె
నని [3]బుభుత్సఁ ద న్నడిగిన యాత్తరేయుఁ
బలికెఁ గ్రమ్మఱ [4](వై యాసి) భాసురముగ॥ 198

సీ॥ ద్రవిళేశ్వరుండు సత్యవ్రతాహ్వయుఁ డిప్పు
డరిగిన దివసకల్పాంతవేళఁ
గడునొప్పు కృతమాలికానదీతటమున
[5](నబ్భక్తుఁడై) హరి కర్పితముగ
నురుశక్తిఁ దపము సేయుచు నుండి యొక్క నా
డయ్యేటఁ దర్పణం బాచరించు
తఱి నొక్క మీనపోతంబు దోయిటఁ దగు
ల్పడినఁ గన్గొని నీటఁ బడగ విడచి

1. హా యనంగ. 2. ప్రావణో. 3. లుభుత్సందన్నడిగిన.
4. వైయ్యాసి. 5. న భక్తుండై.

తే॥ జాలికులు పెద్దమీలును జంపకుండ
వేగ రక్షింపు మన్నల విడిచి తిముల
ననుచుఁ దదోద్బోధితుండయి యప్పుడు దాని
దనదు కుండికాజలములోఁ గొనుచు నరిగి ॥ 199

వ॥ మఱియును,

సీ॥ ఈ కుండి నాకుండ నిమ్ము సాల దనంగ
నొక మహాఘటములో నొనరఁ బెట్టి
యిదియు నామేనికి నిరుకటం బనుటయు
నొక చెఱువునందుగున నుండఁ జేసి
యిదియుఁ గొంచెంబు నా పొదలిక కనుటయు
నొక హ్రదంబున నిడి యూరడించి
యిదియు నాతనువున కిపుడు చాలదు చూడు
మనుటయు నంభోధియందు విడచె
తే॥ ఇందు జలజంతువులు దిను నేమి విడచి
తనుచు యోజనమాత్రదేహమునఁ జెలఁగు
నమ్మహామీనమును జూచి యవ్విభుండు
దెలిసి యిట్లను బ్రార్థనాంజలి యొనర్చి ॥ 200

## మీ నా వ తా ర ము

శా॥ దేవా నీదు మహాత్త్వముం దెలిసి వర్ణింపంగ నే నెవ్వఁడన్
నీవే యోజనమాత్రమూర్తిఁ [1](బొడవై) నే చూడఁగా నాఁడింత తే
జోవృద్ధిం గనుపట్టి తీ విభవ మెచ్చోఁ గాన లోకంబులం
గావం బుట్టిన చక్రి వీవ యగుటం గాంచితి నందియుం, జేటికిన్ ॥ 201

1. బొడవైన.

కం॥ భువి ధర్మస్థాపనకై
యవతారము లమరుచుండ నచ్యుత నీ కీ
యవతార మెట్టిపనికై
యవహితమతి నమరఁ దెలుపుమా యిపుడు దయన్॥ 202

సీ॥ అనుటయు నమ్మీన మపుడు సత్యవ్రతుఁ
గనుగొని యో మహీకాంత యింక
దివసంబు లే డరుదెంచు నంత పయోజ
భవునకు మితమగు పగలు సెల్లు
నవధు లప్పుడు భూర్భువస్స్వర్భువనముల
ముంచు నత్తఱి నీవు మించునట్టి
యొక యోడపైఁ గల్గు నోషధీప్రతతుల
మునియుక్తముగ నిల్పుకొని కడంక
తే॥ నన్ను దలఁపు మే నప్పు డాసన్నవర్తి
నగుచుఁ బొడసూపి యా ప్రళయాబ్ధిలోన
నోడపై నెక్కియున్న ని న్నోడకుండ
సకలగతులఁ గాపాడుచు సంచరింతు॥ 203

ఉ॥ ఆ వనరాశి నీ కొక మహాహి గనంబడు దానిచేత నా
నావ మదీయదంష్ట్రజతనంబుగఁ గట్టుము నీకుఁ దోడుగాఁ
జేవఁ జరింతు నట్టి పెనుజీకటియందు సరోజభూప్రభా
తావధిఁ గాగ నొండొక ప్రయత్నము గల్గదు నాకు నయ్యెడన్॥ 204

ఆ॥ అనుచుఁ దెలియఁ బలికి హరి యదృశ్యుండయ్యె
ద్రవిళపతియుఁ గడు ముదంబు నొంది
దర్భశయ్య విష్ణుఁ దలఁపుచు నవ్వేళ
కెదురు సూచు తమి వహించి యుండెన్॥ 205

వ॥ అంతఁ బరమేష్ఠికి దినావసానం బగుటయుఁ బ్రళయమేఘ వర్షంబు లుత్కర్షంబు నొంది సముద్రంబు లముద్రంబులై వచ్చుతఱి సత్యవ్రతుండు హరిస్మరణసమాగతంబైన యొక్క పెను నావమీఁద నోషధిబీజంబుల మునియుక్తంబుగా నిలిపి తాను నం దధిరోహించియుండు నంత సర్వేశ్వరుండును లక్షయోజనవిస్తారఘోరంబగు మీనశరీరంబుఁ ధరియించి పొడసూపుటయు, నబ్జాపతి చేరువం జేరవచ్చిన యొక్క మహా[1](నాగంబు)చేత నన్నావఁ దద్దంష్ట్రాటంకంబున [2](లంకించి) యనేక విధంబుల నద్దేవుని నభినుతించుటయు నతండును సత్యవ్రతునకు సాంఖ్య యోగంబుల నుపదేశించుచుం జరియించె నంత, 206

ఉ॥ ఆ వనజాసనుండు నిశయైనతఱిఁ బరిశయ్యమీఁద ని
ద్రావిలచిత్తుఁడై పొఱలునత్తఱిఁ దన్ముఖ[3](వర్తియైన) వే
దావళిఁ జోరతం గొనుచు నంబుధి సొచ్చిన యుద్ధతున్ హయ
గ్రీవునిఁ ద్రుంచె మీనపతి క్రీడ నె తన్నిగమావనార్థియై॥ 207

ఉ॥ అంత నహఃప్రమాణనిశ యంతయుఁ బోవఁ బ్రభాతవేళ ని
ద్రాంతము నొందు నల్వకు రమాధిపుఁ డానిగమంబులం గడున్
సంతస మొప్ప నిచ్చె మునిసన్నుతుఁ డా ద్రవిళేశ్వరుండు ని
ష్క్రాంతజలోర్విపై నిలిపెఁ గ్రమ్మఱఁ నోషధి[4](రాజ)రాసులన్॥

తే॥ మీనమై జలరాశిలో మౌనివినుతుఁ
డగుచు ద్రవిళేశ్వరునకుఁ బ్రహ్మంబుఁ దెలిపె
వేదములు నల్వ కొసఁగిన విష్ణుమహిమ
వినినఁ జదివిన జనుఁ డొందు విపుల శుభము॥ 209

కం॥ మతిమంతుం డా సత్య
వ్రతుఁ డచ్యుతుకరుణఁ జేసి వనజాప్తునకున్
సుతుఁడై మెఱయుచు వైవ
స్వతుఁ డన నిపు డున్నవాఁడు సప్తమమనువై॥ 210

1. రాగంబు. 2. లెక్కించి. 3. వృత్తియయిన. 4. రాజి.

వ॥ అతఁడు సూర్యవంశంబునకుఁ బెద్ద, యతనివలన నిక్ష్వాకు ప్రముఖులు జనించి రిది యష్టమస్కంధకథావిశేషంబులు. 211

రాజవంశకీర్తనము

కం॥ అనుటయు నావైవస్వత
మనువంశక్రమము లెల్ల మాది ముద్ద మొదవన్
వినవలయుఁ దెలుపఁదగునని
జననాయకుతోడ యోగిచంద్రుం డనియెన్॥ 212

మ॥ తగునే యెట్టి సుబుద్ధికైన మనుసంతానంబు సర్వంబు నో
ప్పుగ వర్ణించెద నంచుఁ [1](బలుకన్)బోలున్ ఫణిస్వామికిన్
మిగులం జిత్రపథంబునం దెలిపెదన్ నీ కందులోఁ గొందఱన్
భగవద్భాగవతప్రసాదకలనన్ బ్రఖ్యాతులౌ ముఖ్యులన్॥ 213

తే॥ విష్ణుపాక్కి‌ఁటితమ్ము నవ్విధి జనించె
నతనికి మరీచి గలిగెఁ గశ్యపుఁ డతనికి
నదితియం దుద[2](యించెను సర్కుఁ డతని
వర)సుతుఁడు చెప్పఁబడిన వైవస్వతుండు॥ 214

కం॥ ఆ వైవస్వతమనువు ప్ర
జారహితుం డగుచు నుండి సంతతికై మి
త్రావరుణులఁ గూర్చి వసి
[3](ష్ఠావేదితసరణి నొక్క) యాగము సేసెన్॥ 215

చం॥ పలుమరు నందుఁ జేరి మనుభామిని పుత్రికఁ గోరి తెల్పఁ న
ట్లలవడు గాత వేగ మన హవ్యము వేలుచు హోత ప్రాణియుం
దిల యను నొక్కకన్య జనియించిన డోయుచు నా నృపాలకుం
డలఘువసిష్ఠుఁ జేరి యనఘా! యిది యేమి యటంచు దూరినన్॥

1. (.........) 2. యించె నర్కుఁ డతనికివర. 3. ష్ఠాదితసరణి నొక్క.

తే॥ నీ సతీమణి దుర్బుద్ధిఁ జేసి హోత
యట్టి పని చేసె నిఁక నేమి యనఁగ వచ్చు
నా తపశ్శక్తిచేతఁ గన్యకనె పుత్త్రుఁ
జేసి యిచ్చెద ననుచు వసిష్ఠుఁ డలరి॥ 217

## సు ద్యు మ్న చ రి త ము

కం॥ అనుపమనియతిఁ దపము సే
సిన హరి యమహాత్మునికోర్కె సిద్ధము సేసెన్
మనుపుత్త్రియు సుద్యుమ్నుం
డనుకొమరుం డయ్యె జనుల కాశ్చర్యముగన్॥ 218

సీ॥ హరుఁడు ము న్హైమాచలాత్మజ నపవస్త్రఁ
దొడలపై నిడుకొని కడుఁ బ్రియంబు
లాడుచుఁ గరగించునత్తఱిఁ దను గొల్వఁ
దాపసు లెల్లఁ దాత్పర్యనిష్ఠఁ
జతురతఁ గనుగొని సమయంబు గాదని
తరలి పోవుటయు మాధవుఁ డెఱింగి
యిది మొద లివ్వనం బెవ్వఁడు సొచ్చిన
నబల యయ్యెడు నని యానతిచ్చె
తే॥ నట్టి యా వనమునకు సైన్యములతో మ
నూత్తమసుతుండు సుద్యుమ్నుఁ డొక్కనాడు
వేటలాడుచు నేఁగి తా వెలఁది యయ్యె
భటులు [1](సఖులైరి) హయమును బడబ యయ్యె॥ 219

1 సతులైరి.

ఆ॥ అచట సింధుతనయుఁడగు బుధుం డా రాచ
మగువ మదనకేళిఁ దగులుటయును
వార లిరువురకుఁ బురూరవుం డను పట్టి
కలిగెఁ జంద్రవంశకర్త యతఁడు॥ 220

వ॥ ఇట్లు చరియించుచు సుద్యుమ్నుం డొక్క నాఁడు తనకుం బ్రాప్తంబైన నారీత్వంబునకు దుఃఖించి నిజగురుండగు వసిష్ఠుఁ దలంచిన నతండుఁ దపోనియమారాధితుండైన హరునివలన నమ్మనుపుత్రునకు నొక్క మాసంబు స్త్రీత్వంబును నొక్క మాసంబు పురుషత్వంబును గలుగునట్టి వరంబు వడసి తోడితెచ్చిన సుద్యుమ్నుండు గొంత కాలంబుఁ జేసి, [1](యుత్కలుండును), గయుండును, విమలుండును నను పుత్రత్రయంబునకు దక్షిణదేశాధిపత్యం బొసంగి ప్రతిష్ఠానపురంబునం బురూరవుని నిలిపి వనంబునకు నరిగె నంత, 221

తే॥ ఆత్మజుఁడు పోవుటయు మను వాత్మఁ గలఁగి
హరిగుఱించి పుత్రార్థియై యమునలోనఁ
దపముఁ గావించి తత్ప్రసాదమునఁ జేసి
ముదముతోఁ గాంచె మఱియును బదురు సుతుల॥ 222

## ఇక్ష్వాకుప్రముఖజననము

వ॥ ఇక్ష్వాకుండు, నృగుండు, శర్యాతి, దిష్టుండు, ధృష్టుండు, కరూషుండు, [2](నరిష్యంతుఁడు); [3](వృషధ్రుండు), [4](నభగుండు), కవి యను పేళ్ళుగల వారలలో వృషధ్రుండు గురుహోమధేనువును వధించి యతనిశాపంబున శూద్రత్వంబు నొందె, కవి యనునతండు ప్రసన్నుండై హరిం జేరె. కరూషునకుం గారూషకు లనం గలిగి విప్రత్వంబు నొందిరి.

1. వుల్కలుండును. 2. నరిష్యంతి. 3. వృషదుండు; 4. నభవుండు.

ధృష్టునివలన [1](ధార్టులు) గలిగిరి. వారలును బ్రాహ్మణులైరి. నృగునికి భూతజ్యోతిరాదులు పుట్టిరి. నరిష్యంతునకు ద్వాదశుండైన యగ్నివేశ్యునినుండి యాగ్నివైశ్యాయనం బన బ్రహ్మకులం బయ్యె నింక [2](దిష్టుని) సంతానక్రమంబు వివరించెద. 223

తే॥ [3](దిష్టజుఁడు వైశ్యకన్యయం దిష్టుఁ డగుచు
వైశ్యుఁ డయ్యెను నాభాగవరసుతుండు
తత్సుతుఁడు హాలందనుఁడును వత్సప్రీతి
తత్సుతుఁడు, ప్రాంశుఁ డతని కాతనికిఁ బ్రమితి)॥ 224

## మరుత్తాది చరిత్రములు

సీ॥ ప్రమితికిఁ బుత్రుఁడై పరఁగె [4](ఖమిత్రుఁడా)
తనికిఁ దనూజుఁడై తనరెఁ జాక్షు
షుండాతనికి [5](వివింశుం) డాతనికి రంభుఁ
డతనికి ఖనినేత్రుఁ డా ఘనునకు
సుతుఁడు కరంధముం డతని కవీక్షితుం
డతనిసూనుఁడు మరుత్తాహ్వయుండు
శాలాదికములు కాంచనమయములుగఁ బె
క్క-ధ్వరంబు లొనర్చె నా మహాత్ముఁ
తే॥ డతనికులమున నధముఁడై నట్టి బంధుఁ
డధికుఁ దృణబిందు నిలబిల యను సుపుత్రిఁ
గాంచె తృణబిందుకులమునఁ గలుఁగువారు
ప్రథ వహించిరి [6](వైశాలరాజు) లనఁగ॥ 225

1. ధార్షులు. 2. ధృష్టుని. 3. ధష్టునకు వైశ్యకన్యం బరిగ్రహించి వైశ్యుఁడయి నాభాగవరసుతుండు। తత్సుతుఁడు నలధుండు వత్సద్రి యతని కొనరె ప్రాంశు డా విభున కాతనికి బ్రమితి ॥. 4. జనిత్రుఁ డా. 5. వివిశుండు. 6. పాంచాల.

వ॥ ఇంక శర్యాతిచరిత్రంబు సెప్పెద. 226

సీ॥ శర్యాతి యానర్తసంజ్ఞ మించిన యొక్క-
యాత్మజన్ముని సుకన్యాఖ్యయైన
కన్నియ నొక్కర్తుఁ గాంచె నయ్యింతి భా
ర్గవుఁ[1](డైన చ్యవనున) కువిద యయ్యె
ఆనర్తుఁ డబ్ధిమధ్యమునఁ గుశస్థలి
యను పురి నిర్మించి యందు నిలిచి
[2](తెలివితో) నానర్తదేశ మేలుచు నుండి
కనియె రేవుం డను తనయు నొకని

తే॥ రేవునకునుఁ బుత్రశతంబు ప్రియము మీఱఁ
గలిగె నందుఁ గకుద్మి యగ్రజుఁ డతండు
తనదుపుత్రి రేవతినిఁ దోడ్కొనుచుఁ గార్య
పరత బ్రహ్మలోకమునకు నరిగి యచట॥ 227

తే॥ నలువ గాంధర్వగోష్ఠి నుండగ నొకింత
సేపు నిలుచుండి పొడగని చిన్నిపాపఁ
జూపి దీనికి నే మహీశుండు ప్రాణ
విభుఁడు గాఁగలం డని విన్నవించుటయును॥ 228

ఉ॥ ఓ మహినాథ! నీ విచట నున్నక్షణంబున సక్రమంబుగా
నా [3](మహా సప్తవింశతి)మహాయుగముల్ చరియించె బిడ్డకై
నీమదినున్నయట్టి ధరణీపతు లందరుఁ బోయి రింకఁ ద
న్నామములున్ వినంబడవు నాశముఁ బొందిరి తత్కులీనులున్॥ 229

చ॥ ధరణిభరంబు వాపెడుమతంబుఁ దలంచి పురాణపూరుషుం
డరుదుగ యాదవాన్వయమునందు జనించినవాఁడు రాముఁడై
నరవర పెండ్లియాడ్పు మిఁక నందని నందముగాగ నా గుణా
కరునకు వేగఁ బొమ్మనుచుఁ గ్రక్కునఁ దెల్పి విరించి యంపినన్॥ 230

1. డయిన వైవసువున. 2. తెలివొందు. 3. మహిమంబు.

వ॥ మహీతలంబునకు వచ్చి యాకకుద్మి కృష్ణుండు రాజుగాఁ గుశస్థలి ద్వారక యను పురిగ వర్తిల్లు యాదవులం జూచి బలభద్రునకు రేవతి నొసంగి వనంబునకుం జనియె. మఱియు నభగుండను మనుజపతి నాభాగునిం గనుంగొనియె నతనికి నంబరీషుండు పుట్టె నతండు, 231

## అ ం బ రీ ష క థ

కం॥ శ్రీదయితున కర్పణముగ
నాదరమున సెలగఁ బెక్కు యజ్ఞములు వసి
ష్ఠాదులు మెచ్చగఁ జేసెఁ
బాదుకొనిన తెలివిఁ బరమభాగవతుండై ॥ 232

సీ॥ ఆ యంబరీషుండు హరిఁగూర్చి తా నొక్క
వర్ష మేకాదశీవ్రతము సల్పె
కార్తికమాసశుక్లద్వాదశీతిథిఁ
గాళిందితటమునఁ గలుగు మధువ
నంబునఁ గడుభక్తి [1](నారాయణునిఁ) బెక్కు
విధములఁ బూజించి విప్రవరుల
కంచితశ్రేష్ఠగోన్యర్బుదషట్కంబు
నొసఁగి మహోత్సవం బొనరఁ జేసె
తే॥ మునులకుఁ జతుర్విధాహారముల నొసంగి
తాను బారణ సేయంగఁ దలఁచువేళ
వచ్చె దూర్వాసుఁ డను ఋషివరుఁడు తెలిసి
క్రోధనుండైన దివ్యతపోధనుండు ॥ 233

1. వాసుదేవుని..

ఉ॥ వచ్చిన నంబరీషుఁడును వందనపూర్వముగాఁగఁ బూజ మె
న్నిచ్చి ప్రియంబు లాడి తనయింట భుజింపఁగ వేఁడుకొన్న నా
సచ్చరితుండు నియ్యకొని స్నానము సేతకు యామునాంబువుల్
చొచ్చి మునింగి లో నరుగఁజూపున బ్రహ్మముఁ జూచుచుండఁగన్ ॥

తే॥ ద్వాదశియు నింక నొక్క ముహూర్తంబు చిక్కె
నతిథి రాక పారణయుఁ జేయంగఁ గూడ
దేమి సేయుదు నను నమ్మహీశుతోడ
మునులు జలపారణావిధి ముఖ్య మనిరి ॥ 235

కం॥ అనుటయు నగుఁగా కని య
జ్జనపతిచంద్రుం డొనర్చె జలపారణ, య
మ్మునియు నరుదెంచి యతనిం
గనుఁగొని యా భావ మెఱింగి కడుకుపితుండై ॥ 236

తే॥ మానవులార ! చూచితిరె దుర్మానుఁడైన
యీతఁ డే నుండఁ బారణ యెట్లు సేసె
నైనఁ గానిందు చూడుఁడీ యనుచు నొక్క
జడ పెఱికివేయఁ గృత్యయై నడిచె నదియు ॥ 237

సీ॥ అంతలో లక్ష్మీశుఁ డమ్మునికోపంబుఁ
జక్కఁ బెట్టఁగ సుదర్శనము ననుప
నదియున్ను బ్రళయకాలార్కసన్నిభమయి
చనుదెంచి కృత్యను సంహరించి
మునిమీఁదఁ గవిసిన ముని కీలవీడితుఁ
డై పరువిడుచు దో నరుగుదెంచు
ఘోరచక్రంబు నివారించుటకుఁ బద్మ
భవ శంకరులఁ జేరి ప్రణుతి సేసి

తే॥ వార లీపని తమచేతఁ దీర దనిన
వేగ వైకుంఠపురిఁ జొచ్చి విష్ణుఁ జేరి
యశరణశరణ్య! నను నిట్టి యార్తిఁ గావు
మనుచు మొఱలిడుటను జూచి యవ్విభుండు॥ 238

కం॥ తనకంటెను మాన్యులు భువిఁ
దనదాసు లటంచు దెలుపు తలఁపున నీకీ
పని యంబరీషు వేడిన
ననఘుఁ డతఁడు దక్కఁబెట్టు నని దయఁ బలికెన్॥ 239

ఆ॥ పలుకుటయును మౌని పరతెంచి యంబరీ
షునిపదములు పట్టుకొని యనేక
దైన్యభావ లాడ దయ పుట్టి యతఁడు చ
క్రంబుఁ జెక్కగతులఁ బ్రస్తుతించె॥ 240

సీ॥ రాహుసంహననశిరస్సంధిబంధవి
చ్ఛేదనకార్యప్రసిద్ధమహిమ
గజపదగ్రాహినక్రప్రాణవాతాను
భూతిసందర్శితభోగిభావ
గర్వితానేకరక్షఃకంఠపీఠస్ర
వచ్ఛోణితౌఘబిందుచ్ఛటాంక
చంద్రాగ్నిరవిభావజగదుపకర్తృతా
సంభావితాత్మతేజఃప్రసార

తే॥ జ్వలదరానలసాత్కృతశత్రు[1](నికర)
ప్రణుతమతస్స్వామిహరిహస్తపద్మనిలయ
దాసజననిత్యకల్యాణదానశౌండ
మమ్ము బ్రోవుము శ్రీచక్ర [2](మథితవక్ర)॥ 241

1. నగర. 2. మథిత.

తే॥ హరికి నే నిజదాసుఁడ నగుదు నేని
కరుణ నామీఁద నీకును గల్గె నేని
నన్ను జూచి యీమునిఁ గాచి నాథుకడకు
మఱల విజయంబు సేయు సమ్మతి యొనర్చ॥ 242

వ॥ అని విన్నవించి నమస్కరించినఁ జక్రంబు మఱల విజయంబు సేసె. దూర్వాసమునీంద్రుండును మఱలి నాకి విడిచినయట్లయి నీవు భగవద్భక్తుండవు, నీమహాత్మ్యం బెఱుంగక చేసకితి నని యంబరీషుని వినుతించి యతండు పెట్టించిన యన్నం బారగించి యథేచ్ఛం జనియె నట్టి యంబరీషునికి విరూపుండు, విరూపునికిఁ బృషదశ్వం డతనికి రథీతరుం డతని నుండి కలుగువారలు రథీతరగోత్రులు నాంగీరసులు నన బ్రాహ్మణులై రవ్విధంబునఁ దొమ్మండ్రు మనుపుత్రుల సంతతు లుదాహరించితి నింక నిక్ష్వాకుని సంతానక్రమంబులు వివరించెద. 243

ఇ క్ష్వా కు స ం త తి క్ర మ ము

తే॥ మనుసుతుండైన యిక్ష్వాకుమనుజపతికి
నాత్మజులు నూర్గు రుదయించి రందులో వి
కుక్షియు నిమియు నుద్దండకుండు నాఁగ
పెద్దలై మువ్వు రేగిరి పృథులయశులు॥ 244

వ॥ అందు వికుక్షియొక్క నాఁడు పితృనియుక్తుండై పితృకార్యార్థంబు మాంసంబుఁ దేర నడవికిఁ జని స్వభక్షితావశిష్టశశమాంసంబుఁ దెచ్చుటం జేసి శశాదుం డను పేర నయోధ్యాపతి యయ్యె నాతనికి, 245

సీ॥ సుతుఁడు పురంజయుం డతులత నుదయించె
నమరసంప్రార్థితుఁడైన విష్ణుఁ

డతనియొద్దు వసించి యనిలోన వృషరూప
మున నున్న యింద్రుని మూపురంబు
నందుండి దైత్యసంహారంబు సేసి క
కుత్థనామంబున గురుతు పడియె
నతనిపేరునఁ దత్కులావనీపతులకు
కాకుత్థ్సు లను రూఢి గలిగె ధాత్రి
తే॥ నతనికిని నేనుఁ డయ్యె నేనాభిధాన
విభునకుఁ బృథుండు పృథునకు విశ్వగంధి
విశ్వగంధికిఁ జంద్రుండు వెలయు నట్టి
చంద్రునకు యవనాశ్వుఁడు సంభవించె॥ 246

కం॥ అతనికి [1](శావస్తుఁ) డనఁగ
సుతుఁ డాతఁడు తనదు పేర శుభమగు పురముఁ
క్షితి నిలిపెను బృహదశ్వుం
డతనికి నాతండు కువలయాశ్వునిఁ గనియెఁ॥ 247

కం॥ [2](వడి నతఁడు) పుత్రయుతుఁడై
కడలిదరి నుదంకమునికిఁ గడుహర్షముఁ జొ
ప్పడ దుందుభుఁ డను దానవు
మడియించె వహించె [3](దుందుమారాహ్వయముఁ)॥ 248

తే॥ అతనికి దృఢాశ్వుఁ డతఁడు హర్యశ్వుఁ గనియె
తనయుఁడు నికుంభుఁ డతని కాతఁకి బర్హ
ణాశ్వుఁడు కృశాశ్వుఁ డతనికి నాతనికిని
[4](సేనజిత్తయ్యె) యువనాశ్వుఁ డా నృపునకు॥ 249

---

1. శాభక్తి. 2. పట్టి నతడు. 3. దుందుమారాఖ్యాయముఁ,
4. ప్రసేనజిత్తయ్యె.

## మాంధాతృ, హరిశ్చంద్ర, సగర, భగీరథాదుల వృత్తాంతము

సీ॥ అతఁడు సంతానార్థ మింద్రయాగము సేయు
నప్పుడు దివ్యమంత్రాభిమంత్రి
తంబైన తనపత్నిఁ ద్రావింప మునులు గూ
ర్చినకలశాంబువుల్ జనితతృష్ణుఁ
డై రాత్రి వేఁడుఁగఁగ చేరి త్రావుటయుఁ ద
త్కుక్షిఁ జించుక యొక్క కొడుకు పుట్టె
అతని కింద్రుండు నిజాంగుష్ఠమూన్యంబు
నం దిడి త్రావించినందుకతనఁ
తే॥ బ్రేమ మాంధాత యనియెడి పేరు పెట్టె
కరుణ తజ్జనకుని బ్రతుకంగఁ జేసె
నతఁడు సూర్యోదయాస్తమయ²(ములపట్లు)
కడలుగా నేలె ధరణి విక్రమము పేర్మి। 250

వ॥ మఱియు నతండు వరుణాదుల జయించి శతబిందుపుత్రికం బిందుమతిం జేపట్టి యశ్వమేధరాజసూయాదిమహాధ్వరంబు లొనర్చి ప్రసిద్ధుఁ డయ్యె నతనికి నంబరీష పురుకుత్స ముచికుందు లను కొడుకులు ముగ్గురుఁ, గూతు లేబండ్రుం గలిగి రక్కన్నియల సౌభరి యను ముని పరిగ్రహించె నం దంబరీషుని సంతతి విప్రత్వంబు నొందె ముచికుందుండు యోగి యయ్యెఁ బురుకుత్సుని తరువాతఁ గ్రమంబునఁ ద్రసదస్యుండును నసరణ్యుండును, హర్యశ్వుండును, నరుణుండును, త్రిబంధనుండును సత్యవ్రతుండును త్రిశంకుఁడును హరిశ్చంద్రుండును నయోధ్యాపతు లై రందు, 251

1. పై యింద్రయాగము సేయునప్పుడు. 2. ములను పట్టు.

చం॥ గురువు శపింప నంత్యజతఁ గూరు త్రిశంకుని గాధిజుండు త
త్పరతఁ ద్రివిష్టపంబునకుఁ బంపె సురేంద్రనిరస్తుఁడై వడిం
దిరిగి రథంబుతో నరుగుదేరఁగ గన్గొని యమ్మహీశు నం
బరమున నిల్పె నేఁడు నదె పద్మభవాదులు సన్నుతింపఁగన్॥ 252

హ రి శ్చం ద్ర క థ

శా॥ సాంద్రప్రస్ఫురితప్రభావనిధి విశ్వామిత్రుఁ డీష్యార్థ మా
త్మం ద్రాసం బొదవించునంత యగు నర్థం బర్థి నర్థించి యుం
టం దచ్చి్ర హరియించి యంత్యజునిఁ బట్టం జేసినం దా హరి
శ్చంద్రుం డేమరఁ డయ్యె సత్యవచనస్థైర్యంబు ధైర్యంబునన్॥ 253

సీ॥ కొడుకు నిచ్చిన నీకుఁ గొడుకు నే వేల్చెద
నని యొడంబడుటకు నాత్మ మెచ్చి
యా హరిశ్చంద్రున కంబుధీశుండు మే
కొని లోహితుం డను తనయు నిచ్చి
నరమేధయాగ మొనర్పు మం చెడతాఁకఁ
దెలిసి లోహితుఁడు భీతిల్లి గృహము
విడిచి పంచాబ్దంబు లడవిలోఁ దిరిగి యు
త్తము నజీగర్తు మధ్యమతనూజు
తే॥ ఘనశునశ్శేపుఁ దనమారుఁ గని యొసంగ
నమ్మహీపతి వరుణాదులైన సురలఁ
గ్రతువిధిప్రీణితాత్ములుగా నొనర్చెఁ
గౌశికుండు శునశ్శేపుఁ గాంచె నపుడు॥ 254

వ॥ ఆ హరిశ్చంద్రుని సుతుండగు లోహితుని యనంతరంబున హరితుండును, చంపానగరనిర్మాత యగు చంపుండును, సుదేవుండును,

విజయుండును, [1](రురుకుండును), వృకుండును, బాహుకుండును గ్రమం
బున రాజ్యస్థులయి రందు బాహుకుండు, 255

చం॥ యవనశకాదులం గలసి హైహయరాజులు రాజ్య మంతయుఁ
గవిసి హరించి తోలుటయుఁ గానలకుం జని బాహుకుండు కా
లవశత నొంద నవ్విభుకళత్రము వహ్నిఁ జొరంగఁ బూనుచోఁ
బ్రవిశితగర్భ గావునఁ గృపామతి నౌర్వుఁడు మాన్పి నిల్చెనన్॥ 256

## స గ రు ని క థ

ఉ॥ మున్ను సపత్నులోర్వ కతిమూఢత గర్భము వోవునట్లుగా
నన్నముతో విషం బిడిన నందున క్రుందక యున్న సూనుఁ డా
సన్నుతగాత్రికిం గరళసంయుతుఁడై జనియించి యాతఁ డ
భ్యున్నతమైన తేజమున నొప్పఁ గడున్ సగరుం డనన్ భువిన్॥ 257

తే॥ ఔర్వమునియొద్ద సకలవిద్యానిరూఢి
నలరి యా ముని దయఁ బావకాస్త్ర మొసఁగ
సగరుఁ డనివార్యశౌర్యుఁడై జనకరిపుల
హైహయులఁ ద్రుంచెఁ బగతుర నాహవమున॥ 258

వ॥ మఱియు శకయవనతాళజంఘుల హైహయబర్బరాదులఁ ద్రుంప నుద్యోగించి వసిష్ఠనివారితుండై శ్మశ్రువర్జంబుగా శకాధీశుల శిరోముండితులం జేసి [3](యవనతాళజంఘుల) సర్వముండితులుగా నొనర్చి ముక్తకేశులుగా బారదులను సతతశ్మశ్రుధారులగా బర్బరులం గావించి [4](యప్రతీపప్ర)తాపదీప్తుం డయి, 259

---

1. భరతుండును........ 2. కాంభోజకుఁ - సంస్కృతమునఁ గానరాదు. పోతన భాగవతమునందును గానరాదు. 3. (......................).
4. యప్రతిపత్ర.

కం॥ సుమతిం గేశిని నిరువురఁ
బ్రమదల వరియించి వేడ్కఁ బరగెఁ గలిగి రా
సుమతికి నఱువదివేవురు
కొమరులు కేశినికి నొక్క కొమరుఁడు వరుసన్॥ 260

తే॥ ఆ సగరుఁ డశ్వమేధంబు లాచరించు
చుండ నొక యాగమున నింద్రుఁ డోర్వ లేక
సైంధవముఁ గొనిపోయి రసాతలమునఁ
గపిలుజేరువఁ గట్టి తాఁ గడకుఁ దొలఁగి॥ 261

వ॥ అట్టియెడ,

సీ॥ ఆ యశ్వమునకుగా నఱువదివేవురు
సౌమతేయులు గూడి జగతిఁ దిరిగి
యలసి కానగ లేక యందఱు నట రసా
తలము [1](మోవఁగ) మహీతలముఁ ద్రవ్వి
యచ్చోటఁ గపిలుని యఱుత గుఱ్ఱముఁ గాంచి
చిక్కెఁ జోరకుఁ డని చేరి తిగిచి
[2](తద్రోష)దృష్టిచే దగ్ధులై రంతట
సగరుండు వారల జాడఁ దెలియ

తే॥ నాత్మఁ దలపోసి కేశినియాత్మజన్ముఁ
డైన యసమంజసునిపుత్రు నంశుమంతు
ననిపిన నతండు కపిలమహామునీంద్రుఁ
గాంచి వినుతించె భయభక్తికలితుఁ డగుచు॥ 262

వ॥ అట్లు వినుతించిన నంశుమంతునిం గపిలుండు కృపావలోక
నంబులం జూచి, 263

1. వోవఁగ. 2. తద్ఘోష.

ఉ॥ అంశుమదాఖ్య! నీ పితరు లాగతి పోయిరి వీరి కిచ్చటన్
బ్రాంశుతరంగ గంగ పయిఁ బారిన మోక్షము గల్గు దానికిన్
వంశకరుండ వీవ యతనం బొనరించుట యుక్త మంచు ని
స్సంశయవృత్తిఁ బల్కి మఖసైధవముం గృపసేసి యంపినన్॥ 264

మ॥ హయముం దెచ్చి యొసంగి యా సగరుచే యాగంబుఁ జేయించి య
న్వయశోభాకరుఁ డంశుమంతుఁడు వియన్నద్యంబుసంప్లావనా
ప్రియకృత్యంబు పితృవ్రజంబునకు నర్థిం జేయు వాంఛం దపో
నియతుండై యటు సేయ లేక చనియెన్ నిర్వేదఖిన్నాత్ముఁడై॥

కం॥ అంగద దత్తనయుఁడు ఖ
ట్వాంగదిలీపుఁడును దండ్రి యట్లు తపశ్శ
క్తిం గావించి పితలకున్
గంగం బసి గొనగ లేక కడచిరి నృపా॥ 266

భ గీ ర థు ని క థ

చం॥ ప్రథితగుణుండు తత్సుతుఁ డపారభుజాబలశాలియా భగీ
రథుఁడు విధేయమై సకలరాజకముం బనిసేయఁ బేర్మితో
బృథివి భరింపుచుండి తమపెద్దలకై తప మాచరించె ని
[1]ర్వ్యథుఁడయి గంగఁ గూర్చి మది నద్భుత మందుచు మెచ్చె గంగయున్

కం॥ అప్పుడు గంగానదియుం
గుప్పించి ధరిత్రిఁ బడగఁ గ్రుంగక యుండున్
జొప్పడగఁ దాని నిలుపగ
నప్పరమేశ్వరుని వేడు మని పల్కెటయున్॥ 268

1. ర్వ్యథు డయి.

తే॥ వరతపంబుచేఁ బార్వతీవరుని మెచ్చఁ
జేసె నా భగీరథుఁడు విచిత్రలీల
హరుఁడు నంగీకరించె గగాంబుఝరము
శిరమున ధరింతు ననె భక్తవరుఁడు నగుట॥ 269

వ॥ ఆ సమయంబున,

మహాస్రగ్ధర॥

ప్రవహించెం గంగ రంగత్ప్రమథపరివృఢప్రస్ఫురత్తామ్రజూట
త్సవి శేషోత్సంగరంగత్సలిలతటమహోత్సాహసంవర్ధమానా
రవభూవిభ్రష్ట[1](భాగీరథిరభస)పరిభ్రాట్పవిత్రాంబుసేకో
త్సవదాన[2](ప్రీణితాంచత్)సగరనృపసుతస్వర్గసోపానవృత్తిన్॥ 270

సీ॥ ఆ భగీరథునకు నాత్మజుండు శ్రుతుండు
శోభిల్లె శ్రుతునకు నాభవరుఁడు
సుతుఁడు సింధుద్వీపుఁ డతులితుఁ డతనికి
నయుతాయు వతనికి నఖిలవేది
యతనికి నలసఖుం డగు ఋతుపర్ణుండు
సర్వకామాఖ్యుఁ డా సజ్జనునకు
తనయుఁ డాతనికి సుదాసుఁ డాతఁడు గురు
శాపంబుచే రాక్షసత వహించి

తే॥ విప్రుఁ దినినంత నవ్విప్రువెలది, యువతిఁ
జేరకుండఁ శపించిన కారణమున
నతనిసతియగు మదయంతి కాత్మజుండు
కలిగె నశ్మకుఁడు వసిష్ఠువలన నధిప॥ 271

---

1. భాగీరథీరథసథ. 2. ప్రణితాంచత్.

వ॥ ఇట్లు కల్మాషపాదుం డయిన సుదాసునకు క్షేత్రజపుత్రుండై న యశ్మకుండు పరశురామభయంబున నారీపరివృతుండై బ్రతికి నారీకవచుం డనం బరగె నవ్విభునినుండి యెడతెగక క్రమంబున దశరథుండు, విజయుండును, విశ్వసహుండును, దిలీపుండును, దీర్ఘబాహుండును, రఘువు, పృథుశ్రవుండు, నజుండును, దశరథుండును, వంశకరులై రా దశరథునకు విష్ణుండు రాక్షససంహారార్థంబు స్వాంశంబుల రామలక్ష్మణ భరతశత్రుఘ్నుల రూపంబుల నవతరించె దచ్చరిత్రంబు జగద్విదితంబు.

## శ్రీ రా మ చం ద్ర క థ

కం॥ ప్రవిమలగతి శతకోటి
ప్రవిస్తరం బరయ రామభద్రచరిత మం
దవనీశ ! యొక్కవర్ణము
చవిఁ బలికిన ఘోరదురితచయము లణంగున్॥ 273

## న వ ర త్న ము లు

సీ॥ కల్యాణమతి పుత్రకామేష్టి దశరథో
ర్వీపతి యొనరించు వేళయందు
సురలెల్ల రావణాసురబాధ లెఱిఁగింప
హరి వచ్చి కౌసల్యయందు వేడ్క
రామచంద్రుం డయి ప్రభవించె భరతుఁడై
కైకేయి కొదవె చక్రంబు గరిమ
నట సుమిత్రకు శేషుఁ డమర లక్ష్మణుఁ డన
శంఖంబు శత్రుఘ్నసంజ్ఞఁ బుట్టె
తే॥ ఇవ్విధంబునఁ గలిగి తా రిద్ద ఱిద్ద
ఱొక్క జోడై రి ప్రేమంబు పిక్కటిలగ
రామలక్ష్మణు లనియును భూమిజనులు
భరతశత్రుఘ్ను లనియును బరిగణింప॥ 274

సీ॥ మఖముఁ గాచుటకుగా మౌని విశ్వామిత్రుఁ
డడిగినఁ దమతండ్రి యనుపఁ జూచి
యమ్మునివెనువెంట నరుగుచుఁ దెరువున
నొక కోలఁ దాటక [1](నుర్వి రాల్చి)
మఖముఁ గాపాడుచు మఱి సుబాహునిఁ ద్రుంచి
మారీచు గాలిచేఁ బారఁ దోలి
జనకునినగరికిఁ జనువేళ నమ్మార్గ
మున నహల్యకు శాపముక్తి నొసఁగి
తే॥ ప్రమథపతివిల్లు ఖండతుండములు సేసి
వెలయ సీతామహాదేవిఁ బెండ్లి యాడి
పరశురామునిగర్వంబు భంగపరచి
రామచంద్రుం డయోధ్యాపురంబు సొచ్చె॥ 275

సీ॥ కైకేయిమాటలు గైకొని తనతండ్రి
వనభూములకు నేఁగు మనినఁ గదలి
జానకీలక్ష్మణసహితుఁడై శృంగిబే
రంబను నొక్కపురంబుఁ జేరి
గుహునిఁ గన్గొని చిత్రకూటాద్రిపై భర
ద్వాజశాసనమున వసతిఁ జేసి
తను భరతుఁడు రాజ్యమునకు రమ్మనిన బో
వక వేడుకొనినఁ బాదుక లొసంగి
తే॥ దండకాటవి సొచ్చి యుద్ధతు విరాధు
[2](నణఁచి) మౌనులఁ గాంచి శూర్పణఖరూపుఁ
దరపి ముఖ్యు లయిన చతుర్దశసహస్ర
దైత్యుల వధించె నా రఘూద్వహుఁడు బలిమి॥ 276

1. నువిరి ద్రాల్చి. 2. హంతి.

సీ॥ మృగమూర్తియైన మారీచుచేతను దవ్వ
 చనఁ జేసి భిక్షువేషమునఁ జేరి
దశవదనుండు సీతాసతిం గొనిపోవ
 మారీచు సమయించి మరలి వచ్చి
యద్దేవి వెదకుచు నారక్కసునిచేతఁ
 బడిన జటాయువుపనికి వగచి
శబరి గావించు పూజలు మెచ్చి హనుమంతుఁ
 గాంచి సుగ్రీవుతోఁ గలసి యతఁడు
తే॥ మెచ్చ దుందుభికాయంబు మీటి సప్త
సాలములఁ ద్రెంచి యొక కోల వాలిఁ గూల్చి
చెలిమి చేసినయతని కిష్కింధ నిలిపె
సత్యసంధుండు శ్రీరామచంద్రవిభుఁడు॥ 277

సీ॥ కీశసంఘములు సుగ్రీవుండు పనుప సీ
 తాన్వేషణము సేయునట్టి వేళ
శతయోజనముల విస్తారంబు గల వార్ధి
 దాఁటి లంకాపురిఁ దరసి యందు
నలఁగి యశోకవనములోన నున్న సీ
 తకుఁ బ్రియవార్త యంతయును దెలిపి
వెడలి యక్షాదులఁ బడఁగొట్టి వాలాగ్ని
 నెఱపి యప్పీఁడెల్ల నీఱు సేసి
తే॥ వచ్చినట్టి హనూమంతు మెచ్చి, యేక
కాండభీషితమగు వార్ధి కపులచేతఁ
సేతుఁ గట్టించి యా త్రోవఁ జేరఁ గడచి
విడిసె నవ్వల నా రఘువీరవరుఁడు॥ 278

సీ॥ శరణు సొచ్చిన విభీషణునకుఁ గరుణచే
నభయంబుఁ గృపఁ జేసి యనుజుచేత
నతికాయమేఘనాదాదుల నణఁగించి
కుంభకర్ణుని మహారంభ మణఁచి
వేయుగుఱ్ఱంబులు వెలయు మాతలిచేత
సురపతి యనిచిన యరద మెక్కి
యతిభయంకరయోద్ధయై యున్న రావణ
శిరములు ఖండించి గరిమ మించి
తే॥ యతనితమ్మున కపుడు లంకాధిపత్య
మిచ్చి యగ్నివిశుద్ధయై మెచ్చుఁ దగిన
జానకీసతిఁ గూడి పుష్పకము నెక్కి
కదలె రాఘవుం డమరసంఘము నుతింప॥ 279

సీ॥ వర్ణితంబగు భరద్వాజాశ్రమముఁ జేరి
పవనజు మున్నుగా భరతుకడకు
ననిపి నందిగ్రామమునకుఁ జేరువ నెదు
రొ్కనినఁ దమ్ములతోడఁ గూడి యచట
తమ జటావల్కబంధనములు దొలఁగించి
రమణీయమైన వేషము ధరించి
మానివర్యులు ప్రజల్ మాతృమంత్రులును మె
చ్చఁగ నయోధ్యాప్రవేశంబు సేసి
తే॥ యప్పుడ వసిష్ఠుచేతఁ బట్టాభిషిక్తుఁ
డగుచు భేదంబు లేకుండ నరసి ప్రజలఁ
దంద్రికై వడి నడుపుచు ధర్మవృత్తి
ధరణిఁ బాలించె వేడ్క సీతావిభుండు॥ 280

సీ॥ పరునింటనుండియుఁ దిరుగ వచ్చినదాని
విడువఁ జాలక ప్రేమ మిడిసి యేల
నే వెట్టిరామునం డనే యను నొక్కని
హీనవాక్యము విని యిచ్చ రోసి
గర్భిణి యగు జనకజ నిద్రఁ బోవంగ
సౌమిత్రిచే నిశాసమయమునవన
వాల్మీకిమునితపోవనముఁ జేర్పించిన
నయ్యింతి యమడల నచటఁ గనిన
తే॥ వారు వాల్మీకిరచితసంస్కారులగుచుఁ
గుశలవాఖ్యులై విద్యలు గూడఁ జదివి
తనదు మఖమున కేతెంచి తనదు కథయ
ప్రౌఢిఁ బాడంగ విని మెచ్చె రావణారి॥ 281

సీ॥ వారి మీ రెవ్వరివా రంచు నడిగిన
వారలు వాల్మీకిఁ బేరుఁ గొనిన
యమ్మునిఁ గడు మెచ్చి యభిలాష మడిగిన
జనకజ నేలుకొ మ్మనుచు నతఁడు
నచటికి రావింప నయ్యింతి తత్సభా
గ్రంబున భూవివరంబు చొరుడు
నాత్మలో నడలుచు నాత్మజద్వయముఁ జే
పట్టి ధర్మములెల్లఁ బాదుకొలిపి
తే॥ వసుధ [1](నేకాదశసహ)స్రవత్సరంబు
లేలె వెనుకొన్న జీవుల కెల్ల ముక్తి
యమర, నిజపదవికి విజయంబు సేసె
రాముఁ డసమానకీర్త్యభిరాముఁ డధిప॥ 282

1. (.........).

కం॥ ఈనవరత్నంబుల నే
మానవుఁడు పఠించు విను సమగ్రకృపాసం
ధానమున రామభద్రుఁడు
వానికి దయసేయు సకలవాంఛితఫలముల్ ॥ 283

వ॥ ఆ రామచంద్రనందనుఁడగు గుశునితరువాత నతిథి, నిషధులు రాజ్యస్థులయి రా కుశునకు నిరువదియాఱవతరంబువాఁడగు బృహద్బలుండు భారత యుద్ధంబున నణంగె నా బృహద్బలునినుండి యంకఁ గలియుగంబున బృహద్రణాదులు పుట్టం గలరు. ఆ బృహద్బలునకు ముప్పదియవ తరంబువాఁడగు సుమిత్రునినుండి సూర్యవంశంబు కొనసాగక నిలుచు నింక నిక్ష్వాకుపుత్రుండైన నిమిచరిత్రంబు వినుము. 284

సీ॥ గురుఁడు వసిష్ఠుండు సురపతి మఖమున
కరిగినవేళ డా నన్యమునులఁ
జేర్చుక యాగంబు సేయంగ నగ్గురుఁ
డరుదెంచి యతని దేహంబు పడఁగ
శపియించెఁ దనకు నా నృపుఁడు నబ్బంగిన
ప్రతిశాప మిడిన మిత్రావరుణుల
వలన జన్మించె సూర్వశియందు, నిమియును
వేగంబు దేహంబు విడచియుండ
తే॥ మఖవిధిప్రీణితులు సుర ల్మఱల బ్రదుకు
మనిన రోసి యే మే నొల్ల [1](ననుడు, గన్ను)
[2](గవఁ) గదల్చిన యప్పుడు [3](కానఁబడుదు)
గాక యని పల్కె రందఱు నేకయుక్తి ॥ 285

వ॥ అత్తఱిఁ బెద్దలగు వారలు తద్దేహంబు మథియించిన జనకుం డన నొక్క కుమారుండు పుట్టె నతండు విదేహాపత్యంబు గావున వైదే

1. సుండఁగ. 2. గన్నుగవ. 3. కానబడదు.

హుండును మధనజుండగుటవలన మిథిలుండును ననంబడు నతనికి
నాఁ అవతరంబువాఁడయిన బృహద్రథుండును, యజ్ఞభూమిం దున్నిన లాం
గలముఖంబున సీతాదేవి సంభవించె నతనికి శిరధ్వజుండు, తదనంతర
జనకకుశధ్వజాదులు పుట్టి మైథిలులనం బరగుచుందురు. 286

ఉ॥ ఆకలితప్రభావమహిమాద్భుతవీరకరీరమైన యి
క్ష్వాకునరేంద్రవంశము ప్రసన్నమతిం [1](వినవేర్చు) నట్టి సు
శ్లోకునకుం జిరాయువు యశోవిభవంబు ననంతసంపదల్
గైకొనఁగల్గుఁ దత్ప్రతనకౌశలశాలికిఁ బోలె భూవరా॥ 287

కం॥ తన్వవజితవసుమానో
దన్వత్కీర్తిప్రతాపధనరాజచరి
త్రాన్వితముగ నీ [2](కిఁక) సో
మాన్వయ మెఱిఁగింతు నెఱుఁగు మవధానమునన్॥ 283

## చంద్రవంశరాజవర్ణనము

మ॥ హరికిం బొక్కిటితమ్మిఁ బుట్టె ద్రుహిణుం డమ్మేటికిం బుత్రుఁడై
పరగెం దండ్రికి నీడనంగ మిగులం బ్రఖ్యాతుఁడై యత్రి, త
ద్వరనేత్రోదితుఁడైన చంద్రుఁడు జగద్వంద్యాత్ముఁడై యుండియున్
గురుభార్యామణిఁ దారఁ బట్టుకొని సక్తుండయ్యెఁ గామోద్ధతిన్॥

మ॥ సరసీజాసనుఁ డాయమ న్మఱలఁ దా సాధించి యిప్పించుచోఁ
గురుచంద్రుల్ సుతకాంక్షచే బుధునికై కోపించి బాధించి [3] (యె)
వ్వరికిం బుట్టె నతండు దెల్పు [4](మనినన్) వారింప కా తార చం
దురునిం జెప్పిన నిచ్చె నా బుధునిఁ బుత్రుంగా [5](నిశాభర్తకున్)॥

1. జలేర్చు. 2. నీకక. 3. నె. 4. (ని.........).
5. నిశాచార్యకున్.

తే॥ అట్లు చంద్రునకుఁ దారయందుఁ బుత్రుఁ
డైన బుధుఁడు పురూరవుం డను కుమారుఁ
గాంచె నిలయందుఁ దత్కథాక్రమము మున్నె
తెలిపినాఁడ మనంబులోఁ దలఁచికొనుము॥ 291

ఉ॥ ఆ నరభర్త జహ్నుతనయాతటసీమ సముల్లసత్ప్రతి
ష్ఠానపురీనివాసుఁ డయి సర్వమహీతలశాస్తయై విధా
నూనమఖక్రియాదిరచనోత్సుకుఁడై యసమానరూపరే
ఖానవపంచబాణుఁ డనఁగాఁ బొగడంబడుఁ జక్రవర్తియై॥ 292

తే॥ ఆ పురూరవుసౌందర్య మరసి చూచి
వలచి యూర్వశి యను దివ్యవారకాంత
వచ్చి తియ్యని పల్కుల మెచ్చుఁ జేసె
కాపురము సేసె తత్సమాకార యగుచు॥ 293

కం॥ దివిజవిహారస్థలముల
నవిరళకలితాష్టభోగుఁడై యెపుడుఁ బురూ
రవుఁ డా యూర్వశితోడం
దవిలి వినోదించె నస్వతంత్రుం డగుచున్॥ 294

కం॥ ఆయువు శ్రుతాయువును స
త్యాయువు రయ జయ విజయులు నను నార్గురు మే
ధాయుతులు సన్నుతులు సుతు
లా యూర్వశియందుఁ గలిగి [1](రాయనఘునకున్)॥ 295

సీ॥ అందులో విజయునినందనుం డగు భీముఁ
డాత్మజుఁ గాంచనాహ్వాయునిఁ గాంచె
నతనిపుత్రుఁడు హోత్రుఁ డతనికి గంగ గం
డూషించినట్టి జహ్నుం డతనికిఁ

1. రాయ్యైతునకున్.

బూరుఁ డావిభుని కొడుకు బలాకుఁ డా
గుణవంతునకు [1](నజకుం) డతనికి
నెగడెఁ గుశుం డాతనికిఁ గుశాంబుఁడు పుట్టెఁ
గలిగె నా నృపతికి గాధినృపతి
తే॥ యతనిపుత్రిక యగు సత్యవతికి రుచికు
వలన జమదగ్ని యను మునివర్యుఁ డొదవె
నతని కరుదార రేణుకయందుఁ బుట్టెఁ
బరశురాముఁడు హరిమూర్తి భవ్యయశుఁడు॥ 296

జమదగ్ని పరశురాముల వృత్తాంతము

ఉ॥ ఆ జమదగ్నిసూనుఁడు హరాత్తకుఠారము చేతఁ బూని స
ద్రమా జనఁ జంపఁబూనియు సమర్థుని నర్జును దోస్సహస్రవి
భ్రాజితుఁ ద్రుంచి హేతికను వాయక యిర్వదియొక్కమారుగా
రాజుల సంహరించె భువి రాజవిహీనత యారచించినన్॥ 297

చం॥ అనుటయు నో మునిప్రవర యచ్యుతుఁ డాజమదగ్నిసూనుఁడై
జనపతివంశకాండముల సారెకు శాతకుఠారధారచేఁ
బనివడి ద్రుంచె నంచుఁ దగఁ బల్కితి వందులహేతు వెద్దియో
వినఁబడ సేయు నాగఁ బృథివీపతికిం శుకయోగి యిట్లనున్॥ 298

సీ॥ దత్తునాత్రేయునిఁ దపముచే మెప్పించి
వరములు గొన్న సుస్థిరహృదుండు
జిరలుకొట్టుచు వేయు చేతుల నర్మదా
ఝర మరికట్టిన గురుబలుండు
చెనకవచ్చిన రావణునిఁ బట్టి మోదించి
చెఱసాల నుంచిన యొఱపులాడు

1. నర్జునుండు.

సాధించి యష్టాదశద్వీపముల యూప
తతుల నిల్పిన మహాధర్మపరుఁడు
తే॥ సుతుఁడు కృతవీర్యసుతు డర్జునుండు పేర్మి
నుర్వి నంతయు నేలుచు నొక్కనాడు
వేటలాడి పరిశ్రాంతి వేగిరింప
వచ్చె జమదగ్ని మునితపోవనమునకును॥ 299

ఉ॥ అదనున నమ్మునీంద్రుఁడును నన్నగభర్తకు హోమధేనువుం
బిదికి సమస్తవస్తువులు బెట్టిన నొప్పుగ నారగించి స
మ్మదమున నద్భుతంబు మదిఁ [1](మల్లడిలం) గొనిపోవఁ జూచె న
మ్మొదవు నతండు సాధువులు మోహము నొందుదు రొక్కపట్టునన్॥

తే॥ మొఱలు పెట్టెడు నమ్మునిముఖ్యుఁ ద్రోసి
బలిమిమై హోమధేనువుఁ బట్టికొనుచు
నక్కజంపు సువస్తువు జిక్కె ననుచు
సరిగె మాహిష్మతీపురి కర్జునుండు॥ 301

ఉ॥ అంతట రైణుకేయుఁడును నవ్వనభూమికి నేఁగుదెంచి భూ
కాంతుని [2](చెయ్దు)లెల్ల విని కావర మెక్కెనె యిట్లు వీని కీ
పంతము లెల్ల మాన్తు నని పాణికఠోరకుఠారరోచు ల
త్యంతభయావహంబులుగ నర్జునువీటికి వచ్చె నుద్ధతిన్॥ 302

ఉ॥ ఆహవకాంక్షి రాముఁ బరిహాసము సేయుచు నర్జునుండు సో
త్సాహత దండనాయకుల సంగతి సప్తదశప్రకీర్తితా
క్షౌహిణులన్ వడిం బనిచి యప్పుడ తాను శతాంగమెక్కి య
మ్మోహర మొప్ప నాత్మపురి ముంగలిభూమికి వచ్చె సజ్జుఁడై॥ 303

---

1. దల్లడిం. 2. చ్రుదు,

ఉ॥ గర్జలు దర్జనంబు లధికంబుగఁ జేయుచు నేఁగుదెంచు న
య్యర్జునసైన్యముం దృఢతరాత్ముఁడు రాముఁడు సింహనాదవి
స్ఫూర్జథు బృంహణల్ సెలఁగ భూరిరయంబునఁ జొచ్చి యాత్మదోః
ఖర్జువు వృద్ధినొందఁగ సుఖంబునఁ ద్రుంచెఁ గుఠారధారచేన్॥ 304

కం॥ మూరి మసంగినసంగతి
నా రాముఁడు పదియు నేడు నక్షౌహిణులన్
ధారుణి మాన్చిన నర్జున
భూరమణుఁడు గాంచి రోషపూరితహృదయుఁడై ॥ 305

తే॥ ఎడమచేతుల నేనూటి నెత్తి నట్టి
విండ్లఁ గుడివంకచేతుల విశిఖవృష్టిఁ
గురియుచు రణంబు సేసె నప్పరశురాము
తోడ నెచ్చట లేని యద్భుతము దోఁప ॥ 306

కం॥ కృతహస్తుఁడు రాముఁ డహం
కృతమున నొక విల్లు పూని, క్రీడనె పోలన్
కృతవీర్యసుతునిఁ గార్ముక
వితతిన్ [2](సకలంబు) నొక్క- వెఱవునఁ ద్రుంచెన్॥ 307

ఉ॥ ఖండితచాపుఁ డయ్యు మహికాంతుఁడు వృక్షశిలాభివర్షియై
యుండఁగ రేణుకాసుతుఁడు హుమ్మని క్రమ్మఱ డాసి తద్భుజా
మండలమంతయుం దునిమి మస్తకముల్ బడఁగొట్టినంత నా
ఖండలదాతపక్షగిరికై వడి వ్రాలె నతండు మేదినిన్॥ 308

తే॥ అర్జునాత్మజు లయుతంబు ననికి నోడి
యరుగుటయు రాముఁ డపుడ యా పురము సొచ్చి
హోమధేనువు వత్ససంయుతముగాఁగ
గొనుచు జనకుని యాశ్రమంబునకు నరిగె ॥ 309

వ॥ అంత,

1. స్ఫూర్జదుబృందముల్. 2. (నగ......).

సీ॥ జమదగ్నియును రాముచరితంబునకు మెచ్చి
యుండుచో నాలోన నొక్కనాడు
రేణుక ఘటము ధరించి గంగానది
నుదకంబుఁ దెచ్చు నుద్యుక్తి నరిగి
తజ్జలకేళితత్పరు నప్సరోయుతుం
జిత్రరథాఖ్యు వీక్షించుకతనఁ
దడసి యేతెంచినం దాపసుం డహితము
నెఱిఁగి కోపించి యా యిందువదనఁ

తే॥ [1](జంపు మనుడు నే పుత్రుఁడు చంపకున్నఁ)
దండ్రియాజ్ఞచే రాముఁ డా తల్లిఁ దొడ్ల
తలలుఁ ద్రెంచి తన్మెచ్చు న త్తపసివలన
వరముఁ గొని యపుడు బ్రతికించె వారి మఱల॥ 310

వ॥ అంతఁ గొండొకకాలంబు చనుసంతఁ దమపగఁ దీర్చుట కర్జునకుమారు లొకనాడు గూడి గూఢంబుగ నాశ్రమంబున నొక్కరుఁ డుండంగ జమదగ్నిశిరంబుఁ గొనుచు రయంబునఁ జని రానమయంబున,

ఉ॥ భ్రాతలఁ గూడి రాముఁడు నరణ్యవిహారము మాని వచ్చుచో
నాతురవృత్తి రేణుక హాహా జమదగ్ని వధించి పోయి రా
భూతలనాథపుత్రు లని పొక్కుచు నిర్వదియొక్కమా రసం
త్రాతశరీరయై లపనతాడనశక్తి వహించె ముందరన్॥ 312

తే॥ రాముఁడును దండ్రిమేను సురక్షితంబు
సేయుఁ డిడె పగఁ దీర్చెదఁ జింత యేల
యనుచు మాహిష్మతీపురి కరిగి జనక
[2](హంతృ)వర్గంబుఁ బరిమార్చె నాక్షణంబ॥ 313

1. జెప్పుమనుడు నేపుత్రుడు జెప్పకున్న. 2. హంత్రు.

ఆ॥ మఱియు నా ఘనుండు మదిఁ గ్రోధ మెడలంగ
జనని [1](గోడుకొనిన సంఖ్య కలుగ)
సకలనృపుల వెదకి [2](చంపె) కఠోరకు
ఠారఘోరశాతధారచేత ॥ 314

వ॥ ఇవ్విధంబున శత్రుసంహారంబు సేసి. 315

సీ॥ రాజన్యరక్తపూరములచేత శమంత
పంచకంబునఁ బ్రతిభయములైన
మడుఁగు లొనర్చి తన్మగ్నుఁడై పితృతర్ప
ణం బొనరించె రోషంబు వాయఁ
దండ్రిమూర్ధముఁ దెచ్చి తత్కళేబరముతో
సంధించి బ్రహ్మర్షిసమ్మతముగఁ
దను గూర్చి తాన యధ్వరమొనర్చి [3](యొసఁగెఁ)
బృథ్వీతలం బెల్ల ఋత్విజులకు
తే॥ బ్రాప్తతనుఁడైన తండ్రిఁ దపంబుపేర్మి
నంబరంబున సప్తర్షులందు నిలిపె
తాను నిపుడు మహేంద్రభూధరముపైఁ ద
పోమయుం డయి యున్నాఁడు రాముఁ డధిప ॥ 316

## విశ్వామిత్ర యయాతి ప్రముఖుల చరిత్రములు

కం॥ రామునిజనకునకు న్మా
తామహుఁడగు గాధిరాజు తనయుం గనె వి
శ్వామిత్రుని నతఁడు తప
స్థేమన్ బ్రహ్మర్షియయ్యెఁ ద్రిదశులు మెచ్చన్॥ 317

1. దోడికొనిన సఖ్యరలుగ. 2. చంపి. 3. ఘోషరించి.

ఆ॥ విను పురూరవునకుఁ దనయుఁడై వెలసిన
యాయువునకు నహుషుఁ డయ్యెఁ బుత్రుఁ
డతఁడు తాన యింద్రుఁడై కొన్ని నాళ్లమ
రావతీపురంబుఁ బ్రాపించి యేలె॥ 318

కం॥ అతనికి యయాతి యనియెడు
సుతుఁ డుదితుం డయ్యె నతఁడు శుభనాసీరో
ద్ధతధాటీరయసంక్షో
భితరిపుఁడై గెలిచె సకలపృథివీతలముఁ॥ 319

వ॥ ఆ యయాతి రాజ్యంబు సేయుచుండు సమయంబున, 320

సీ॥ వృషపర్వుఁ డను దైత్యవిభుపుత్రి శర్మిష్ఠ
యను నింతియును దేవయాని[1](పేరు)
గల శుక్రదుహితయుఁ గాఁగలో నొక్కనా
డొకచోట జలకేళి నుండి రంత
దరికి మున్నుగ వచ్చి దైత్యజ యెఱుఁగక
తనవల్వఁ గట్టినఁ గనులు వోడమి
గురుబిడ్డ నే శిష్యుకూతుర వీవ దా
సీసమానవును నాదు చెలిమి నిట్లు

తే॥ కట్ట నర్హవే యనుచు నగ్గలిక మఱియుఁ
దెరలఁ గఱినోక్తు లాడు నద్దేవయానిఁ
బట్టి యొక క్రుంకినూతిలోఁ బడగఁ ద్రోసి
చనియె నక్కన్య నగరికి సఖులఁ గూడి॥ 321

ఆ॥ అట్టివేళ వేట కరుదెంచినట్టి య
యాతి నూతిలోన నార్తి నొందు
దేవయానిఁ గరుణచే వెడలఁగ నిల్చెఁ
గుడికరంబు నూఁదికొనగ నొసఁగి॥ 322

1. యని.

వ॥ ఇవ్విధంబునఁ గూపంబు వెడలించిన నక్కన్య యారాజన్యునిం జూచి యేను శుక్రునిబిడ్డ దేవయాని యను దాన, నే నిప్పుడు నీ కరం బవలంబించితిం గావున నీవు నాకుఁ బ్రియుండవు. గురుపుత్రుండగు కచుండు మా తండ్రియొద్ద సంజీవని యను విద్య నభ్యసించునప్పుడు నే నతని వరింపు మని పలికి మదభిలాషం బొనర్పకున్న యతనికి విద్యా నైష్ఫల్యశాపం బొసంగితి నాతండును నాకు బ్రాహ్మణేతరుండు పతి యగు నని శపియించె నది కారణంబున నుత్తమక్షత్రియుండ వగు నీవ దొరికితి వని పలికిన యయాతియు దైవవశంబున నంగీకరించి వరించి నిజపురం బునకుఁ జనియె. దేవయానియును శుక్రునికడకు వచ్చి శర్మిష్ఠావృత్తాంతం బెఱింగించుటయును, 323

సీ॥ శుక్రుండు గినిసి యచ్చోట నుండక పోవ
జాగిన దైత్యుఁ డా [1](జాడఁ) దెలిసి
యపుడ సఖీసహస్రాన్వితయై పొల్చు
బిడ్డ శర్మిష్ఠఁ దత్ప్రియతనూజ
యగు దేవయానికి ననునారిగా నిచ్చెఁ
గవియు నా రోషంబుఁ గడకుఁ ద్రోసి
తనపుత్రి నా దైత్యతనయాసమేతంబు
గాఁ దోడుకొని రాజుకడకు నరిగి
తే॥ యెపుడు శర్మిష్ఠఁ గూడకుమీ యటంచుఁ
జేరి చెవిలోన బుద్ధిగాఁ జెప్పి చనియె
విభుఁడు నద్దేవయానితో వేడ్కఁ గలసి
చెలఁగె శర్మిష్ఠయును బనుల్ సేయుచుండె॥ 324

1. నాచాటు.

వ॥ అంత,

కం॥ ముద మొదవ న. య్యయాతికి
యదువును తుర్వసుఁడు దేవయానిరమణియం
దుదయించిరి సత్పుత్రులు
విదితగుణోత్తములు లోకవిశ్రుతకీర్తుల్ ॥ 325

మ॥ ఒకనాఁడా కవిపుత్రి పుష్పవతియై యుండంగ శర్మిష్ఠ ద
ర్పకవేధాకులచిత్తయై కదిసినన్ రాజేంద్రుఁడున్ జింత సే
యక యంగీకృతి సేసె నాయమకు బెంపారంగ ధర్మాత్మనూ
త్నసుతుల్ ద్రుహ్యుఁ డనుండు పూరుఁడు ననన్ శోభిల్లి రాత్మోద్భవుల్

తే॥ ధరణిపతి యిట్లు శర్మిష్ఠఁ దగులుకొనుట
దేవయానిముఖంబునఁ దెలిసి శుక్రుఁ
డదరిపడి వృద్ధుఁడగు గాక యనుచు నతని
కొసఁగె శాపంబు కోపంబు నుడుప లేక ॥ 327

వ॥ ఇట్లు శాపంబు ప్రాప్తం బయిన జరాభారంబున యయాతి సుడివడి యిమ్ముదిమి పుచ్చుకొని జవ్వనం బిచ్చినఁ గొంత కాలంబు భుక్తభోగుండనై తిరుగ నిచ్చెద నని యదుతుర్వసుద్రుహ్యులనువులం బ్రార్థించిన వారు లొప్పకుండు నంత బూరుం డవ్వినిమయంబునకు మేకొని యట్ల సేసిన నన్నాహుషుండు కతిపయవర్షవిషయానుభవంబులఁ దృప్తుం డయి తద్వినిమయసంవర్తనంబు సేసి యను ద్రుహ్యు యదు తుర్వసులకు నుదీచి ప్రాచి ప్రతీచి దేశంబు లొసంగి పూరునికిం బట్టంబుఁ గట్టి విరక్తుం డయి చనియెం బరీక్షిన్నరేంద్రా! యనుచు భవజ్జనన కారణం బయిన పూరునివంశంబు సెప్పెద, 328

## పూరువంశవృత్తాంతము

సీ॥ వినుమయ్య పూరునకు సజ్జనమేజయుం డాత
నికిఁ [1](ప్రచిన్వాంసుండు) నెగడె నాతఁ
నికిఁ బ్రవీరుం డాతనికి [2](నమస్యుఁడు) చారు
సుతుఁ డాతనికి సుద్యుఁ డతని కొదవె
నతనికి బహుగవుఁ డతనికి [3](సంయాత్యా
హంయాతి) యతనికి నాత్మజుండు
రౌద్రాశ్వుఁ డతని కా రాజు ఘృతాచియం
దనఘు ఋతేయునిఁ గనియె నతని

ఆ॥ [4](కంతిసారుఁ) డతని కాత్మజుల్ మువ్వురు
ధ్రువుఁడు సుమతి ప్రతిరథుండు వారి
యందుఁ బ్రతిరథాన్వయమున మృకండుము
ఖ్యులు ద్విజాతివర్యు లొదవి రధిప॥ 329

## దుష్యంతుని కథ

కం॥ సుమతిసుతుం డగు రైభ్యుని
కొమరుఁడు దుష్యంతుఁ డధికగుణవంతుండై
విమతారి[5](కి) విధిలిఖిత
క్రమములకు నతద్విధార్థఘటన లొనర్చెన్॥ 330

కం॥ ఆఖండలసమవిభవుం
డాఖండితవైరివీరుఁ డా దుష్యంతుం
డాఖేటవిహారణస్ఫుర
ణాఖిలమున్ ముదము నొంద నర్థించె మదిన్॥ 331

వ॥ ఇట్లర్థించి యొక్కనాఁడు, 332

1. ప్రవిద్వాంసుండు. 2. మనస్యుడు. 3. సంయాతిహంయాతి.
4. కంతనాయుడు. 5. క.

సీ॥ శరభశార్దూలకేసరకులాకీర్ణంబు
మహిషదంతివరాహమండితంబు
గవయగోమాయుఖడ్గకరురువ్యాప్తంబు
మృగమృగీబర్హిణమేదురంబు
శల్యగోలాంగూలచమరకీశోగ్రంబు
ఘూకఝిల్లీటిట్టిభాకులంబు
కంకఖంజనగృధ్రకాకనీరంధ్రంబు
క్రకరకపింజలగణవృతంబు
తే॥ తాలహింతాలవటరజ్జుదాలసాల
భూజమాలూర[3](ఖదిర)జంబూకరంజ
బాణభల్లాతకీసర్జపారిభద్ర
కలితమునునైన నగహానభాగంబుసొచ్చి॥ 333

వ॥ అందు,

సీ॥ సింగిణి చేఁ బూని సింహవరాహశా
ర్దూలాదికంబులఁ ద్రుంచి త్రుంచి
ఖడ్గంబు చేఁ బూని గవయఖడ్గకశల్య
హరిణాదికంబుల నణఁచి యణఁచి
కుంతంబు చేఁ బూని కోకణరామిష (?)
కోకాదికంబులఁ గ్రుమ్మి క్రుమ్మి
ఘనము చేఁ బూని రుక్షకరురుకందళి
చమరాదికంబులఁ జమరి చమరి
తే॥ పంచధారాప్రపంచనచుంచువాజి
గమనచంచలకమనీయకర్ణమహిమ
నాభరణదీప్తి [3](నీరాజితాననాబ్జుఁ)
డగుచు విహరించె దుష్యంతుఁ డవ్వనమున॥ 334

1. ఖనిర. 2. జుంఝు. 3. విరాజితానూనవాబ్జ.

వ॥ మఱియును,

తే॥ శ్యేన [1](వ్యాఘ్రఘూట) దాత్యూహ చిల్ల కంక
ఖంజరీట పారావత కర్కరేట
భృంగ సారంగ కలవింక పికశుకాది
విష్కిరములకు భయము నావిష్కరించె ॥

కం॥ ప్రచలాకిబర్హిభార
ప్రచాలనప్రణయిపవనపంక్తిప్రసర
ద్విచికిలకలితామోదో
పచితహృదాహ్లాదుఁ డయ్యెఁ బార్థివుఁ డంతన్॥

తే॥ ఇట్లు విహరించి యా మనుజేంద్రచంద్రుఁ
డలసి చేరువ నున్న కణ్వాశ్రమంబుఁ
గాంచి మునిఁ జూచి పోదము గాక యనుచుఁ
జనియె నొక్కఁడు తత్పర్ణశాలకడకు ॥

దుష్యంత శకుంతలా సమాగమము

చం॥ మనుజవరేణ్యుఁ డచ్చట సమంచితరూపవతిన్ శకుంతలం
గనుగొని యద్భుతప్రమదకంపితమానసుఁడై నుతించి వి
ప్రునిసుత గాక యీ మగువ భూవరపుత్రిక యౌనఁ జక్కనౌ
నని తలపోయుచున్ బలికె నమ్మునికన్యకతో నుదంబునన్॥

శా॥ బాలా ! యెవ్వరిదాన వేగతి జనిప్రస్తావ మేపార నీ
కీ లావణ్యరసాబ్ధివేలకు వనంబె ట్లునికిప ట్టయ్యె నే
లీలం గణ్వుఁడు చుట్ట మిత్తెఱఁగు లోలిం దెల్పి సందేహదో
లాలోలం బగు నామనంబునకుఁ జాలం గూర్పుమా నిల్కడన్

1. శ్యేనధరుండటు.

చం॥ అనుటయుఁ గన్య పల్కె మనుజాధిప! గాధిసుతుండు మేనకా
తనుమణియందుఁ గాంచె నను దత్పరతన్ సవరించెఁ గణ్వుఁ డి
వ్వనమున నీ శకుంతములు వారక కొన్నిదినమ్ము లర్థిఁ జే
కొని బ్రతికించెఁ గావున శకుంతల యందురు నన్ను పేరునన్॥ 340

వ॥ అనుటయు నప్పలుకులకు ధరాకాంతుండు సంతోషంబునొందుచు,

ఉ॥ క్షత్రియకన్య నీవు మది సంశయ మంతయుఁ బాసె నిత్తఱిన్
జైత్రత నొందె మన్మథుఁడు చంద్రకులోద్భవవంతు నన్ దయా
పాత్రునిఁ జేసితేని యనభంగురభోగవిభూతిఁ దేల్చి నీ
పుత్రునిఁ బ్రేమతో నిఖిలభూతలనాథునిగా నొనర్చెదన్॥ 342

కం॥ అని పలికె మఱియుఁ దియ్యని
నును(1బలుకుల నెమ్మనంబు) నూల్కొల్పుచు న
వ్వనిత నచట గాంధర్వం
బగువిధి నొనరన్ వరించె నతిహర్షమునన్॥ 343

తే॥ ఇట్లు పరియించి యా ధరణీశ్వరుఁడు శ
కుంతలకు గర్భమును పాదుకొనగఁ జేసి
యుదితసంతోషసంతతహృదయుఁ డగుచుఁ
జనియె మరునాఁడు తనప్రతిష్ఠానపురికి॥ 344

సీ॥ ఇటు శకుంతల ముదం బెసఁగ నాశ్రమమునఁ
గాంచిన సుతునకుఁ గణ్వమౌని
విహితసమాచారవిధు లొనర్చి యతండు
శరభసింహాదుల సరకుఁ గొనక
దమియింపగా సర్వదమన నామం బిడి
యంతఁ గొన్నిదినంబు లరుగునంత
శిష్యునిఁ గూర్చి యచ్చెలువఁ బుత్రయుతంబు
గాఁ బ్రాణనాథుని కడకుఁ 2(దన్ను)

1. బలుకుచు నమ్మనంబు. 2. నన్ను.

తే॥ బనుప [1](నతఁడు) సభాగృహప్రాంగణమున
నితఁడు నీపుత్రుఁ [2](డీమె) నీ యింతి వీరిఁ
గరుణ భరియింపు మనుచు నాకాశవాణి
పలుకుటయుఁ జేసి నెల్ల జనుల్ ప్రస్తుతింప॥ 345

కం॥ సురమార్గవాణి యతనిన్
భరియింపు మటంచు నపుడు పలికినకతనన్
భరతుండై తదనంతర
మురుపతి శాకుంతలేయుఁ డుర్వి వహించెన్॥ 346

భ ర త ప్ర భా వ ము

వ॥ భరతుండు గంగాయమునాతటంబుల నూటముప్పదిమూఁ డశ్వమేధయాగంబులు సాంగంబులుగా నొనర్చి, బంధాపరనామధేయంబు లగు చతురశీత్యుత్తరత్రయోదశసహస్రాధికగోబృందంబుల వేయింటిని [3](వేవురుబ్రాహ్మణులకు)ను మష్ణారాఖ్యతీర్థంబున జతుర్దశలక్షకుంజరంబుల విప్రకుంజరులకు నిచ్చె. రాక్షససంహారంబు సేసి యనేక స్వర్గబంధ మోచనం బొనర్చి సప్తవింశతిసహస్రవర్షంబులు రాజ్యంబు సేసె నతండు పుత్రార్థియై మరుత్సోమంబను యాగం బొనర్చుటయును, 347

తే॥ అన్నయగు [4](నుచథ్యుని)యింతియైన మమత
నిర్జరగురుఁడు గవయ జన్మించినట్టి
యనఘువృత్తిఁ భరద్వాజుఁ డను మహాత్ముఁ
దనయుగా నిచ్చి రమరు లా ధరణిపతికి॥ 348

వ॥ అతండు వితథం బైన భరతకులంబునకు మొదలయ్యెఁ గావున వితథుం డయ్యె నతనికి [5](మన్యువు), మన్యువునకు [6]((బృహత్క్షత్రుండును)

1. నతని సతి. 2. డీయమ. 3. (.........).
4. నవచథ్యుని. 5. మనువు. 6. బృహతత్క్షత్రుండును.

జయుండును, మహావీర్యుండును, నరుండును, గర్గుండును నను పుత్ర పంచకంబు గలిగె నందు నరునకు సంకృతి, సంకృతికి రంతిదేవుండు పుట్టె నతండు, 349

కం॥ అడిగెడువారికి నెడపక
తొడిబడ రాజ్యంబు ధనముఁ దురగంబులనుఁ
గడముట్ట నొసఁగి యంతట
నడవికి సకుటుంబుఁ డగుచు నరిగెం గృశుఁడై ॥ 350

సీ॥ నలువదియాఱుదినము లుపవాసియై
యశనంబు నొకగతి నలఁతఁగూర్చి
యొక్కచో భుజియింప నుద్యుక్తి సేయుచో
నచటికి నొక్క బ్రాహ్మణుఁడు వచ్చి
యన్నంబు వేడిన నాత్మభోజ్యంబులో
నతనికి సగ మిడి, యంత నొక్క
వృషలుఁ డాహారంబు వేడ నా సగములో
సగ మిచ్చె మఱి సహాశ్వగణుఁ డొక్క
తే॥ మ్లేచ్ఛుఁ డోదన మడిగిన మిగిలి యున్న
యంతయు నొసఁగి యట నొక్క యంత్యజుండు
దప్పిఁ గొని వచ్చి వేడిన నప్పు డున్న
యంబువుల్ వోసె హరి కర్పణంబు గాగ ॥ 351

కం॥ ఆ రంతిదేవుఁ డత్తఱి
వారిజభవముఖులు మెచ్చి వర మడుగు మనన్
నారాయణభక్తికళా
పారీణతఁ గోరి పరమపదముం జెందెన్ ॥ 352

వ॥ గర్గ జయ మహావీర్యుల సంతతులు బ్రాహ్మణత్వంబు నొంది బృహత్క్షత్రునకు [1](సుహోత్రుం) డాన రేంద్రునకు హాస్తిపురనిర్మాతయగు హస్తి జనియించె. హస్తికి నజమీఢుం డతనికి నలిని యను పత్నియందు నీలుం డతనికి శాంతి, యతనికి సుశాంతియు నతనికి బురుజుండు బురుజునికి నర్కుండు నతనికి భర్మ్యాశ్వుం డతనికి ముద్గలుండును, యవీనరుండును, బృహదిషుండును, కాంపిల్యుండును, సృంజయుండు నను నేవురు పుట్టి పాంచాలు లనం బరగి రందు, 353

సీ॥ వినుము దివోదాసుఁడును నహల్యయును ము
ద్గలుఁ డను నతనికిఁ గలిగి రధిప
ఆ యహల్యకు గౌతమాసక్తి నొదవె శ
తానందుఁ డతఁడు సత్యధృతిఁ గనియె
తత్తనూజుఁడు శరద్వంతుఁ డూర్వశిఁ జూడ
జారు వీర్యము కుశస్తంభగతము
గాఁ జేయుటయుఁ గన్యకయుఁ బురుషుండు గ
ల్గిరి పేళ్ళఁ గృపియును గృపుఁడు ననగ
తే॥ వెంట వచ్చిన శంతనువిభుఁడు వారిఁ
గొనుచు నరిగి ప్రేమమునఁ దాఁ బెనుచుకొనియె
నందుఁ గృపి ద్రోణునకు భార్యయై చెలంగె
కృపుఁడు కౌరవగురుఁడు నాఁ గీర్తిఁ గాంచె॥ 354

వ॥ దివోదాసునినుండి మిత్రాయువు, చ్యవనుండును, సుదాసుండును, సహదేవుండును, సోమకుండును, సుజన్మకృత్తును నను నాలు తరంబులవారిమీఁదఁ బృషతునకు ద్రుపదుండు ద్రుపదునకు ద్రౌపదియు ధృష్టద్యుమ్నుండును గలిగి రిది పాంచాలరాజప్రపంచంబు. 355

---

1. పసుహోత్రు.

తే॥ ఆ యజామీఢునకుఁ గల్గె నాత్మజుండు
[1](వరగుణుఁడు బుద్ధిఁ డంత సంవరుణుఁ డతని
కతని కల సూర్యకన్యకయైన తపతి)
యందుఁ బుట్టెఁ గురుండను నందనుండు॥ 356

వ॥ ఆ కురువునకు బరీక్షిత్తును, సుధనువు [2](జహ్నువు), [3](నిషధుండును) నను నలుగురు గలిగి రందు సుధనువువంశంబున [4](సుహోత్ర) చ్యవన, కృతి, వసు, బృహద్రథాదులు నేనుతరంబులవార లరిగినమీఁద జరాసంధుండు పుట్టె నీ వంశంబునఁ గ్రమంబున నింక మీఁదం గలి యుగంబునం బుట్టంగల రాజులు సహదేవ, మార్జాలి, శ్రుతశ్రవులును, నయుతాయు, నిరమిత్ర, సునక్షత్ర, బృహత్సేన, కర్మజిత్తులును, శత్రుంజయ, విప్ర, శుచి, క్షేమ, సువ్రత, ధర్మనేత్రులును, శ్రుత, [5](ధృఢసేన) సుమతి, [6](సుబల, సునీతి, సత్యజి, ద్విశ్వజి), త్సురంజయులు నను వార లిరువదిరెండుమంది వేయేండ్లలోఁ జనఁ గలరు. వీరు బార్హద్రథు లనఁ బడుదురు. 357

శంతను భీష్మాదుల జననము

సీ॥ ఆకురునందనుఁడై నజాహ్నవిపట్టి
సురథుఁ డాఘునునకు సూనుఁ డగు వి
[7](దూరభూపతికిఁ బ్రదీపుఁడురయించి (?)
నానరాధిపతికి దేవాపిశంతును
బాహ్లికాఖ్యులైనమువ్వురుకొడుకులు)
......రగ్రతేజ......తేజ
..........................
లెంతయును నందు విలసిల్లె శంతనుండు

---

1 నుతచరిత్రుడుసత్స్వరుడనగనతని ; కలసూర్యకన్నికయైనతపతి. 2. జాహ్నువు. 3. నిషాదుండు. 4. సహోత్రు. 5. శ్రుతసేన. 6. (జపతాపససునిత) 7. ఇచట ఛందస్సు చెడినది.

తే॥ శంతనునకు గంగానదీకాంతయందు
భుష్మసన్నిభుఁ డుదయించె భీష్ముఁ డాదిఁ
గలిగె రటమీఁద యోజనగంధియందు
వెలయఁ జిత్రాంగద విచిత్రవీర్యు లధిప॥ 358

వ॥ యోజనగంధికిం బరాశరునివలనం గానీనపుత్త్రుండయిన వేద వ్యాసునివలన విచిత్రవీర్యునిభార్యలలో నంబికయందు ధృతరాష్ట్రుండును, నంబాలికయందుఁ బాండురాజునుం గలిగె రందు ధృతరాష్ట్రునకు దుర్యో ధనాదులు నూర్వురు పుట్టిరి. పాండునకుఁ గుంతియందు ధర్మజ భీమా ర్జునులును, మాద్రియందు నకుల సహదేవులును జనియించె రందు నీ పితామహుం డయిన యర్జునునకు నభిమన్యుం డతనికిం బరమభాగవతుండ వగు నీవునుం జనియించితి, 359

కం॥ నీ తర్వాత మహోరగ
జాతిభయదయాగకారి జనమేజయుఁ డు
ర్వీతల మేలెడు నా వి
ఖ్యాతునకుఁ నందనుఁడు శతానీకుఁ డగుఁ॥ 360

తే॥ ధరణి నీకు ముప్పదియవ తరమువాఁడు
కలుఁగ గలఁడు బృహద్రథుఁ డలఘుకీర్తి
యతఁడు కడు ఘనుఁడై మునీంద్రాశ్రమమున
నంచితజ్ఞానుఁడై హరి నాశ్రయించు॥ 361

ఋ ష్య శృ ం గ చ రి త ము

సీ॥ అనఘ యయాతికి నాత్మజుఁడై నట్టి
[1](యనువు)వంశమునందు జనితుఁ డగుచు
రోమపాదుండనావృష్టిపరీహార
మూహించి మహాత్మ ఋష్యశృంగు

1 యదువు.

బంకజాక్షులచేత భ్రమియించి రావించి
తనకు బిడ్డలు లేమి దశరథుండు
సంప్రీతి నిచ్చిన శాంతాఖ్య యగు కన్య
నతనికిఁ దగ వివాహంబు [1](సేయ)
తే॥ నతఁడు వచ్చినయప్పు డా యాత్మదేశ
మున నవగ్రహదోషము ముక్తి నొందె
నతఁడు దశరథునకు జగద్ధితము [2](పొంటె)ఁ
బుత్రకామేష్టి సేయించెఁ బాత్రవిధుల॥ 362

## య దు వం శ ప్ర కా ర ము

వ॥ ఇంక సకలభువనప్రభవంబగు రమావిభునకుం బ్రభవస్థానం బయిన యదువంశంబు నభివర్ణించెద. యదునకు [3]సహస్రజిత్తు, క్రోష్టువు, నలుఁడు, రిపుఁడను నలువు రుదయించిరి. వారిలో [4](సహస్రజిత్తునకు శతజిత్తు, నా) శతజిత్తునకు హేహయుం డతనికిఁ బొమ్మిదవ తరంబువాఁ డగు కృతవీర్యున కర్జునుం డుదయించె, 363

సీ॥ దశసహస్రాబ్దముల్ దపమాచరించి ద
త్తాత్రేయు మెప్పించి యతని కరుణ
నద్భుతంబైన బాహాసహస్రంబునఁ
గార్యచింతాసమకాలదుష్ట
శాసనక్షేమతయు సామ్రాజ్యలాభంబు
వరములు గాంచి యేకరథమునను
నెల్ల రాజులఁ గెల్చి యేడు దీవులఁ జేసి
యేడునూరు మఖంబు లెసక మెసఁగ

1. సే. 2. పుట్టి. 3. శతజిత్తు. 4. (.........).

తే॥ నేలె నెనుబదియైదువేలేండ్లు ధాత్రి
పిదప భార్గవరాముని విదితపరశు
ధారచే ముక్తిఁ గాంచె నుదారయశుఁడు
జగతిఁ గార్తవీర్యార్జున చక్రవర్తి॥ 364

వ॥ మఱియుఁ దద్వంశంబున వృష్టి మధు ప్రముఖు లయిన
వారలు పెక్కండ్రు జనించిరి, 365

తే॥ యదుసుతుండగు క్రోష్టున కొదవె వృజిన
వంతుండును [1](శ్వాహి యు)తనికి వరలె నతఁడు
గాంచె నురుశంకు [2](నతనికిఁ) గలిగెఁ జిత్ర
రథుఁడు శశిబిందుఁ డతనిపుత్రత వహించె॥ 366

మ॥ శశిబిందుండు మహోన్నతిన్ శతసహస్రస్త్రీప్రియుండై చతు
ర్దిశదివ్యద్దశకోటిపుత్రు లతిభక్తిన్ సేవ సేయంగ య
[3](క్షుశునాసీరుల గ్రేణి)సేయు ధనభోగస్త్రీ లెసంగన్ యశో
విశదచ్ఛన్నజగత్త్రయుం డగుచు నుర్విం బ్రోల్చె రాజేంద్రుఁడై॥

సీ॥ శశిబిందునకు బృథుశ్రవుఁ డాతనికి ధర్ముఁ
డతనికి నుశనుఁ డాకృతికి రుచుఁడు
[4](జామఖుం) డతనికా జననాథవరునకు
శైబ్యయందు విదర్భసంజ్ఞుఁ డొదవె
వెలసిరి క్రథకైశికులు రోమపాదుండు
నను మువ్వు రాత్మజు లా విభునకు
నందుఁ (గ్రంథుఁడను) నతనిసూనుఁడు కుంతి
[6](ధృష్టి) యాతనికి [7](నిర్వృతి) యతనికి

---

1. డభిభవుండ. 2. (.........). 3. క్షుశునాశిరులన్ గ్రణి. 4. జామంఖు.
5. పృథుఁడను నతనికి సూతుడు! కుంతి. 6 వృష్టి. 7. నివృత్తి.

సీ॥ సతనినుండి వరుస దశార్హప్రభుండు
వ్యోము జీమూత వికృతి (ముఖ్యులును [1] భీమ
రథుఁడు), [2](నవరథుఁడును), దశరథ కరంభి
శకుని, దేవరాతులును సంజాతు లైరి॥ 368

వ॥ ఆ [3](దేవరాతునకు) దేవక్షత్రుఁ డా బుధునకు మధుం డా సుమనునకుఁ [4](గురువశుం)డా ఘనునకు ననుం డా దాతకుం బురుహోత్రుం డా సత్యవంతునకు [5](సాత్వతుం) డతనికి భజమానుండును, [6](భజియును, దివ్యుండును, వృష్ణియు), దేవాపృథుండును, అంధకుండును, మహాభోజుండును నను పుత్రు లుదయించి రందు భజమానునకు శతజితాదులు జనియించిరి. దేవాపృథునకు భద్రాదు లుద్భవించిరి. మహాభోజుని వంశంబువారలు భోజు లనం బరగిరి. ఆ భోజులలోన శ్వఫల్కుండను రాజునకు నక్రూరుం డుద్భవించి ప్రసిద్ధుం డయ్యె నంధునకుఁ గుకురుండును భజమానుండును, శుచియును, [7](గంబళబర్హిషుండు నను నల్గురు) గలిగి రందుఁ గుకురునకు వృష్ణి పుట్టె, వృష్ణికిఁ బుత్రపౌత్రు లై, కపోత రోమ దవిద్యోతులు గడచిరి. దవిద్యోతునకుఁ గొడుకును మనుముండును నై పునర్వసుండును నభిజిత్తునుం బ్రభవించిరి. 369

తే॥ అభిజిదాఖ్యున కాహుకుఁ డను మహాత్ముఁ
డాత్మజుం డయ్యె బంధువు లభినుతింప
నా వరేణ్యుని పుత్రు లై దేవకుండు
నుగ్రసేనుండు నను [8](వార) లుదితు లైరి॥ 370

వ॥ అందు దేవకునకు దేవదత్తుండు మొదలుగాఁ గుమారులు నలుగురును దేవకియాదిగాఁ గూతు లేడ్వురును గలిగి రక్కన్యకలు వసుదేవభార్య లైరి. ఉగ్రసేనునకుం గంసుం డాదిగాఁ బుత్రనవకంబును, గంస యాదిగా నేవురు గూఁతులుఁ బుట్టిరి. మఱి యంధకద్వితీయపుత్రుండైన భజమానునకు షష్ఠుం డయిన హృదికునకుం గృతవర్మ జనించె. సాత్వతపుత్రుండగు వృష్ణికి యుధాజిత్తును దేవమీఢుండును, ననమిత్రుండును గలిగి రందు,

1. గాఖ్యులనునుండి. 2. శరిధుడు. 3. దేవహూతునకు. 4. శమనుం డా.
5. సత్వతుం. 6. (.........). 7. నను ముప్వురు. 8. వారు.

కం॥ సుతుఁడు వృష్ణికనిష్ఠా
పత్యం [1](బన)మిత్రుఁ డధికబలు [2](శినిఁ) గనియెన్
సత్యకుఁ డతనికిఁ గలిగెన్
సాత్యకి తత్తనయుఁ డగుచు జగతిన్ వెలసెన్॥ 372

వ॥ అతనికి [3](యుయుధాన) నామంబు ముఖ్యం బయి నడచు,
తత్కులజులు జై నివేయు లనంబడుదు రగ్రజుం డయిన యుధాజిత్తునకుం
బుత్రుండు సంవి త్తతనికి నందనుండు నిఘ్నుం డతనికి నాత్మజులు సత్రా
జిత్ప్రసేను లనం బడుదురు. మఱియు దివామీఢునకు శూరుండు పుట్టె.

ఉ॥ శూరునకున్ యశోమహిమ చొప్పడ మారిషయందుఁ బుత్రుఁడై
ధీరుఁడు సంభవించె వసుదేవుఁడు తజ్జనివేళ మ్రోసెఁ బెం
పారగ మింట దేవతల యానక దుందుభు లట్టి వృత్తిచే
నా రవితేజునిం దొలుత నానకదుందుభి యందు రందఱున్॥ 374

ఆ॥ దేవభాగుఁ డాదిగా వసు[4](దేవున)
కనుజనవక మమరె నమర సమత
నందు దేవభాగు నాత్మజుఁ డాచార్యుఁ
డనఁగ వెలసె నుద్ధవాహ్వయుండు॥ 375

వ॥ మఱియు వసుదేవునకుఁ బృథయు, శ్రుతకీర్తి, శ్రుతశ్రవయు,
శ్రుతదేవయు, రాజాధిదేవియు నన నేవురు చెల్లెండ్రు గలిగిరి వారలలోన,

సీ॥ శూరుఁడు పృథ నిచ్చెఁ జుట్టము కుంతిభో
జున కపుత్రకునకుఁ దనయ గాఁగ
నాయమ పాండున కతివయై వెలయించె
ననమానుల యుధిష్ఠిరాదిసుతుల
శ్రుతకీర్తి దంతవక్త్రునిఁ గాంచెఁ గారూశ
వృద్ధశర్ముఁడు దనవిభుఁడు గాఁగ
[5](దమఘోషుపతికి శ్రుతశ్రవ కుద్ధత)
ప్రకృతికిఁ డగు శిశుపాలుఁ డొదవె

1. బున. 2. శిబి. 3. యుయుధా. 4. దేవునకును. 5. దమఘోషమశ్రుతశ్రవకుద్ధతికిని.

తే॥ కేకయునిఁ గూడి శ్రుతదేవ యేకలవ్యుఁ
గనియె నతఁడు నిషాదులఁ గలసి పెరిగె
రాజదేవి జయత్సేనరాజువలనఁ
దనరె విందానువిందు లాత్మజులు గాఁగ॥ 377

## కృష్ణావతారసూచనము

ఉ॥ [1](ధీవర)విక్రముండు వసుదేవుఁడు రోహిణియందుఁ జంద్రశో
భావిమలుం దనూజు బలభద్రసమాఖ్యు ననంతరంబ యా
దేవకియందు [2](వృష్ణికుల) దీపకుఁ గృష్ణునిఁ గాంచె బుత్రులం
బావనమూర్తులన్ మఱియుఁ బల్వురుగాఁ గనియెం గదాదులన్॥

శా॥ శ్రీరామాకుచకుంభపాళికలపైఁ జెన్నొందు విష్ణుండు భూ
భారోత్తారణకారణంబు [3](ఖల)భూపవ్యాజదేవారిసం
హారార్థంబుగఁ గృష్ణుఁడై తనదుకృత్యం బెల్ల నీడేర్చెఁ ద
చ్చారిత్రంబులు చిత్రముల్ భవలతాసంఛేదనా([4]దాత్రముల్)॥ 379

తే॥ చక్రధరునకుఁ బ్రభవమై చాల నొప్పు
విధునివంశంబు నెవ్వాఁడు విను బఠించు
నమరు నతనికిఁ బుత్రపౌత్రాభివృద్ధి
భాగ్యసౌభాగ్యవైభవప్రాభవములు॥ 380

వ॥ అని యివ్విధంబున నభిమన్యునకు వైయాసి చెప్పిన విధంబు సూతుండు వినిపించిన శౌనకాది మహామునులు మహాత్మా! సమనంతర కథావిశేషంబు లానతీయవే యని యడుగుటయు, 381

సు॥ సహజాంభోజదినేశగౌరవరరాజ్యస్థాపనాచార్య, యు
ష్టహారిద్రాయమనోభయంకరమహాజన్యస్థలీపార్థ, శ
త్రుమహాతానమ్రన్నృపాలపాలితకళాసామ్రాజ్య సంపూజ్యని
త్యహితశ్రీపదపట్టవాడగజసింహా! దానశూరోత్తమా॥ 382

---

1. ధీరత. 2. విష్ణుకుల. 3. బల. 4. పాత్రముల్.

కం॥ కుంకణ కళింగ ఛోటక
కొంకణ సౌరాష్ట్ర మగధ ఘూర్జర ముఖ్యా
నంక మహీనాథ సభా
సంకీర్తిత నిబిడసత్యసంధత్వనిధీ ॥ 383

మాలినీ॥ ఉచితవిమలతారాయోగగంభీరరేఖా
రచితవిపులచక్షూరాగళీతాంశురోచి
ర్నిచయనిభయశశ్శ్రీనిత్యసంస్తుత్యగంధ
ప్రచురితజగదండా రాయరాహుత్తగండా ॥ 384

గద్య॥ ఇది శ్రీమదష్టభాషాకవిమిత్ర నాగయమంత్రిపుత్ర సాహిత్య మార్గనిశ్శంక దోనూరిపదాంక వినయలక్ష్మీసనాథ కోనేరునాథ ప్రణీతం బయిన బాలభాగవతం బను మహాప్రబంధంబునందు స్వాయంభువాది మనుచరిత్రంబును, గజేంద్రమోక్షంబును, రైవత చాక్షుషవర్తనంబును, సముద్రమథనంబును, కూర్మావతారంబును, కాలనేమి సుమాలుల సంహారణంబును, జంభపాక బల నముచి దళనంబును, హరిహరసల్లాపంబును, వైవస్వతాదివృత్తాంతంబును, వామనావతారకథయును, సత్యవ్రతోపాఖ్యానంబును, మీనావ తారంబును, రాజవంశ కీర్తనంబును, సుద్యుమ్న చరితంబును, నిక్ష్వాకుప్రముఖజననంబును, మరుత్తాదిచరిత్రంబులును, నంబరీష కథయును, మాంధాతృ హరిశ్చంద్ర సగర భగీరథాదుల వృత్తాం తంబులును, శ్రీరామచంద్ర కథయును, జంద్రవంశరాజవర్ణనోప క్రమంబును, జమదగ్ని పరశురాముల వృత్తాంతంబులును, విశ్వామిత్ర యయాతి ప్రముఖుల చరిత్రంబులును, శకుంతలా దుష్యంత సమాగమంబులును, భరతప్రభావంబును, శంతను భీష్మాదుల జన్మంబులును, ఋష్యశృంగచరిత్రంబును, యదువంశ ప్రకారంబును, గృష్ణావతారసూచనంబును నను నష్టమస్కంధ కథావిశేషంబులు గల చతుర్థాశ్వాసము – సంపూర్ణము.

# బాలభాగవతము

## పంచమాశ్వాసము



క॥ శ్రీవిఠ్ఠలముఖ్యానుజ
సేవితపాదాబ్జ దుష్టశిక్షక రామ
క్ష్మావిభుపాత్రశ్రేష్ఠ సు
ధీవినుతయశఃప్రతాప తిరుమలభూపా ॥ 1

వ॥ ఆకర్ణింపుము పుణ్యకథాశ్రవణసముగ్రహర్షులగు శౌనకాది మహర్షులకు హరినామస్మరణరోమహర్షణి యగు రోమహర్షణి యిట్లను నట్లు ప్రాయోపవేశవ్రతశీలుం డగు పరీక్షిన్నరపాలుం డాగర్భవైష్ణవ ధర్మానురాగి యగు శుకయోగి నవలోకించి సమ్మదంబున, 2

సీ॥ యదువంశమునఁ గృష్ణుఁ డవతీర్ణుఁడై భూమి
భరము వాపె నటంచుఁ బలికి తిపుడు
రాముఁడు రోహిణీరమణికెట్లుదయించె
హరి యెట్లు దేవకియందు పొడమెఁ
బితృగేహ[1](మందున)ఁ బెరుగక యా జగ
దీశుండు రేపల్లె కేల యరిగెఁ
గంసు నేమిటికిగా హింసించె మఱియును
నే పను లొనరించె నెచట నుండె
తే॥ నెన్ని యేండ్లు విహరించె నిందుముఖుల
నెందఱ వరించెఁ దత్సుతు లెంద [2](ఱరి)
సేవనందితుఁ డగు వాసుదేవచరిత
మింతయును విస్తరంబున నేర్పరింపు ॥

1. మునందు. 2. ఱరి.

వ॥ అని కృష్ణకథాకర్ణనజనితోత్కంఠాతిరేకసంవృతుం డగు నా
జనమేజయజనకునితో జనసుతజని యైన యోగిచంద్రుండు పలికె. 4

శా॥ కల్యాణాత్మక నీదుప్రశ్నము పరాకాంతామనోజ్ఞంబు సా
కల్యోదా[1](హరణీయ) కృష్ణచరితౌఘం బైన నే నింక వై
మల్యాన్వీతముగా నెఱింగినగతిన్ మజ్జన్మవాక్ జ్ఞానసా
ఫల్యస్ఫూర్తి సెలంగ నుత్తరము సంభావ్యంబుగా నిచ్చెదన్॥ 5

సీ॥ దృప్తనృపవ్యాజదితిసుతౌఘములచే
నొదవిన భారంబు నోర్వ లేక
యల ధేనురూపమై యరిగి ధాతకు నిజ
వ్యసనంబు నెఱిఁగించి వగవ నతఁడు
హరసురసహితుఁడై యవనియుఁ దోడ రా
నమృతాబ్ధికడ కేఁగి యంబుజాక్షుఁ
బురుషసూక్తక్రమంబున సన్నుతించిన
ధ్యానుఁడై యటు గొంతఁ దడవు నిలచి

తే॥ యుడుపథంబునఁ బొడమిన యొక్క మాట
యాలకించి ప్రమోదావృతాంతరంగుఁ
డగుచు మూసిన కనుఁగవ [2](నల్లఁ దెఱచి
యాదితేయుల కిట్లని) యానతిచ్చె॥ 6

వ॥ వినుం డీ పుడమికిం గల బఱలిక మున్నె తెలిసి వెన్నుండు తద్భారాపనయార్థంబు వసుదేవగృహంబున నవతరింపంగలవాఁడు. తదాదేశంబున శేషుండు మున్నె పుట్టెడిఁ దదీయమాయయుం బాయక యవతరించు మీరలును యదువులం దంశంబులచేత జనియింపవలయును, నద్దేవుని సేవించుటకు నమరకాంతలును సంతసంబున నొదవం గల నాగ లీప్రయోజనం బచిరంబ సేయునది యని తెల్పి ధాత్రిని నూరడించి నిజధామంబునకుం జనియె నంత,

1. హరణేయు. 2. శల్ల (.........)లకు యిట్లని.

## దేవకీదేవి వివాహము

తే॥ తొల్లి శూరసేనుండు యదుప్రభుండు
ధాత్రి యేలె నెయ్యది రాజధాని గాగ
నట్టి యాదవైకాధార మగు సమృద్ధి
రాజితంబైన మథురాపురంబునందు॥ 8

ఉ॥ దేవసుతాశయుండు వసుదేవుఁడు శూరసుతుండు గణ్యుఁడై
[1](దేవక)పుత్త్రియై తనరు దేవకి వేడ్క వరింప సమ్మద
శ్రీ వెలయన్ నిజాలయముఁ జేరఁగఁ గోరి యనేకవందిసం
రావము మించ నొక్క రథరత్నము నెక్కె నవోఢతోడుతన్॥ 9

కం॥ చెలియలికిఁ బ్రియము సేయఁ
దలంచి యల యుగ్రసేనుతనయుఁడు కంసుం
డలఘుబలుం డా తీరునఁ
దెలివి నొగ లెక్క సారథిత్వముఁ దాల్చెన్॥ 10

సీ॥ ఆ దేవకుఁడు దేవకీదేవి కావేళ
  నరణంబుగా నిచ్చినట్టి గంధ
గజములు నన్నూఱు గంధర్వములు సార్థ
  మయుతంబు కాంచనస్యందనత్రి
షట్శతంబులు పరిష్కారవచ్ఛేటికా
  ద్విశతియుఁ దోడ మోదించి నడువ
ఝల్లరదుందుభుల్ శంఖమృదంగాది
  బహువాద్యరవము లంబరము నిండ
తే॥ నేగుతఱి నోయి కంస నీ వీ నవోఢ
కిట్లు సూతుఁడ వైతివి యిందువదన
యెనిమిదవచూలు నిను బొలియించు ననుచుఁ
బొడమె నశరీరవాణి యద్భుతము గాగ॥ 11

1. దేవకి.

## కంసోద్రేకము

ఆ॥ పౌషమినట్టి బైటినుదువ్వుల కులికి యూ
కంసుఁ డపుడ చేత ఖడ్గ మంది
హంతుకాముఁడై రయమునఁ జెలియలి
కొప్పుఁ బట్టుకొనియెఁ గ్రూరుఁ డగుచు॥ 12

కం॥ పట్టిన కంసుని జోడుగ
బట్టుక వసుదేవుఁ డార్తి బడియశచేతన్
గొట్టగనీకన్ నిలుపుచు
బెట్టుఘ దైన్యమునఁ బలికెఁ బ్రియపూర్వముగాన్॥ 13

శా॥ ఓ రాజన్యవరేణ్య నిర్మలయశోయుక్తుండ! యేవట్టునన్
శూరశ్లాఘ్యగుణుండ వీ చెలియలిన్ శోభావతిం గాతుక
శ్రీరాజత్కరఁ జంపఁ బూనుటకు నీ చెయ్యాడె నెబ్భంగి, ని
ర్లేరీతిం గుఱిలేని మాటలకుగా నీ భ్రాంతి నీ కేటికిన్॥ 14

ఉ॥ మృత్యువు తోడ నేర్పడును మేను ధరించినవారి కెల్ల నా
మృత్యువుభీతిఁ బాపుగతి మేకొనవచ్చునె, యైనఁ గొంతకా
లాత్యయకాంక్షమై ననుజ [1](కల్గదు) నన్న నవశ్యభావియై
మృత్యువు గాచియుంట కలిమిన్ [2](దనువుల్)వృధగావె చూడగన్॥

శా॥ నాశం బెన్నటికైనఁ గల్గునది తన్నాశంబు గావింప నా
[3](నాశాస్త్ర)ప్రముఖామరౌఘమునకున్ శక్యంబె [4](యట్లైన)చో
నాశాపాశనిబద్ధతం బడయు నయ్యంహస్తముల్ ప్రత్యభావా
వాశాస్థస్థితిపాత్రులై తన కవశ్యంబుం భుజింపం బడున్॥ 16

కం॥ అని యిట్లు పెక్కువిధముల
ననునయ మొనరింప వినక యాగ్రహము మదిన్
బెనగొలుపు కంసు నప్పుడ
మనమున నొక యుక్తిఁ గాంచి మఱలం బలికెన్॥ 17

---

1. (.........). 2 జరువుల్. 3. శాశాస్త్ర 4 యిట్లైన.

శా॥ ఏతద్గర్భభయంబుసంగతి గదా యీ పీగతిం జీవస
ప్రీతిన్ హింసకుఁ జొచ్చి తట్లయిన నీ బింబాధరాగర్భసం
జాతాపత్యచయంబు లెల్ల గడు మెచ్చ న్నీకు నర్పింతు ని
ర్ఘాతక్రూరకరాసి వే కృప చెలంగన్ నిల్పు రోషంబునన్॥ 18

తే॥ అనినఁ దద్వాక్యసారజ్ఞుఁ డగుచుఁ గంసుఁ
డట్ల యగుఁ గాక యని వధోద్యమంబు మాని
శౌరియును నద్దురాత్ముని సన్నుతించి
సంతసమున గృహప్రవేశంబు సేసె॥ 19

ఉ॥ దేవకి గాంచె నంత సుతు ధీనిధి కీర్తిమదాహ్వయున్ శచీ
దేవసమానయుక్తి వసుదేవుఁడు నత్తొలుచూలుపట్టెఁ బ్రా
జ్ఞావళి యెల్ల నీతఁ డహాహా! [1](బుతసంధుఁ) డటంచు మెచ్చగాఁ
[2](గోవిదుఁడౌచు) గంసుకడకుం గొనిపోయిన నాతఁ డిట్లనున్॥ 20

ఉ॥ దుష్టత పీని నూరకయుఁ ద్రుంపగ [3](నొల్లఁ) బ్రతిజ్ఞ సెల్లె సం
హృష్టత నీసుతున్ మఱల నెత్తుక పొమ్మిదె దేవకీ [4](సుద)
త్యష్టమగర్భ మింతియ కదా తలపోయగ మీఁద నాకు వి
ద్వేష్ట, [5](తదాత్మ)హింసయ విధించెదఁ దక్కు విచార మేటికిన్॥

కం॥ అని యనుపఁగ వసుదేవుం
డనధికవిశ్వస్తహృదయుఁడై నిజధామం
బున కేఁగినంత కలహా
శనుఁ డగు ముని వచ్చెఁ గంససదనంబునకున్॥ 22

వ॥ వచ్చి యా నారదుండు సబాంధవంబుగా వసుదేవనందాదులనియును, గంసుండునుం దదనుచరులును రక్కసులనియును దేవకీదేవికెనిమిదవ కుమారుం డయి హరి భూభారాయమానదానవసంహారంబొనర్చు ననియు రక్కసునకుం దెలిపి చనుటయు, 23

1. హామతసం. 2. గొండరిల. 3. నెల్ల. 4. సద. 5. రథాత్మ.

సీ॥ హరిచేత మును హతుం డగు కాలనేమియ
తా నయి పుట్టుట తా నెఱింగి
కలఁగి కంసుఁడు చెలియలిని మఱందిని
కారాగృహమున శృంఖలలఁ బెట్టి
యమితవిరోధముఁ బూని యదుభోజనాయకు
నుగ్రసేనుని బంధయుక్తుఁ జేసి
యధిపతి దా నయ్యె నా వసుదేవుని
పొలఁతిక నేనేట పుట్టునట్టి
తే॥ సుతులఁ దోడ్తోడఁ దునుముచుఁ గతఘృణాప్ర
సారుఁ డయ్యెఁ బ్రలంబచాణూరకేశి
బకతృణావర్తధేనుకప్రముఖదైత్య
బాణనరకాదినరపాలబంధుఁ డగుచు ॥ 24

ఉ॥ ఆఱువు రిట్లు దేవకికి నాత్మజు [1](లా) ఖలుఁడైన కంసుచే
దీఱిన మీఁద నా గుణవతీమణి కేడవగర్భ మయ్యె న
క్కాఱియ లెల్ల మాన్పుటకుఁగా దయఁ బూని యనంతసంజ్ఞచే
మీఱిన విష్ణుధామమున మించి మనోహరకాంతి[2](యంతమై)॥ 25

వ॥ ఆ సమయంబున,

కం॥ హరి విశ్వాత్ముఁడు వసుదే
వరమణిమాలునకుఁ గంసువలనిభయము లో
నరసి నిజయోగమాయం
గరుణాసంపద చెలంగఁగా నిట్లనియెన్॥ 26

వ॥ దేవ నీ విప్పుడు భూతలంబునకుం జని దేవకీగర్భంబున నేడవ గర్భంబగు శేషాఖ్యంబైన మదీయతేజంబుఁ దిగిచి గోగోపికాలంకృతంబగు నందగోకులంబునందుఁ గంసభయంబున నణంగి యున్న వసుదేవపత్ని

1. రా. 2. వంత మై.

యగు రోహిణి యనవతారంబున నిలుపుము. అనంతరంబ యష్టమ పుత్త్రుండ నగుచు [1](దేవకీదేవి కేన) జనియించెద నీవును నందపత్ని యగు యశోదయందు జనియింపుము. 27

## బ ల దే వా వ తా ర ము

తే॥ అనుటయును యోగమాయ మహాప్రసాద
మనుచు నపుడు యబ్భూమికి నరుగుదెంచి
దేవకీదేవిగర్భంబుఁ దెచ్చి రోహి
ణీ[2](రమణికుక్షి)లోపల నిలువఁ జేసె॥ 28

కం॥ దుర్భర వైష్ణవమాయా
విర్భావం బట్టు సేయ వీటఁ గల జనుల్
గర్భిణి యగు దేవకికిన్
గర్భచ్యుతి యయ్యె ననుచుఁ గలఁగిరి తమలోన్॥ 29

వ॥ అంత నక్కడ, 30

తే॥ గర్భసంకర్షణమున సంకర్షణుండు
రాముఁ డనిశం బఖిలలోకరమణవృత్తి
బల మపారం బగుట బలభద్రుఁడును న
నంగ రోహిణి కుదయించె నందనుండు॥ 31

వ॥ తదనంతరంబ,

## కృ ష్ణా వ తా ర ము

కం॥ శ్రీవల్లభ తేజము వసు
దేవుఁడు దనయందు సేర్చ దేవకిగర్భం
బై విలసిల్లె సుధాంశుస
మావేశమనోజ్ఞహరితహాయనహరిదాభన్॥ 32

1. దేవికి యేన. 2. మణికుక్షి.

సీ॥ పుండరీకాక్షుఁ డీ పొలఁతిపుత్రుం డను
విధమునఁ గనుదోయి విశద మయ్యె
పంకజనాభుఁ డీ పడఁతిసుతుం డను
సరణిఁ బొక్కిటివిడి చాల విరిసె
శ్యామలదేహుఁ డీ చామసూనుం డను
కరణిఁ జన్మొనల్కలఁ గఱ దొసంగె
కేశవుం డీ మృగాక్షికి నందనుం డను
రీతిగా నా రోమరేఖ పొడమె
తే॥ యోగనిద్రానురక్తుఁ డీ యువిదతనయుఁ
డను తెఱంగునఁ జెయ్యుల నడరె జడిమ
విష్ణునిర్మలధామప్రవేశనుతము
గర్భ మభివృద్ధి నొందంగఁ గమలముఖికి॥ 33
కం॥ హంసగమన యిట్లు బలి
ధ్వంసిం దనకుక్షిఁ దాల్చి వరలఁగఁ గని యా
కంసుం డెంతయు బహుమీ
మాంసానిబిడాంధకారమగ్నత నొందెన్॥ 34
వ॥ అట్టియెడ,
సీ॥ అభయ మిచ్చితి గదా యవనిభారం బెల్ల
వేగ మాన్చెద నని విశ్వగర్భ
యానతిచ్చితి గదా యదువంశమునయందు
పుట్టుదు నని శేషభోగిశయన
ప్రతినఁ జేసితి గదా వితతదైత్యకులంబుఁ
వెలుకునమార్చెద నని జలజనాభ
నిలువనాడితి గదా నిర్జరస్త్రీసేవ
యవధరించెద నని యాదిపురుష

తే॥ తల్లియుదరంబు వెడలుము దయ దలిర్ప
జిక్కు లన్నియుఁ దీర్పఁగఁ జిత్తగింపు
మనుచు దేవకీగర్భస్థు హరి నుతించి
రర్థి డగ్గరి యజహరాద్యమరవరులు॥ 35

కం॥ ఆ యమరులు దేవకిఁ గని
[1](యో యంగన) నీకు నంబుజోదరుఁడు సుతుం
డై యొదవెడు భయ మెంతయుఁ
బోయెడు నని భక్తిఁ బలికి పోయిరి వేడ్కన్॥ 36

కం॥ ఉదరమున జగము లిమిడిన
ముదుకనిఁ గృశమైన జఠరమున [2](నీ గతి) నె
మ్మదిఁ దాల్చిన చూలాలికిఁ
బదియవ నెల వచ్చె భాగ్యపాకము పేర్మిన్॥ 37

మ॥ ప్రణుతప్రక్రియ నంతఁ గాంచె ముదమొప్పం దేవకీదేవి శ్రా
వణకృష్ణాష్టమి నర్ధరాత్రమున దేవవ్రాతసంరక్షణ
క్షణనిర్వర్తనకీర్తితాత్మవిలస[3](త్సంధాఢ్య)వర్తిష్ణున
వ్రణకారుణ్యరసామృతోరులహరీవర్ధిష్ణునిం గృష్ణునిన్॥ 38

మ॥ అసురారాతి జనించు నత్తఱిన భూమాతోద్యసంరావముల్
ప్రసరించెన్ సురపుష్పవృష్టి గురిసెం బ్రత్యగ్రసౌరభ్యమై
విసరెం జల్లనిగాలి యంబునిధు లుద్వేలంబులై యుబ్బె నిం
పెసఁగం బాడగ నాడి రచ్చరలు బహ్వాప్తప్రమోదంబునన్॥ 39

ఉ॥ నీరదనీలగాత్రు సితనీరజపత్రవిశాలనేత్రు శం
ఖారిగదా[4](బ్జవచ్ఛ్రీతు)రుదంచితహస్తు సుకౌస్తుభప్రభాస్తు శం
పారుచిరాంబరున్ మకుటభాసురసర్వవిభూషణోజ్జ్వలున్
ధీరుని విష్ణుఁ గృష్ణు వసుదేవుఁడు దగ్గరఁ గాంచె వేడుకన్॥ 40

1. వోయనంగ. 2. నానగతి. 3. సంధాఢ్య. 4. బ్జదచ్యుతు

తే॥ కృష్ణజనోత్సవంబున క్షితిసురులకు
నయుతగోరత్నముల నిత్తు ననుచుఁ బలికి
శూరనందనుఁ డా సితాంభోరుహాక్షుఁ
బ్రణతుఁడై పెక్కువిధములఁ బ్రస్తుతించె॥ 41

తే॥ దేవకియు నాత్మజుని నాదిదేవుఁ డనుచుఁ
దెలిసి యుపనిషత్తుల్యసూక్తుల నుతించి
వినుతభయభక్తి[1](మిశ్రణం) బనువు పడగఁ
బలికెఁ బ్రాంజలియై [2](కృష్ణ) భక్తవరదు॥ 42

సీ॥ చెనఁటి కంసుండు హింసించె నా పుత్రుల
నార్వుర నంత నేఁడవదియైన
కడుపు విచ్యుతి నొందెఁ గరుణ ని క్లైనిమిది
యవచూలు నీ వైతి పద్మనాభ
నిను దనూభవునిగాఁ [3](గనినట్టి) నా భాగ్య
మింత యంత నననగ నెట్లు వచ్చు
[4](నీ) చంద మేపాటి యెఱిఁగిన నిఁక నేమి
యొనరింప నూహింతునో ఖలుండ

తే॥ దేవ నీ యవతారంబు దెలియనీక
మనుజబాలకమూర్తివై [5](యొనర) నిల్చి
యేము సేయంగఁ గల పను లెల్లఁ దెలిపి
శరణ మనియెడు మమ్ముఁ బ్రోవు పరమపురుష॥ 43

వ॥ అనుటయు శ్రీకృష్ణుం డిట్లనియె. 44

---

1. మిశ్రవణంబు. 2. గృష్ణ. 3. గనట్టి. 4. యీ. 5. వనర.

సీ॥ వినుము స్వాయంభువమనుకాలమున పృశ్ని
యను పతివ్రతయుఁ బెంపలరు సుతపుఁ
డను ప్రజాపతియు [1]( నై యుంటి ) రీవును
వసుదేవుఁడును దద్భవమ్మునందు
వినువక పండ్రెండువేలు ది[2](వ్యాబ్ద)ముల్
నన్నుఁగూర్చి తపం బొనర్చి యేఁ బ్ర
సన్నుఁడ నైన నాపన్నత నావంటి
పుత్త్రుఁ గోరితి రేను బొసఁగ మీకుఁ

తే॥ గరుణ నబ్బామునం బృశ్నిగర్భుఁ డనఁగఁ
గలిగి యామీఁద నదితియుఁ గశ్యపుండు
నైన మీకు నుపేంద్రుఁడ నై జనించి
యిపుడు కృష్ణాఖ్యుఁ బుట్టితి నిట్లు తల్లి॥ 45

వ॥ కంసుండు పూర్వంబున నాచేత హతుండైన కాలనేమి యను రక్కసుండు. తత్పుత్రు లార్వురు షడ్గర్భు లను వారలు తండ్రిచేతనే చనునట్లుగా హిరణ్యకశిపుచేత శాపంబు నొంది యుండిరి. వారల నీ గర్భంబునఁ బుట్టఁ జేసితి నేడవగర్భంబైన మదీయ తేజంబు నా యోగమాయచేత దిగియించి రోహిణీదేవి యుదరంబున నిలిపించితి నయ్యోగమాయ నందపత్ని యగు యశోదకుం బుత్రియై పుట్టి యున్నయది. నన్ను నివ్వేళం గొని చని యశోదపాదిగిట నిడి యా పడుచు నిచ్చటికిం దెచ్చుట కర్జంబు. సకలరాక్షససంహారం బొనర్చి భూభారం బణంచెద. భయంబు వల దని యానతిచ్చి పసిబిడ్డనిచందంబుఁ గైకొనుటయు, 46

1. నయ్యుంటి. 2. వ్యాబ్జ.

## ఘోష ప్ర వే శ ము

సీ॥ అపగతశృంఖలుఁడై వసుదేవుఁ డా
మహానార్భకుని నెత్తుకొని రయమున
తనకుఁ దామె వాకిళ్ళు తలుపులబిగంబు
లూడంగ నిద్రచే నొదిగి యెల్ల
జనులు తెలియంగక యుండ సంగడ శేషుండు
[1](దోడయి) చనుదేర పీడు వెడలి
కాళింది వేగ మార్గం బొసంగిన దాఁటి
భాసిల్లు నందునిపల్లెఁ జొచ్చి
తే॥ యందు నీళ్ళాడి నిద్రించు నయ్యశోద
పొదిగిటఁ దనూజుఁ బెట్టి తత్పుత్రుఁ గొనుచు
వచ్చి పత్నికి నిచ్చి పూర్వంపురీతి
బంధనముఁ దగుల్చుక యుండెఁ బవ్వళించి॥ 47

వ॥ ద్వారంబులు మున్నిటియట్ల మూయంబడియె నంత బాలక ధ్వని విని గృహపాలకు లెఱింగించినం గంసుండు తొట్రుపడుచు సూతికా గృహంబునకు వచ్చి చెలియలిచేతిపడుచు నొడిచి బిగిచికొని చెట్టుమీఁదఁ బడవైచినం బడక యద్దేవి యంబరంబునకు నెగసి దివ్యాంబరాభరణ మాల్యభూషితయును, శరశరాసనశూలభర్మాసిశంఖచక్రగదాధరాష్టభుజయును నైన దుర్గయై కనపడి యిట్లనియె. 48

కం॥ నను జంపఁగ నేమి యగుఁ
మనుజాశన నిన్ను ఖలుల మర్దించుటకై
జనియించినవాఁ డొకచోఁ
బనివడి యున్నాఁడె యింకఁ బదరఁగ నేలా॥ 49

1. తోడయి.

ఆ॥ అనుచుఁ బలికి యుర్గ చనియెఁ గంసుండు న
ప్పలుకు వినుచు నులికి బంధనములు
ద్రోవఁ జేసి దేవకీవసుదేవులఁ
బ్రియముఁ జెప్పి పంచి పెరయ ననిపె॥ 50

సీ॥ మఱునాఁడు ప్రొద్దున మంత్రులఁ బిలచి యా
కంసుండు రాత్రి దుర్గాప్రణీత
యగు వార్త యంతయుఁ దగ నెఱింగింప వా
రెల్ల నో దేవ! నీ విట్టి పనికిఁ
దగు నుపాయంబుఁ జిత్తమునఁ జింతింపుము
రిపువృద్ధి కోఱగామి నెపుడు నోసఁగు
బాలురఁ నెల్ల ద్రుంపఁగఁ బంపు మిలమీఁద
ఘోరపుటసురుల గూఢవృత్తి
తే॥ విప్రులును ధేనువులు విష్ణువెన్నుబలము
వారి నణఁచిన నతఁడు దుర్బలత నొందు
నట్లు సేయింపు మనుటయు నాగ్రహమున
నెల్లచో నవ్విధమునఁ జేయింపఁ దొడఁగె॥ 51

తరల॥ [1](ఇట) యశోదయు శౌరి గృష్ణుని నింపునం దనసజ్జ ని
ల్పుటయు ముఁ దనకుం జనించిన [2](పుత్రికం) గొని పోవఁ జా
లుటయు వైష్ణవమాయచే మదిలో నెఱుంగగ లేక వి
స్ఫుటము[3](గా) నుదయించెఁ బుత్రుఁడ పుట్టె నంచు నరాధిపా॥

వ॥ నందుండును బుత్రజన్మముదితుం డయి బ్రాహ్మణుల రావించి జాతకర్మంబు లొనర్చి ధేనులక్షద్వయంబును సప్తతిలపర్వతములును దానంబు నేసి మఱియును నిష్టార్థంబుల నర్థులం గృతార్థులం జేసిన, 53

1. యిట్టి. 2. పుత్రిపుత్రికెం 3. గ.

కం॥ పసుపును నూనియయుఁ [1](గలపి)
పసులకు నన్నిటికిఁ జమరి ప్రమదముతోడన్
పసగల నేయ్యాల్పెరుగుల
వసంత మాడిరి చెలంగి వల్లవు లెల్లన్॥ 54

శా॥ పాలిం డ్లెంతయుఁ బేదఁగాను వణఁకింప న్వేడ్కతో వచ్చి గో
పాల[2](స్త్రీలు) మురారికిం జలక మొప్పం జేసి రా రాము నా
శాలాంతస్థలిఁ దొట్లలోనికి మహోత్సాహంబునం బట్టి రా
జోల ల్పాడిరి తానమానములచే శోభిల్లు రాగంబులన్॥ 55

ఆ॥ మోద మలర రోహిణీదేవియును నప్పు
డసమభూషణాంబరాభిరాము
యగుచుఁ గృష్ణసేవనార్థంబు చరియించెఁ
దనదు సుతుఁడు నభ్యుదయము నొంద॥ 56

శా॥ అంత న్నందుఁడు పల్లియన్ హితుల రక్షార్థంబు రావించి శు
ద్ధాంతస్త్రీలకు బాలరక్షణవిధా వ్యాపారము ల్దెల్పి[3] ధీ
మంతు ల్గొల్వఁగ నేఁగెఁ దా మధురకున్ మానం బనూనంబుగా
బంతం బొప్పెడు కంసభూపతికిఁ గప్పం బిచ్చు కార్యంబునన్॥ 57

తే॥ ఏఁగి యచ్చటఁ గంసున [4](కేఁటనేఁటఁ)
బెట్టఁ గల ధన మంతయుఁ బెట్టి మన్న
నయును వీడ్కోలుఁ బడసిన నందుఁ గాంచి
యేకతంబున వసుదేవుఁ డిట్టు లనియె॥ 58

కం॥ పెద్దతనంబున నీకొక
ముద్దులసుతుఁ డొదవె నట్టి మోదము మాకున్
దద్దయుఁ గలిగెఁ జుమీ మన
మిద్దఱముం భ్రాత లనఁగ నెనయుట నందా॥ 59

1. యును గల 2. శ్రీలు. 3. రద్ధీ. 4. కేధి.

కం॥ నిను దండ్రిగఁ జూచుక నా
తనయుఁ డొకఁడు నీ మనోజ్ఞధామంబున నీ
వనితామణి లాలింపఁగ
ననువున నున్నాఁడు వాని నరయుము చాలన్॥ 60

వ॥ అనుటయు,

కం॥ ముదమున నప్పలుకులు విని
యదువర్యునిఁ జూచి కంసహతపుత్రులకై
మది వగవకుమీ యనుచున్
గదలె న్నందనుఁడు గోపగణములు గొలువన్॥ 61

పూ త నా సం హా ర ము

సీ॥ అంతఁ గంసనియుక్తయై బాలహింసనం
బొనరించు పూతన యొక్కనాఁడు
వ్రేపల్లియకు వచ్చి వెలఁదియై [1](చూపఱు)
చొక్క నందునియిల్లు సొచ్చి యచటఁ
జూచి రోహిణియు యశోదయు భ్రమయంగ
శకటరత్నముక్రిందిశయ్యమీఁదఁ
గడు నొప్పు కృష్ణునిఁ గాంచి గ్రక్కున నెత్తి
కొని కన్నతండ్రి యోకొంటి వనుచు
తే॥ నోర విషపుచన్నిడిన వెన్నుండుఁ బాలు
తోడఁగూడనే సప్తధాతువులు దిగువఁ
గుడువ భయ మంది వడఁకుచు విడువు మనుచు
నొబలు పెట్టినప్పుడె ప్రాణములను దిగిచె॥ 62

1. చూపఱ.

వ॥ అప్పుడు,

మ॥ వికృతాకారత నున్న రక్కసిపయిన్ వేడ్కొందు చందంబు లే
క కడు న్ముద్దుగఁ గ్రీడసల్పు విదళత్కంజేక్షణుం గృష్ణు గో
పికలుం జెల్లె నటంచు నెత్తుకొనిరో భీతిల్లెనో యంచు సా
రెకు గోపుచ్ఛముఁ ద్రిప్పి రక్ష యిడి రర్థిం బెక్కు మార్గంబులన్ ॥

తే॥ యోజనము నర నిడుపుతో నొరగి యున్న
యా నిశాటిని నందాదు లపుడు వచ్చి
కాంచి శస్త్రుల ఖండించి కడ దహించి
రదియుఁ గృష్ణుని కరుణచే నందె సుగతి ॥ 64

శకటతృణావర్తభంజనము

ఆ॥ అంత మఱియుఁ గంసహతకసంప్రేరితుఁ
డైన శకటదైత్యుఁ డట్లు కృష్ణు
సెజ్జక్రిందుగాఁగఁ జెలువొందు నబ్బండి
నూఁది కుటిలబుద్ధి నుండు నంత ॥ 65

సీ॥ [1](ఒదిఁగిలఁ) బడనేర్చు చున్న కాలంబున
[2](వాదిత్రగీతారవములు సెలఁగ
బాలున కొకనాఁడు) వనిత పండువు సేసి
బోరు కాడించి కుమారవరుని
బండిక్రిందటిసెజ్జపైఁ బవ్వళింపించి
బంధుతాపూజనపరత నుండు
నవ్వేళఁ గృష్ణుఁడు నల్ల [3](నచ్చోటికిఁ
గిదు)కుచు మీఁదికిఁ బదము లెత్తె

1. వొదికిల. 2. (..........). 3. నచటికి గిదు.

తే॥ నెత్తినప్పటిపదము లొక్కింత సోఁకి
నంతలో బండి చు వ్వన నంబరమున
కెగసి భగ్నాత్మమై [1](సంధు) లెడలి కూలె
పృథ్విపై భీమనినదంబు పిక్కటిలఁగ॥ 66

కం॥ నందుఁడును గోపకులు నా
చందమునకు వెఱఁగుపడిరి సరభసముగ నా
నందునిసతి యురమునఁ జే
ర్చెం దనయుని నన్ను నేమి సేసితి రనుచున్॥ 67

కం॥ అంత మఱియు నొకనాఁ డ
క్కాంత నిజాంకమున శౌరి గ్రావముగతి న
త్యంతభరం బయి తోఁచిన
నెంతయు వెఱఁ గంది యతని నిల్పై నిలిపెన్॥ 68

వ॥ ఆలోనం దృణావర్తుం డను కంసభృత్యుండు సుడిగాలియై
చనుదెంచి యందఱఁ గొండలం బందఁజేయుచు గోవిందుని నెత్తికొని
చనిన గగనంబునం బర్వతంబుభంగి వ్రేఁగై తోఁచిన భరింప లేక యుక్కు
సెడిన యా రక్కసుని నక్కపటబాలుండు గరంబు బిగియం బట్టి వ్రేలి
యుండుటయును నతండు కన్నులు దెఱవకునికి యవ్యక్తరాగంబునం
బల్లియ నడుమన్ బడుటయు, 69

కం॥ నాగలక రక్కసుపై విం
తగ నున్న కుమారు నద్భుతం బిది యని క్రొ
మ్మగువలు దెచ్చి యొసంగిరి
వగచు యశోదకు మహోత్సవం బొనగూడన్॥ 70

1. సందు నెడలి.

తే॥ అంత వసుదేవచోదితుఁ డగుచు యదుపు
రోహితుండైన ఘనుఁడు గర్గుండు తనగృ
హంబునకు వచ్చుటయు నందుఁ డర్చ లొనఁగి
రోహిణీయశోదలకుమారుఁను జూపె॥ 71

వ॥ నీవు మహానుభావుండ వీ కుమారులకు నామకరణసంస్కారంబొనర్పు మనుటయు నతండు యదుపురోహితుండ నయిన నేను సంస్కారంబు సేసిన గంసునకు సందేహంబు పుట్టుఁ బ్రకాశంబుసేయం జనదని యోజింగించి,

కం॥ ఆ మేటి రోహిణీసుతు
రాముఁ డని యశోదయొద్ద రాజిల్లు హరిన్
బ్రేమమునఁ గృష్ణుఁ డనియును
నామము లిడి తిరిగి యరిగె నందానుమతిన్॥ 73

శా॥ అంతన్ రాముఁడు గృష్ణుఁడున్ వ్రజమునం దాభీరనాథుండును
త్కాంతారత్నము లెల్ల వేళల సముద్యద్భక్తి లాలింప గా
నంతర్గుప్తసమగ్రసత్త్వములతో నంతంత కుప్పాంగుచున్
వింతల్గా బెరుగం దొణంగిరి జనుల్ వీక్షించి హర్షింపగన్॥ 74

సీ॥ కరపంకజములఁ జక్కగఁ బట్టి విడుచుచు
నడగుదమ్ములు దచ్చి యాడి యాడి
చెలువు మీఱఁగ బోరగిలఁ బడి తల యించు
కించుక గదలంగ నెత్తి యెత్తి
కొట్టు కొట్టు మనుచు బెట్టుగా నగు పెంపు
సుదతులఁ దప్పక చూచి చూచి
అన్న మా [1](యన్నరమ్మనుచుఁ) జేతులు సాఁచు
వారిచేతులకును వచ్చి వచ్చి

1. (..........).

తే॥ అల్ల నల్లన [1](నుగ్గును)గ్గనుట యాది
యైన మాటలు ముద్దుగా నాడి యాడి
యఖిలజనులు నల్లారుముద్దని నుతింపఁ
బెరిగెఁ గృష్ణుఁడు విదియచందురుఁడుపోలె॥ 75

కం॥ అలవడఁ గొందఱు వ్రేతలు
వెలకిలఁ బవడింపఁ జేసి వెన్నని నిదెచ
క్కిలిగిలి యని పుణుకుచుఁ గల
కల నవ్వఁగ [2](నెంతోముదముఁ) గాంతురు మరులన్॥ 76

తే॥ అందుఁ గొందఱు వ్రేతలు చందమామ
రావో జాబిల్లి రావో తోరముగ వెండి
కుడుక వెన్నయు బంగారుకుడుకఁ బాలు
దెమ్ము మా కృష్ణునకు నంద్రు సమ్మదమున॥ 77

కం॥ విద్దెలకు బుట్టి నిల్లగు
నద్దేవుని నిలువఁ బెట్టి యాడింతు రొగిన్
విద్దెము విద్దెము పట్టిక
విద్దెఁ బని కొంద ఱసమవినుతక్రీడన్॥ 78

తే॥ రమ్ము నాతోడ నాభాగ్యరాశి రమ్ము
రమ్ము నాగుమ్మ రత్నమ్మ రమ్ము కృష్ణ
యనుచుఁ గొందఱు వ్రేత ల య్యదుకులేంద్రు
నెత్తికొంద్రు పీఁ డెవ్వరి వోనుఁ గనుచు॥ 79

కం॥ మచ్చికఁ గొందఱు వ్రేతలు
ముచ్చటపడి లోచనములు మూసుక యవ్వల్
వచ్చిరి విందులు వచ్చిరి
వచ్చి రనుచుఁ బట్టికొంద్రు వనజదళాక్షున్॥ 80

1. యాగ్గవు. 2 (.........).

తే॥ అన్న యడుగొత్తు మిచ్చెద వెన్నముద్ద
యప్ప చే సాఁపు మీఁగడ లప్ప యిత్తు
ననుచు వ్రేఁతలు నేర్పఁ బట్టడుగు లొయ్యఁ
బెట్టెఁ గృష్ణుఁడు చూపఱ ప్రియపడంగ॥ 81

ఉ॥ గంటలు మువ్వలున్ మొరయగా విలసిల్లెడు రావిరేకతో
దంట యనంగఁ ద్రిమ్మరుచుఁ న న్నపు డెవ్వరు గన్న మేనిపై
నంటిన దుమ్ములోఁ దుడిచి యక్కునఁ జేర్చుకొనంగఁ గృష్ణుఁ డిం
టింటికి నేఁగి యాడు దనయీడగు బాలురఁ గూడి వేడుకన్॥ 82

వ॥ ఇవ్విధంబునఁ గృష్ణుండు బలభద్రసమేతుండై గోపబాలకులం గూడి యాడుచు వ్రేఁతలయిండ్లఁ బయస్యంబు దొంగిలి యారగించుచు విహరింప వ్రేఁతలు యశోదకడకుం జని, 83

సీ॥ హాసంబు సేయుచు నసమయమున ధే
నులకు వత్సంబులఁ గలయ విడుచు
కల్పితనే.........కడవల బాలును
బెరుగును వెన్నయుఁ దరశి మెసఁగు
వానరంబులఁ బిల్చి వానిచేఁ దినిపించు
నమరకుండిన నపత్యముల మోదు (?)
నందని ద్రవ్యంబు నమర నులూఖల
పీఠాదికంబులఁ బెట్టి తిగుచు
తే॥ చొచ్చి చీఁకటియిండ్లలో సురుచిరాత్మ
భూషణాపురత్నముల దీపములుగ మెలఁగు
మఱియు నేమియు నెఱుఁగని మంచివాని
పగిది నూరక యుండు నీ బాలుఁ డబల॥ 84

కం॥ అని మఱియుఁ బెక్కువిధముల
వినిపించిన విని యశోద వెసఁ బయ్యెద మో
మున రాచుకొను కుమారుని
జననుత యేమియునుఁ బలుకఁ జాలక యుండెన్॥ 85

## మృద్భక్షణాది చరిత్రములు

తే॥ అంత నొక్కనాఁడు రాముఁడు లంబ కృష్ణ
డింభు మృత్తికఁ దినియె నంచెలుక సేయ
విని యశోద వీక్షించి[1](వి యూతని ముఖంబు
మన్ను దిన నేల యని తన్ను) దన్నుటయును॥ 86

కం॥ కనుగొనుము లేదు సుమ్మీ
యని కృష్ణుఁడు నోరు దెఱువ నందు యశోదా
వనిత విలోకించె జగం
బును నఖిలము విస్మయప్రమోదము లొదవన్ ॥ 87

కం॥ కనుగొని యశోద యీతం
డనుమానము లేదు విష్ణుఁ డని తలఁపంగా
తనమాయఁ గప్పెఁ గృష్ణుఁడు
తనయుం డను తొంటిబుద్ధిఁ దాల్పగఁ జేసెన్॥ 88

వ॥ అని చెప్పుటయును బరీక్షిన్మహీపాలుండు నందుండు యశోదయు నెట్టి వారని యడుగుటయుఁ బునర్వసుప్రవరుండగు ద్రోణుండును నతనిభార్య ధరయును ధరణియందు జనియించిన తమకు హరియందుఁ బరమభక్తి వలయునని ప్రసన్నుండగు బ్రహ్మదేవునిచేత వరంబులు గొని రది నిమిత్తంబున ద్రోణుండు నందుం డయ్యె ధర యశోద యయ్యె నని తెలిపి శుకయోగి మఱియు నిట్లనియె, 89

2 చె (.........) తన్ను.

సీ॥ ఒకనాఁడు చల్ల సేయ యశోదఁ ద్రోడికెడు
కొమరుని నంకపీఠమున నిల్పి
చన్నిచ్చి యచ్చట నున్నట్టి పాల పొం
గార్పంగఁ బోవ నయ్యర్భకుండు
నలిగి యాదధిఘటం బపుడ భిన్నముసేసి
యటుపోయి యొక్కఱోలమర నెక్కి
యుట్టిపై నవనీత మొక్కఁ గోఁతికి మేపు
చుండంగఁ జూచి యయ్యువతి పట్టి
తే॥ కట్టఁ బోవఁ గట్టెడుత్రాడు గడమ వడగ
నెదురు లిడి యిడి కడు నలయిక వహింపఁ
గాంచి కరుణించి హరి దానె గట్టువడియె
కట్టుకొని తానె యొక యులూఖలముతోడ॥ 90

నలకూబర మణిగ్రీవ శాపమోక్షము

వ॥ ఆ సమయంబునఁ గృష్ణుండు జలక్రీడాసమయంబున వనితా సన్నిధి వివస్త్రులై యుండుటం జేసి నారదశాపంబు నొంది |వజంబున యమళార్జునత్వంబున జనియించిన కుబేరపుత్రు లయిన నలకూబరమణి గ్రీవుల శాపవిమోచనంబు సేయఁ జిత్తగించి, 91

తే॥ తల్లి పనుల కేగెడు ఱోలు తరల దిగిచి
యమడ[1](మద్దుల) నడిమికి నడ్డ మీడ్చె
నవియుఁ బడి విశాపత నొంది యక్షు లయ్యె
జనిరి వారును గృష్ణుని సన్నుతించి॥ 92

కం॥ ఆ నినదము విని నందుం
డా నెలవున కేఁగుదెంచి యా కృష్ణుని సం
ధానమును విడిచి యెత్తుక
యానందముతోడఁ జేరె నాత్మగృహంబున్॥ 93

1. మద్దుల.

## బృందావనగమనము

వ॥ అంత నందోపనందాదులగు వల్లవులు పూతనాదిమహోత్పా
తంబుల నదరి శంకితులయి యీ బృహద్వనంబు విడిచి యమునాప్రవాహ
మనోహరంబును, గోవర్ధనాచలప్రాంతకాంతంబును, ధేనువిహారోచిత స్థల
శోభితంబును నయిన బృందావనంబునకు నరిగి వ్రజంబు గావించికొని
యుండి రచ్చట రామకృష్ణులు గోపాలబాలకసమేతులై వత్సపాలకత్వం
బున విహారంబు సేయుచుండి రంత నొక్కనాఁడు, 94

## వత్సాపహరణము

కం॥ వనజాక్షుఁడు వత్సాకృతిఁ
జను దెంచిన దైత్యు వెనుకచరణంబులు గ్ర
క్కునఁ బట్టి నెలఁగతోనే
ర్చినలావునఁ గొట్టి విగతజీవునిఁ జేసెన్॥ 95

తే॥ మఱియు నొకనాఁడు బకమూర్తి మెఱయు నొక్క
యసుర తను ద్రింగి యోర్వంగ నలవి గాక
నలఁగి వెడలింప వాని తుండములు బట్టి
వ్రయ్యలుగఁ జేసె శౌరి దేవతలు వొగడ॥ 96

వ॥ మఱియు నొక్కనాఁడు, 97

సీ॥ అఘుఁ డను రక్కసుం డజగరంబై యోజ
నాయామమూర్తి డా నరుగుదెంచు
తెరవున వక్త్రంబుఁ దెఱచుక యుండ న
వత్సంబుగా శిశువ్రజము [1](ద్రింగు)
టెఱిఁగి శౌరియు లోని కేఁగి కుత్తుకలోనఁ
బెద్దగాఁ దన మేను బెంచి [2](రిమ్మ)

1. పించు. 2. (.........).

గొట్టినచందంబుఁ గూర్చినఁ గడు పుబ్బ
రించి దైత్యుండు నిర్జీవుఁ డయ్యె

తే॥ హరియు శిశువత్ససహితుఁడై యతిరయమున
వెడలి యొక్క కాసారంబుకడకు నేఁగి
చలిది కుడుచుచు [2](నుండ) వత్సములు దప్పి
పోవుటయు లేచి వెదకంగఁ బోయి యచట॥ 98

వ॥ క్రేపులం గానక మఱలి వచ్చి బాలురం గనక తనమాహా
త్మ్యంబు దెలియు[1]వొంటె విరించి కొని చని దాఁచుటయెఱింగి యప్పుడు,

ఉ॥ క్రేపులు తొంటియట్ల పరికింపగ [3](నన్నియుఁ) దానయై తగన్
గోపకుమారులట్ల యొనగూడగ నందఱు దానయై పరుం
డీ పరిపాటి దెవ్వఁడును నిచ్చ నెఱుంగక యుండునట్లుగా
గోపనివాసదేశములకుం జనియెం జలజాక్షుఁ డర్మిలిన్॥ 100

శా॥ ఆ వత్సావళిఁ జూచి ధేనువులు సత్యర్థంబు నుప్పొంగు ప్రే
మావిర్భావము నొందె గోపకులు సాంద్రానందముం జెంది రా
[4](శేవన్) వచ్చిన యాత్మపుత్రకులచూడ్కిన్ మున్ను లోకంబులన్
గోవిందుం డొనరించు మాయ నొరుడెందుం దాఁటగా శక్తుఁడే॥

వ॥ అంత ధాత తనత్రుటికాలంబు ధరణి నొక్కవత్సరం బగునంతం
బూర్వపుచోట బాలవత్ససమేతుండై లీలం దొంటిభాతిఁ జరియించు
వసుదేవుపట్టిం గాంచి, 102

చం॥ మనమున నద్భుతం బొదవె మాటికి మాటికిఁ జూడఁ జూడగా
వనజదళాక్షమూర్తు లయి వత్సములున్ శిశువు ల్గనం బడన్
వనజభవుండ డగ్గరగ వచ్చుతఱిన్ వసుదేవసూతి, గ్ర
మ్మనఁ గనరానివానిగ నమర్చె నరాధిప వాని నన్నిటిన్॥ 1(3

1. వొంటు. 2. నన్నియు. 3. దేవ.

తే॥ అంతఁ గృష్ణునిఁ జేరి పద్మాసనుండు
పాదపద్మానతుం డయి భక్తిఁ బొగడి
యొనర బాలురఁ గ్రేపుల నొప్పగించి
తదనుమతి నేఁగె శుభనిజధామమునకు॥ 104

వ॥ కృష్ణుండును బ్రాతరాశకబళహస్తుండయి క్రేపులఁ దోలుకొని నాఁ డన్నంబు లారగించుచున్న సరిత్తీరంబున నున్న బాలకులఁ జేరవచ్చిన వారలను దన్మాయాబలంబున వత్సరంబును క్షణమాత్రం బయి పోవుటం జేసి కృష్ణ! శీఘ్రంబ వచ్చితి గదా యని సంతసించి రంత మఱియు నొక్కనాఁడు, 105

తే॥ ధేనుకాసురసంరుద్ధమైన తాళ
వనములోఁ గల పండ్లపై వాంఛ సేయ
వ్రేలు వేడుకఁ గొల్వ నవ్విభుఁడు రామ
సహితుఁడై యా వనమునకుఁ జనియె నంత॥ 106

కం॥ బలదేవుం డా వనము
గ్గలికఁ బ్రవేశించి కలయఁగ దలించి రవం
బిలుగుపడఁ [1](నూపి) తాళీ
ఫలములు రాలంగఁ జేసె బాహుబలమునన్॥ 107

ఉ॥ ఆ రవ మత్తఱిన్ విని సమగ్రతరాగ్రహవృత్తి రాసభా
కారత నుండు రక్కసుఁడు గ్రక్కున నుర్విఁ జలింపఁ జేయుచున్
జేరగ వచ్చి యా బలుని చెన్నగు వక్షముఁ దన్నె నుద్ధతిన్
గారవకారియై వెనుకకాళ్ళఁ దదీయసఖు ల్భయంపడన్॥ 108

కం॥ రాముఁడు నపు డొక కరమునఁ
బామరు నద్దైత్యు వెనుకపదములు సత్త్వ
శ్రీ మెఱయఁ బట్టి తాళము
తోఁ మోఁదినఁ గూలెఁ దరువుతో నతఁ డుర్విన్॥ 109

1. పడి సమునదాళ.

కం॥ ధేనుకబాంధవు లగుచుఁబర
దానవు లరుదెంచుటయు నుదంచితమహిమ
శ్రీనిధులు రామకృష్ణులు
ధేనుకునిం బోలె తావు దీర్చిరి పెలుచన్॥ 110

కం॥ తాళీవనఫలభక్షణ
కేళిం దత్పరులు దుండఁగీ [1](లర్భకు) లా
నాళీకదళాక్షుని వన
పాళీసభ్రాజమానుఁ బ్రణుతించి రొగిన్॥ 111

వ॥ మఱియు నొక్కనాఁడు వాసుదేవుండు రామునిం బాసి బృందావనంబునఁ జరియింపుచుండి గోగోపసంఘంబు యమునాజలంబుఁ ద్రావి మూర్ఛితంబయిన నమృతవర్షి యయిన వీక్షణంబున మఱల బ్రతికించి తద్విషహేతు వయిన కాళీయాహి నమ్మడుగువలన నెడలింప నుద్యోగంబు సేసి, 112

కాళీయమర్దనము

మ॥ గరుడత్రస్తము కాళియోరగము నాఘూటాతివేగోచ్చల
ద్గరళం బిం దనిశంబు నుండుట గదా కాళిందిలో నీ జలా
కర మత్యుగ్రాహ్యత నొందె నీ జలముపైఁ గాలూఁదు న గ్గాలియుం
బరితాపంబునొసంగుఁ బ్రాణులకు నీపాపంబు మాన్పం దగున్॥ 113

తే॥ అని విచారంబు సేసి పీతాంబరంబు
నడుము బలియించి [2](దరి) నున్న కడిమితరువు
నెక్కి భుజ మప్పళించుక యెగసి యుఱికె
[3](మడువులోఁ) బడ నమ్మహామహితయశుఁడు॥ 114

1. గార్భకకు. 2. దగు. 3. మడువు.

సీ॥ అప్పుడు గలిఁగి నూఱమ్ముల పెట్టు దూ
రమున ద్రొట్టిన నిట్టి రవము వినుచుఁ
గనలున వెడలి యా కాళియనాగంబు
కమలలోచనుని మర్మములు గఱచి
తనువునంతయు జుట్టు[1](కొనుఁడు నా) [2](దిట్టయు)
దరి నిల్చియున్న బాంధవులు వగవ
నొక్కింత తడ వేమియును నెఱుంగనివాని
పగిది నూరక యుండి బలునిచేత

తే॥ బోధితుం డయి విదళించి పొరలఁ ద్రిప్పి
కడిమిమై జుట్టు తప్పించి [3](యెడద) నొత్తి
మించిన జవంబుచేఁ జొకళించి యెగసి
నిలిచెఁ బడగలమీఁదికి [4](నెలవు) మెఱయ 115

శా॥ ఆడెం దాండవ మయ్యహీంద్రుదలలం దాసక్తులై కిన్నరుల్
పాడన్ సాంద్రకుతూహలంబున నభోభాగస్థులై నిర్జరుల్
చూడన్ దత్తటి నున్న బాంధవహిత[5](స్తోమంబు) దుఃఖంబులన్
వీడన్ శౌరి యమందగౌరవగుణావిర్భావసంభావ్యుఁడై॥ 116

తే॥ జొరజొరన నోళ్ళ నెల్ల నెత్తురులు దరియ
క్షీణసకలేంద్రియుం డయి చిక్కి కాళి
యుండు భీతిల్లు నంతఁ దద్యువతు లాది
పురుషుఁ బ్రార్థించి రార్తలై పురుషభిక్ష॥ 117

వ॥ అంత సర్వేశ్వరుండు దయాళుండు గావున మన్నించి విడిచి యక్కాళీయుని సముద్రంబునకుం బోవ ననిపె నదియాదిగా నయ్యుదకం బమృతం బగునట్లుగాఁ బ్రసాదించె బంధుసమేతుండయి యా దివసంబునం ద య్యమునాతటంబునందే యుండి, 118

1. కనుండునా. 2. దిట్టి. 3. యెదను. 4. యెలవు. 5. స్తోమ.

ఆ॥ రాత్రి చుట్టుకొను నరణ్యానలము బల
భద్రుచేత మట్టుపడగఁ జేసి
సకలబంధుమిత్రసంస్తూయమానుఁడై
యరిగె బల్లిదుఁడు దినాదివేళ ॥ 119

ఉ॥ అంతఁ బ్రలంబనాముఁడు మహాసురుఁడుం గడుఁ బుష్పవంతులన్
సంతమసంబువోలె బలశౌరుల నోర్చెద నంచుఁ గంసుతో
మంతనముండి వచ్చి గరిమంబున గోపకుమారరాజి[1](యం)
దెంతయు నేర్పునం గలసి యేర్పడకుండెను రంధ్రకాంక్షియై॥ 120

తే॥ ఇట్టి విధ మంతయును గృష్ణుఁ డెఱిఁగి యంత
నాఁడు వేసవిలో యమునాతటమున
[2](జతులు) జేతల మోవంగఁ బ్రతిన సేసి
కందుకక్రీడఁ దలపెట్టి కౌతుకమున ॥ 121

వ॥ రామ శ్రీధామవృషభాదు లొక్క మూఁకయును, కృష్ణభద్ర
సేనప్రలంబాదు లొక్క మూఁకయును నై యాడుచు రామాదులు
గెలిచిన శ్రీధాముని గృష్ణుండును, వృషభుని భద్రసేనుండును, బలభద్రుని
బ్రలంబుండును వహించి రందు, 122

సీ॥ అదియ సందుగఁ బ్రలంబాధముండు రయంబు
మెఱయగ రాముని మేర దాఁటి
కొని చని యారూఢగురుతరుండై తోఁప
గతసత్త్వుఁడై నిజాకృతి ధరించె
క్రూరదీప్తాక్షుండు భ్రుకుటీభయంకరుం
డుగ్రదంష్ట్రుండు నై యున్న యసురఁ
గాంచి బలుండు ముద్గరదృఢముష్టిచే
నప్పుడ తల తునియలుగఁ జేసి

1. యుం. 2. జతుల.

ఆ॥ జయము గొన్న యట్టి సంకర్షణునిఁ జేరి
గోపతనయు లెత్తుకొనిరి వేడ్క-
విరులవాన గురిసె వేల్పుమూఁకలు ప్రలం
బఘ్నుఁ [1](డీతఁ) డనుచుఁ బలికి రధిప॥ 123

వ॥ మఱియును,

దవానలపానము

మ॥ ఒకనాఁ డుగ్రదవాగ్ని చుట్టుకొని హాహాయంతిత్వరాత్రేడిత
స్వకనామాఖ్యల గోపసూనులఁ గృపాసక్తిన్ విలోకించి య
య్యకలంకాత్ముల నేత్రపద్మముల మాయంజేసి యా శౌరి యో
డక మంచు న్వడి నట్టి కారడవిమంట ల్మ్రింగి కాచెన్ నృపా॥

కం॥ తనయోగమాయచేతన్
వినిమీలితనేత్రు లయిన వ్రేఁబోడుకలన్
వనజాక్షుఁడు భాండీరం
బనువట భూరుహము సేర్చె నద్భుత మందన్॥ 125

వ॥ అంత,

సీ॥ శీతవిద్రావితాశేషమందోష్ణాతి
శయసమారూఢయోషాస్తనంబు
పల్లవకాంక్షితప్రౌఢాంగనాపీన
కుచకుంభగాఢోపగూహనంబు
కుటఖండసంభృతోత్కటకరీషానలో
[3](ద్యద్ధూమ)సంఛాదితాంబరంబు
జానుసంవ్యాజితశాత్రోదరీకృత
వ్యాయస్తదుర్బలవార్ధకంబు

1. డితండ. 2. వది. 3. ద్యద్ధూతము.

తే॥ జనవరస్వీకృతోరు[1](హసంతికం)బు
హవ్యవాటోత్కటనసంశ్రితాహస్కరంబు
దీర్ఘదీర్ఘవిభావరీదీపితంబు
నయ్యె హేమంతవేళాసమాగమంబు ॥ 126

గో పి కా వ్ర త ము లు

వ॥ అట్టి హేమంతసమయంబునందుఁ గాత్యాయన్యర్చనవ్రతంబు సలుపుచుం గోపకుమారిక లొక్కనాఁడు తటంబులం బటంబు లిడి యమునాజలంబునం దీర్థంబులాడు సమయంబున, 127

వ ల్ల వీ వ స్త్రా ప హ ర ణ ము

కం॥ ఆ వలువలు దా నెత్తుక
యావల నొక నీప మెక్కి యంబుజనేత్రుం
డో వనితలార ! యిచటికి
వే వచ్చిన వలువ లిత్తు వినుఁ డని పలికెన్॥ 128

తే॥ శౌరిచేత నటులఁ జీరలు చిక్కిన
గోపబాలికలకలరుఁ గొలనిలోనఁ
బ్రహ్మద మాత్మభవత నమరి కన్పట్టుట
తగునె కాదె యుక్తిఁ దలచి చూడ॥ 129

వ॥ అట్లు కృష్ణహృతవస్త్రలై లజ్జాప్రమోదమేదురలగు గోపబాలికలు కృష్ణుని నవలోకించి యాకంఠమగ్నలగుచు, 130

కం॥ నీకుం దాసుల మయ్యెద
మో కృష్ణ! పటంబు లిచటి కొసఁగవె యనినన్
నాకుం [2](దాసులె) మైనన్
నాకడ కేతెంచు డంచు నళినాక్షుఁ డనన్॥ 131

1. హసంత్రికం. 2. దాసులు.

కం॥ స్మరమందిరములఁ గరపు
ష్కరములచే మూసికొనుచు సరసి వెడలి త
త్తరుణులు నిలువంబడి యం
బరములు వేఁడుటయు శౌరి మధురస్మితుఁడై ॥ 132

తే॥ అంశుకంబులు లేక నీళ్ళాడినట్టి
పాతకము వోవునట్లుగాఁ జేతులెత్తి
మ్రొక్కుఁ డల్లన [1](మీఁదవస్త్రములను జేర్తు)
ననుటయును జేసి [2](రాసతు ల)వ్విధమున ॥ 133

కం॥ మ్రొక్కుటయును నంబరములు
చక్కఁగఁ గృపఁజేసి పోవఁజాలమిఁ గని యిం
పెక్కఁగ నేలెదఁ జనుఁ డని
యక్కమలాక్షుండు వారి ననిపెం గరుణన్ ॥ 134

సీ॥ వనములో నొకనాఁడు వల్లవబాలకు
లాకలి యయ్యెడు ననుడు నంతి
కమున [3](నాంగిరసస)త్రము సేయు విప్రుల
కడ కేఁగి నాపేరు నొడివి యన్న
మడిగి తెమ్మనుటయు నరిగి బాలురు విప్ర
పరివృతకాయులై యరుగుదేర
సోమినానుల వేడి చూడదు డీ తోయ మం
చనిపిన వారలు నట్ల సేయ

తే॥ దీక్షితాంగన లతిభక్తిఁ దెచ్చి బహువి
ధాన్నములు తన కొసఁగి నెయ్యంబు సూప
హృష్టుఁడై వారి కపవర్గ మిత్తు ననుచుఁ
బ్రతినఁ గావించెఁ గృష్ణుఁడు పార్థివేంద్ర ॥ 135

1. మీఁదువస్త్రములజేరు. 2. రాఖిసతుల. 3. నాంగీరసస.

వ॥ ఇవ్విధంబునఁ జరియించుచుండ నంత, 136

## గో వ ర్ధ నో ద్ధ ర ణ ము

సీ॥ ఒకనాఁడు నందాదు లుత్సాహవంతులై
యింద్రయాగము సేయ నిచ్ఛగించి
సంభారములు గూర్చు సంభ్రమంబులు సూచి
యడుగ నవ్విధ మెల్ల నరసి శౌరి
యింద్రునిఁ బ్రార్థింప నేల గోగోపసం
వర్ధనమైన గోవర్ధనాద్రి
యుద్దేశ్యముగఁ జేయుఁ డురుభక్తిఁ [1](గురు)యాగ
మచటికి యాత్ర సేయంగవలయు

తే॥ ననుచుఁ గదలింప నచట బ్రాహ్మణులఁ గూడి
స్నానజపదానహోమాదిచర్య లెల్ల
నలరఁ జేసి శైలమునకు బలి యొసంగి
యారగించి [2](రెల్లరును) మహంబుఁ జేసి॥ 137

కం॥ వ్రజమునకు వచ్చి యుండగ
నిజభజనము మాని గోపనివహము శిఖరిన్
భజియించుట కింద్రుడు చి
త్తజనితగురురోషుఁ డగుచుఁ దత్సమయమునన్॥ 138

## ఇ ం ద్రా న య న ము

సీ॥ సంవర్త [3](కములను) జలధరంబులఁ [4](బిల్చి)
నందాదివల్లవబృంద మిప్పుడు
నను భజించుట మాని నయ మేది యున్నవా
రెంతయు నుద్ధతి నీర లేఁగి

1. గురి. 2. రీవల్లవులు మఖంబు. 3. కలను. 4. బిలచి.

కరకశిలాయుక్తఘనతరసారంబు
కురియుఁడు నందగోకులముమీఁద
ననుటయు నౌఁగాక యనుచు నయ్యభ్రంబు
లప్పుడ చండానిలాహతంబు

తే॥ లై నభోవీధి నిల్చి భయంకరముగఁ
బ్రకటనిర్ఘాతపాతపూర్వంబు గాఁగఁ
బ్రళయవర్షంబు వర్షించెఁ గలయ నందు
పల్లె గోగోపగోపికల్ తల్లడిలఁగ॥ 139

మ॥ బలభిచ్చోదితమేఘబృంద మిటులన్ బాషాణవర్షమ్ముచే
గలయన్ గోకులమున్ మథించు నిధ మాకంజాక్షుఁ డీక్షించి వ్రే
యల యార్తిధ్వని యాలకించి యవనప్రోద్యుక్తి గోవర్ధనా
చల మెత్తెం గరపంకజంబున నవ[1](చ్ఛత్రాక)తుల్యంబుగన్॥ 140

తే॥ ఎత్తిన మహీధరముక్రింద నింపుమీఱు
గోపగోపికాగణముల గోయుతముగ
నిరవుకొన నిల్పి రక్షించె నేడుదినము
లరుగునందాక వసుదేవునాత్మజుండు॥ 141

కం॥ ఇవ్విధమునఁ దనపూనిక
యవ్వనరుహనేత్రుపై నిరర్థంబగుడున్
క్రొవ్వడఁగి యింద్రుఁ డప్పుడు
దివ్వె యుడిగి మఱల దిగిచె జీమూతములన్॥ 142

తే॥ వృష్టి వేల్చినఁ గని శౌరి హృష్టుఁ డగుచు
బ్రజలఁ బసులఁ బల్లియఁ జేరఁ బనిచి[2](కేల)
డించి [3](మున్నిటియట్ల పొందించె) నద్రి
నమరగంధర్వఖచరాదు లభినుతింప॥ 143

1. చ్ఛత్రాత. 2. (.........) కేల 3. మున్నిటియట్ల పొందెంచె.

వ॥ అంత దేవేంద్రుండు సురభిసమేతుం డయి యనేకవిధంబుల నభినుతించినఁ గృష్ణుండును బ్రసన్నుం డయ్యె. సురభియుం బహువిధం బులఁ బ్రశంసించి యదియాదిగా గోవిందుం డన విజయంబు నొందు మని నిజోధస్యధారాధారలచేత నభిషేకింప నింద్రుండును మాతృకాప్రేరితుం డయి సకలతీర్థోదకంబులచేత నభిషేకించి యగ్గోవిందునిప్రసాదంబు నొంది సురభిసమేతుం డయి నిజపురంబునకు నరిగె నంత, 144

## నందానయనము

తే॥ శౌరి యొక్క[1](బారసి) నుపస్నానవేళ
వరుణభృత్యుండు దిగుచుక యరుగు టెఱిఁగి
వరుణగృహమున కేఁగి యవ్వార్ధిభర్త
నతినుతు [2](లొనర్చి యొసఁగంగ) నందుఁ దెచ్చె॥ 145

వ॥ అంత,

## రాసక్రీడలు

సీ॥ ఒకనాఁడు శౌరి చంద్రోదయవేళ చి
త్రంబుగా వేణుపూరణము సేయ
వ్రజమునఁ గలఁగిన రమణు లుల్లంబులు
వదలి ప్రేమంబులు పొదలి పొదలి
కదలి యప్పుడ తనకడకు నేతెంచి కృ
ష్ణా! కావవే యని యార్తలైన
మదనతంత్రంబుల మన్నించి చిత్రంబు
లరయుట కంతర్హితాత్ముఁ డగుట
తే॥ ప్రతినికుంజంబుఁ బ్రతిలతాభవనతలము
ప్రతిసరోవరమును భేదపరతఁ దన్ను
వెదకుగతిఁ జూచి దయమానహృదయుఁ డగుచు
మరలఁ బొడఁజూపి మన్నించె మమత నెఱపి॥ 146

---

1. బారాసి. 2. లొసర్చ నందు నిచ్చె.

కం॥ తనకవల నడుమ నింతులఁ
దనుమధ్యల కవల నడుమఁ దానునుగా ని
ట్లానరంగ రాసమండల
మనుపమగతి నిలిపి తాఁ దదంతరసీమన్॥ 147

కం॥ ఇరువురుతరుణులపైఁ గర
సరసిజములు సాఁచి వేణుసంరావముచే
గర మనురాగము సేయుచు
నరుదుగ వర్తించె వింతలగు మార్గములన్॥ 148

కం॥ చుట్టున నుండిన రమణులు
నట్టి పదంబులనె తారు నాడిరి పాటల్
మట్టున నాడుచు నతిసం
ఘట్టితబహువిధవిలాసకమనీయముగన్॥ 149

వ॥ ఇవ్విధంబున రాసక్రీడ యొనర్చి పరిశ్రాంతి వహించినవాఁ డయి యలసిన యాభీరభీరువులం గూడి జలకేళి యొనర్చి వివిధవిహార విశేషంబులం గ్రీడించి యరుణోదయకాలంబున ననిపె మఱియును, 150

## సుదర్శన శాపవిమోచనము

సీ॥ ఆభీరు లొక్కనాఁ డంబికావనమున
జాతర సేసి సంప్రీతి నుండి
నంత సరస్వతి యను నేటిదరియందు
నొక్క మహోరగం బొడసి గరసి
మ్రింగ గణంగి యమ్మేయి నెవ్వ రెబ్బంగి
నొడచిన విడువక పిడుచునంత
తనపదంబున శౌరి దన్నిన యప్పణి
యపుడ విద్యాధరుం డగుచు నిలిచి

తే॥ యే సుదర్శనాఖ్యుండ నో యీశ్వరేశ
యంగిరసులఁ గుత్సితరూపు లనుచు నవ్వి
వారిశాపంబుచే నిట్టి వాఁడ నయితి
నదియుఁ బాసితి నీ వంచు ననుచు మ్రొక్కె॥ 151

వ॥ మఱియును,

శంఖచూడారిష్టదళనము

ఉ॥ గూఢతశంఖచూడుఁ డను గుహ్యకుఁ డొక్కఁడు రేయి వ్రేతలన్
బ్రౌఢత నెత్తికొంచుఁ జనఁ బల్మరు నమ్ముఱలాలకింపుచున్
గాఢతరప్రహారముల గ్రక్కున వాని గతాసుఁ జేసి సం
సోఢముగా నివైరమునఁ జూచి హరించె నదళ్శిరోమణిన్॥ 152

తే॥ అంత వృషభాసురుం డరిష్టాఖ్యుఁ డొకడు
నందగోకుల మంతయుఁ గ్రందుపఱుప
లీల గోవిందుఁ డా ఖలు లీల ద్రొబ్బి
శృంగములఁ బట్టి నులిచి నిర్జీవుఁ జేసె॥ 153

కంసుండు దేవకీవసుదేవుల నిరోధించుట

వ॥ అంత నారదుండు కంసగృహంబునకు వచ్చి రామకృష్ణుల జన్మప్రసారంబును వసుదేవుండు వారలను నందగృహంబునంద్చుఁ జేర్చుటయును దుర్గ యశోదపుత్రిక యగుటయును దెలిపి చనిన కంసుండు మున్ను హింసింపం బూని నారదునిచేత వారితుం డగుటం జేసి దేవకీవసుదేవులం గారాగృహస్థులం జేసి కేశి యను దానవుని రామకృష్ణహననార్థంబు నియోగించి చాణూరముష్టికాదిమల్లులం బ్రధాన సమక్షంబున నిట్లనియె,

తే॥ వినుఁడు రాముఁడు కృష్ణుఁడు ననగ శౌరి
కొడుకు లున్నవా రట నందగోకులమున
రక్కసుల వారు ద్రుంచినా రుక్కు మిగిలి
వారి వారింతు నొకయుక్తి వలను మెఱసి॥ 155

ఉ॥ రంగమునందు మీరును సురల్ వెఱగంది కనుంగొనంగ మా
తంగములం బెడం గెడపఁ డార్కొను సింగము లట్ల డాయుచున్
సంగతమంగళోరుభుజసత్త్వసమృద్ధనియుద్ధవైఖరిన్
ద్రుంగఁగఁ జేయుఁ డా ఖలుల దుర్నయగోపకపంక్తి భీతిలన్॥ 156

వ॥ అని మావంతులం జూచి యిట్లనియె. 157

సీ॥ తలఁగూడి యీ చతుర్దశినాఁడె [1](యొక)ధను
ర్యాగంబుఁ దలపెట్టు డనువు మీఱఁ
నది చూచునెపమున నచ్చట వసుదేవ
సుతుల రావింతు సన్మతులచేత
రామకృష్ణులఁ ద్రుంచి రయమున నందుని
వసుదేవు నణఁచి దేవకుని నుగ్ర
సేనుని బొలియించి చిల్లరయనువుల
దండించి వైర మంతయును నింగి
తే॥ నాదుగురుఁడు జరాసంధుఁ డాదరింప
మిత్ర మగునట్టి ద్వివిదుండు మెచ్చి పొగడ
నెప్పుడును మీర లత్యంతహితులు గాఁగఁ
జేయఁ గలవాఁడ రాజ్యం బజేయవృత్తి॥ 158

## అ క్రూ రా గ మ న ము

వ॥ అని తెలిపి యక్రూరునిఁ బిలిచి నీవు నాకు హితకరుండవు. నీవు నందవ్రజంబునకు నేఁగి నందాదిగోపసమేతంబుగా రామకృష్ణుల

1. యేక.

ధనుర్యాగనిరీక్షణవ్యాజంబున నిచ్చటికిం దోడ్కొని వచ్చి నాకు వైర
నిర్యాతనంబగు నుపకారంబు బొనర్పుమని యొడంబఱచి యంతిపురంబునకుఁ
జనియె నంత, 159

ఉ॥ క్రూరుఁడు కేశిదానవుఁడు గుఱ్ఱపురూపున నందుపల్లియం
జేరఁగ వచ్చి హేషితవిచేష్టితభీషితజంతువర్గుఁడై
శౌరియురంబుఁ దన్నునెడ సవ్యతరాత్మమనోజ్ఞహస్తమిం
పారఁగఁ బట్టి ద్రిప్పినఁ రయంబున వ్రాలె ధరాతలంబునన్॥ 160

వ॥ అంత నారదుం డరుదెంచి కృష్ణు ననేకవిధంబుల నుతించి దేవా! నీవు భూభారహరణార్థం బవతరించిన పరమపురుషుండవు. కేశిదానవునిఁ జంపుట యేమి యరిది. [1](జగమెల్లంగనఁ) జాణూర ముష్టికాదిమల్లులం గంసుని నెల్లుండి నీవ చంపఁగా నేను జూచెద ననంతరంబ శంఖయవనమురనరకాదిసంహార సాహసంబులును ద్వారకానిర్మాణాది మహాద్భుతంబులును, పారిజాతాపహరణాది విజయంబులును జూడంగలవాఁడ నని నమస్కరించి యనుజ్ఞాతుం డయి నిజేచ్ఛం జనియె నంత,

ఉ॥ కొందఱు మేషము ల్దవిలి కొందఱు వారి హరించువారిపైఁ
గొందఱు కాచువారు నయి గోపకుమారకు లాడుచుండ నిం
పొంది మయాత్మజుం డయిన వ్యోమమహాసురుఁ డందుఁ జోరులం
బొందు చెలంగఁ దాఁ గలసి భోరనఁ గృష్ణుఁడు సూచుచుండగన్॥

తే॥ చొచ్చి మేషాయితుల గోపసుతుల నెత్తిఁ
గొనుచుఁ జని చని యొకగిరిగుహ నణంగి
వాత గండశైలం బిడి వచ్చు నంత
దాని నప్పుడె [2](పశువారె) దానవారి॥ 163

1. జగమల్లంబును. 2 పశుమారెన్=పశువుగా చేసెను లేక చంపెను అని అర్థమైయుండనోపు

కం॥ సమనంతరంబ పాపా
ణము దలగగఁ ద్రోసి బిలమునం గల్గఁగెడు ద్రే
కొ్మ్మురుల వెడలించెన్ శ
క్తిమహత్త్వము మెఱయ దేవకీసుతుఁడు నృపా॥ 164

మ॥ వినునంతన్ మఱునాఁటి సాయమున ధీవిఖ్యాతుఁ డక్రూరుఁ డా
వనజాతేక్షణుఁ డివ్విధంబునఁ [1](ప్రభావం బొప్పఁ) గ్రీడించు నం
దుని ఘూషల్లియ కేఁగుదెంచె హరి నాద్యన్ భక్తి సంరక్తుఁడై
మనుజాకారునిఁ జూడఁ గంటి నని యానందాంబుధిం దేలుచున్।

తే॥ వచ్చి బలరామ[2](కృష్ణుల) వందనం బొ
నర్చి వారలు మన్నింప నందునింట
నారగించి యక్రూరుఁ డా హరికిఁ జెలిపెఁ
దన్ను గంసుఁ డట్లనిపినతలఁపు లెల్ల॥ 166

కం॥ విన నేఁడు గదా సుదినం
బని శౌరియు నవ్వె నందుఁ డాదిగఁగల యా
ఘనులకుఁ బయనము సెప్పెన్
జనియెన్ నిశ యంత గోపసంభ్రమగతులన్॥ 167

ఉ॥ వేఁకువ లేచి వేడ్క నరవిందదళాక్షుఁడు కంతుతూపులం
గాఁకల నొందు గోపికల గారవ మొప్పగ బుజ్జగించి పెక్
వీఁక బలుండుఁ దో నడువ వ్రేయలు నందపురస్సరంబుగా
నాఁకలు లేక రాఁ గదలె నర్మిలి దూరతరథాధిరూఢుఁడై॥ 168

కం॥ అరుగుచుఁ దెరువున యమునా
తరంగిణిన్ జలముఁ ద్రావి తత్తీరవనాం
తరమున బలుఁడును గృష్ణుఁడు
నరదముపైఁ బవ్వడించి రలసినభంగిన్॥ 169

---

1. ప్రభాతం బొప్ప. 2. కృష్ణనను.

## వి శ్వ రూ ప క థ

సీ॥ అంత నానదిఁ దీర్థమాడఁగ నేఁగి యా
యక్రూరుఁ డుదకంబునందుఁ మునిఁగి
యాలోన రామసహాయుఁ గృష్ణునిఁ గాంచి
వెఱఁగంది లేచి యత్తెఱఁగుతోన
యరదంబుపై నున్న యా మహాత్ములఁ జూచి
ముదముతోఁ గ్రమ్మఱ మునిఁగి యందు
శేషసింహాసనాసీనుఁ బీతాంబరు
శంఖచక్రగదాప్రశస్తహస్తు
తే॥ సకలభూషణోజ్జ్వలు ఘన శ్యామదేహు
విష్ణుఁ గనుగొని విస్మయావిష్టుఁ డగుచు
వివిధరీతుల వినుతించె విశ్వపతియు
నంత[1](లోపల) నంతర్హితాత్ముఁ డయ్యె॥ 170

తే॥ స్నానవిధి యంతఁ జాలించి జలము వెడలి
చేరవచ్చు నక్రూరు నీక్షించి శౌరి
యేల తడవుంటి నీటిలో నేమియైన
గలిగెనో విశేష మనుచు నుత్కంఠ నడిగె॥ 171

కం॥ అడిగిన నెల్ల విశేషము
లెడపక గలిగించు నిన్ను నీక్షింపగఁ జొ
ప్పడుటయు విశేష మనుచుఁ
నోడువునతనిఁ గేశిసూదనుఁడు [2](మెచ్చుకొనెఁ)॥ 172

వ॥ వచ్చి రామాక్రూరసమేతుం డయి యన్నందాదులు విడిసి యున్న మధురోపవనంబునకువచ్చి యచ్చట నయ్యక్రూరుని ననిపిన నతండు తదాగమనంబు కంసునికి నెఱింగించి నిజగృహంబునకు నరిగిన నంత, 173

1. లోన.

## మథురానగర ప్రవేశకథ

తే॥ అంత గోవిందుఁడును నపరాహ్ణవేళ
బలుఁడు గోపాలురును దన్ను బలసి గొలువఁ
జూచువేడుకఁ జారులు చూచి మెచ్చ
రాజితంబైన మథురాపురంబుఁ జొచ్చె॥ 174

సీ॥ సౌధాగ్రచరరతిశ్రాంతిముహ్యత్కామి
జనజలార్ద్రీభవజ్జలధరంబు
వైజయంతస్థదివ్యస్త్రీణవాలజ
వ్యజనీభవత్కేతనాంశుకంబు
గగనాధ్వచంక్రమక్లాంతహేళిహయాళి
లీలాస్థలీకృతాట్టాలకంబు
కేళీచరద్భుజంగీవిలేపనమహా
గంధవాసితపరిఖాజలంబు
తే॥ చారుదిక్ప్రతిపురచతుష్టయవిహాసన
గురుతరవ్యాప్తవదనాభగోపురంబు
యదుకులోద్భవనృపతిసింహాసనంబు
రమ్యలక్ష్మీభరము మథురాపురంబు॥ 175

వ॥ అట్టి మథురాపురంబునందు, 176

## ధ ను ర్భం గ ము

సీ॥ ఖలుఁడైన రజకునితలఁద్రెంచి వానిచేఁ
జెలువొంద వింతవల్వలు ధరించి
నాయకుం డిచ్చిన నవరత్నభూషణ
జాలంబు సముచితసరణి దొడిగి

వినయాఢ్యుఁ డగు సుదాముని ధామమున కేఁగి
యతఁ డిచ్చినట్టి మాల్యములు దాల్చి
చిత్రంబుగాఁ గుబ్జచేతిగంధ మలంది
కొని యాసతికిఁ జక్కదన మొసంగి
తే॥ జననివేదితమార్గుఁడై చని సుప్రాజి
తం బయిన కంసహాతకునిధనువుఁ జేరి
చేత నవలీల నెత్తి సింజియను గూర్చి
విరిచె శౌరి టంకృతిని విద్విషులు బెగడ॥ 177

కం॥ కనలున నడ్డముఁ జనుదెం
చిన కావలివారి నట్లు సేసిన [1](బాణా
సన)ఖండంబులచేఁ బోరి
గొని విడిదికిఁ జనిరి సాధకులు బలకృష్ణుల్॥ 178

సీ॥ [2]ఆహావాయాసిమం దేహాధిపతికర
భ్రష్టహైంగుళ[3](మహో)ఫల మనంగ
చారువిలిప్తసింధూరాంజనాఖ్యాది
కుంజరైకతరోరుకుంభ మనఁగ
తమసారినిర్గమోత్సవసముత్క్షిప్తసం
ధ్యావధూవదనపద్మం బనంగ
చరమాద్రివీతపాషాణసంస్థాపిత
ముఖమణిశివలింగమూర్తి యనఁగ
తే॥ కాల[4](హాతక)సమాహాతి గళిత మనఁగ (?)
గురుతరశ్లోకసుశ్లోకగుచ్ఛ మనఁగ (?)
జలధిరాజాత్మభవకేళిచక్ర మనఁగ
నస్తగిరిమీఁదఁ గనుపట్టె నహిమకరుఁడు॥ 179

1. బాణసన. 2. ఆహోరా. 3. (........) 4. హాత.

కం॥ ఏడవ నా గుఱ్ఱమునకు
జో డెన్నఁడు దొరక దిందుఁ జూడఁ గలిగి యా
గోడిగఁ గూర్చెద ననియెడు
జాడన్ సప్తాశ్వుఁ డపరజలనిధి సొచ్చెన్ ॥ 180

ఉ॥ ద్యోసతికిం దినేశవిగమోచితమై కడు మించి వెల్వలన్
భాసిలు మన్మథాగ్నిగతిఁ బశ్చిమదిక్పతిగేహభిత్తికం
బూసిన జాజుచందమున భూసురమంత్రను[1](తార్ఘ్య)వారిక
[2](త్తాసురరక్త) మట్లు చెలు[3](వారె) గడుంగడు సంజదీప్తియున్॥

మ॥ అలరెం బశ్చిమదిక్కునందుఁ గడు సంధ్యారాగవిస్ఫూర్తిసం
వలనంబున్ మఱి తూర్పుచక్కటిఁ గ్రమవ్యాప్తిస్ఫుటంబై తమః
కలనంబున్ విలసిల్లె బీజయుతమై కన్పట్టు భల్లాతకీ
ఫలమ ట్లుజ్వల మయ్యె నెంతయు నభోభాగంబు చిత్రంబుగాన్॥

కం॥ ఖరకరుఁ డుఱికెను రయమున
శరనిధిఁబైఁ బొడమునట్టి జలబిందువు లం
బరమున నంటెనో యనఁదగి
తరలత గానంగ వచ్చెఁ దారాగణముల్ ॥ 183

ఉ॥ తోరపుఁజీకటుల్ జగముఁ దోరణగట్టుచుఁ బేర్మి నొందగాఁ
దారక లంత కంతకు నుదారతఁ గానఁ బడంగ యామినీ
నారి నిజేశుఁ గూడ గమనం బిడి కస్తురి పూసి మల్లియల్
నేరుపు మించగా ముడిచి నిల్చిన బాగులు దోఁచె నల్లెడన్॥ 184

వ॥ అంత,

---

1. తార్క్ష్య. 2. త్తాసురక్త. 3. వార.

సీ॥ రిక్కలగమికాఁడు రేవణంతిమగండు
కలువచుట్టము వేడివెలుగుజోడు
వెలికినట్టాడులేమలబూచి లచ్చితో
బుట్టువు చలువలపుట్టినిల్లు
కలికంతుతలపువ్వు చెఱకువిల్తునిమామ
[1]దాతరాయఁడు చక్కదనముటెంకి
తరిదాల్పుడాకన్ను దండిచీకటిఁ ద్రెంచు
బలియుండు పసిడిగుబ్బలితలారి
తే॥ కమలములపాలి విధి చకోరముల పంట
కుప్పతెక్కలికాంద్రకు గుండెదిగులు
తలయచిక్కిన వెడగామచలిదికుడుపు
[2](.........)కన్నులుమెచ్చ చందురుఁడు వొడచె॥ 185

వ॥ అట్టి సమయంబున రామకృష్ణులు నందునివిడిది నానందంబున క్షీరాన్నంబు లారగించి పవ్వడించిరి. కంసుఁడును నిద్దుర యొఱుంగక దుర్నిమిత్తంబులు గనుచుండె నంత, 186

సీ॥ అగ్ని([3]రత్నములు) ప్రత్యగ్ర[4](నాడీ)వియు
క్తతామధూమసంగతి నెసంగఁ
జంచరీకంబులు జలజకుట్మలపుటీ
[5](కారాకుటీ)వినిర్గతి వహింప
చక్రవాకంబులు శ్లథవియోగవ్యథా
ప్రథిమాంబురాశిపారంబు నొంద
శైలాగ్రములు కుంకుమాలిప్తకుంభినీ
కుచకుంభసామ్యంబు కూడుకొనఁగ

1. చాత; 2. దేవయు. 3. రత్నము. 4. నాడి. 5. (.........)

తే॥ ప్రాచికయి మించు [1](రత్న)దర్పణ మనంగ
మఘవతలమీఁది కురువిందమాళి యనఁగ
దివికి నేతెంచు బడబాగ్నిదీప్తి యనఁగ
తరణి యుదయించె నఘవార్థితరణి యగుచు॥ 187

కం॥ తిమిరాసురసంహార
క్రమమున కై రుద్రరౌద్రరస మాకారం
బమరంగ వచ్చెనో యనఁ
గమలాప్తుం డుదయశిఖరిఁ గానఁగ వచ్చెన్॥ 188

వ॥ ఇట్లు సూర్యోదయంబునం గంసుండు మల్లక్రీడామహోత్సవంబుఁ దలపెట్టి రంగగృహమునం దమాత్యపరివృతుం డయి మండలేశ్వరమధ్యంబున రాజమధ్యంబునం గూర్చుండఁ జాణూరముష్టికకూటశలతోసలకాదిమల్లులు నలంకృతు లయి రంగంబుఁ బ్రవేశించిరి. నందాదులును సందర్శితోపాయను లయి కొలిచి యుండి రంత ననేక వాద్యంబులు ప్రహతంబు లయ్యె న క్కలకలంబులు విని బలరామకృష్ణులును ముదితాంతరంగు లగుచును రంగగృహంబు సొరవచ్చు సమయంబున, 189

## కువలయాపీడ చాణూరముష్టికాదివధము

కం॥ అంబష్ఠుఁడు చరణాంగు
ష్ఠంబులఁ జూళికలు వొడిచి సహరవముగ న
య్యంబుజనేత్రునిమీఁద ర
యంబున గవియించెఁ గువలయాపీడంబున్॥ 190

వ॥ ఆ సమయంబున,

---

1. రత్నము.

తే॥ పొడవు దప్పించుకొని కాళ్ళనడుమ వెడలి
తోఁక వట్టుక గుదియించి [1](వీక) శౌరి
కువలయాపీడము నెదిర్చి కూల్చి రదము
వెలికి డానన యంబష్ఠు వీచ మణఁచె॥ 191

సీ॥ ఇవ్విధంబున నగ్గజేంద్రంబుఁ బొలియించి
రంగస్థలంబుఁ జేరంగ వచ్చి
నట్టి బలాన్వితుం డగు శౌరిఁ జేరి చా
ణూరుఁ డో కృష్ణ! యాభీరతనయ!
యీ రాజు మెచ్చంగ నీవును నేనును
యుద్ధంబు సేయుద మొక్కమాఱు
బలుఁడు ముష్టికునితోఁ దలపడి పోరెడు
ననుటయు గోవిందుఁ డల్ల నవ్వి
తే॥ బాలురము వనచరుల మేలీలఁ బ్రౌఢు
లైన మీకు మెచ్చుఁ బోరెద మైనఁ జేత
నైనగతిఁ జూచెదము గాక యనుచుఁ బలికి
బద్ధపరికరోజ్జ్వలు లైరి బలుఁడుఁ [2](దాను)॥ 192

వ॥ ఇట్లు సన్నద్ధులై కృష్ణచాణూరులును బలముష్టికులును దలపడి హస్తంబులు హస్తంబులం బదంబులు బదంబులం దిగుచుచు ముష్టిబంధంబులచేత ముష్టిబంధంబులును, జానువులచేత జానువులును, శిరంబులచేత శిరంబులును, నురంబులచేత నురంబులును, నన్యోన్యంబు దాఁకుచుం బరిభ్రమణవిక్షేపపరిరంభావతాండనంబులచేత సముత్సర్పణాపసర్పణంబులచేతను నరికట్టుచు నుత్క్షేపణోన్నయనచాలనస్థాపనాదులచేతం బరస్పరంబు నొప్పించుచు మఱియు వివిధంబులైన యుద్ధవిశేషంబులం బోరి రందు, 193

1. వీక. 2. దాను.

ఉ॥ బీరము మీఱఁగా నెగసి భీకరముష్టియుగంబుచేఁ జిట
త్కార మెసంగఁ బేరురము గ్రక్కున నక్కఱ నొంచునట్టి చా
ణూరునిబాహువుల్ బలిమి నొక్కుచుఁ బట్టి కుదించి త్రిప్పి ని
స్సారునిఁ జేసి కూల్చె నిలఁ జయ్యనఁ గృష్ణుఁడు విస్మయంబునన్॥

కం॥ బలి యగు బలభద్రునిచేఁ
దల హాతుఁడై ముష్టికుండు తత్క్షణమున సం
కలితాసృగ్వమనుండై
యిలపయిఁ బడిమోర రయమువ్యపేతాసుండై॥ 195

వ॥ మఱియును,

కం॥ బలభద్రుచేతఁ గ్రూరుఁడు
చలమరి యటఁ గృష్ణుచే[1](త శల)తోసలులుం
బొలిసినఁ గని తక్కిన మ
ల్లులు వరచిరి ప్రాణభీతిలోలత్వమునన్॥ 196

## కంసవధము

వ॥ ఇవ్విధంబున రామకృష్ణులచేత మల్లులు సమయుట గనుంగొని కంసుండు కరాళించి మంత్రులఁ బిలచి దుశ్శీలులగు నీ గోపబాలుర వెడలఁద్రొబ్బి యుబ్బు నేరుపుడు. గోపకుల గోధనంబులు హారింపుఁడు. నందవసుదేవుల బ్రమందింపుఁ డుగ్రసేనునిం దీనునిం జేయుం డనిపలుకునంత,

కం॥ తమగముమీఁదికి లాఘవ
మునురంగా నెగసి కృష్ణుఁ డభ్రగపతి స
ర్పమునుఁబోలెఁ బట్టి వడి రం
గమునకుఁ బడద్రొబ్బి యూడ్చె గతజీవునిఁగాన్॥ 198

1. తచ్ఛల.

తే॥ ఆసమయమున [1](గహోద్వేదు) లతనియనుజు
లెదురుపడుటయుఁ గాంచి సమిద్ధరోష
కలితుఁడై రాముఁ డొకపరిఘుంబుచేతఁ
ద్రుంచెఁ బశువ్రుల సింగంబుఁ ద్రుంచునట్లు॥ 199

కం॥ దుందుభులు మొరసె దివి నా
నందమ్మున విరులు గురిసె నలినాసనఖం
డేందుధరాద్యమరులు గో
విందుని జగదార్తిహారుని వినుతించి రొగిన్॥ 200

తే॥ అంత [2](రామ)గోవిందుల నఖిలజనులు
మెచ్చి పొగడంగ నానందమిళితు లగుచు
బహువిధంబుల విలపించి బడలునట్టి
కంసహతకునిసుతులశోకంబు నుడిపి॥ 201

సీ॥ తల్లిదండ్రులకు బంధవిముక్తిఁ గావించి
యుచితసంభాషల నూరడించి
యదువులకెల్ల నాయకుఁడుగఁ గడు నుగ్ర
సేనుఁ భద్రాసనాసీనుఁ జేసి
కంసభయంబునఁ గడలనుండిన యదు
[3]వృష్ణిముఖ్యులను రావించి నిలిపి
గోపసంఘుంబుతోఁ గూడ నందునిఁ బ్రియం
బులు పల్కి గోకులంబునకు ననిపెఁ

తే॥ జనకరచితోపనయనసంస్కారరమ్యు
లై యవంతీపురవాసుఁ డైన ఘనుని
నవ్యసాందీపవిఖ్యాతనాముఁ జేరి
చదివి రఖిలవిద్యలు చతుష్షష్టితిథుల॥ 202

1. గంగా. 2. నారామ. 3. వృష్ణి.

వ॥ ఇట్లు విద్యాభ్యాసంబు సేసి, 203

సీ॥ ముదముతో విద్యాంతమున గురుఁడు ప్రభాస
తీర్థవిశిష్టవార్ధి ప్రమీతు
సూనునిఁ దెచ్చి యిచ్చుటయు దక్షిణ గాఁగ
నడిగిన బలయుక్తుఁ డగుచు శౌరి
రథికుఁడై యేఁగె వారాశిచే గురుతనూ
భవుని శంఖాకృతిఁ బరగు నసుర
వరుఁడు మ్రింగుట విని శరధి[1](మధ్యస్థు) న
క్కజనునిఁ ద్రుంచి తత్కుక్షిలోన

తే॥ బాలుఁ గానక తత్కళేబరజమైన
యమలశంఖంబుఁ గొనుచు సంయమిని యనఁగ
జనిన జముప్రోలు జేరంగఁ జనుచు నచట
వెలయ శంఖంబు పూరించె భీకరముగ॥ 204

ఆ॥ శంఖరవము వినుచుఁ జనుదెంచి శమనుండు
బలునిఁ గృష్ణుఁ గాంచి భక్తినమ్రుఁ
డగుచు గురుతనూజు నర్పింప వార లా
బాలుఁ గొనుచుఁ బ్రమదభరము వెలఁగ॥ 205

తే॥ వచ్చి గురువర్యునకు నిచ్చి మెచ్చుతోడఁ
గూడఁ ద ద్దీవనయును వీడ్కోలు వడసి
గంధవహావేగ మగు శతాంగంబు నెక్కి
మధుర కేతెంచి రెల్ల సమ్మదము నొంద॥ 206

వ॥ మఱియుఁ గృష్ణుం డుద్ధవుని ననిపి నందవ్రజంబువారల
నూఱడిలం జేసి యక్రూరుని ననిపి పాండుపత్నీకుమారుల నుపలాలితులం

1. మధ్యస్థు.

గావించి యుండు నంత నస్తియుం బ్రాప్తియు నను కంసునిభార్యలు తమతండ్రి యగు జరాసంధునికడకు నేఁగి తమపరిభవం బెఱింగించిన నతండు కుపితుండై యిరువదిమూఁ డక్షౌహిణులతోడం జనుదెంచి మథురాపురంబును జుట్టుముట్టుటయును, 207

సీ॥ ఈ దుర్మదాంధుని నిపుడె యణంచుట
కర్జంబు గాదు సంగ్రామవిజితుఁ
డై వీఁడు పలుమారు నక్షౌహిణులఁ గూడి
చనుదెంచు నట్లైన జగతిభార
ముడుపవచ్చు నటంచు నూహించి కంసారి
దివమునుండి యేతెంచినట్టి
రథయుగళంబులో రాముని కొక టిచ్చి
యనువారఁ దా నొక్క యరద మెక్కి
తే॥ యా జరాసంధబలముల నపుడ యొక్క
పిక్కయును జిక్కనీక దప్పించి త్రుంచి
బలునిచేఁ బట్టువడిన యా బలునిఁ గాచి
విడుచుటయు నాతఁ డేఁగె నిర్విణ్ణుఁ డగుచు॥ 208

కం॥ వినుము జరాసంధుఁడు మఱి
యును దావత్సంఖ్యసైన్యయుక్తుండై కృ
ష్ణునిచే నట్లనె కోల్వడి
చనియెం బదియేడుమార్లు సహాలజ్జుండై॥ 209

వ॥ అంత బదినెనిమిదవతోయంబు రా నుద్యోగించుసమయంబున నారదప్రేరితుండై కాలయవనుండు యవనకోటిత్రయ సహితుండై మథురాపురం బవరోధించినఁ గృష్ణుండు బలదేవునితో నేకతంబున, 210

తే॥ కాలయవనునితోడ సంగ్రామచర్చఁ
గలసి మన ముందునంత నివ్వల జరాసు
తుం డరుగుదెంచి యదువులఁ ద్రుంచు నొండె
నెత్తుకొని పోవు నొండె పో (¹రెసఁగు)నపుడు॥ 211

వ॥ కావున,

కం॥ నరదుర్గమ మగు దుర్గం
బరుదుగ నొక్కటి ఘటించి యందు యదువులన్
దిరముగ నిలిపి యనంతర
మరిసంహారంబు సేయునది యుచిత మగున్॥ 212

కం॥ అని యెన్ని వనధిమధ్యం
బున ద్వాదశయోజనములు పొసఁగినవిరివిన్
దనరెడు ద్వారక యను నొక
ఘనతర మగు పట్టణంబు గలుగఁగఁ జేసెన్॥ 212

సీ॥ ఇనునివార్వపుతొక్కు లెనయుకోటలును తా
రాలితో నొరయు నట్టాలకములు
వైజయంతము మించి వరలు మేడలు రత్న
కుధరభూములఁ బోలు కుట్టిమములు
హేమాద్రిఁ దెగడించు నిండ్లును గైలాస
శైలంబు గడచు దేవాలయములు
మానససరసితో మలయు దీర్ఘికలు నం
దనము నవ్వించు నుద్యానములును

తే॥ శక్రసభ కుద్దులైన హజారములును
ఫణినివాసంబుఁ దలపించు పడిగెగములు
గలిగి కన్నులపండువై యలరుచుండు
ధరకుఁ దొడవుగ ద్వారకాపురవరంబు॥ 213

1. డి. దెసగు.

తే॥ అట్టి ద్వారవతీపురి నాత్మజనులఁ
దెలఁగు యోగప్రభావంబుచేతఁ దెచ్చి
నిలిపి కంసారి క్రమ్మఱ బలసమేతుఁ
డగుచు మధురకు వచ్చి చెన్నలర వెడలె॥ 214

చం॥ వనజదళాక్షు నల్లెదురువచ్చుతఱిన్ నిపుణంబుగాఁగ గ
న్గొని ఖలుఁడైన కాలయవనుండు నిజాహితుఁగా నెఱింగి చ
య్యనఁ బరతెంచెఁ బట్టుటకు నవ్విధ మవ్వసుదేవసూతియుం
గనుచుఁ బలాయనంబు వడిఁ గైకొనియెన్ రిపుఁ డంటి వెంటరాన్॥

కం॥ అరిగి యరిగి యొక గిరిగ
హ్వరంబు సొచ్చుటయుఁ గాలయవనుండును దో
బరువునఁ జొచ్చి తదీయాం
తరమున నొక నిద్రవోవు ధన్యునిఁ గనియెన్॥ 216

తే॥ కాంచి నను నలయించి యిక్కడికిఁ దెచ్చి
ఖలుఁడు నిద్రవోయెడు నని పలికి తన్ని
యతఁడు గను విచ్చి చూచినయంతమాత్ర
నప్పుడ విదగ్ధదేహుఁడై కుప్ప వడియె॥ 217

వ॥ అంతం గృష్ణుం డతనికిఁ బొడసూపిన నేను మాంధాతృ పుత్రుండ ముచికుందుండనువాఁడ నింద్రునికిం దోడై దైత్యసంహారంబు సేసి యలసి యిచ్చట నిద్రించుచున్నవాఁడ నీ వెవఁడ వని యడుగఁబడిన వాఁడై నిజస్వరూపంబుఁ దెలిపి తనపదంబు చేరు వరంబుఁ గృపసేసి మఱలి మధురాపురంబునకు వచ్చి మ్లేచ్ఛబలపీచం బణంచి తదీయ ధనంబు ద్వారకకుం గొనిపోవు సమయంబున, 218

సీ॥ ఇరువదిమూఁ డని యెన్నంగఁ దగునట్టి
అక్షౌహిణులఁ గూడి యలరు మాగ
ధుం డరికట్టి ప్రచండిమఁ జూపిన
బలరాము లులికినపగిదిఁ దోఁపఁ
బరువిడి యంతంత బహుళవర్షణముఁ బ్రవ
ర్షణ మను నొక భూధరంబు నెక్కి
రా జరాసంధుండు నందాకఁ దరిమి య
క్కడ [1](దాన నే) జాడఁ గాన లేక

తే॥ తిరిగి రా దారువుల్ [2](దీర్చి) గిరి దహింపఁ
గడఁగుటయు నయ్యదూత్తముల్ కార్యపరతఁ
బదునొకడు యోజనములు చొప్పడిన పొడవు
మెఱయు నందుండి వడి దిగ నుఱికి రిలకు॥ 219

తే॥ ఇవ్విధంబున నుఱికి యయ్యిద్దరును న
రాతిచేఁ గానఁబడక ద్వారకకు నేఁగి
రా జరాసంధుఁడును వారి నచట హతులఁ
గానె దలఁచి చనియె నిజస్థానమునకు॥ 220

సీ॥ అంత నానర్తేశుఁడైన రేవతుఁ డాత్మ
తనయ రేవతిని రామునకుఁ బెండ్లి
సేసె నాకథ మున్నె చెప్పితిఁ గృష్ణుండు
బాలుపారు భీష్మకపుత్రియైన
రుక్మిణీదేవి నారూఢి సాళ్వాదిక
చైద్యపక్షీయరాజకము గెలిచి
వెలయంగ రాక్షసవిధిచేత హరియించి
వరియించె జగదుత్సవంబు గాఁగ

1. దానచే. 2. నేర్చి.

తే॥ ననుటయును నెట్టి సరణి నయ్యవనిపతుల
గెలిచి కృష్ణుండు రుక్మిణీలలనఁ బెండ్లి
యాడె నింతయుఁ విసఁజేయు మను నరేంద్రుఁ
బలికె శుకయోగి యానందకలితుఁ డగుచు॥ 221

వ॥ వినుము విదర్భదేశంబున భీష్మకునకు రుక్మియును, రుక్మరథుం
డును, రుక్మబాహుండును, రుక్మకేశుండును, [1](రుక్మమాలి)యను పుత్రు
లేవురును రుక్మిణియను కన్యయుం గలిగి రందు, 222

శా॥ కంతుం బుత్రునిగాఁ గనంగల జగత్కల్యాణసౌందర్యసి
ద్ధాంతస్థానము సన్నుతోన్నతగుణౌఘావాసగేహంబు శ్రీ
మంతుం గృష్ణునిఁ జేరఁ బుట్టినజగన్మాత్రంశ మా రుక్మిణీ
కాంతారత్న మటన్న నమ్మగువ నింకన్ శక్యమే చెప్పఁగన్॥ 223

కం॥ ఆ రుక్మిణి నిజజనకా
గారమునకు వచ్చు ఘనులు గడు వినుతింపన్
శౌరిగుణంబులు విని యా
ధీరుని వరియింతు నని మదిం దలపోసెన్॥ 224

తే॥ తనకుఁ దగు బుద్ధిలక్షణౌదార్యరూప
శీలగుణములచేఁ బ్రశంసింపఁ దగిన
రుక్మిణీదేవి నబ్జనేత్రుండు ప్రేమ
భాసురంబుగ నుద్వాహింపంగఁ దలఁచె॥ 225

సీ॥ తనతల్లిదండ్రు లాదరమునఁ గృష్ణుని
కిచ్చెద మనగ నయ్యిచ్చఁ జనక
శిశుపాలనరపతిఁ జేర్చెద నన రుక్మి
తలఁ పెల్ల నెఱిఁగి వైదర్భి గలఁగి

1. రుక్మనేమాలి.

యాప్తుని నొక విప్రు నంబుజాక్షునికడ
కనిపిన నప్పుడుఁ డరిగి శౌరిఁ
గాంచి యవ్విభుఁడు గావించు నాతిథ్యంబు
నంది యాగమనార్థ మడుగఁబడియుఁ
తే॥ కృష్ణ! నిను జేరఁ గోరి రుక్మిణి ముదమున
ననుపఁగా వచ్చినట్టి బ్రాహ్మణుఁడ ననుచుఁ
బలికి సందేశ మొక్కటి గలదు వినఁగ
నవధరింపు మటంచు నిట్లనియె మఱియు॥ 226

వ॥ దేవా ! రుక్మిణివిన్నపం బేను నీ సుగుణంబులు విని నీయం దాసక్తచిత్తనై యున్నదాన నన్ను బాణిగృహీతం జేసి మన్నింపవలయు సింహభాగంబును సృగాలంబుపోలె భవద్దాసిని నన్ను శిశుపాలుండు ముట్ట నర్హుండు గాఁడు నన్ను బరిగ్రహింపవేనియు నీయధీనం బయిన జీవంబు నీ పాదపద్మములకు సమర్పించెద నని, 227

మ॥ అని యా విప్రుఁడు పల్కినట్టి పలు కా యబ్జాక్షుఁ డా[1](లించి తా
ననె సర్వంబు నెఱుంగు దేనవిరతం) బాహారనిద్రాదులుం
గనఁ జు మ్మిప్పుడ వచ్చి వైరివరులన్ ఖండించి వేగంబునన్
దనకున్ మెచ్చు లొసర్తుఁ జూడు మని యుత్సాహంబు వర్ధిల్లగన్ ॥

వ॥ దారుకానీతంబై సైన్య సుగ్రీవ, మేఘపుష్ప, వలాహక నామ, హయచతుష్టయ సంయుతంబును, గరుడధ్వజవిరాజితంబును నైన రథంబు రుక్మిణీప్రేషితవిప్రసహితుం డయి యెక్కి యేకరాత్రంబున ద్వారవతినుండి కుండినపురంబునకు వచ్చినంత నచ్చట, 229

కం॥ దమఘోషసుతుఁడు బరిణయ
సముచితమంగళవిధానుసంధానసుసం
భ్రముఁడై కుండినపురికిన్
బ్రమదంబున వచ్చెఁ బెక్కు బలములు గొలువన్॥ 230

1. (.........నీతతన్).

తే॥ సాళ్వపాండ్రకులును జరాసంధ దంత
వక్త్రులు విదూరథుండు గర్వములు మీఱ
చైద్యపక్షీయు లగుచు నచ్చటికి వచ్చి
రచ్యుతుఁడు వచ్చు నని మత్సరానువృత్తి॥

కం॥ లలనకుఁగాఁ గృష్ణునకున్
గలహ మొదవు నచట ననుచుఁ గడువేగమునన్
బలయుతుఁడు వచ్చె బలుఁడును
జలజాక్షునిఁ గూడుకొనియె సమ్మద మొదవన్॥

కం॥ ధరణీసురుఁడు గన్యాంతః
పురంబునకు నేఁగి యట్టి పూనిక కృష్ణుం
డరుదెంచుట వినిపించినఁ
బరగెన్ రుక్మిణి ప్రమోదభరసంభృతయై॥

తే॥ భీష్మకుఁడు చైద్యుతో బిడ్డపెండ్లి మనసు
రాకయును బలకృష్ణుల రాక వినుచు
నుత్సవముఁ జూడఁ జనుదెంచిరో యటంచు
జనితసంభ్రముఁడై యెదుర్కొనియెఁ బ్రేమ॥

వ॥ అంత,

సీ॥ మాతృవర్గము సంభ్రమంబునఁ జుట్టి రా
భటసమూహంబులు బలసి కొలువ
పణవభేరీశంఖపటహాదిబహువాద్య
రావంబు రోదోంతరంబు నిండ
వైదర్భిపురబాహ్యవనమున శోభిల్లు
నంబికాలయమున కరుగుదెంచి
యద్దేవి నర్చించి హరిఁ బతిఁగాఁ జేయు
మనుచుఁ బ్రార్థించి ముత్తైదువులను

తే॥ స్వర్ణాఘ్రాపతాంబూలహారకంఠ
సూత్రఫలకసాలాదివస్తువు లొసంగి
వెడలి కృష్ణునిఁ దలఁచుచు నడచి నడచి
యరద మెక్కంగ గమకించు నంతలోన॥ 235

కం॥ శౌరి యెడసించి గ్రక్కున
నా రమణిం బొదివి పట్టి యాత్మరథముపై
ధీరత నిడికొని నిజశం
ఖారవ మొదవించి కదలె నగ్రజయుతుఁడై॥ 236

ఉ॥ ఆ సమయంబునన్ సరసిజాక్షునహంకృతి నోర్వలేక పెన్
రేసున వచ్చి తాఁకిన యరిక్షితిపాలకసాళ్వముఖ్యులన్
వాసికి నెక్కినట్టి యదువర్యు లెదిర్చి మహాస్త్రశస్త్రవి
న్యాసము చొప్పడన్ సమయునట్లుగఁ జేసిరి తద్బలంబులన్॥ 237

కం॥ నరపతు లట్లు పలాయన
పరులగుటయుఁ జూచి రుక్మి బహువిధశస్త్ర
స్ఫురితతరధారాఢ్యుండై
తిరమగు రోషమున వాసుదేవునిఁ దాఁకెన్॥ 238

ఉ॥ అట్టిని రుక్మి నాహవమునందు జయించి వధించుపూనికన్
బట్టి గదాగ్రజుండు ప్రియభామినిప్రార్థనఁ జేసి మానుచున్
గట్టి శిరంబు మోము నొడికం బరరేవులు సందుసందులన్
బుట్టగ శస్త్రిచే గొఱిగి పో విడిచెం బలశాసనంబునన్॥ 239

తే॥ ఇవ్విధంబున న వ్వి[1](దర్భేశదుహితఁ
దెచ్చి ద్వారకాపురి)జనుల్ మెచ్చ శౌరి
సకలజగదుత్సవంబుగ శాస్త్రసరణిఁ
బరిణయం బయ్యె ససమువైభవము మెఱయ॥ 240

1. (..........).

వ॥ అంతఁ గాలక్రమంబున, 241

కం॥ మును శంకరనయనానల
మున సమసిన మదనుఁ డాదిమూలంబగు కృ
ష్ణునివలనఁ బ్రద్యుమ్నుం
డను సుతుఁడై రుక్మిణీమృగాక్షికిఁ బుట్టెన్॥ 242

సీ॥ ఇవ్విధంబున జనియించిన ప్రద్యుమ్ను
మాయావియైన శంబరుఁడు వైర
బుద్ధి పెంపునఁ గొనిపోయి పయోనిధి
లోన వైచిన నొక మీను మ్రింగె
జాలరుల్ వట్టి యా శకులంబుఁ దెచ్చి యా
ఖలునకుఁ గానుకగా నొసంగ
దారితం బగునట్టి తదుదరాం[1](తరమున)
బాలునిఁ గని యడబాల విన్న
తే॥ వించుటయు వెఱ గంది యా చంచలుండు
నారద[2](నిదేశ)మున మున్న చేరి తన గృ
హమున వంటలపని నున్నయట్టి రతికిఁ
బెనుప నిచ్చె నాడింభకుఁ బెనిచె రతియు॥ 243

ఉ॥ ఆ రతి యాకుమారునకు యావన మేర్పడునంత నొంటిపా
టారసి యొక్కనాఁడు రతికై మన సేఁచినఁ జూచి నవ్వి యా
ధీరుఁ డిదేమి తల్లి విగ దే యన నా సతి పత్నిగాఁ దనున్
వైరిగ శంబరుం దెలిపి ద్వారకకుం బయనంబు సేసినన్॥ 244

1. తమున. 2. నివేశ.

కం॥ అతఁ డాహవమున శంబరు
హంతుగా నొనరించి ద్వారకాహ్వయపురికిన్
సతిఁ గూడి వచ్చెఁ బౌరులు
ద్వితీయకృష్ణుం డటంచు విస్మయమందన్॥ 245

వ॥ కృష్ణుం డివ్విధంబు నంతయు నెఱింగియు నెఱుంగనిచందంబున నూరక యుండ నారదుం డరుగుదెంచి రుక్మిణీదేవికిఁ బ్రద్యుమ్న వృత్తాంతం బంతయుఁ దెలిపిన నందరుం బరమానందంబు నొంది రంత,

సీ॥ సరసిజాప్తుఁడు భక్తి సత్రాజితునకు స్య
మంతకం బను నొక్క మణి [1](నొసంగె)
నెనిమిది భారువుల్ కనకంబుఁ గురియు నా
రత్న మవ్విభునకుఁ బ్రతిదినంబు
నా సువస్తువు దను నర్థించు శౌరికి
నా లుబ్ధుఁ [2](డాస) నీఁ జాలఁ డయ్యె
నట్టి స్యమంతకం బఱుత ధరించి ప్ర
సేనుండు వేటకై కాన కేఁగి

ఆ॥ సింహనిహతుఁ డయ్యె సింహంబుఁ ద్రుంచి యా
తొడవు జాంబవంతుఁ డొడిచికొనుచుఁ
దన[3](గృహమున కేఁగి) తనయకు నాడించు
బంతిగా నొసంగె నంత నిచట॥ 247

తే॥ తమ్ముఁ డణఁగిపోవుటయు సత్రాజితుండు
మణికిఁ దా నిట్టి పనిఁ జేసె మాధవుండు
ననుచు దుఃఖితుఁ డగుచుండె నట్టి వార్త
వినియె శౌరి కర్ణాకర్ణి [4](వినఁబడంగ)॥ 248

1. ఘొసంగె. 2. వాస. 3. గృహంబున కేఁగె. 4. ననుపడంగ.

కం॥ ఆ సింగము భల్లూకము
చే సమసినచోటుఁ గాంచి శీఘ్రమ కృష్ణుం
డాసక్తిఁ దదీయపద
న్యాసంబులజాడ వెంట నరుగుచు నెదుటన్॥ 249

సీ॥ జాడ [1](సొచ్చిన) యొక్క శైలంబుగనిఁ జేరి
యనుచరవర్గంబు నచట నిలిపి
యందుఁ బ్రవేశించి యభ్యంతరంబున
జాంబవంతుని యగారంబునందు
మహితస్యమంతకమణిచేతఁ గ్రీడించు
బాలికసజ్జ కభ్యాసభూమి
నిలిచిన యా రుక్మిణీపతి నీక్షించి
దాది యాక్రోశింపఁ దత్క్షణమున

తే॥ కనలి జాంబవంతుండు వేగమున వచ్చి
[2](కదిసి చేసె ని)యుద్ధ మా ఘనునితోడ
నిరువురును సిద్ధబలముల నింపు మీఱఁ
బెనఁగి రిరువదియెనిమిది దినము లట్లు॥ 250

కం॥ ఆ జాంబవంతుఁ డంతట
నోజంబు దొరంగి పురుషోత్తముగా న
త్తేజోనిధి నెఱుఁగుచు న
వ్యాజముగ నుతించె బహువిధాగమగతులన్॥ 251

వ॥ వినుతించి యాగమనప్రయోజనంబు దెలిసి నిజపుత్రిక యగు జాంబవతితోడం గూడ స్యమంతకమణి నర్పించి మఱియు ననర్ఘరత్నములం బూజించిన నతనికిం బరమభక్తిం బ్రసాదించి రుక్మిణీపతియు జాంబవతీసమేతుఁ డయి యబ్బిలంబు వెలువడి యంతకుమున్న వారు

1. సించిన. 2. కదిసె సిని.

పం(డెండుదివసంబులు (ప్రతీక్షించి మఱలి పురంబుఁజేరిన పౌరజనవర్గం
బునకు లోచనోత్సవం బయి సభాగృహంబున సకలయదుసముకుంబున
స(త్రాజిత్తునకు మణి నొసంగె నంతట, 252

శా॥ ఆ స(త్రాజితుఁ డాత్మలోనఁ గడు లజ్జా(క్రాంతుఁడై యింక నీ
దోసం బంతయుఁ బాపికొందు నని సంస్తుత్యంబుగాఁ (బ్రార్థనో
ల్లాసం బొప్పగ సత్యభామ యను బాలన్ మించు సత్పుత్రికన్
జేసెం గానుక దానవారికి మణి(శేష్ఠంబుతోఁ గూడగన్॥ 253

తే॥ శౌరియును సాటిలేని యా సత్యభామఁ
(బేమతో యథావిధిగఁ బరి(గహించి
యా స్యమంతకమణి నొల్లఁ డయ్యెఁ దిరుగ
[1](మామకె) యొసంగె జనులు మా మా యనంగ॥ 254

వ॥ అంత,

కం॥ జతుగృహములఁ బాండవు లా
హుతులైరను వార్త శౌరి యఖిలజ్ఞుఁడు సం
గతముగ నాలించి కురు
(ప్రతతిం గనుగొనఁగ నేఁగె బలసహితుండై॥ 255

సీ॥ [2](ఆయెడ నట్లు సత్యను గృష్ణునకును ని
చ్చుటఁ జేసి) కలుగు నసూయచేత
న(క్రూరకృతవర్మ లవినీతి బోధింప
శతధన్వుఁ డత్యంత చపలవృత్తి
స(త్రాజితునిఁ జంపి శౌరి కుల్కి స్యమంత
కంబు న(క్రూరునికడనె పెట్టి
పారిపోవగ సత్యభామ మొఱంగింప
శౌరి రథారూఢుఁడై రయమునఁ

1. మామకే 2. ఆయెడరున నట్లు సత్య కృష్ణునకున్ నిచ్చుట చేసి.

తే॥ గదలి వెన్నుడి జని వాని ఖండితోత్త
మాంగుఁగా నొనరించి తదంబరంబు
తానె శోధించి యమ్మణిఁ గాన లేక
తిరిగి, చనుదెంచె ద్వారకాపురమునకును॥ 256

వ॥ వచ్చి భయపలాయితుం డయిన యక్రూరుని రావించి
యతనిచేత మణి యుండుట యదువుల కెల్ల విదితంబుగా నొనర్చె నీ
యాఖ్యానంబు వినినం జదివినఁ సుకీర్తిదురితహారం బగు నని పలికి
శుకయోగి మఱియు నిట్లనియె. 257

కం॥ యమునాతటమున భాస్కర
కుమారి కాళిందిఁ గాంచి గోవిందుం డా
ప్రమదఁ ద్వారకకుం దె
చ్చి ముదంబున శాస్త్రసరణిఁ జేపట్టె నృపా॥ 258

తే॥ మఱియు రాజాధిదేవికుమారి మిత్ర
వింద యను కన్య [1](వింద్రానువింద)భగిని
నఖిలనృపులును జూడఁ స్వయంవరమున
దెచ్చి పరిణయ మయ్యె సుధీవరేణ్య॥ 259

సీ॥ కోసలదేశంబు శాసించు నగ్నజి
త్తను నతిధార్మికుఁ డైన నృపతి
తన తనూజాతకు ననుపమసౌందర్య
[2](నందిత) యైనట్టి నాగ్నజితికి
దృప్తంబు లైనట్టి సప్తగోవృషముల
నిర్జించుటయ పరిణీత వెట్టు
[3](నుంకువ)గాఁ జేసి యుండంగ నవ్వార్త
విని శౌరి తత్పురంబునకు నేగి

1. విందానవింద. 2. నుదితి, 3. నుక్కువ.

తే॥ యతనిచేత సంపూజితుఁడై నృపముల
గెలిచి బంధించి జనసుత[1](కృత్యుఁ డగుచు)
నా నరేంద్రుండు ధారవోయంగఁ బెండ్లి
యాడె నయ్యెందుముఖిఁ బ్రమోదాన్వితముగ॥ 260

వ॥ ఇట్లు వివాహంబై కృష్ణుం డన్నరేంద్రునిచేతఁ బుత్రిక నరణంబుగా నొసంగఁబడిన దశధేనుసహస్రంబులను నిష్కగ్రీవయువతి త్రిసహస్రంబులును, నవసహస్రనాగంబుల, నాగశతగుణరథంబుల, రథ శతగుణాశ్వంబుల, నశ్వశతగుణభటులం దోడ్తోనుచు వధూయుక్తంబుగా రథారూఢుం డయి మార్గమధ్యంబునం దాఁకిన రాజకంబు నిర్జించి పురప్రవేశంబు సేసె. మఱియు శ్రుతకీర్తిదుహిత యగు భద్రను మద్రకన్యక యగు లక్ష్మణను వివాహం బయ్యె వెండియు నాకర్ణింపుము.

కం॥ గిరిశస్త్రాగ్నిజలానిల
భరదుర్గదురాసదంబు బహుమురపాశా
వరణము నగు ప్రాగ్జ్యోతిష
పురమున నరకాసురుండు భూతిఁ దలిర్చెన్॥ 262

ఆ॥ అదితికుండలములు నంబుపచ్ఛత్రంబు
నచ్చరలు సురాలయంబు నాది
యైన యింద్రుసొమ్ము లపహరించి చరించు
ధరణితనయుఁ డయిన నరకుఁ డధిప॥ 263

శా॥ ఆ విశ్వంభరపట్టి యట్లు నిబిడాహంకారపర్వోద్ధతుం
డై వేఁటాడి కలంచుటల్ మిగుల దైన్యప్రక్రియల్ దోఁపఁగా
దేవేంద్రుం డెఱిఁగింపఁ దద్దళనయుక్తిన్ సత్యభామాయుతుం
డై వచ్చెన్ వసుదేవసూనుఁడు ఖగేంద్రారూఢుఁడై వేడుకన్॥

1. కృత్యుండనగును.

వ॥ ఇట్లువిజయంబు సేసి ప్రాగ్జ్యోతిషపురంబునకుఁ జుట్టును నున్న దుర్గపరివేష్టనక్రమంబులు విలోకించి, 265

మ॥ గదచేతన్ గిరిదుర్గముల్ పెకలికల్గాఁ జేసి శార్ఙచ్యుత
ప్రదరౌఘంబుల శస్త్రదుర్గ[1](వితతుల్ భంజించి) చక్రంబుచే
[2](నదనన్) వహ్నిజలానిలప్రచురదుర్గానీకముల్ మాపి యా
యదునాథుం డసిధారఁ ద్రుంచె ముర[3](పాశానీకముల్) వ్రేల్మిడిన్॥

కం॥ [4](ఎడపని) శంఖా[5](రవముల)
జడిచే యంత్రము లణంచి జనహృదయము లే
ర్పడఁ బగుల శౌరి యప్పురి
బెడఁ గడరెడు కోటఁ దగఁ బ్రభిన్నము సేసెన్॥ 267

శా॥ సంగ్రామోత్సుకవృత్తి కృష్ణుఁ డటులన్ శంఖంబు పూరింపఁ జా
లం గ్రోధమ్మున నమ్మురాసురుఁడు వల్గత్పంచవక్త్రంబు లో
లిం గ్రూరభ్రుకుటిన్ ధరింప హరుపోల్కిన్ నీటిపై లేచి వ
చ్చెం గ్రవ్యాదగణంబు గొల్వ [6](నతిరో)చిష్మత్త్రిశూలోగ్రుఁడై॥

కం॥ నేలన్ శూలము వహ్ని
జ్వాలలు నిండంగ నెదురు వచ్చి కదియు న
వ్వ్యాలునిశిరంబు చక్రము
చే లీలనఁ ద్రుంచె మునులు చేకొని పొగడన్॥ 269

తే॥ అంత భూకాంత యరుదెంచి యదితికుండ
లములు వరుణాతపత్రంబు విమలమణియు
వైజయంతియు నొసఁగి యవ్వాసుదేవుఁ
జేరి పొగడి పౌత్రుని నిల్వఁ జేసి చనియె॥ 270

1. నిహతులై ప్రకోల్చి. 2. నదనన్వ. 3. ఘాసానీదముల్. 4. యడ. 5. రావముల. 6. గరా.

వ॥ ఇవ్విధంబున మురాంతకుండు నరకాసురసంహారం బొనర్చి ప్రాగ్జ్యోతిషపురంబు సొచ్చి నరకాసురభవనంబున నతండు రాజుల గెల్చి తెచ్చి నిరోధించిన పదియాఱువేవురు రాచకన్నియ లున్నచోటికిం జని మఱియును, 271

ఉ॥ ఈతఁడె నాకుఁ జిత్తహరుఁ డీతని నాకు హృదీశుఁగాఁగ న
ద్ధాత మదీయఫాలమునఁ దప్పక మున్నె లిఖించి యుండె నేఁ
జేతులు గూర్చి యీ ఘనుని[1](చేతల) కెప్పుడు మ్రొక్కుదాన నే
రీతి మదీయపుణ్యములఁ బ్రేమ నితండె ననుక్ వరించుతక్॥ 272

కం॥ అని యీ గతి నందఱు దమ
మనములఁ దలపోయ [2](మదన)మదవివశుల న
వ్వనజాక్షులఁ గరుణారస
మునఁ జేకొనుబుద్ధిఁ జూచె ముదము దలిర్పక్॥ 273

తే॥ అంత బహువస్తుయుతముగా నమ్మురారి
రాజకన్యల నెల్ల ద్వారకకు ననిపి
చనియె గరుడాధిరూఢుఁడై సత్యఁ గూడి
యదితికుండలదానార్థ మమరపురికి॥ 274

వ॥ చని యాస్వర్గద్వారంబున శంఖంబు పూరించి సార్ఘ్యపాద్యాదు లైన సురలచేత నెదుర్కొనఁబడి పూజితుండై యదితిగృహంబున కేఁగి యద్దేవికి నమస్కారపూర్వకంబుగా మణికుండలవారుణచ్ఛత్రంబులు సమర్పించి నరకనాశం బెఱింగించి తత్సన్నుతుండై వీడ్కోలు వడసి, 275

కం॥ వనజాక్షుఁ డపూర్వంబులు
తనకాంతామణికిఁ జూపుతలఁపున సుర[3](ప
త్తన)నికటస్ఫుట మగు నం
దనవనమున కేఁగి యచటఁ దద్దయుఁ బ్రీతిక్॥ 276

1. చేతుల. 2. మద. 3. పట్టన.

కం॥ [1](ఇది) యీ తరు విది యీ లత
యిది [2](యీ) పొద యనుచుఁ [3](జూపె) నింతి కఖిలముఁ
ముదితయుఁ జూచుచుఁ జూచెన్
సదమలజాతంబుఁ బారిజాతాగంబున్॥ 277

తే॥ చూచి యో దేవ! నాదు నిష్కుటమునందు
నిలుపఁ దగు నీ [4](కుజంబు) మన్నించితేని
యనుచుఁ బలుమారు గ్రుచ్చి నెయ్యంబు మిగులఁ
దియ్యముగ సత్యభామ యర్థించుటయును॥ 278

మ॥ హరి లీలం బెకలించి సమ్మదముతో సత్పారిజాతాగముఁ
గరుడస్కంధమునందు నిల్పికొని సంగ్రామార్థులై వచ్చు ని
ర్జరులన్ సేంద్రులఁ గాఁడఁ దోలి రమణీసంయుక్తుఁడై ద్వారకా
పురికిన్ వే సనుదెంచి నిష్కుటమునన్ బొల్పార [5](నిల్పెన్) నృపా॥

వ॥ అంత,

కం॥ పదియాఱువేవు రగు న
మ్ముదితల మురవైరి యన్నిమూర్తులఁ దాన
త్సదనములందు వరించె
న్ముద మొప్పగ నొక్క లగ్నమునఁ జిత్రముగాన్॥ 280

తే॥ అంత నుచితంబుగాఁ బదియాఱు వేవు
రాయతాక్షుల కా దానవారివలన
నొక్క రొకరికిఁ బదుగురు లెక్క సుతులు
సన్నుతింపఁ జనించిరి జనకసములు॥ 281

వ॥ మఱియు నంతకు మున్న రుక్మిణికిఁ బ్రద్యుమ్న, [6](చారు దేష్ణాదులును), నాగ్నజితికి భానుచంద్రాదులును, గాళిందికి శ్రుత, కవి

1. యిది. 2. యొ. 3. జూపి. 4. కుటంబు 5. నిచ్చెన్.
6. చారుదిష్ణాదులును

ప్రముఖ్యులును, మాద్రికిఁ బ్రఘోషగాత్రవన్ముఖ్యులును, మిత్రవిందకు [1](వృకారర్క)ప్రభృతులును, భద్రకు సంగ్రామజిద్బృహత్సేనాదులును, పదుండ్రు పదుండ్రు కుమారులు జనియించి రందుఁ బ్రద్యుమ్నునకు రుక్మిపుత్రి యగు రుక్మవతియం దనిరుద్ధుండు పుట్టె నయ్యనిరుద్ధునకు రుక్మిపౌత్రిం బెండ్లి సేయుటకు రామకృష్ణులు భోజకటకం బను పురంబునకుఁ జని రచ్చట, 282

తే॥ రుక్మి నిజపౌత్త్రి నయ్యనిరుద్ధునకుఁ బ్రి
యముగ శుభలగ్నమున వివాహంబు సేసి
హితులు కాళింగముఖనృపు లెచ్చరింప
హలధరునిఁ బిలిచి దుర్ద్యూత మాడఁ దొణఁగె॥ 283

సీ॥ తనతోడ నపుడు జూదం బాడి మును గెల్చి
బలుఁడు గైకొనినట్టి పన్నిదముల
నప్పుడు వైదర్భుఁ డన్నియు మఱలింప
నవ్వెఁ గాళింగుఁ [2](డున్మాద)వృత్తి
నది [3](సీరి) యోర్వనియంతలో నోడియు
గెలిచితి నే నని పలికె రుక్మి
సంకర్షణుఁడు గెల్చె సవ్యంబుగా నను
సురమార్గభాషయు సరకుఁ గొనక

తే॥ గొల్లవే యూరుజూదంబుగొడవ వనుచు
నెగ్గు లాడంగ ముసలి యూహీనుఁ బట్టి
పరిఘుహతుఁ జేసి [4](కాళింగుపండ్లు) డులిచి
[5](తటిమెు) నొప్పించి తక్కిన ధరణిపతుల॥ 284

వ॥ ఇట్లు రుక్మి హతుండైన రామకృష్ణు లనిరుద్ధునిం దోడ్కొని ద్వారక కేతెంచి యుండు నంత, 285

1. వృకాలర్క. 2. డున్మాన. 3. సిరి. 4. కాళింగపండు. 5. తరమొ,

సీ॥ [1](బలి)సుతుఁ డైనట్టి బాణా[2](సురుండు) శం
కరునిఁ దాండవవేళఁ గరసహస్ర
కృతవాద్యవాదనాద్భుతమున మెప్పించి
యాతఁడే తనపురం బరయు నతఁడు
గా, వరం బతనిచేఁ గాంచి పార్శ్వంబున
నున్నట్టి యద్దేవు నొక్కనాఁడు
మ్రొక్కి యో దేవతామూర్ధన్యరత్న! నా
భుజము లూరకయ మోపులు దలంప

తే॥ నిజముగా నొక్కరుండవు నీవు దక్క
నెదురుపడువాఁడు లేడు నా కిజ్జగముల
క్రొవ్వుతీట లణంగెడు నెవ్విధమున
దలఁచి తగు యత్న మాన తీవలయు ననిన॥ 286

మ॥ ద్విజరాజార్ధధరుండు నవ్వి పలికెన్ ధీరాగ్రణీ! నీ రథ
ధ్వజదండం బెపుడేని భంగుర మగున్ దద్వేళ మత్తుల్యుఁ డై
న జనుం డీ భవదీయబాహువుల నెన్నం గల్గు కండూతికా
రజతత్త్వంబు హరించు నాహవమహీరంగానుషంగంబునన్॥ 287

కం॥ అను నప్పలుకులు విని యా
దనుజేంద్రుఁడు సంతసిల్లి తనదు వినాశం
బు [3](నెఱుంగ) లేక యీ పని
యనుమానము లేక కలుగు నని యుండు తఱిన్॥ 288

తే॥ కలదు తత్పుత్త్రి యుష యను కంజనేత్ర
బాల్యయౌవన[4](సీమా)విభాసమాన
యా వధూమణి యొకనాఁడు దైవవశత
స్వప్నమునఁ గాంచె ననిరుద్ధసంగమంబు॥ 289

1. బల. 2. సురుడు. 3. నెరుగ. 4. శీమా.

వ॥ కాంచి యుదరిపడి లేచి యా కాముకునిఁ గానక కళవళించి కన్నీరు మున్నీరుగా వగచుచున్న సమయంబున బాణాసురమంత్రి యగు కుంభాండునకుఁ బుత్రి సకలకళాప్రవీణ చిత్రరేఖ యను చెలికత్తియ డగ్గఱ వచ్చి విషాదవేదనానిదానం బడుగుడు నక్కన్నియ విశ్వాసపాత్ర మగు నా సుగాత్రితో నెట్టకేలకు దిట్టతనంబుఁ దెచ్చికొని నిట్టూర్పు నిగుడించుచు,

ఉ॥ అంబుజపత్రనేత్రుఁడు నవాంబుదవర్ణుఁడు శోభమానపీ
తాంబరుఁ డిజ్జగంబులకు నాభరణం బగు నొక్క యౌవనా
డంబరశాలి నన్నిపుడు డాసి మనోభవకేళిఁ దేల్చి పో
యెం బరుషాత్మకుం డయి చెలీ! కలయో నిజమో [1](యెఱుంగనే)

కం॥ చెలియా! యా చెలువునితోఁ
గలయిక [2]గనఁ గలిగె నేని కలదానిఁగ నా
దలఁపు మటుగాక యుండిన
నిలువంగాఁ గూడ దదియు నిక్కంబు సుమీ॥ 292

తే॥ అనుచుఁ బలికిన నగు గాక యలరుఁబోఁడి!
యింత మాత్రమునకుఁ జింత యింత యేల?
నీ ప్రియునిఁ దెత్తు నిపుడ నా నేర్పుకలిమి
ననుచు నా చిత్రరేఖ భయంబు దెలిసి॥ 293

వ॥ తూలికయుం జిత్రపటంబు దిగుచుకొని క్రిందిమీఁదిలోకంబుల వారి లిఖించి చూపె, మధ్యమలోకభూనాయకుల వ్రాసి చూపుచు యదువంశక్రమంబున వసుదేవరామకృష్ణలేఖానంతరంబునం బ్రద్యుమ్నుని నిర్మించిన నయ్యిందువదన మందహాసంబు వదనారవిందంబున నందంబుగా విలోకించె నంత ననిరుద్ధునిఁ జిత్రించిన లజ్జావనతవదన యయ్యో న య్యింగితం బెఱింగి యా మంత్రిపుంగవపుత్రి యా క్షణంబున ద్వారవతీ

1. యరుంగ. 2 గనక.

పురంబున కేఁగి సుఖనిద్రితుండగు ననిరుద్ధుని నిజయోగబలంబున నెత్తికొని వచ్చి రహస్యంబుగ వయస్యకు సమర్పించిన, 294

కం॥ దనుజేంద్రదుహిత యా హరి
మనుమనితోఁ గూడి యుండె మనమున నితరం
బును నెఱుఁగక తద్యుతుండై
యనిరుద్ధుఁడు నితరకృత్య మంతయు మఱచెన్॥ 295

సీ॥ అనిరుద్ధుఁ డిత్తెఱంగున నాల్గు నెల లుషా
సహితుఁడై తగు నుపచారములఁ బ్రి
యంబుఁ జొప్పడ నుండు నంత నంతఃపుర
రక్షకుల్ కన్యదుర్లక్షణములు
గాంచి యెఱింగింపఁ గనలున బాణుండు
పట్టంగఁ బనిచిన భటుల నెల్లఁ
బరిఘుచేఁ బరపెడు ప్రద్యుమ్నసుతు నాగ
పాశాళిచేఁ దాను బద్ధుఁ జేయ
తే॥ నింతయును నారదుఁడు వచ్చి యెఱుఁగఁ జేయ
రామకృష్ణులు జనితసంరంభు లగుచు
ద్వాదశాక్షౌహిణీపరివారు లగుచుఁ
గదలి వచ్చిరి శోణితాఖ్యానపురికి॥ 296

వ॥ బాణుండును సమానబలసమేతుండై పురంబు వెడలి వచ్చి యెదిరించె నా సమయంబున, 297

ఉ॥ బాణునిపట్టణంబునకు భక్తి నజస్రము నిల్చి రక్షణ
ప్రీణన మాచరించు పురభేదనుఁ డాగతి వచ్చి యాదవ
శ్రేణులు విక్రమింపఁ గని చెచ్చెఱ [1](వేడుక భక్త)జాల మ
క్షీణగతిం భజింప నడచెన్ వడిఁ గృష్ణరణాభిలాషియై॥ 298

1. గచ్ఛుక.

ఉ॥ శౌరియుఁ జంద్రమౌళియును సాహసలీల నెదుర్పడంగ త
ద్ఘోరరణంబు గన్గొనుటకున్ మది వేడుక యుప్పతిల్లగా
సారసనంభవుండు సురసంఘము గొల్వఁగ నంబరంబునన్
జేరువ నిల్చె నారదుఁడు చెంగట గంతులు వైచుచుండఁగన్॥ 299

వ॥ అప్పు డయ్యిరువాగునుం గయ్యంపుటాయితంబునం దలపడు టయు బలంబుల తూర్యంబుల రవంబులు కిక్కిరిసి బ్రహ్మాండకటాహంబు [1](నాస్ఫాలించి) శంకరునితోడం గృష్ణుండును బాణాసురునితోడ సాత్యకి యును, కుమారస్వామితోడఁ బ్రద్యుమ్నుండును, బాణపుత్రునితోడ సాంబుండును, కుంభాండకూపకర్ణులతోడ బలభద్రుండును దలపడి పోరి రంత శంకరానుచరు లగు భూతప్రేతపిశాచగుహ్యకఢాకినీయాతుధాన భేతాళవినాయకమాతృకూష్మాండబ్రహ్మరాక్షసాదులం గృష్ణుండు శార్ఙ్గప్ర యుక్తనిశాతసాయకజర్ఝరితాంగులం జేసి పఱపె. శివగణప్రయుక్తంబు లయిన బ్రహ్మవాయవ్యాగ్నేయపాశుపతాస్త్రంబులం బ్రత్యస్త్రంబుల చేత నిరసించి జృంభకాస్త్రంబున శంభుని మూర్ఛితునిఁజేసి కుమారుఁడును బ్రద్యుమ్నుని బాణంబులచేతఁ ద్రాణ చెడి పలాయితుం డయ్యెఁ గుంభాండకూపకర్ణులు బలదేవహతు లగుటయు దైత్యవరూధిను లనాథు లగుచు విచ్చి చనియె నంత, 300

సీ॥ సాత్యకితోఁ బోరు సాలించి బాణుండు
తన కెదుర్పడఁ జక్రధరుఁడు సూచి
చాపసారథివాజిసంహార మొనరించి
శంఖంబు పూరించు సమయమునను
తన్మాత [2](కోటర) తత్ప్రాణరక్షేచ్ఛ
నపవస్త్రయై నిల్చె నంతరమున
దానిఁ జూడఁగ నోడి దానవారి యవాఙ్ము
ఖుం [1](డయి యుండ) బాణుండు భీతిఁ

1. నాస్వాదించి. 2. కోటీర. 3. దైయ్యుండ.

ఆ॥ [1](బురము) సొచ్చె నంత హరవిముక్తజ్వరం
బచట వైష్ణవజ్వరాతిభిన్న
మై భయంబు నొంది యా చక్రిఁ గీర్తించి
చనియె నవ్విభుని బ్రసక్తి వడసి॥ 301

వ॥ అయ్యెడ,

ఉ॥ క్రమ్మఱ వచ్చి బాణుఁ డతిగర్వమునన్ రణ మాచరింపగా
నమ్మధుసూదనుండు నిశితాచలచక్రముచేతఁ ద్రుంచె రో
షమ్మున వాని బాహువులు చయ్యన నాలుగు చిక్క నంతలో
నమ్మదనాంతకుం డసుర కడ్డము వచ్చి కృపావిధేయతన్॥ 302

తే॥ వచ్చి యంతటిలో నిల్పవలయు వీని
ననుచు వినుతించి ప్రార్థించె నంధకారి
[2](అతఁడు) ప్రహ్లాదకులజుఁ [3](డహాస్యుఁ) డనుచుఁ
గాచి విడిచెఁ గంసారియుఁ గరుణాపేర్మి॥ 303

తే॥ ఒప్పగించె బాణుఁడు సుపాయుక్తముగ ని
రుద్ధు ననిరుద్ధుఁ దెచ్చి కారుణ్యనిధికి
చనియె నతఁడును పౌత్రుఁ దోడ్కొనుచు ద్వార
వతికి సేనాసమేతుఁడై వైభవమున॥ 304

సీ॥ ఒకనాఁడు ద్వారవత్యుపవనచరు లైన
బాలకు లొక పెద్ద పాడు నూతి
లోన మహాద్రిసమానమై కనుపట్టు
నొక సరటముఁ గనియు ధరింప
నమకట్టి దిగువ నశక్తులై శౌరికి
నెఱిఁగింప నవ్విభుఁ డేఁగుదెంచి

1. బారము. 2. ఇతఁడు. 3. హాస్యుఁడ

సరగున వామహస్తము సాఁచి వెడలింప
నది దివ్యమూర్తియై యలరు పురుషుఁ

తే॥ డగుచు నిల్చి నీ వెవ్వఁడ వని మురారి
చేఁ గృతప్రశ్నుఁడై నమస్కృతి యొనర్చి
పలికె ము న్నేను నృగుఁ డను పార్థివుండ
వినుఁడు నేఁ జేసినట్టి దుర్వినయవృత్తి॥ 305

తే॥ ఏనె మున్నొక విప్రున కిచ్చినట్టి
గోవుఁ గ్రమ్మఱ మద్ధేనుకులమునందె
మఱిగి యలయుట యెఱుఁగక మఱల నొక్క
యవనిసురునకు నిచ్చితి నాదిదేవ॥ 306

వ॥ అంతఁ బూర్వంబునఁ బ్రతిగ్రహించినవిప్రుండు వచ్చి యిది మదీయధేను వని పట్టిన నితరుండును నట్టులే పలుక నిద్దఱి వివాదం బేను విని కోటిధేనువుల నైన నే నొసంగెద నిద్ధేనువును సమ్మతించి విడువు మని ప్రార్థించిన సమ్మతింపక యిద్దఱునుం జని రద్దోషంబున నిట్టి రూపంబు ప్రాప్తం బయ్యె నీ కరస్పర్శనంబున ధన్యుండ నైతి నని విన్నవించి విమానారూఢుండై యరిగె నంత, 307

సీ॥ బలభద్రుఁ డొకనాఁడు బంధుదర్శనతర్ష
మున నందగోకులంబునకు నేఁగి
బృందావనాంతంబునందుఁ జరింపుచు
రమణీయవారుణీరసముఁ గ్రోలి
మత్తుఁడై జలకేళి కత్తఱిఁ దగఁ బిల్వ
తరలి రాకుండుట తప్పు గాఁగ
హలముచే యమున ద్రవ్యాలు సేసె నపుడ త
త్సన్నుతిచేతఁ బ్రసన్నుఁ డగుచు

తే॥ నందు రమణీసహాయుఁడై యంబుకేళి
తత్పరుం డయ్యె బహువిధోదారగతుల
చైత్రవైశాఖమాసముల్ సఖులఁ గూడి
యచ్చటనె సుఖంబున నుండె నంత నిచట॥ 308

ఉత్సాహ॥ వాసుదేవుఁ డనఁగ నేన వాసుదేవనామముల్
వాసి లేని నీకుఁ [1](దాల్ప) వచ్చు [2](నెట్లు) విడువు లే
దా సమీకమునకు వెడలఁ దగు నటంచు దృప్తుఁడై
[3](వ్రోసె) పౌండ్రకుండు దూతముఖమునన్ మురారితోన్॥

ఉ॥ పౌండ్రకదూత యీ సరణిఁ బ్రౌఢతఁ దోపఁగ నాడినట్టి యా
వేంద్రపు మాట లెల్ల విని వెన్నుఁడు నవ్వుచు మేలు మేలు రా
వాంద్రను వీంద్ర నాడుగతి వచ్చితనన్ జెనకంగ నైన నీ
తీంద్ర యణంతు నంచు నెడ త్రిప్పక సేనలు తన్ భజింపగన్॥ 310

ఆ॥ వెడలి కాశిపురికి నడచె నచ్చటి [4](కంత)
పౌండ్రకుండు కాశిభర్తఁ గూడి
నడచె దేవదేవునకు సమ్ముఖంబుగాఁ
దగఁ దదీయచిహ్నధారి యగుచు॥ 311

తే॥ శంఖచక్రముల్ పీతవస్త్రంబు వైజ
యంతి యను నాదిగాగల యాత్మచిహ్న
ముల [5](నటుఁడు)వోలెఁ దాల్చు నమ్మూఢుఁ బౌండ్రుఁ
జూచి యిది వింత యనుచుఁ గృష్ణుండు నవ్వె॥ 312

ఉ॥ క్రించగు పౌండ్రుచేత రణకేళి యొకించుక సేపు పెద్దఁ జే
యించి తదుత్తమాంగము నహీనరయంబునఁ జక్రధారచేఁ
ద్రెంచి తదీయసైన్యము విదీర్ణముగా నొనరించె హేమపుం
ఖాంచితశార్ఙ్గముక్తనిశితానలసన్నిభసాయకంబులన్॥ 313

1. ద్రాల్ప. 2. నట్లు. 3. వ్రోసి. 4. కినంత. 5. నటుండు.

ఆ॥ కాశిరాజుశిరము ఖడ్గకృత్తము సేసి
బాణములఁ దదీయపట్టణంబు
నఘమఁ బడఁగ జేసి నళిననాభుఁడు ద్వార
వతికి వచ్చె జనులు నుతి యొనర్ప॥ 314

సీ॥ అటఁ గాశిఁ గాశినృపాత్మజుండు సుదక్షి
ణుం డట్టి తన జనకుండు సనుట
కని దుఃఖియై కాశికానాథు విశ్వేశు
సంతుష్టుఁ జేసి తచ్ఛాసనమున
పితృహంతహననార్థ మతినిష్ఠ నభిచార
హోమంబు సేసిన నా మహాగ్ని
తాన భీకరరూపధారియై ద్వారక
కేతేరఁ గని జనుల్ భీతిఁ జెప్పఁ

తే॥ జక్రి పార్శ్వస్థితం బైన చక్రమునకు
సెలవు వెట్టిన నది యగ్ని నొలసి పరపి
శీఘ్రగతి నేఁగి యా సుద[1](క్షిణు) దహించి
కాశిపురమంతయును [2](నీఱుగా) నొనర్చె॥ 315

కం॥ తను బనిచినపని యంతయు
గనుమూసినయంతలోనె కాఁజేసి సుద
ర్శన మాత్మవిభునిపార్శ్వం
బున నిలిచి కొలిచెఁ బూర్వపుసరణిన్॥ 316

వ॥ అంత నరసఖుం డయిన ద్వివిదుం డను దుష్టవానరాగ్రేసరుండు పురగ్రామఘోషాదు లగ్ని యిడియును, శైలంబులు వెఱికి మీఁద వైచియును, ఋషుల యాశ్రమంబులపాదపంబులు విఱిచియు, హోమా నలంబులమీఁద శకృన్మూత్రంబులు చల్లియును, కులస్త్రీదూషణంబులు

1. క్షిణుని, 2. నీరు.

సేసియును, మఱియుం బెక్కుప్రకారంబుల జగదుపప్లవంబు సేయుచుండి యొక్కనాఁడు బలభద్రుం డంగనాసమేతుం డయి రైవతకాచలంబున విహరించుచుండ నచ్చటికిం జనుదెంచి యంతట, 317

కం॥ లలనల నవ్వింపుచు శా
ఖలు విఱుగంగ నూఁచి యాడి [1](గంతుల నగుచున్)
కిల కిల యగుచున్ మదిరా
కలశము నెత్తికొని పోవఁ గని [2](హాలి) యలుకన్॥ 318

తే॥ ముసలమున మ్రోఁదె నబ్బంగి మ్రోఁదఁబడియు
విడిచి పోవక తరుశిలావృష్టిఁ గురియు
ద్వివిదు నువిదలు మెచ్చ సంధించి ముష్టిఁ
బొడిచి హతుఁ జేసె నయ్యదుపుంగవుండు॥ 319

కం॥ ఆదరమున వేల్పులు జయ
వాదంబులతోడ సాధువాదములు నమో
వాదంబులు జేసిరి ని
ష్పాదితనవపుష్పవృష్టిభరులై [3](హలికిన్) 320

వ॥ మఱియును,

సీ॥ కలితస్వయంవరకల్యాణ యైన దు
ర్యోధనుపుత్త్రి సముజ్జ్వలాంగి
లక్షణ యనుదాని లాలితబలుఁడు సాం
[4](బుఁడు) హరింపఁగ బంధమునకు నడ్డ
మరుదెంచి కురువీరు లతనిఁ బట్టినవార్త
బలుఁడు నారదమౌనివలనఁ దెలిసి
హస్తిపురి కేఁగి యచట వియ్యానులు గై
కొనక తన్నాడుపల్కులకు నులికి

1. గోసతులునను చున్. 2. హరి. 3. హరికిన్. 4. బుండుహరింపగ బంధంబునకు నడ్డ.

తే॥ యప్పురముదక్షిణపుదిక్కు హాలము నాటి
వైచి పెగలింప గడగడ వణఁకి వార
లంగనాయుక్తు సాంబుని నపుడ యొసఁగఁ
దెచ్చె నిజపురంబునకుఁ బార్థివలలామ॥ 321

తే॥ [1](అదిమొదలుఁగాఁగ నేఁడును నప్పురం బె)
సంగుచున్నది బలశౌర్యసాధి యగుచు
దక్షిణపుదిక్కు పొడువు నుత్తరపువంక
నానతంబును నై గంగలోని కొఱగ॥ 322

వ॥ అంత,

మ॥ హరి యష్టోత్తరమైన షోడశసహస్రాంతఃపురస్త్రీల నే
కరణిం గూడి మెలంగునో తెలిసెదం గాకంచుఁ గౌతూహలా
స్ఫురణ న్నారదుఁ డొక్కనాఁడు మిగులన్ శోభిల్లు [2](తద్ద్వార)కా
పురి[3](కిన్ వచ్చె) రథాంగపాణి నమలాంభోజాక్షునిం జాడుచున్॥

వ॥ ఇవ్విధంబునం జనుదెంచి నారదుం డంతఃపురంబున నొక్క భవనంబునందు దాసీసహస్రపరివృత యగు తరుణిచేతఁ జమరీవాలవీజ్యమానుం డగుచున్న వెన్నునిం గని ప్రత్యుత్థానపూర్వకంబుగా నద్దేవుని వలన నాతిథ్యంబు వడసి నుతియించి యోగమాయాప్రభావంబుఁ దెలియ నుత్సహించి మఱియొక్క వధూగృహంబు సొచ్చి యందుఁ దరుణియును, నుద్ధవుండునుం, దానును జూదం బాడు నయ్యంగజజనకునిం గనుంగొని మున్నిటియట్ల పూజితుండయి కుశలప్రశ్నాదికం బనుగంబడి విస్మితుండై,

తే॥ మఱియు నేయింటఁ జూచిన మధువిరోధి
గలిసి యొక్కొక్కపని నుండి కానఁబడఁగ
కృష్ణరహితాలయంబు వీక్షింప లేక
తిరిగె నిల్లిల్లు దప్పక దిట్ట తపసి॥ 325

1. అదిమొదలుగ నేఁడును నప్పురం బె. 2 తద్వార. 3. కిం వ.

ఆ॥ తిరిగి తిరిగి యలసి హరినొక్కచోఁ జేరి
దేవ నీదు మాయఁ [1](దెలియఁ) జూడ
నెంతవాఁడఁ గరుణ నీక్షింపు మని నమ
స్కారకారి యగుచు సన్నుతించె॥ 326

వ॥ సన్నుతించుటయును గరుణావిలసితంబునం గనుంగొని, 327

ఉ॥ నారద చూచితే కలయ నారుల [2](యిండ్లను దృష్ణ) తీరెనే
యారసితే మదీయమహితాద్భుత మంతయు నొంటివాడు సు
మ్మీ రుచిరాంగులం దనుచు నెల్లిదమాడుచు గారవించి యం
భోరుహలోచనుం డనుపఁ బోయె మునీంద్రుఁడు విస్మితాత్ముఁడై ॥

వ॥ ఇవ్విధంబునఁ గృష్ణుండు ద్వారకావిహారియై యున్న సమయంబున,

మ॥ అనుభావంబున సాటిలేని ఘనుఁ డుద్యత్కీర్తిచంద్రాతపం
బున లోకంబులు వన్నెవెట్టుకృతి యంభోరాశిగంభీరుఁ డా
ర్యనుతకౌంతియుధిష్ఠిరుండు సుమనుండై రాజసూయాధ్వరం
బొనరింపం దలపెట్టె నచ్యుతకృపాయోగంబులో నమ్మటన్॥ 330

వ॥ అట్టి యనంతరంబునందు, 331

మ॥ తమరక్షించుట కింతయుం దెలిపి దూతం బంపి రా చక్రికిన్
సముదగ్రస్థిరశాసనుం డగు జరాసంధక్షమానాథుచే
సమరావర్జితులై గిరివ్రజపురిన్ సంవృద్ధులై యున్న భూ
రమణుల్ భూరిసహస్రసంఖ్య లగు వారల్ దాసభావంబునన్॥ 332

మ॥ యదువంశోద్భవుపాలి కా నృపతిదూతాగ్రేసరుం డట్లు స
మ్మద మొప్పం జనుదెంచి యుండగనె సన్మాన్యుండు ధన్యుండు నా
రదమౌనీంద్రుఁడు వచ్చి ధర్మజముఖారంభం బెఱింగించి యా
సదయుం బ్రార్థితుఁ జేసె నట్టిపనికిన్ సాహాయ్యసంధాయుగాన్॥

1. దెలిపి 2. యిండ్లవృష్టదీ.

వ॥ ఇట్లు యుగపత్ప్రాప్తంబయిన కార్యద్వయంబుచేత సమా
కులితచిత్తుండై చిత్రజజనకుం డుద్ధవునిం జూచి బుద్ధి యడిగిన, 334

సీ॥ దీక్షితుం డయిన యుధిష్ఠిరునకు సాయ
[1](మాచరించుట) యుక్త మబ్జనేత్ర
రాజులు చెఱలు ఘోరనఁ దీర్ప వారలుఁ
గొలుతురు కీర్తియుఁ గలుగు మిగుల
ఆ మాగధుండు నాగాయుతప్రాణుఁడు
వారికి నతనిఁ గెల్వంగ రాదు
ద్వైవధంబున వాని వధియింప యుక్తుండు
సముఁడు భీముండు నిస్సంశయముగ
తే॥ విప్రు[2](లై యేఁగి) రణభిక్ష వేడుకొనిన
నాతిథేయుం డతండు లేదనక [3](యిచ్చుఁ)
గావున మఖంబునకు నేఁగి కార్య మిదియుఁ
దగు నొనర్పంగ ననుచు నుద్ధవుఁడు బలుక॥ 335

ఉ॥ శౌరియు నప్పు డుద్ధవుని సన్నయపద్ధతి నాదరించి పెం
పారగ నయ్యుధిష్ఠిరునియాగముఁ జూడఁగఁ జిత్తగించి మీ
వారినిఁ జూచి పోవ నిదె వచ్చెదఁ బొమ్మని దూతఁ బంపుచుం
దారసమేతుఁడై బలవితానముతోఁ గదలెన్ రథస్థుఁడై॥ 336

మ॥ దనుజారాతి-క్రమప్రయాణముల నింద్రప్రస్థముం జేర వ
చ్చిన నద్ధర్మతనూభవుండు విలసత్సేనాయుతుండై యెదు
ర్కొని సంపూజితుఁ జేసి యే నిపుడు గైకొన్నట్టి యుద్యోగ మె
ల్ల నిను న్నమ్మి [4](య) సుమ్ము కృష్ణ యని సల్లాపంబునం దెల్పినన్॥

1. మాచరింపుట
2. లయ్యేగి.
3. నిచ్చు.
4. సుమ్ముకృష్ణయని,

తే॥ ఉద్ధవుఁడు మున్ను జెప్పిన యుక్తి నెల్ల
కమలనాభుండు పాండవాగ్రణికిఁ దెలిపె
నిదియ కర్తవ్య మని యజనేశ్వరుండు
సమ్మతంబును నాత్మలో సమ్మతించె॥ 338

వ॥ అంతఁ గృష్ణుండును వడముడియునుం గవ్వడియును బ్రాహ్మణ
వేషులై గిరివ్రజంబునకు నరిగి యాతిథ్యవేళయం దా జరాసంధునిం
గనుంగొని, 339

కం॥ అతిథుల మతిదూరసమా
గతులము నీవలన నొకటి కాంక్షించెద మో
యతిథిప్రియ యది మాకున్
ధృతి నొసగెద నంటివేని తెలిపెద మనినన్॥ 340

తే॥ అతఁడు వారల స్వరములు నాకృతులును
జ్యా[1](కిణాంకప్రకోష్ఠ)దేశములు నరసి
యవనిపతులఁగాఁ దెలిసియు నాతిథేయుఁ
డగుట విని యాదరోపయుక్తాంగుఁ డగుచు॥ 341

కం॥ కడపక యర్పించెద నా
యెడ నెయ్యది మీకు మిగుల నిష్టం బది స
న్నడుగుం డర్థుల రగు మీ
రడిగిన నిపు డిత్తు నుత్తమాంగం బైనన్॥ 342

తే॥ అనుడు శౌరి యా మగధేశు నభినుతించి
యతఁడు భీముఁ డేఁ గృష్ణుండ నితఁడుఁ గ్రీడి
తోడరి మాలోన నొక్కనితోడఁ బోరు
మిదియ నా కోర్కె యన నజ్జనేశ్వరుండు॥ 343

1. కిణోకోష్ఠ.

సీ॥ పకపక నవ్వి రోషకలితుండై చూచి
యగుఁ గాక నీ పెద నడిగినట్లు
భీతుండవై మున్ను పెద్దలు వసియించు
రమణీయమగు మథురాపురంబు
విడిచి పయోనిధినడుమ నివాసంబుఁ
గైకొన్న కృష్ణ! నీ కథలు చాలు
నాకంటెఁ బిన్న యీ పాకశాసనుపుత్రుఁ
డితనితోఁ [1](దొడరుట) హీనతరము
తే॥ బలమున వయోగుణంబులఁ దెలియ [2](మత్స)
మానుఁడై నట్టి యీ భీమసేనుతోడఁ
జేరి యొక్కటి కయ్యంబు సేయువాఁడ
ననుచు ధీరతరంబుగాఁ [3](వినగఁ) బలికె॥ 344

వ॥ గదాద్వయంబుఁ దెప్పించి యందు భీమసేనునకు నొక్కటి యొసంగి తా నొక్కటి ధరియించి పురంబు వెడలి యుద్ధంబునకుం దలఁపడె నప్పుడు, 345

కం॥ నానామండలసంచా
రానూనాభ్యాసులైన యయ్యిద్దఱు తే
జోనిధులు నతిభయంకర
మైన గదాహవము సేసి రమరులు పొగడన్॥ 346

ఉ॥ ఆతతరోషవృష్టి మగధాధిపభీములు విస్ఫురద్గదా
పాతములన్ భుజాంసకటిపాదకరోరువు లెల్ల నుగ్గు నూ
గై తెగి రక్తముం గురియ నత్తఱిఁ గానఁగ వచ్చెఁ బక్వత
ద్ధాతుఝరీసమేతవసుధాధరశోభలఁ గ్రేణిసేయుచున్॥ 347

---

1. తొడరవు. 2. వత్స. 3. వినక.

తే॥ పగరఁ బరిమార్పఁ గల యుపాయ మాత్మఁ
దగ విచారించి వడముడి మొగము సూచి
పాదమునఁ బాదపముఁ ద్రొక్కి [1](పఱియవాపు)
విధముఁ దోఁపంగ సంజ్ఞఁ గావించె శౌరి॥ 348

వ॥ ఇవ్విధంబునఁ గృష్ణుండు సంజ్ఞఁ గావించి నిజతేజఃప్రవేశంబున నాప్యాయనం బొనర్చిన నక్కరువలిపట్టియుం గఱుకెక్కి గ్రక్కున, 349

తే॥ పాదములు పట్టి పడఁగొట్టి పాద మొకటి
పదముచేఁ ద్రొక్కి మఱియొక్కపదము హస్త
మున గ్రహించి శిరోభాగమునకు వెడల
బఱియవాపె జరాసంధు కఱుకుమేను॥ 350

కం॥ మోహించి చూచుప్రజలకు
హాహాకారంబు వొడమె నాహాకారం
బా హరిపార్థుల కొదవె ర
ణాహతుఁడై మగధనాథుఁ డట్లు పడంగాఁ॥ 351

సీ॥ అంత జరాసంధు నాత్మజుఁ డై నట్టి
సహదేవుఁ దద్రాజ్య[2](శాస్త్రఁ జేసి)
యిరువది[3](వేవురు నెనమ)నూఱ్వుర బంధ
నాలయగతులైన యవనిపతుల
విడిపించి వారల వినుతి నాకర్ణించి
యంబరాభరణయానాదు లొసఁగి
స్వస్వదేశములకు పూర్వపుచందమున సమ
చిత్తులై యొనర శాసింపుఁ డనుచు

1. పఱియవాపు. 2. శాస్తిచేసి. 3. వేవుర నెనమ.

తే॥ ననిపి భీమార్జునసమేతుం డగుచు వేడ్క-
లెసయ నాఖండలప్రస్థమునకు నేఁగి
వాసుదేవుండు తాఁ జేసి వచ్చినట్టి
కార్య మంతయుఁ బాండవాగ్రణికిఁ [1](దెలిపె)॥ 352

వ॥ ధర్మనందనుండును జనితానందుండై యటు మున్న భీమార్జున నకులసహదేవులచేత వాసవవైశ్రవణవరుణవైవస్వతదిశలవలనం దేఁబడిన యర్థంబులచేత వసిష్ఠ, వామదేవ, విశ్వామిత్ర, భరద్వాజ, వ్యాస, పరాశరాది మునిప్రవర్తమానతంత్రుండును, భీష్మ ద్రోణ కృప విదుర దుర్యోధన దుశ్శాసనాదినివర్తితసకలప్రయోజనుండునునై యథావిధిగా రాజసూయాధ్వరం బొనర్చి సౌత్యంబగు నహంబునందు యాజకార్చ నంబు సేయం బూని యాసమాజంబునం దగ్రపూజార్హు లెవ్వ రని యడిగిన నందఱు నన్నిచందంబులం బలుకుచుండ సహదేవుం డిట్లనియె, 353

శా॥ భూకాంతోత్తమ! యింక వేఱ వెదుకం బో నేల నిక్కంబుగా
నీ కృష్ణుండె శ్రుతిప్రకాశకుఁడు యజ్ఞేశుండు తన్మంత్రతం
త్రాకారుండు చరాచరప్రభవరక్షాంతానుసంధానలో
కైకాధీశుఁ [2](డితండ) యెయ్యెడలఁ బూజార్హుండు మున్నెట్టుగన్॥

తే। కీర్తితాఖండచిన్మోదమూర్తి యితఁడె
యొక్కఁడై వెలుంగు నితఁ డద్వయుం డితండె
యైతదాత్మ్యంబు సర్వంబు నరసి చూడ
నితఁడె నవవిధసంసారహేతు వధిప॥ 355

దండకం॥ వినుమింక సకలాగమవ్యక్తసిద్ధాంతసిద్ధార్థముం దెల్పెద న్నేర్చుభంగిన్ రజస్సంగతిన్ లోకనిర్మాతయై బ్రహ్మనామంబునన్ సత్త్వసంయుక్తిఁ దద్రక్షియై పద్మనాభాభిధేయంబునం దామసవ్యక్తి సంహారకుండై హరాఖ్యం బ్రవిఖ్యాతుఁడై గౌణభిన్నత్వముం బొందు

1. దెలిపె. 2. త్రండు

నీతండు సర్వజ్ఞుఁ డాద్యంతశూన్యుం జగద్రక్షణార్థంబు దేహంబు గైకొన్న యీ మాన్యునిం గ్లేశకర్మప్రకారానభిజ్ఞాతయై పుంగవుం డైన యయ్యాశ్వరుంగా నెఱింగింతు రార్యుల్ మహాభాగు లీ భోగిరాట్తల్పుపై భక్తిసంయుక్తులై యుక్తిమంతుల్ సదా [1] (ధ్యానవీతాఘు)లై మించి సంసారపారంబుఁ గాంతు ర్మదిం గ్రామ్యభావంబులన్ [2](రోసి) కైవల్యకాము ల్మహాదుర్గతిం బొల్చు నియ్యద్వయున్ యోగమార్గంబుచేకొన్న చిత్తంబుచేతన్ బ్రవేశింతు రుర్వీధరుండై యధోవృత్తియై యుంఁజియుం బ్రహ్మలోకోపరిస్వస్థుఁడై యున్నవాఁ డెవ్వ నీయున్నతుం డెట్టివేళన్ సృజింపం బడం డెట్టిచో సంహరింపం బడం డేరికిన్ శాసనీయుండు గాఁ డెట్టివానిన్ నుతింపం డితం డిమ్మహాత్ముండు పూర్వంబు తోయంబుఁ గల్పించి యం దాత్మవీర్యం బవార్యంబుగా నిల్పఁ [3](దత్తేజ) మద్ధాతకుం గారణం బయ్యె నద్ధాత విశ్వంబుఁ గల్పించె, నీతండు మీనావతారంబునన్ వేదసంరక్షకుం డయ్యెఁ, గూర్మాకృతిం దేవకృత్యంబు నీడేర్చె, నాదిన్ వరాహావతారంబునం గంధరా[4](ఘూన)నప్రస్ఫురత్కేసరక్షిప్తవారాశికల్లోలినీభూతధాత్రిం క్షణోత్క్షిప్తఁ గావించె, శ్రీ నృసింహుండు నాఁ బొల్చి వజ్రాదిదుర్భేద్యమై దుర్నివారాజిఖర్జూభరంబైన దైతేయవక్షఃస్థలంబున్ నఖాగ్రంబులం జించి లంఘించి రోషంబునన్ మించి దిగ్దంతికుంభస్థలాస్ఫాలనం బాచరింపంగ నేతన్నఖౌఘంబు లాపూర్ణముక్తౌఘుతన్ శుక్తిభంగిన్విరాజిల్లె, గుజ్జై బలిస్వీకృతంబైన యవ్వజ్రిరాజ్యంబు పూజ్యంబుగాఁ గ్రమ్మఱం గైకొనం బూను నవ్వేళ నర్కేందులోకంబులం దాఁటి యున్మేటిపాదాంబుజం బంతరిక్షంబు నన్నింటఁ గప్పట్టె, నీతండె రామాభిదానంబునన్ రేణుకాసూనుఁడై కార్తవీర్యార్జునాఖ్యాగమున్ పాటితానంతపత్రౌఘమున్ బాహుశాఖావిహీనంబున[5](........)తాచ్ఛాయమునుం

---

1. ధ్యాపీతాఘు. 3 ప్రోసి. 2. మత్తేజ.

4. ఘూన. 5 (నత్యుచ్ఛ్రితా).

గా నొనర్చెం దశస్యందనాపత్యమై వార్ధి బంధించి గీర్వాణవిద్రావణుం
ఖండితుం జేసి లంకాపురిం వానితోఁబుట్టువుం బట్టముం గట్టె నీ దిట్ట
పద్మాసనప్రార్థి [1](తుండై ఘోరా)సురేంద్రాదులం బోరులం ద్రుంప నీవాను
దేవత్వముం బొందె కృష్ణాఖ్య నే లోకనాథుండు గోపాలసల్లాపలీలాత్ముఁడే
పుణ్యుఁ డుద్యద్భుజాదండసారంబునం గొండపై నుండఁగా వించి వర్షాపదా
మగ్నగోమండలోద్ధారకుం డయ్యె, నే శూరుఁ డత్యుద్ధతిం సత్యభామా
మనఃప్రీతికై నందనోద్యానవిఖ్యాతమున్ బారిజాతాగముం దెచ్చి [2](ము
న్నిచ్చె) నద్దేవుఁ డార్యుం డనంతుం డయజ్ఞేశ్వరుం డిట్లు సాక్షాదనుగ్రాహ
కుండై భవద్యజ్ఞనిర్వాహకుం డయ్యె నీ భాగ్య మత్యంత చిత్రంబు
భవ్యుండ వీ శౌరికిం బూజ మున్నిచ్చి యాచంద్రతారార్కముల్ మే
లనం జాల ధన్యుండవై యుండు ధర్మాత్మజా. 356

వ॥ అని యివ్విధంబున సహదేవుండు పలికినఁ దద్వచనంబు మునీంద్రు లెల్ల సాధువాదంబుల సంస్తుతించిరి. ధర్మనందనుండును దదనుమతంబునఁ గనకకలశసంవృతతీర్థోదకంబులఁ గృష్ణునిపాదపద్మంబులు ప్రక్షాళించి యాతీర్థంబు తనవారలు తానును శిరంబుల ధరియించి గంధాక్షతపుష్పంబుల నర్చించి పీతకౌశేయవస్త్రంబులును బహుమూల్యాభరణంబులును, నానందజలావిలాక్షుండై వీక్షింప నోపక యుండె నద్దేవునకు సభాసదుల జయశబ్దపూర్వప్రణామంబులు [3](దివిషద్దుందుభి) రావపూర్వపుష్పవర్షంబులుఁ బ్రవర్తిల్లె నయ్యవసరంబున, 357

తే॥ అహితుఁడై నట్టి శౌరికి నమరినట్టి
యుత్సవముఁ జూచి శిశుపాలుఁ డోర్వలేక
యలుకమై లేచి చెయ్యెత్తి యచట సభ్య
జనులు వినునట్లుగాగ నుచ్చైఃస్వరమున॥ 358

1. తుండయ్యె. 2. (.........). 3. దివిషదుందుభి.

మ॥ తగునే యో మునులార! మీరు మిగులం దత్త్వజ్ఞులై యుండి యీ
పగిదిన్ బాలునిబుద్ధిచే నతిఘనుల్ బ్రహ్మజ్ఞు లుండంగ నీ
యగుణాకారున కగ్రపూజ యొసఁగన్ హవ్యంబు కాకోచితం
బగునే? మీకు నవజ్ఞ వచ్చుపని సేయం బాడియే యెచ్చటన్॥

తే॥ గుణవిహీనున కతిమాత్రకుత్సితునకు
[1](సదుచితం)బైన యగ్రపూజనముసేత
బట్టతలమీఁద దువ్వెన పెట్టినట్టి
కరణిఁ గనువారలకు హాస్యకరణిఁ [2](గాదె)॥ 360

వ॥ అని యుధిష్ఠిరాదులం గనుంగొని, 361

ఉ॥ పాండవులార మీకుఁ గన భావములం గడు నిశ్చయంబు కృ
ష్ణుండె సమర్చనీయుఁడని చొప్పడి యుండినయేని యీ మహీ
మండలనాథులం ద్రిదశమాన్యుల మానులఁ బిల్వ నేల యి
ట్లొండె దిరస్కరించుటకు నూహ యొనర్చితిరో మనంబులన్॥ 362

కం॥ మాతులహంతయు ఖరహాయ
గోతరుణీహింసకుండు కులపాంసనుఁడున్
బాతయు నగు నితఁ డర్హుఁడె
యేతాదృశపూజనమున కించుకయైనన్॥ 363

వ॥ అని రాజులం గనుంగొని, 364

ఉ॥ ఎడ్డెలు ధర్మనందనుఁడు నీ సహదేవుఁడుఁ గూడి యిప్డు జే
యడ్డను లేక శౌరిని మహాధికుఁగా నొనరించి రూరకే
వెడ్డుర మాడ నేమిటికి వింటిరి భూపతులార పోరిలో
[3](దొడ్డను) సన్నముం దెలుపుదుం బరికింపుఁడు సావధానతన్॥ 365

1. సదుచితం. 2. గాదె. 3. దొడ్డను

తే॥ అనుచు శిశుపాలుఁ డిట్లు భయంబు లేక
ఘనతరంబుగఁ గృష్ణు నిందనము సేయ
సద్దురాత్మునిఁ దిట్టుచు నాగ్రహమున
వినఁగ జాలక సభ్యులు వెడలి చనిరి॥ 366

వ॥ తత్సమయంబునఁ బాండవులును, మత్స్యకేకయసృంజయాది భూపాలురు నప్పుడ యుద్ధాయత్తులై శిశుపాలజిఘాంసులై లేచిన శిశుపాలుండును వాలునుం బలకయుం గైకొని యెదురు నడుచునంత, 367

కం॥ మురరిపుఁ డాత్మీయుల నా
నరపాలుర నిలిపి చేదినాయకుని శిరం
బరుదుగఁ ద్రుంచె నిశాత
క్షురాంతచక్రమున జనులు చోద్యపడంగన్॥ 368

వ॥ శిశుపాలుదేహంబువలన వెడలిన తేజంబు కృష్ణునిం బ్రవేశించె ధర్మపుత్త్రుండును సదస్యులకు దక్షిణ లొసంగి యవభృథస్నానంబు సేసి కృతకృత్యుం డయ్యె నందు నచట, 369

సీ॥ అల నాఁడు రుక్మిణీహరణంబుతఱిఁ బరా
జితుఁడైన సాళ్వుండు సిగ్గు నొంది
మృడునిఁ గూర్చి తపంబు మృదుభక్తుఁడై సేసి
మయనిర్మితంబుఁ గామగము, నాయ
సంబు, నభేద్యంబు సౌభకనామక
మగు విమానంబును నా హరునివలన
వరముఁగాఁ గొని యుధిష్ఠిరుని యాగమునకు
శౌరి యేఁగినయట్టి సంధివేళ

తే॥ వరబలసమేతుఁ[1](డై) ద్వారవతికి వచ్చి
వనములఁ గలంచి కోటలు వ్రాల్చి భవన
సౌధముల [2](నుగ్గు) సేసి ప్రజలఁ [3](గలంచి)
సేసె నుపహతి మదదుష్టచేష్టుఁ డగుచు॥ 370

వ॥ అట్టియెడఁ బ్రద్యుమ్నుం డక్రూరగదసాంబాది సమేతుండై
కయ్యంబు సేయుచుండె నప్పుడు, 371

కం॥ సేనలతో సౌభకముపై
మానితగతి నిల్చి సాళ్వమహీపతి యొకచో
గానఁగ వచ్చియు నొకచోఁ
గానఁగ రాకయుఁ జరించె గగనమున భువిన్॥ 372

తే॥ ఇవ్విధంబున నిరువదియేడుదినము
లరుగునంత మురారాతి యరుగుదెంచి
సాళ్వుఁ గనుఁగొని యాదవసైన్యములకు
నడ్డమై నిల్చి యొనరించె నాహవంబు॥ 373

వ॥ అయ్యాహవంబునందు,

మ॥ ఇదె నీ తండ్రినిఁ బట్టి తెచ్చితిఁ జుమీ హింసించెదం జూడు నీ
మద మెల్లం జను నేటితోడ ననుచున్ మాయావిధానంబుచే
నొదవంగా వసుదేవుఁ జూపి యసిచే హుమ్మంచు ఖండించె స
య్యదయుండా హరి చూచుచుండఁ జపలుండై యభ్రమార్గంబునన్॥

కం॥ అది యంతయు యోగీశుఁడు
మది మాయగఁ దెలిసి దుష్టమానసుఁడై యా
[4](మద)నిందితాత్ము సౌభము
గదచేఁ జూర్ణంబు సేసెఁ గడలిం బడఁగన్॥ 375

1. డయి. 2. నుసుగ్గు. 3. గలచి. 4. షడి.

కం॥ తనసఖుఁడు సాళ్వుఁ డణఁగుట
కని వచ్చిన దంతవక్త్రుఁ గౌమోదకిచేఁ
జనఁ జేసిన గోవిందుని
తనువుఁ బ్రవేశించె నతనిధామం బధిపా॥ 376

తే॥ అతనిభ్రాత విధూరథుఁ డవ్విధమున
నాహవమునకుఁ జనుదేర నమ్మురారి
చూచి తత్కంఠపీఠికాశోణితౌఘ
వర్ధితముఁ జేసెఁ జక్రాంరవహ్ని నపుడు॥ 377

వ॥ ఇవ్విధంబునఁ గృష్ణుండు సౌభసాల్వదంతవక్త్ర విధూరథ
సంహారం బొనర్చి ద్వారకానగరంబుఁ బ్రవేశించె నంత, 378

సీ॥ పాండవకౌరవప్రధనోద్యమము విని
యచ్యుతాగ్రజుఁడు మధ్యస్థుఁ డగుచు
నందులో నెవ్వరియందుఁ దాఁ గలయక
పుణ్యతీర్థము లాడఁబోయి వరుస
నైమిశారణ్యంబునకు నేఁగి యచ్చోటఁ
బ్రతిపర్వమును మఖబాధసేయు
నిల్వలసూనునిఁ బల్వలుం డను దైత్యు
హలముసలములచే హతునిఁ జేసి
తే॥ గదలు గైకొని యనికి డగ్గరిన భీమ
ధార్తరాష్ట్రులను గాంచి తద్దయును వగచి
వారి వీడ్కొని సహపరివారుఁ డగుచు
స్వజను లభినుతింపఁగఁ ద్వారవతికి వచ్చె॥ 379

## కు చే లో పా ఖ్యా న ము

వ॥ మఱియుఁ గృష్ణుండు తన్నుఁ జేరవచ్చిన బాలసఖుండైన కుచేలునకుఁ బృథుకతండులస్వీకారహేతుకంబుగాఁ బరమైశ్వర్యం బొసంగి దేవకీదేవి వేడినఁ బాతాళంబునకుం జని బలిచేతం బూజితుండై కంసునిచేత నిహతులైన యార్వురుపుత్రులం దెచ్చి చూపి వారల ముక్తులఁ గావించె. త్రిదండివేషంబున వచ్చిన యాఖండలనందనునకుఁ జెలి యగు సుభద్ర నొసంగె మిథిలాపురంబునకు నేఁగి యాత్మపదధ్యానంబు ప్రతిజ్ఞాతంబు సేసె శ్రుతదేవవైదేహులకు దయాప్రాబల్యంబుఁ గనిపించె నర్జున సమేతుండై చక్రవాళాచలంబు గడచి చక్రప్రకాశదత్తమార్గంబునం దమంబు గడంచి చని యా దేవదేవుని శేషశయ్యాశయానునిం గని మృత బ్రాహ్మణపుత్రులం దెచ్చి తజ్జనకున కర్పించె నిది యాదిగాఁ గల కృష్ణ చరిత్రంబు లవాఙ్మనసగోచరంబు లత్యద్భుతంబు లుత్తమోత్తమంబులు కర్ణామృతంబులు కల్యాణసంధాయకంబు లని పలికిన శుకయోగీంద్రునిఁ బరీక్షిన్నరేంద్రుండు ప్రణామస్తుతులచేతఁ బ్రసన్నునిం జేసి, 380

తే॥ నిరయసదసత్పరుండును నిర్గుణుండు
నైన బ్రహ్మంబు నిర్దేశ్య ననుసరించి
శ్రుతులు గుణవృతులయ్యు నేగతిఁ జరించు
ననుచు నడిగిన నయ్యోగి యాదరించి॥ 381

వ॥ నరేంద్రా యీక్రమంబుననే మున్ను నారాయణమునీంద్రుండు నారదునిచేతఁ గృతప్రశ్నుండై స్వసృష్టం బగు సకలంబును గ్రసించి శక్తులతోడం గూడి శయానుండై యాపురుషోత్తము నీ శ్రుతులు ప్రభాత కాలంబునఁ బ్రభువును మంగళపాఠకులవోలె మేలుకొల్పునని జనలో కంబునందు సనందుండు తన్నడిగెడు మునిబృందంబునకుం దెలిపె నని శ్రుతిస్తుతిక్రమంబులు దయావిశేషంబున భాషించిన విని యా నారదుండు

మదీయజనకుండైన కృష్ణద్వైపాయనునకుం దెలిపె నని యయ్యుపనిషత్తు నుపదేశించి యేతదాకర్ణనంబున నిర్గుణుండైన బ్రహ్మంబునందు నిర్దేశ్యుని యందు మనంబు చరియించుం జుమ్మనుటయు మేదినీవిభుండు బ్రమోదంబు నొంది, 382

చం॥ యతివర రుద్రునిం గొలుచునట్టి నరుల్ ధనధాన్య[1](సంపదు
న్మతు)లయి చాల నొప్పుదురు మారరమణుఁ హరిఁ గొల్చు భక్తిసం
గతు బటులక్ భువిం దఱచుగాఁ గనుపట్టరు నాకు దీనికై
సతతముఁ బుట్టుచుండు మది సంశయ మిందుల కీలుఁ దెల్పుమా॥

వ॥ అని యడిగిన శుకయోగీంద్రుం డిట్లనియె. 384

సీ॥ హరుఁడు శక్తిసమేతుఁ డనిశంబు గుణసంవృ
తుం డగు నతనిభక్తులును నట్ల
నగుట విభూతుల [2](నంది) మత్తిల్లుదు
రచ్యుతుఁడు గుణత్రయాధికుండు
తత్సేవ సేయు నాతండును నిర్గుణుం
డై ప్రకాశించు నీ యర్థ మాది
నడిగె ధర్మజుఁడు మురారి నద్దేవుఁ డి
ట్లనియె నో కౌంతేయ వినుము తెలియ

తే॥ నెవ్వనిఁ బరిగ్రహింప నే నిచ్ఛగింతు
నతనిధన మెల్ల హరియింతు నతఁడు నన్ను
మానసంబున నపుడును మఱువఁడేని
మెత్తు నిరుపద్రవపదంబు నిత్తు ననఘ॥ 385

---

1. సంపదల్ నతు. 2. నొంది

కం॥ మెచ్చు శివుఁడు వేగమ వర
మిచ్చుం దత్క్షణమునంద యీడేర్పఁగలం
డెచ్చోట దీని కొక కథ
యచ్చుపడ నుదాహరింతు నని యిట్లనియెఁ॥ 336

## వృ కో పా ఖ్యా న ము

సీ॥ శకునినందనుఁడైన వృకుఁ డను దైత్యుండు
మృడునిఁ దపంబుచే మెచ్చఁ జేసి
తనహస్త మెవ్వనితలఁ బెట్ట నతఁ డీల్గు
నట్లుగా నద్భుతంబైన వరముఁ
గొని ప్రీతిఁ జూడంగఁ గోరి యాహరుశిరం
బున నె కరం బిడఁ బూని నడవ
నతఁ డతిభీతుఁడై యన్నిదిక్కులు (దిర్గి)
దిక్కెఱుగక తాను దీనఁ దగుచుఁ
తే॥ బరమపదమున కేఁగిన సిరివరుండు
కరుణ నొక బ్రహ్మచారియై కనఁక మెఱయ
హరినిఁ దఱుముక బరతెంచు నసుర కెదుర
సని గభీరతరంబుగా శాంతిసరణి॥ 337

ఆ॥ అసురవర్య యేల యలసేద విబ్భంగి
నెందుఁ బోవఁ బూని తివ్విధమున
ననుచు నడుగుటయు సురారి విభ్రాంతుఁడై
సకలవర్తనము పొసంగఁ దెలిపె॥ 338

వ॥ తెలిపిన నవ్వి దక్షశాపంబునఁ బిశాచత్వంబు నొంది
పిశాచపతి యనం బరగిన యతనిమాట లేమి యని నమ్మితి యతండు

కైతవంబునకుం బుట్టినిల్లు యే నొక్కటి దెలిపెద నంతఁ గని కరంబు నీశిరంబున నిడుకొని చూడు మతనిమాట యసత్యం బయ్యెడు నట్లు పరీక్షించి యనృతంబు లెన్నడుం బలుక వనునట్టుగా నతనిం దండించెదు గాక యని మోసపుచ్చి పలికిన, 389

శా॥ తన్మాయావృతుఁడై వృకుం డిడియ యుక్తం బంచుఁ దద్వాక్యముల్
సన్మానించి రయంబునం దనదుహస్తం బాత్మమూర్ధంబు మీఁ
దన్మార్క్షత్వ మెసంగ నిల్పికొనుచుం దత్కాలనిర్జీవుఁడై
యున్మూలద్రుమలీల వ్రాలె మును లోహో యెట్టి చిత్రం బనన్॥

కం॥ కుసుమాంజలు లొసఁగి యమ
ర్త్యసమూహము డాసి కొల్చె నబ్జాక్షుని న
య్యసమాత్ముఁడు.........
యసిఁబుచ్చితె యనుచుఁ బొగడి యరిగె నిజేచ్ఛన్॥ 391

కం॥ అని ధర్మనందనునకున్
వినిపించెఁ బ్రియంబుఁ గాఁగ విష్ణుప్రభుఁడో
జననాయక కావున హరి
యనుపముఁ డవిభేద్యుఁ డాద్యుఁ డర్చ్యుం డెందున్॥ 392

## త్రిమూర్తి పరీక్షోపాఖ్యానము

వ॥ అదియునుం గాక తొల్లి సరస్వతీనదీతీరంబున సత్త్రం బాచరించు మునులు హరిహరహిరణ్యగర్భులలోన నెవ్వఁ డధికుం డని వితర్కంబు బుట్టి తెలియుటకై భృగుమహాముని ననిపిన నతండు బ్రహ్మకడకుం జని తాఁ బ్రణామస్తుతు లాచరింప మిక్కిలి కోపించిన యవ్విరించి నాత్మ తేజంబుచే నుపశమితక్రోధుం జేసి కైలాసంబునకుం జని కౌగిలింప వచ్చిన

యతని పలికి మేకొనక నిలిచి శూలహస్తుండై హింసింప వచ్చు నా
శర్వుపలనం బార్వతీదేవిచేత మోచితుండై వైకుంఠమునకు నేఁగి రమా
సహితుం డగు పురుషోత్తమునిఁ దన్ని యతనిచేతం బూజితుండై
ప్రియంబు సెప్పంబడి తిరిగివచ్చి, పోయివచ్చినవృత్తాంతంబు సెప్పిన
నత్తాపసు లచ్యుతుండె బ్రహ్మణ్యదైవం బని నిశ్చయంబు చేసి రట్లు
కావున, 393

శా॥ పద్మాధీశుఁడె నిత్యసత్త్వగుణసంపన్నుండు ఖండేందుభృత్
పద్మప్రోద్భవ[1](సేవ్యుఁ) డెల్లగతులన్ బ్రహ్మణ్యుఁ డద్దేవు [2](సత్
పద్మారాధకు)లున్ గభీరులు మహాభాగుల్ ప్రమాశ్రీదయా
సద్మంబుల్ త్రిదశేంద్రవంద్యులు మహాసంకల్పు లుర్వీశ్వరా॥ 394

వ॥ అని యివ్విధంబున నా యభిమన్యుపుత్రునకు వైయాసిచెప్పిన
విధంబు సూతుండు వినిపించిన శౌనకాదిమహామునులు మహాత్మా!
సమనంతరకథావిశేషంబు లానతీయవే యని యడుగుటయును, 395

శా॥ శ్రీమద్వీరనృసింహరాయనృపతిశ్రేయోదయాసాధిత
స్వామిద్రోహరగండనూపురవిరాజద్రామరాజ్తిమ్మభూ
పామిత్యర్జితపుణ్యసత్ఫలసమస్తాశాంతవిశ్రాంతని
స్సీమోర్వీప్రతిపాదనవ్రతయశా శీతాంశువంశోద్భవా॥ 396

కం॥ ప్రక్షుభితాభిముఖప్రతి
పక్షావిపయోరత ప్రబలకళశుభసూ
త్రక్షామకరాంబుజగత (?)
క్షాత్రేయకవిహితరత్నగర్భామోదా॥ 397

---

1. (.........). 2. (.........).

మత్తకోకిల ॥ రంగదంఘ్రినఖాంశురంజితరాజమస్తక-చోళగౌ
ళాంగవంగకళింగలాటశకాదిభూపరసంపదు
న్నంగకీర్తితసంగరాంగణచర్యకంపిలిరాయసం
ప్తాంగగండరగూళిసద్బిరుదాదిసంగ్రహణోజ్జ్వలా ॥ 398

గద్య ॥ ఇది శ్రీమదష్టభాషాకవిమిత్ర నాగయమంత్రిపుత్ర సాహిత్య మార్గనిశ్శంక దోనూరిపదాంక వినయలక్ష్మీసనాథ కోనేరునాథ ప్రణీతంబైన బాలభాగవతం బను మహాప్రబంధంబునందు దేవకీ వివాహంబును, గంసోద్రేకంబును, బలదేవావతారంబును, కృష్ణావతారంబును, ఘోషప్రవేశంబును, పూతనాసంహారం బును, శకటతృణావర్తభంజనంబును, మృద్భక్షణాదిచరిత్రం బును, నలకూబరమణిగ్రీవ శాపమోక్షంబును, బృందావనగమ నంబును, వత్సాపహరణంబును, కాళీయమర్దనంబును, దావానల పానంబును, గోపికావ్రతంబులును, వల్లవీవస్త్రాపహరణంబును, గోవర్ధనోద్ధరణంబును, [1] ( నందానయనంబును ), రాసక్రీడనం బును, సుదర్శనశాపవిమోచనంబును, శంఖచూడారిష్టదళనం బును, గంసుండు దేవకీవసుదేవుల నిరోధించుటయును, నక్రూ రాగమనంబును, విశ్వరూపకథయును, మధురానగరప్రవేశకథ యును, ధనుర్భంగంబును, కువలయాపీడచాణూరముష్టికాది వధంబును, గంసవధంబును, దేవకీవసుదేవబంధమోక్షంబును, నుగ్రసేన రాజ్యస్థాపనంబును, రామకృష్ణ విద్యాభ్యాసంబును, గురుపుత్రప్రదానంబును, జరాసంధకథయును, ద్వారకానగర ప్రవేశంబును, గాలయవనఘాతనంబును, రుక్మిణీకల్యాణంబును, ప్రద్యుమ్నచరితంబును, జాంబవతీకల్యాణంబును, సత్యభామా కల్యాణంబును, గాళిందీమిత్రవిందాకల్యాణంబులును, మురనరక

1. నందానయనంబును.

సంహారంబును, షోడశసహస్రకన్యాపరిగ్రహంబును, పారిజాతాప హరణంబును, రుక్మిభంజనంబును, నుషాహరణంబును, నృగో పాఖ్యానంబును, గాళిందీప్రవాహభేదనంబును, పౌండ్రకాశిరాజ సంహారంబును, గాశీపురీదీపనంబును, ద్వివిదహననంబును, హస్తి నాపురహలాకర్షణంబును, కృష్ణనారదసల్లాపంబును, ధర్మరాజ రాజసూయకథయును, జరాసంధవధయును, శిశుపాలవధయును, సాళ్వాదినిర్జయంబును, బల్వలాసుర మరణంబును, గుచేలో పాఖ్యానంబును, దేవకీపుత్రార్పణంబును, సుభద్రాపరిణయం బును, మిథిలాగమనంబును, మృతవిప్రపుత్రదానంబును, శ్రుతితగీ లును, వృకోపాఖ్యానంబును, త్రిమూర్తిపరీక్షోపాఖ్యానంబును, నను దశమస్కంధకథావిశేషములు గల పంచమాశ్వాసము

సంపూర్ణము. 399



# బాలభాగవతము

## షష్ఠాశ్వాసము

కం॥ శ్రీకర్ణాటమహేశ్వర
భాకృద్విక్రమవిలాస బహువిధదానా
నీకవిచక్షణ సకలసు
ధీకల్పక యారెవీటి తిరుమలభూపా॥ 1

వ॥ ఆకర్ణింపుము పుణ్యకథాశ్రవణసమగ్రహర్షు లగు శౌనకాది మహర్షులకు హరినామస్మరణరోమహర్షణి యగు రౌమహర్షణి యిట్లను నట్లు ప్రాయోపవేశవ్రతశీలుం డగు పరీక్షిన్నరపాలునకు నాగర్భవైష్ణవ ధర్మానురాగి యగు శుకయోగి యిట్లనియె. 2

చం॥ దనుజవధంబు సేసి యుచితంబుగఁ గృష్ణుఁడు పాండురాజనం
దనులకు ధార్తరాష్ట్రులకుఁ దద్దయు వైరము పుట్టఁ జేసె మే
దినికి భరంబులైన నృపతిప్రకరంబులఁ ద్రుంచి యంతఁ ద
క్కినభరముం హరింపఁ గమకించిన వాఁడగుచు న్మనంబునన్॥ 3

ఉ॥ చూపఱ భీతి నొంది కడుఁ జోద్యమున న్మితివెట్టరాక నా
ప్రాపునఁ జేసి దుర్మదము వాటిలి ధాత్రి ననన్యసాధ్యులై
యేపున మించు యాదవుల నెల్ల వడిం దమచేతఁ దారె పో
రై హాలియంగఁ జేసి చరితార్థత నొందెద నాత్మధామమున్॥ 4

తే॥ అని విచారించి పద్మాక్షుఁ డగ్రజన్మ
శాపమిషమున యదువుల సంహరించి
మంజులంబైన యాత్మధామంబుఁ జేరె
ననుటయుఁ బరీక్షిదవనీశుఁ డద్భుతమ్మునఁ॥ 5

ఉ॥ అట్టిమహానుభావు లగు యాదవవీరుల కేమి కారణం
బెట్టిది శాప మాదిమును లిచ్చిరి వేగమ వారి నాశమే
పట్టున నెట్లుసంగెఁ దనభవ్యపదంబున వాసుదేవుఁ డే
కట్టడి నిల్చెఁ దెల్పు మనఁ గ్రమ్మఱ నా శుకయోగి యిట్లనున్॥ 6

యా ద వ నా శ ము

సీ॥ శౌరి యాత్మకులంబు సమయింపఁ గోరెడు
నంతఁ గౌశికముఖ్యు లైన మునులు
దైత్యారిఁ గొలిచి యా ద్వారక వెడలి పి
డారకతీర్థంబుఁ జేరి యుండ
నచట వినోదించు యదునందనులు సాంబు
నంగనావేషుఁగా నలవరించి
వారిముందర నిడి యీరామ సుతుఁ గాంచు
నా యని నవ్వుల కడుగుటయును
తే॥ వార లతికుపితాత్ము లై వంశనాశ
నంబు నొక[1] (ముసలము నీక్షణంబ) కాంచు
ననిన డింభకు లాసంబోదరాంతికంబు
విడిచి ముసలంబు చూచి నిర్విణ్ణు లగుచు॥ 7

వ॥ అమ్ముసలంబుఁ గొనుచు ద్వారకానగరంబున కేఁగి యదురాజగు నాహాలికునకు సకలయాదవసన్నిధి నెఱింగించిన నతం డమ్ముసలంబుఁ జూర్ణంబు సేయించి తచ్చూర్ణంబును దదవశేషితం బైన లోహంబును సముద్రంబునందు జల్లించిన నందు లోహశేషంబు నొక్క మత్స్యంబు మ్రింగఁ జూర్ణంబుతఱకలు జలోహ్యమానంబు లగుచుఁ జెలియలికట్టయం

1. ముసలంబు నీక్షణంబు.

దేరకాహ్వాయతృణంబు లై జనియించె. జాలరులచేత దిగువంబడిన య
మ్మత్స్యంబుకడుపులో నున్న యాలోహంబు నొక్క లుబ్ధకుండు శరా
గ్రంబున నమరించికొనియె. విదితసర్వార్థుండైన యీశ్వరుండు న వ్విప్ర
శాపంబు నన్యథాకరింప నిచ్ఛగింపం డయ్యె నా సమయంబున, 8

తే॥ ద్వారవతిలోన నొకనాఁడు తనదుగేహ
మునకు వచ్చిన నారదమునివరేణ్యు
నొనరఁ బూజించి వసుదేవుఁ డుచితభంగి
నొలయు వినయంబు గనఁబడఁ బలికె నిట్లు॥ 9

కం॥ నీవంటి వారిరాక శు
భావహము గదా మునీంద్ర! యాత్మీయగృహం
బీ విధమున నిట నీ సం
భావనచేఁ బావనాతిపావన మయ్యెన్॥ 10

వ॥ ఏ ధర్మంబుల నేనియు వినినమాత్రంబున జనుం డకుతో
భయుం డగుచు భవబంధవిముక్తుండగు నట్టి భాగవతధర్మంబులు వినిపించి
నన్నుం గృతార్థుం జేయు మనిన నారదుం డిట్లనియె. 11

సీ॥ సాత్త్వికోత్తమ నీదు సంప్రశ్న మభివర్ణ
నీయంబు సుజనవర్ణితము లగుచు
నతులంబు లగు భాగవతధర్మములు దెలి
యంగఁ గోరెదు సమగ్రాదరమున
తలఁచిన వినిన నాదరము సేసినఁ బఠిం
చిన సంతసించినఁ జిత్రలీల
ననఘుఁగా నొనరించు జనుని సద్ధర్మంబు
సంస్మారితుం డయి చక్రపాణి

1. దహరింతు. 2. నాగము.

తే॥ యార్షభవిదేహసంవాద మనఁగ నొక్క-
యభినుతేతిహాసము సిం దు[1](దాహరింతు)
[2](రాగమ)జ్ఞాత లగువార లదియు నీకు
నెఱుఁగ జేసెద విను మవహితుఁడ వగుచు ॥ 12

వ॥ స్వాయంభువమనుసుతుండైన ప్రియవ్రతునకు సుతుం డాగ్నీధ్రుం డతనితనయుండు నాభి యతనిపుత్రుండు వాసుదేవాంశజుం డగు ఋషభుం డతనిజ్యేష్ఠతనయుండు భరతుం డతనిపేర నిమ్మహీభాగంబు భారతవర్షం బయ్యె- మఱియు నా ఋషభకుమారులు కవి, హర్యంతరిక్ష, ప్రబుద్ధ, పిప్పలాయ[1](నా,విర్హోత్ర), [2](ద్రమిళ, చమస), కరభాజను లను వారలు తొమ్మండ్రును నాత్మారాములై విశ్వంబు వాసుదేవాత్మకంబుగా గనుం గొనుచు సకలలోకంబులం దిరుగుచు నొక్క-నాఁడు మిథిలాపురంబునకు వచ్చిన మఖదీక్షితుండై విదేహుండును సదస్యసమేతుండై యెదుర్కొని పూజించి యుచితాసనాసీను లగు వారితో నిట్లనియె, 13

మ॥ భగవత్పార్షదు లీర లిట్టి ఘను లెప్పాటన్ బవిత్రీకృతిన్
జగముం బ్రోచుటకై చరింతురు మనుష్యశ్రేణికిం దుర్లభం
బగుఁ గాదే హరిదాసదర్శనము నిత్యంబే నిదానం బనం
దగు సత్సంగము మిమ్ముఁ గన్గొని కృతార్థత్వంబున న్మించితిన్॥ 14

తే॥ ఒకటి యడుగంగఁ గల దంబుజోదరుండు
[3](జనున కెద్ది యొనర్ప మోక్షము నొసంగుఁ)
దవిలి సద్భక్తి నట్టి భాగవతధర్మ
ముల నెఱిఁగింపుఁ డీరలు మోద మొదవ ॥ 15

వ॥ అనుటయు నందుఁ గవియనునతం డిట్లనియె. 16

---

1. నాదిహోత్ర. 2. ద్రమీక చమస
3. జనున కట్టి యేనియు మెచ్చిలియు నొసంగు.

## భాగవత ధర్మములు

సీ॥ దేహవాఙ్మనసేంద్రియమనీషాత్మస్వ
భావకృతంబు తాఁ బనుల నెల్ల
నపుడ నారాయణాయ యటంచు నర్పించి
హరిజన్మకర్మంబు లర్థి వినుచు
తన్నామగీతము ల్దవిలి పాడుచుఁ గొని
యాడుచు సకలంబు నతనిమూర్తి
గాఁ దలంచుచుఁ గాంచి కడుభక్తి మ్రొక్కుచుఁ
జరియింపవలయు నిస్సంగుఁ డగుచుఁ

తే॥ జెలఁగి భజియింపఁ [1](దుష్టిపుష్టిక్షుధాత్య)
యంబు లొకపరి చేకూరు నట్టికరణి
భక్తి [2](యీశాను)భవము విరక్తి యొక్క
యపుడ కలుగుఁ బ్రసన్నున కవనిపాల॥ 17

కం॥ అన వినుచు నా విదేహా
వనిపాలుం డెప్పుడు భాగవతుఁ డే కరణిం
గని మెలఁగు నేది చిహ్నం
బనుటయు హరి యను యతీంద్రుఁ డపు డిట్లనియెన్॥ 18

సీ॥ సర్వభూతములందు సర్వేశభావంబు
నఖిలభూతంబుల నతనియందు
భావించు నాతండు భాగవతోత్తముం
డట్టి సంసారమోహాంతిగునకు

1. దుష్టపుష్టక్షుద్దైత్య. 2. యీశాను.

సంభవింపవు మానసక్షేత్రమునఁ గామ
కర్మబీజంబు లే కరణినైనఁ
జరియింపఁ డచ్యుతచరణపాథోజంబు
నందుండి నిమిషార్ధమైన నతఁడు
తే॥ భగవదురువిక్రమాంఘ్రిశోభన[1](నఖౌఘ)
రత్నచంద్రికాసతతనిరస్తతాప
హృదయుఁడు పరమేశ్వరున కతఁ డిష్టతముఁడు
లోకపావనాలోకుఁ డుర్వీశచంద్ర॥ 19

చ। ఆ యతివర్యుభాషణము సంతయుఁ దా వినుచున్ వసుంధరా
నాయకుఁ డార్యులార! యవినశ్వరవృత్తి ననన్యబుద్ధియై
మాయలనైనఁ గప్పు హరిమాయవిధం బెఱిఁగింపుఁ డన్న బు
ధ్యాయతుఁ డంతరిక్షుఁ డనునట్టి మునీంద్రుఁడు పల్కె నేర్పునన్॥

ఉ॥ కేవలనిర్గుణాత్మవయిఁ గీల్కొను బుద్ధి విపర్యయంబ వో
దేవునిమాయ దానన విధించె సమస్తము నవ్విభుండు స
ర్గావననాశముల్ నడుపునట్టిద యాశ్రయంబు సంసృతిన్
జీవులఁ ద్రిప్పునట్టిద వశీకృతకాలబహుప్రకారయై॥ 21

తే॥ అనుటయును నట్టి విశ్వనాయకునిమాయ
దాఁటి పోవుదు రెట్టి విధమున జనులు
తెలుపుఁ డని యుచ్చరించు విదేహనాథు
హరిపదాంబుజభక్తిభూవరునిఁ జూచి
[1](ముదముతోడుతఁ బలికెఁ బ్రబుద్ధుఁ డపుడు)॥ 22

1. నఘౌఘ. 2. పలికె ......ప్రబుద్ధుఁ డపుడు.

మ॥ పరమశ్రేయము నొందఁ గోరిన మహాభాగుండు బ్రహ్మజ్ఞునిన్
గురు సత్యోత్తముఁ జేరి తద్విశదవాక్యాంగీకృతాజ్ఞానుఁడై
కరుణాప్రశ్రయధైర్యముఖ్యసుగుణాకల్పాఢ్యుఁడై శాంతుఁడై
హరిపాదాంబుజభక్తిచే నపుడ మాయం దాఁట వచ్చున్ నృపా॥

కం॥ అతివిశదముగా నిట్లా
యతి యాడినమాట విని దయం బరమాత్మ
స్థితి సెప్పుడను నరేంద్రుని
నుతచరితుఁడు పిప్పలాయనుం డిట్లనియెన్॥ 24

తే॥ విష్ణుభక్తిచే నెపుడేని విగతతముఁడు
తొలఁచు గుణకర్మజాతచేతోమలముల
నపుడె శుద్ధచిత్తంబున నాత్మతత్త్వ
మొలయు దృఢదృక్కులం దర్కతెలివిపోలె॥ 25

వ॥ అని పలుకుటయు నాకర్ణించి యనంతరంబ, 26

తే॥ యదవలంబకుఁడై నరుం డద్భుతముగఁ
గాంచు నైష్కర్మ్యసిద్ధి యా కర్మయోగ
మిపుడ యానతీయుం డను నృపవరేణ్యు
ననువుమీర [1](నావిర్హోత్రుఁ) డనియె నట్లు॥ 27

సీ॥ కర్మమోక్షమునకుఁ గాఁ జూవ్వో కర్మంబు
వివరించి భాషించు వేద మెపుడు
వేదోదితములైన వివిధకర్మంబులు
ఫలము గోరక యొనర్పంగవలయు

---

1. వాదహోత్రుఁ

శ్రుతియందు గల ఫలశ్రుతి రోచనార్థిఁ గా
వివరించి జడతత్త్వవిదులచేత
తంత్రోక్తమైన విధానంబుచేత ల
క్ష్మీపతిఁ దగ షోడశోపచార

తే॥ కలన సర్వాగ్నితోయాదికములయందు
నతిథియందును హృదయంబునందుఁ బూజ
సేయవలయు నీ రీతినే పాయ కెపుడుఁ
జేయు నాతఁడు నైష్కర్మ్యసిద్ధి నొందు॥ 28

శా॥ ఆ సంయమ్యవతంస మిట్లు వలుకన్ హర్షామృతస్వాంతుఁడై
యీ సర్వేశ్వరుఁ డెట్టిజన్మములచే నేమేమికృత్యంబులన్
జేసెం జేయుచు నున్నవాఁ డికఁ బయిం జేయం గలం డింతయున్
వే సూచింపు మటంచుఁ బల్కు నృపు నవ్వీకం ద్రమిళాంటుండనున్॥

సీ॥ నరసఖుఁడై నట్టి నారాయణుం డయి
పెక్కండ్రు దైత్యుల పీఁచ మణఁచె
హంసర్షభాఖ్యహయగ్రీవదత్తాది
కస్వరూపముల యోగంబు నొడివె
మీనకూర్మవరాహతానుతుం డగుచు వే
దోర్వీధరోర్వుల నుద్ధరించె
నరసింహుఁడై హిరణ్యకశిపు మర్దించె
ఖర్వుఁడై బలిదైత్యగర్వ మణఁచె

తే॥ పరశురాముఁడై క్షత్రియపటలిఁ దునిమె
రాముఁడై రావణుని సంహరణ మొనర్చెఁ
గృష్ణుఁడై భూభరం బణఁగించె బుద్ధ
కల్కిమూర్తిమై జనియింపఁ గలఁడు చక్రి॥ 30

వ॥ అనుటయు,

ఉ॥ అనయము విష్ణుఁగొల్వని నరాధము లేమయి పోవు[1](వారలో)
యనుపములార! యంచు నృపుఁ డాడుటయుం జమసాఖ్యుఁడై న స
న్ముని హరిభక్తి లేని యధముల్ పదవీచ్యుతి నొంది నారకం
బునఁ బడి యుందు రన్న నిమిభూపతి గ్రమ్మఱ వారితోడుతన్.

కం॥ ఏకాలంబున నే వ
ర్ణాకారాహ్వాయము లమరి హరి యే విధి దాఁ
గైకొను బూజన మనవుడు
నా కరభాజనుఁ డేరిమొను యతి యిట్లనియెన్॥ 32

సీ॥ కృతయుగంబున సితాకృతిని వైకుంఠుండు
దపముచేయఁ జయింపఁ దగి చెలంగు
త్రేతయం దతిరక్త దేహుఁడై విష్ణుండు
త్రయిచేత సేవ్యుడై తనరుచుండు
ద్వాపరంబున శ్యామతనుఁడు కృష్ణుఁడు వేద
తంత్రయాజ్యుం డయి దనుఁ దలిర్చు
కలియుగంబున నీలకాంతికాయుఁడు చక్రి
సంకీర్తనంబుచేఁ జాల మెచ్చు

తే॥ తామ్రపర్ణి కావేరుల తటములందుఁ
జెలఁగు కృతమాలికాపయస్విసుల దరుల
యుఱవలందు శ్రీహరిపరాయణులు దఱచు
గలియుగమునందుఁ గలుగంగఁ గల రిలేశ॥ 33

మ॥ అని తొమ్మండ్రును నార్షభు ల్దనకు నిట్లాయాయి చందంబులన్
గని భాషించిన తత్త్వభాషణముఁ లాకర్ణించి మోదించి యా
జననాథుండు మఖాంతవేళఁ దగుఁ బూజల్సేసిన న్మౌనులున్
జని రాత్మేచ్ఛల నంత నా నిమియు మోక్షప్రాప్తుఁ డయ్యెం దుదిన్॥

1. వారలో.

సీ॥ వసుదేవ యట్టి సర్వజ్ఞుఁ డచ్యుతుఁడు నీ
కాత్మజుఁ డగుట భాగ్యంబు గాదె
ధన్యులు మీయట్టి దంపతు ల్మల్లోక
ములయందుఁ దెలియంగఁ గలుగ రెపుడు
లోలతఁ గృష్ణవిలోకనాలింగనా
లాపతద్విహరణలాలనములఁ
దగులుచే మీ యాత్మ మిగులఁ గృతార్థకృ
తం బయ్యె నిట్టి చందంబు వింత.

తే॥ యనుచు నిబ్భంగి నారదమునివరేణ్యుఁ
డవిరళశుభంబులైన భాగవతధర్మ
ముల నుదాహరించిన విని ముదితుఁ డగుచు
దేవకీయుక్తుఁడై వసుదేవుఁ డుండె॥ 35

తే॥ అంతఁ బరమేష్ఠి హరుఁడు నింద్రాదిసురలు
వరుసఁ గొలువంగ నా ద్వారవతికి వచ్చి
యంబరంబున నిల్చి పుష్పాభివర్ష
లగుచు వినుతించె శ్రీకృష్ణ ననియె నిట్లు॥ 36

ఉ॥ అంచితయుక్తి భూమిభర మారసి డించుట కేను నిన్ను బ్రా
ర్థించితి మాదికాలమున దేవ యదూద్వహ లీల నిట్లు వ
ర్తించి ప్రతిశ్రుతార్థము విధించితి దైవతకార్యవృత్తి శే
షించుట లేదు నీ మనుజచిహ్నము లేమిటి కింక నచ్యుతా॥ 37

చం॥ క్షితి నవతీర్ణభావమునఁ జెన్నువహించుట యాదిగాఁగ స
న్నుతగతి నేండ్లు లిప్పటికి నూటిను నిర్వదియైదు సెల్లె ది
క్పతులు గిరీశునిఁ సురలఁ బ్రాగ్గతి బ్రోచుట కాత్మధామసం
గతిఁ దయ మాకు మున్నువలెఁ గైకొని ఛత్రము వెట్టగాఁ దగుఁ॥ 38

ఆ॥ అనుడు మందహాసమధరపల్లవకాంతి
నరుణ మగుచు ముదము నావహింప
సరసిజోదరుండు చతురాననునిఁ జూచి
ప్రకటసంభ్రమమునఁ బలికె నిట్లు॥ 39

ఉ॥ యదువు లనన్యసాధ్యులు మహోత్తరశాపమిషంబునన్ సము
న్మదమగు తత్కులంబుఁ బరిమార్చక భూమిభరంబు వాయ దీ
యదనున నిట్టికార్య మొకయంతము ముట్టఁగఁ జేసి తొంటినా
పదమున కేఁగుదెంతు నికఁ బద్మజ! వేగిర మేల యిత్తఱిన్॥ 40

కం॥ అనుటయును వల్లె యని య
వ్వనజాసనుఁ డిందుమౌళి వాసవముఖ్యుల్
దనుగొలువ నేఁగె మును వ
చ్చినమార్గము పట్టి ముదితచిత్తుం డగుచున్॥ 41

కృష్ణుండు యాదవులను ప్రభాసతీర్థంబునకుఁ బంపుట

వ॥ అనంతరంబ ద్వారవతీపురంబునం దోడవు మహోత్పాతం బులు గనుంగొని కృష్ణుండు యాదవులం బిలిచి మన మిట్టి దుర్నిమిత్తం బులు గనియు నిచ్చట నుండుట కర్జంబు గాదు ప్రభాసతీర్థంబున కేఁగి యచట స్నానదానాదికంబు లొనర్చి చతుర్విధాహారంబులచే విప్రులం దృప్తులం జేసిన శుభం బగు నని యానతిచ్చిన యాదవులు నంగీకరించి రథంబు లాయత్తంబు సేయం దొణంగి రా సమయంబున నొక్క విజనస్థలంబున విజయంబుసేసిన యా దేవకీనందనుం డున్నచోటికిఁ జనుదెంచి యుద్ధవుండు తత్పాదారవిందంబుల మీఁదఁ బ్రణమిల్లి ప్రాంజలియై. 42

సీ॥ దేవ ప్రభాసాఖ్యతీరంబునందు యా
దవకులం బేల హతంబు [1](సేసి)
నిజధామమ్మునకుగా విజయంబు సేయంగ
దలచితె వాత్మ నింతయు నిజంబు
నిను బాసి యెబ్బంగి నిలుచువాఁడఁ బృథగ్జ
నాకీర్ణమైన యీ యవని నింక
నెచ్చోట నివసించి యెట్టి చందంబున
వర్తించి యెట్టి భావంబు నిలుప

తే॥ వలయుఁ దుది నెవ్విధమున నీ వాఁడ నగుదు
భక్తి నింతయుఁ దెల్పి [2](ప్రపన్ను) నన్ను
గరుణ నీడేర్చు మనుచు నుత్కంఠఁ బలుక
నుద్ధవునిఁ [3](బల్కె నయ్యంబు)జోదరుండు॥ 43

కృష్ణుం డుద్ధవునకుఁ బరమార్థోపదేశము సేయుట

ఆ॥ భూభరంబుఁ డింపఁ బూనికఁ గలవాఁడ
నగుదు నీవు చెప్పినటుల నిపుడ
యగుచు నున్నయది మహాత్మ నీవింక నీ
ద్వారవతి వసింప నలదు సుమ్ము॥ 45

తే॥ ఇంక నేడుదినంబుల కీపురంబు
ముంచుకొనియుండగలవు సముద్రజలము
లద్భుతంబుగ నెప్పటియట్ల నిలుచు
నలువు చేరంగ నవుడు నా నగరిపట్టు॥ 46

---

1. సేసె. 2. ప్రపన్ను. 3. బల్కె నేయంబు.

సీ॥ బాంధవస్నేహంబు పరిహృతంబుగఁ జేసి
నాయందు భక్తి మనంబు నిల్పి
సమదృష్టివై ధాత్రి జరియింపు మాత్మయం
దఖిలంబు నాత్మ నాయందుఁ గనుచు
జ్ఞానవిజ్ఞానసంసక్తి శరీరుల
కాత్మభూతుఁడ వయి యలరు మెపుడు
ఆత్మానుభవతుష్టుఁ డంతరాయములచే
నవిహతుం డగు నిశ్చితార్థ మిదియు
తే॥ తలఁప డిది దోష మని నిషిద్ధంబువలన
విహితమును గుణబుద్ధిఁ గావింపఁ బోవఁ
డుభయము నతిక్రమించిన యుత్తముండు
బాలుఁడునుబోలె నతఁ డవిపన్నుఁ డెందు॥ 47

తే॥ అనుచు నిబ్భంగిఁ గరుణాసమన్వితముగ
భగవదాదిష్టుఁ డగుచున్న భాగవతుఁడు
తత్త్వజిజ్ఞాసుఁడై ప్రమోదమున మఱియు
వినయభయభక్తియుక్తి వందన మొనర్చి॥ 48

వ॥ దేవా ని విపు డాన తిచ్చిన సన్న్యాసలక్షణంబైన త్యాగంబు దుష్కరంబై తోఁచుచున్నయది భగవన్నిగదితంబైన యీ యర్థంబు నెవ్విధంబున సాధింపుదు భృత్యుండనైన నన్ను శాసింపు మని ప్రార్థించిన భగవంతుం డిట్లనియె. 49

కం॥ తను దానె యుద్ధరించుఁ
దనకు విశేషించి గురుఁడు తానె వివేకం
బున మెలఁగువాని కఖిలము
ననువుగఁ(?) బాధించ నేర్చినఁ శుభ మొందుఁ॥ 49

వ॥ ఈ యర్థంబునం దవధూతయదుసంవాదం
బితిహాసంబు వివరించెద వినుము.

### అవధూత యదుసంవాదము

సీ॥ మద్వంశకర్త సన్మాన్యుండు యదు వను
నుత్తమచారిత్రుఁ డొక్క వేళ
నుర్విపై నకుతోభయుం డయి చరియించు
నవధూత యగు నొక్క యగ్రజన్ము
గనుగొని నిస్పృహాగ్రణి వైన యో ధీర !
యిట్టి సద్బుద్ధి నీ కెట్లు గలిగె
జడసమున్మత్తపిశాచోపమానత
నేదియుఁ జేయ నూహింప వెపుడు
ఆ॥ నిట్టి చరితమునకు నెయ్యది హేతువు
కలుగు [1](నద్ది తెలియఁ బలుకవలయు)
ననుచు [2](నడుగు)ప్రశ్రయావనతునకును
[3](యదువు కగ్రజన్ముఁ డనియె నిట్లు)॥
సీ॥ ధరణియు వాయు వంబరమును నుదకంబు
నగ్నియు జంద్రుండు నర్కుఁడును క
పోతంబు నజగరంబును సముద్రము పతం
గంబును మధుకృత్తు గజము మధుహ
రుండు నిట్టియుఁ బృథురోమంబు పింగళ
యను [4](వేశ్య కురరుండు నర్భకుం)డు
కన్నియయును శర[5](కరుఁడును సర్పంబు
లూత ద్విరేఫంబులును ననంగ

1. నట్టిది తెలియఁబలుకంగవలయు. 2. నడిగిన.
నగ్రజన్ముడు ననియెనిట్లు 4. వశ్య(.........). 5. కరుండు

తే॥ గలుగు నిరువదినలుగురు కణఁకమీఱి
గురువుల గదిరి నడవళ్ళు గురుతుఁ బెట్టి
న న్నుపేక్షించుకొంటి నున్నతచరిత్ర
యదియు వేర్వేరఁ దెలిపెద నవధరింపు॥ 52

కం॥ క్షితి నలరెడు ప్రాణులచే
నతివేలాక్రమ్యమాణమై యుండియు నీ
స్థితిఁ జూచి నేర్చుకొనఁ దగు
సతతంబును గలుగు సర్వసహావ్రతముక్॥ 53

తే॥ వివిధవిషయంబులందుఁ బ్రవేశి యయ్యు
నెపుడు యోగి గుణౌఘవ్యపేతుఁ డగుచు
నన్నిచోటులయందును ననిలుభంగిఁ
దగులువడకుండవలయుఁ జిత్రంబుగాను॥ 54

ఉ॥ వాయుసమీరితం బయిన వారిదబృందముచేత నంబరం
బే యెడఁ గప్పఁగాఁ బడ దహీనవిచారతఁ గల్గువాఁడు నా
చాయ నె కాలసృష్టిగుణసంఘసమన్వయవృత్తి లేక య
త్యాయతబుద్ధి సంగరహితాత్మకుఁడై విలసిల్లఁగాఁ దగున్॥ 55

తే॥ స్వచ్ఛభావంబు మాధుర్యసంపదయును
సహజగతిఁ గల్గు నమ్మౌని జలముభంగి
తీరభూమిరై జనుఁ బవిత్రీకరించు
వీక్షణ, స్పర్శ, కీర్తన విధులచేత॥ 56

కం॥ తేజస్వియు నిబిడతప
స్తేజితుఁడును నైన మౌని దీప్తానలుపో
రోజ నకల్మషవృత్తి
భ్రాజితుఁడై యుండు సర్వభక్షకుఁ డయ్యున్॥ 57

తే॥ కాలమవ్యక్తమార్గంబు కాలవశతఁ
దనువునకుఁ బెక్కు భావము లొనరుచుండు
చంద్రకళలకుఁ బోలె నిశ్చయముఁ గాఁగ
నాత్మ నిత్యుఁ డీ గతి యోగి యరయవలయు॥ 58

కం॥ జలజాప్తుఁ డంశువులచే
నిల నెలవులఁ బోలె సంయమీంద్రుండు గుణం
బులఁ గైకొను విడు దోషం
బులఁ దా నెన్నండు సక్తిఁ బొరయం డెచటన్॥ 59

సీ॥ కాంతారసీమ నొక్క కపోతియును దాను
.........గాపురముసేయు
చుండి మేతఁ గొనంగ నొక్కనాఁ డెందేని
జని వచ్చునంతలో శబరుఁ డొకఁడు
పిల్లలఁ బట్టి నొప్పించి చిక్కంబులోఁ
బెట్టి యుండఁగఁ జూచి పెంటిపిట్ట
యోర్వంగ లేక [1](బిట్టొరయుచు) దగ్గరి
తాన యాచిక్కంబులోనఁ బడియె

తే॥ నపుడు పుంబక్షి బిడ్డల నాలిఁ బాయఁ
జాల కాత్రోవఁ దానును జనియె వాని
నన్నిటినిఁ గొని శబరుఁడు నరిగె వేడ్క
నదియుఁ జూచి మోహంబుఁ గీడనుచుఁ దెలిసి॥ 60

వ॥ మఱియును,

1. బెద్దొరలుచు.

సీ॥ పెనుబాముకై వడిఁ దనయంత వచ్చిన
యాహారమునఁ దుష్టిఁ దగుట సేలు
కడుఁ బ్రసన్నుఁడు దుర్విగాహుఁ డక్షోభ్యుఁడు
నై సముద్రునికి నీడగుట నయము
తెలివలఁ గని నష్టదృష్టియై శలభంబు
రీతిఁ గోల్పోక వర్తించు టొప్పు
విరులఁ దుమ్మెదపోలె వివిధశాస్త్రంబులఁ
గైకొనఁ దగు సారగౌరవంబు
ఆ॥ తరుణి ముట్టి నంతఁ గరిగతి బద్ధుఁడై
మడియు నట్లు గాక మధుహరుండు
క్రీడఁ దేనెపోలె గృహి సజ్జితాన్నంబు
కుడువవలయు యోగకుశలమతికి॥ 61

చం॥ వనగతియైన యోగి యొకవంక నొకప్పుడు గ్రామ్యగీతముల్
వినవల దట్టి పాట లడవి న్వని లుబ్ధకుచేతఁ జిక్కి నొ
చ్చిన హరిణంబు[1] పాటు మదిఁ జేర్చినఁ దద్విషమత్వ మంతయుఁ
గనబడు నట్లుగావున మృగం బొకవృత్తికి నొజ్జ తెల్పఁగన్॥ 62

చం॥ నరవర దుర్జయం బెపుడు నాల్క చలంబునఁ దానిఁ గెల్వ నే
ర్పరిఁ గన కాకయున్న నితరప్రథితేంద్రియనిర్జయంబు లే
గురుగతిఁబట్టు గాలమున గ్రుచ్చిన యొఱ్ఱకు వచ్చి మీను దు
స్తరతరభేదనం బొదలుచాయ యెఱింగి మెలంగగాఁ దగున్॥ 63

సీ॥ విను విదేహాఖ్యపట్టణమునఁ బింగళ
యను నొక్క వేశ్య విత్తాభిలాష
మున వన్నెపెట్టుక తన యింటివాకిట
వేళతోఁ గనఁబడి వీధివారి

1. ఘాల.

కెదురు చూచుచు నుండి యెవ్వరు రాకున్న
దైన్యంబు నొందుచుఁ దల్లడిలుచు
నిల మెఱుంగక చూచి నిలిచి నిషిద్ధంబుఁ
గాంచి నిర్వేదసంకలిత యగుచు
తే॥ నాశ కష్టంబు నైరాశ్య మనమసౌఖ్య
మనుచుఁ బఠడించె నాత్మలో హరిఁ దలంచి
దానిఁ గనుఁగొని ధనకాంక్ష మానవలయు
ననుచు నామదిఁ దోఁచె సజ్జనవరేణ్య॥ 64

కం॥ సామిష మగు కురరముల ని
రామిషకురరములు దఱిమియాడు నదియు న
య్యామిషము విడిచి సుఖి యగు
నా మత మెఱిఁగినఁ బరిగ్రహము రోయఁబడున్॥ 64

కం॥ మానావమానములు మది
నూనక చరియించు బాలు నూహించి కదా
మానావమానములు మది
నూనంగా నీక తిరుగుచున్నాఁడ నృపా॥ 66

సీ॥ కన్నియ యొక్కర్తు తన్ను వరింపంగ
వచ్చిన బాంధవవరుల భుక్తి
కై శాలిసంపు బియ్యంబు దంపగఁ శంఖ
వలయము ల్జేతుల గలుగు రవళి
సిగ్గున రెండేసి చిక్కంగ నన్నియు
సడలించి యవియు నిస్వనము జేయ
నొక్కొక్క వలయంబు చిక్కించి చప్పుడు
కాకుండఁ జని యొల్ల జోకవరచె

తే॥ నట్టి కన్నియ నడవడి యలరఁ జూచి
కలహ మొదవు సంయమములు పెక్కండ్రు గూడ
నిద్ద ఱున్న నెపుడు వార్త యొసఁగుచుండ
నొక్కఁడ చరింప సుఖ మను యుక్తిఁ గంటి॥ 67

తే॥ శరకరుం డంతికంబున నరుగు నృపతి
నైనఁ గానని భంగి నాత్మావరుద్ధ
చిత్తుఁ డగు యతి మఱి యొండు చింత లేక
సాధ్యమగు పని సాధింపఁ జాలియుండు॥ 68

కం॥ పరకృత మగు భవనములోఁ
జొరఁబొది సుఖించు పాముఁ జూచినపుడ యి
ద్ధర యతి [1](గుహాశయుండై
వరలం/.వలయు గృహంబు వ్యర్థం బగుటన్)॥ 69

ఈ షష్ఠాశ్వాసమునం దింతవఱకే గ్రంథముపలబ్ధమైనది. మిగిలిన భాగము సుమారు ఐదారుపుటల పరిమితి గలిగి యుండునని తోఁచుచున్నది. ఏకాదశస్కంధకథాభాగము కొంచెమును, ద్వాదశస్కంధ కథాభాగమును కొఱవడుచున్నది. 70



1. (.........).

